# మంజరీమధుకరీయము.

శ్రీ కోరాడ రామచంద్ర ప్రణీతంబు నాటిక.



# MANJARIMADHUKARIAM

A DRAMA

BY

KORADA RAMA CHENDRA SASTRI GARU

*Late Senior Punnit, Noble College.*

EDITED BY

his son

K. D. NAGESWARA

*Senior Pundit, Noble College.*





Masulipatam.

PRINTED AT THE C. M. S. "DOVE"

1908.



Price Rs. 1-8-0.



# మంజరీమధుకరీయము.

శ్రీ కోరాడ రామచంద్ర ప్రణీతంబు నాటిక.

# MANJARIMADHUKARIAM

**A DRAMA**

BY

**KORADA RAMA CHENDRA SASTRI GARU**

*Late Senior Pundit, Noble College.*

EDITED BY

his son

***K. D. NAGESWARA***

***Senior Pundit, Noble College,***

Masulipatam.

PRINTED AT THE C. M. S. "DOVE

1908.



Price Rs. 1-8-0.

శ్రీ ర స్తు.

శ్రీమత్పరాభట్టారికాయైనమః.

# మంజరీమధుకరీయము.

## ప్రథమాంకము.

శా॥ శ్రీరాముఙ్గురుకామయంత్రణవనీసీమందగందాపసా
కారంబూనివసింపఁబూర్వబుధుఁ డాగారాపు దేవింబలా। త్కారంబ
న్వారియింపవానినని నాకప్రాప్తుఁ జేసిప్రియం। బారందాన జగంబ
ల్మానుచు నాయాద్యుంబరు స్గైల్చెదన్ ॥ ౧ ॥

శా॥ శ్రీవత్సంబును గౌస్తుభంబు మిగులం జిత్రప్రదీపప్రభ
ల్గావింపన్వనమాలికా సరసుచుల్గాం తప్రవాళప్రసూ। నావళ్యంచిత
శోభలీనరమ కాహ్లాదాలయంబై తగు। శ్రీవత్సంబున మించువేల్పు
మనల్గ శ్రేయంబులంగ్రబోవుత‌ౙ॥ ౨ ॥

ఉ॥ కైరవపుండరీక హితకారుల కారణ వైరవృత్తినే। నా
రికిఁ గీర్తిసంపదలు వావిరిఁ గల్గవటంచు నీక్షణా। కారతనే మహాత్ముని
ముఖంబు వసించి రమాహృదబ్జ దృక్కైరవ ముల్లసింప నితకాము
లౌ వానినుతింతుమాధవుౙ॥ ౩ ॥

సీ॥ కరవిరాజదు దారకంబు సుదర్శన కమలఖడ్గోల్ల సద్ఘన
మహిమత। నవియోగ సంభక్తినడరు హంసావృతి పుండరీకావాస
పుణ్యఘటనఁ। బాత్రకైరవ మిత్ర మిత్రాంబక ప్రభాప్రసరభాసి
తభక్త భవుకగణత... త్తసువర్ణపీత వసన ఘనశోభిమంగళ మయ
ధామ మహితధామ। మాదిగల ధర్మములద్ముల్లయైయభీష్ట। దాంప
తీ లాభసంతుష్ట దయితహృదయ। మా... ఖుంచి మహాలలితాళి
హరిని। రసమయుని జేయుశ్రీ దేవి రసములొసగు ॥ ౪ ॥

నాంద్యంతంబున సూత్రధారుండు॥

సీ॥ బ్రహ్మప్రమోద సబ్రహ్మచార్యా నందమయ శాసనము జనుష్మంతులకిడి । తనయాన నూనని జనులుగ్రశిక్షార్హు లయ్యునుఁ గుసుమమయాంబకముల । మోదుచుదత్తతి నోదనంబునకయి పాటీరఘనసార పల్లవసుమ। తల్పాదిసే నలుదగు పథ్యములు గాఁగ నొనరించి బ్రోచుచునుపహారిహార । విధులుదమవత్సతను ముఖవీధులందు । దారదంభంబునఁ దనయుదారశాస । నంబుదాల్చి సుఖింపనానాజగతుల । వృద్ధిసేయు విభుఁడు మీఱుబుద్ధులిడుత ॥ ౫ ॥

ఇట్లని పుష్పాజలిం జల్లి యాతటం గాంచి సానందంబుగ. ఆహా! కల్యతుల్యంబికా లంబు।ఇద్దియుచితంబ । ఎందునుండియనిన

చ॥ చరమగిరీంద్ర శృంగశుభసౌధప కేతనమైనయామినీ। సరసిజనేత్రపుష్ప శరసాయక వంచితమైలసత్త మోం । బరధర తారహార భరభాసినియై విధుఁగాంచి వానితో। వరరతి సౌఖ్యమంది నిజవాసము సేరెడువాఁడు దోఁడుగ౯ ॥ ౬ ॥

మఱియును.

గీ॥ తానొక కతంబునను దవ్వుతావునుండ । నెఱిగి నెలఁతస చెలితమ్మి యింతిసిరులఁ। దోఁచుకొనఁ బ్రొద్దు వానిని జూచుటకయి। బంపుబంట్లనఁ బులుగులు బయలఁబొగు ॥ ౭ ॥

మ॥ విశదాంశుండను రాగ నిర్భరభగావేశఁబున న్వారుణీ। దిశనాశ్లేషణ తర్షతంగరములం దీపించుచుంజేరబ్రాగ్దిశయుద్యద్గరుడాగ్రజచ్ఛలమునం దీపించుకోపాంతయై । కృశసంవేశ కపోతహూంకృతి తతి౯ క్షేపించుచుంజూపదు౯॥ ౮ ॥

వెండియు నడఁకువ యడరనొడలి చూపొడయని దెసవేడుకం బొడగని.

సీ॥ మహదాధివ్యధి నిర్మగ్నకోకనికాయ ముఁగరసారణమ్ములనతిఘృణ। నుద్ధరింపుచునూత నేద్ధప్రభాపాళిగురుతిమిరంబుల గురుతుఁబాపు। చునుదుర్భర విరహాజోరు సంతాపార్తపద్మినీ కాంతనుపా

త్తభవుకః। గానింపుచుఁ గులిశాంకదిగంబుజాక్షి నెన్నొసమున సిందూరపురుతమాల। పత్రవిచిత్రప్రభా స్ఫూర్తిఁ బరగఁజేయు। చునుదయశిఖరిశిఖరాగ్రసంప్రరూఢ। రుచిరకంకేళి మంజరీశోభనూన। బింబుడగుచును జూపట్టునంబరమణి ॥ ౯ ॥

కావున స్వాభిధాన గణ పారాయణ నిజచరణ సేవాసమాచరణ పరాయణులకు నశేషాభిలాషవిషయ సంప్రాపణంబునం గీర్వాణధరణీరుహాయమాణుండగు నీన భోమణిం బ్రణుతించెద.

సీ॥ ఎవనిచే గమలేశుఁడితద్భృష్టియై యొప్పు బురహరుఁడెవనిచే బూర్ణతనువు। నెవనిమయూఖముల్ భువనంబులకురస హరణసంభరణ కలాత్మకములు। నెవఁడు దుర్దమఘోర వృజినప్రభూత దుర్వ్యాధి దుర్దుర్గదవానలాఖ్యుఁ। డెవనికిమూర్తియై యురవ్రేఁను నిగమంబు లెవనిచే విలసిల్లు నెల్లవిధులు। నతనినిబిడతమో భరాహతపరార్థ। సంవిదాంతరబాహ్య విజ్ఞానకరణ। జీవనవిధానమహిత సంజీవనౌష। ధీలసదభిఖ్యునహిమదీధితినిఁగొలుతు ॥ ౧౦ ॥

(వెండియు నంతటఁ బరికించి సవిస్మయంబుగ) అన్నన్నా యెన్ననలవినెందని మన్ననల విన్నాణంబులగు నావేసగియన్న దొరతనంపు నదనిపుడగడు వేడుక లడరఁ బొడగానంబడుచున్నది ఎక్కతంబున వంటివేని.

క॥ పతిచిరసందర్శనమున। సతివలె వికసన్ముఖాంబుజాతస్ఫూరితా। తతసర సామోదగుచుం। ధుతతనుతయి పద్మినీవ ధూటి సెలంగున్ ॥ ౧౧ ॥

కం॥ భూరుహపల్లవదళపట। చోరుండగు శిశిరుడిపుడు సురభిసమయభూ। దారుడు శిక్షయొనగుననిం। భీరుండయిపోయెగుప్తవేతుండగుచున్ ॥ ౧౨ ॥

మఱియును

చ॥ తనప్రియుఁడైన యామని ముదంబలరారఁగఁ జేయఁజేరని ష్వని కవిముక్తకార్శ్యయయి వంచిత భూతవియోగఖేదయై। దనరెఁ డు పల్లవాంశుకము దాల్చి ప్రసూనవికాసహాసయై। కనదురుగీతికాళి వృత కౌతుకమున్ సతివోలె సల్పెదున్ ॥ ౧౩ ॥

మ॥ పికదష్టామ్రమకిసాలదళత పటియుత్పీనస్ఫురత్కేసరభ। ప్రకటోద్గార రజోగుళుచ్ఛకుచభార ప్రహ్వసంజాతకో। రకగోమోద్గమ సాంద్రమంద్రకలనిర్హ్రాదస్వనగ్రీవయై। సకలశ్రీవనియామనింగదిసి హృజ్జక్రీడలన్ సల్పెడిన్ ॥ ౧౪ ॥

చ॥ హిమహృతిఖిన్న యానలినిహృద్య వసంతసమాగమంబున। న్విమతవిముక్తయైమృదుల విస్తృతగంధవికాసపద్మయై। యమరు రసప్రరోహముల నాసరసాలులశ్రోత్రపేయసత్క్రమమధు రోక్తులన్వెలసి కౌతుకముల్గను వారికిచ్చెదున్ ॥ ౧౫ ॥

మఱియును.

సీ॥ మధుపాన సంక్షీబ మధుకరఝంకృత ల్మాగధస్తుతిపాఠ మహితములుగ। స్ఫుటకృపీటజకుందసుమచూత ముఖ్యముల్ప్రహరణరీతి ని బరిఢవిల్ల। సహజమదాటోప శారికాశుకపాళి పటుబిరుదావళిపాఠక ముగ। నభినవామ్రప్రవాళాస్వాదిపటుకంఠకలకంఠములు భటోత్కటతమిూఱ। మలయమహీధ్ర సంబంధగంధవహాళి మదవారణశ్రేణి మతినొనర్ప। వికచప్రసూనద్రుమ వితతిపల్లవసక్తయయి చిత్ర రథశోభ నావహింప। శాఖాశిఖారూఢ చారుకోరకములౌ కేతువుల్కాంత సంకేతములుగ। వికచసుమోద్భ్రాంత పి[illegible]గభములు పటుఘోటకాటోప నటనలీన। సకలసంయమిజన జయసంభృతేహుఁ। డగు మరుని జైత్రయాత్రకు నాప్తవృత్తి। వాహినీశత నొందిన వానిఁబోలి। సుమసమయుఁడిపుడేవుర సొంపునొందు ॥ ౧౬ ॥

మఱియును

ద్విపద। పల్లవితాశోక పదజృంభమాణ। పల్లవాస్త్రప్రతాపశుచిసంభరిత । ములపుష్పితాశేష భూరుహవ్యూహ । ములకైతవంబునం బురణించుకామ । యశములనలరారు నారామతతుల! వశతఁదప్పినపాంథ వర్గాకులములు । పరభృతకలరావ పటిమసంధాన వరభేషజామ్రప్రవాళాంకురములు। నవచూతకిసలాదనవిధూతమాంద్య । రవవిదళితపాంథ రాజికర్ణములు । తరుణకోరక పుష్పతతిగుచ్ఛనమ్రము॥ తరులతాసంశోభిత వనాంతరములు మలయబందీకృత మారుతచరణ । విలగితశృంఖలా విచ్ఛేదకములు । వికచకౌసుమగుచ్ఛవిగళన్మరంద । నికరసిక్తామోదనిబిడాంతవనులు । తనువాతసముదితాతనుపుష్పరేణు । వినుతవితానాప్తి విలసదభ్రములు । సామయసంకేతసంపన్నకుంజ । సీమంబులనుజేరి సేమంబులమర । సరసవిహారముల్సలుపుచున్నట్టి । హరిణాక్షులరశనాహంసకప్రముఖ । భూషణకంధరోద్భూతగంభీర । ఘోషణార్భటుల సంగోపితంబులుగ । నొనరించులీలనుత్కటమహిమ । దనరారుసమయ కృతప్రకృతిజని । మదకల శారికామధుపాన్యపుష్ట । మదనాశ్వముఖపత్త్రి మధురారవములు । తుహినాపగమమున దోఁచు సంపదల మహిమసొంపొందురమావాసకుసుమవనములవిహరించు వాగీశవాహ । ఘనచక్రసారస కారండవాది । జలవిహంగవ్రాత సంచితప్రచుర । కలనాదవాచాల కాసారకములు । మదకలమాతంగమహితఘీంకృతులు । ముదమొసంగుమృదంగఘురురవంబులుగ । బహువిధవిహగౌఘభవ్యరుతములు । బహుమాన్యతాళ శబ్దమధురంబులుగ । నవిరత పుష్పంధయారవార్భటులు । సవిశేష సంగీత సంపదలాగ । మలయశైలాగత మాతరిశ్వుండు । కలసూత్రధార సత్క్రమతను మీఱ వల్లీవనితలక వారిగనృత్త । సల్లలితంబుల సంపదలింపు। గావింపుచును మించు కందర్పసఖుని । యీవింత దినములనెల్ల ప్రాణులకు । నర్మాశయంబులు నవనవంబులుగ । శర్మమయంబులై జగతిసొంపొందు॥

చ॥ సకలజనాభినంద్యముల సద్గుణరూప మహావిభూతులం। ప్రకటిత నవ్యభవ్యత మభాసురహేలలభూరిసమ్మద । ప్రకరములిచ్చు చున్నశుగ రాజిల్చేసినకుందవల్లిక । న్నికలనొనర్చిచేరె నళివింతగను ప్పెడు చూతవల్లరిౕ ॥ ౧౮ ॥

వెండియు నిటలసంఘటిత కరసరోరుహ పుటుండగుచు నొక్క చక్కని దృష్టంగూర్చి

సీ॥ సకలభువనవనజనివనస్థితిసముత్పాటనోత్కటమదార్భటిక కరటి । పటుభుజబల సముద్భటని శాటభటౌఘరుధి రౌఘసంసేక రూ షితవని । సంజ్వర మార్పంగ సదయత నవతరించిన కైటభద్వేషి ఘ నుడు రామ । చంద్రుడు లక్ష్మణజనకజాసహితుండై బుధులెల్ల గొల్వగ బోధమయుత । నిటవసించుట సకల భద్రేడితాత్ముం । డైన యీభద్ర గిరి సేసినట్టిపుణ్య । మొక్కటియకాదుశ్రుతిపురాణోక్తధర్మ । సంది తాస్తిక్య జనపుణ్య సంచయంబు ॥ ౧౯ ॥

సీ॥ అపరిమితబ్రహ్మహత్యాఘసంహతివిఘటిత ప్రాణుడౌ వి ఘ్ననాథు । బుత్రుగాంచి హిమాద్రి పుత్రికమిగుల శోకార్తయై ర మణశిశూదరమున । నిఖిల వేదాంతార్థనిధియైన యేభవ్యనామామృ తంబున నతనివీను । సిక్తంబు సేసి విముక్తనిద్రుని బోలెనుద్ధితుండౌసు తు నుద్ధవమున । గాంచెనట్టియ శేషలోక ప్రసృష్టిరక్షణావసాన సువిధా నదక్షులలితుం । డఖిలవేద శిఖార్థ సౌధాంతరాళ । దీపుడగు రామభ ద్రుండు దివ్యుడితడె ॥ ౨౦ ॥

మ॥ నిజలావణ్యకణావధీరి తశరన్నిర్మలప్టజాడ్యోల్లస । ద్ద్విజరాజవ్రజమైనయీజనక జాధీశాస్యశోభాగ్గం।బజరాహారముగ్రోలి హృష్టమతులై హాయిౕసభాగ్రస్థలి ।-న్నుజనుల్వెల్ల భగోష్ఠి కల్పనల చే జోద్యంబుగానుండెదుౕ ॥ ౨౧ ॥

వెండియునంతటం బరికించి యమందంబుగా నానందంబు కందళింప నాహా యిపుడుగదా మనభాగధేయంబు సువిదిత నామధే

యంబు శుభయత్నోద్రుతం కార్యయను కల్యాణధిషణా భాషణం బుననిష్టార్థ నిర్వహణాంబుకై యవిలంబంబుగావర్తింపవలయునని నేప థ్యాభిముఖంబుగం బరివర్తించి సంకేతం బొనరించుచున్నాఁడు.

(ప్రవేశించి మారిషుండు) ఓయీభావా యిదియేమి? సముది తతరణికిరణ సంస్పృష్ట విమలకమల విభాసమానంబగు నీయాననంబు చింతాసంతతంబై హిమానీ సంవళితంబగు సహస్రదళం బనుకరించు చున్నది.

సూ॥ ఓయీ మారిషుండా యిప్పుడు చతుష్షష్టి కలావిమల మణిశ్రేణీ గుంభిత హారాలంకృత హృదయులు సదయులుసరసకవితా పుంభావవాణులునగు నీయంతర్వాణుల సమక్షంబున నక్షీణ విచక్ష ణత సమగ్ర సమ్మద ప్రాపకంబగు రూపకంబభినయింపవలయు, అది యెద్దియని నామనంబు చింతించుచున్నది।

మా॥ ఓయిభావా అట్లకానిమ్ము విచారంబునకుం గారణంబే మి? అనవద్య సకలవిద్యా నిపద్యాయమాన రసనారంగ నానట్య మాన సరస్వతులును సమగ్రక వనధోరణీ మహానిర్ఝరిణీ సరస్వతు లునగు కాళిదాస భవభూతి ప్రభృతులు భువన జనోపకారార్థంబుగ నానావిధ ప్రబంధంబులు సకలసత్పద సంబంధంబులు పెక్కులు రచి యించియుండిరిగదా!

సూ॥ ఔనుస్వేచ్ఛాలాపస మానాకారసం సృష్టవిస్పష్ట గుణా లంకార రసాత్మకవివిధ ప్రబంధ బంధురులగు నాయాకవితాధురంధరు , భూరిభేదప్రబంధంబుల నేనెఱుంగుదు— ఆ కవిశిఖామణి సంగ్ర థితంబులగు రూపంకంబులెల్లం దఱుచుగ నీసభాస్తారులు సవిస్తారం గం బరికించియుందురు. అక్కతంబుననే కాంబోలు వారి యాశ బన్యాభిలాషంబై చూపట్టు। వారియానతియైనమీఱఁ దగనిది రూపకంబును ప్రాయికంబుగగానఁ బడమి ననుత్పన్నంబువలెఁ చుగాన నా చేతంబు నితాంతచింతా క్రాంతంబగుచున్నది.

మా॥ ఓయార్యా యద్దినీకెట్లు విదితంబయ్యె.

సూ॥ సకలదోషదస్యులగు నాసదస్యులుగ్గై సేసిన పత్రికా లోకనంబున

మా॥ దానింబఠింపుము.

సూ॥ పఠింపుచున్నాడు క॥ ఆద్యప్రకృతిప్రకృతులః। జోద్య బులుబహువిధములు సూచితిమిమహో। విద్యాధికరూపకవులు। వ ద్యాద్య ప్రకృతివికృతి హితరూపకముల్ ॥ ౨౨ ॥

క॥ శుచిమయరసబహుళంబును। శుచిమయహృదయావనీ శుభచరితంబున్। నిచితగుణాలంకారము। రుచిరంబగు రూపకము రూపింపదగుఁ ॥ ౨౩ ॥

మా॥ ఓయార్యా యట్లయినం జింతింపనేటికి?

సూ॥ అట్టిరూపకంబుగలదా?

మా॥ మున్నుమనమా యానసహోధ్యాయులతోడం గూడి ద నింజదివితిమిగదా?

సూ॥ సాశ్చర్యంబుగ తాదృశంబగు రూపకంబెక్కడిది?

మా॥ సస్మితంబుగ వినిపించెద నాలింపుము

సీ॥ కారణపురుషాది కారణంబగుపర దేవతామణిగాఢ తీవ్ర ...యమ। దుశ్చరతరమహా పురశ్చరణంబున నంచిత కరుణారసాప్లు త ...యగుచు దృగ్విషయమై యధిక వత్సలతనిజేష్టమెఱింగింపు మో ...నిన। నాత్మీయవంశజులాసప్తమావధి సకలశాస్త్రాగమ సధను...గు ...। గోరియామెవలననిష్టపూరితుఁడయి ...కౌండిన్యగోత్రప ...ర్తి। మహితకోరాడవంశ నిర్మలమణియయి। దీప్తివిలసిల్లె నమ్మ ...శాస్త్రి ॥ ౨౪ ॥

సీ॥ వర్ధిష్ణు సంతతి వైభవుండగు నమ్మహాదేవశాస్త్రికి నమల దశముఁడు భవసింధు తారకశ్రీరామ మంత్రజపామల మతికి

లక్ష్మ్యాగమవేత్తకు నగ్రతనూజుండు శ్రీశిష్ట వంశాబ్ధిశిశిరకరుఁడు । సకలవిద్యాజన్మ సద్మాయమానజిహ్వాంచలుఁడమిత కావ్యాళికర్త । యయిన శ్రీకృష్ణమూర్తి పదాబ్జసేవ నాత్మ సద్గ్రంథ కల్పనావిత్త సుమతి । విరచిత శ్రవ్యదృశ్యాత్మ వివిధకావ్యుఁ డయిన యారామచంద్రుఁడార్యాళి వశుఁడు ॥౨౫॥

వ॥ మఱియుం బహుల గుణంబుల ననేక లేఖినీ విలేఖిత హృద్య పద్యావళిసంతోషిత పరజన స్వాంతుండగు నతండొక్కనాఁడు నానావిధ ప్రబంధ ప్రకారంబులు గోష్ఠీనశంబునం దలపోయుచు దృశ్యశ్రవ్యకథామయంబులగు కావ్యంబుల శ్రవ్యమాత్రంబుల సవిశేషవిశేష సుషమంబులయిమహాకవులచేఁద్రిలింగభాషయందు గ్రథితంబులుగఁ దృశ్యంబులగు నవి తాదృశంబులుగామికిం జింతించి తద్గ్రథన నిషేధ కారణంబు గానక మరియూ నారూపకంబులఁదత్తత్పాత్ర విశేషంబులకుం బ్రాకృత భాషరూపకాను శాసన విహితంబయ్యును వసంత తిలకవల్లవీ పల్లవోల్లాస శృంగార రంగాదిభాణంబులు రూపక విశేషంబులయ్యును బ్రాకృత మిశ్రంబులుగాక ననిమిష భాషయందు సవిశేషంబుగఁ జూపట్టుటన్ మరియు మిశ్రంబులయందు గ్రథితంబగు ప్రాకృతంబును ఛాయవీడి సకల జనంబులకానంద విధాయకంబుగా నేరమినింతియుకాక నామిశ్ర రూపకంబులయందును నొక్కొక్క చక్కిం బ్రాకృత వ్యవహార యోగ్యంబులయిన పాత్రంబులును సంస్కృతం బాశ్రయించి వచించుటయుం బొడసూపుటవలన నాప్రాకృతభాషలేశయత్యంత నిషేధాపాదకంబు గాదని తలంచి సంచితోత్సాహుండయి సంస్కృతాంధ్ర మిశ్రంబుగాఁబ్రాచీనాను శాసనోక్తలక్షణ లక్షితంబగు నటుల సకల సరసపదార్థకుసుమ వనీవాటియగు మంజరీ మధుకరీయంబను నాటికవి రచించి మనకుం గ్రైసేసెఁగదా।

సూ॥ సవిస్మయానందంబుగ। ఆహా నాయనవథానత। అకారణకరుణారమణిం బరిణయించి యమితరీతి సంగత పరోపకృత లలిత క్రీడల నమందంబగు నానందంబు నొందిి యస్తోక విశదగుణ సంస్తవ్యయశ స్తోమసంతాన సంతానంబులంగని వానిచే నాతరణిహరిణ కిరణంబుగ నిజాభిజననంబు వర్ధిష్ణువుం జేయుపుణ్య వదగ్రణ్యులకు నేయేభువనంబుల నేయేవిబుధనాథ సన్నిధానంబున నెట్టెట్టు కళ్యాణసుఖంబులు గలుగనో యను నధ్యాహారాధీవన మనస్కృతవిస్మృతినొందినను లెస్సగననుస్మారి తుండనైతి

కాన నిపుడఖిల సద్గుణగణంబుల నిభ్యులగు సభ్యుల సద్భావంబునం బ్రార్థించెద, అని పరివర్తనంబొనరించి యుచితప్రస్తుతియగుచు॥

చ॥ సకలకలావిచక్షణులు సద్గుణ పుష్పబు ధావనీరుహు। ల్వికసిత సంశ్రితాళులు నవీనకృతీహులునైనమీరలు । త్సుకతఁగడుంగనుంగొనగ శోభిలునంచలు వైనవాదుమాపక పరిపాటివేఁడెదను వారకమీరలను గ్రహింపుడీ। ౨౬॥

గగనంబునవీనుండాల్చి యేమి యానతిచ్చిరి సదస్యచతురాస్యులారా॥

సదస్యులు॥

గీ॥ నీవిటులమమ్ము వేఁడుటనీతి నిపుణ । దూరదూరాధ్వచంక్రమణో-రు ఖేద। ఘునను బానీయ కాంక్షికి మోదమొదవ।విందు సేయుట గాదొక్కొ విందువమరి॥ ౨౭॥

మారిషుఁడు॥ ఓయిభావామనభాగధేయ మహీరుహంబీ యొకఁగదామిగుల నామూలచూడ ఫలితంబు। ఎందునుండియని యను యోగించెదవా యవధరింపవయ్యా। మనకుం గమనీయంబగు మహనీయ పరికరప్రకరంబున కొక్కింతయైనం గొఱంత చిరంతన కథాప్రాయంబయ్యెఁ గనుంగొనుము।

ఉ॥ ఈసమయంబశేషకుసుమేడిత గంధక గంధవాహకం। బీసభకున్మహామహమ హీతనమారమణుండువల్లభుం।డీసభవారు వాక్పతి సమీడ్యకలావిభవాభిరాములా, యాసకల ప్రకారనట నాగమ సింధు విలంఘనోద్భటుల్। ౨౮॥

క॥ అనియెన్న విదితులుగదా । మనవారందఱును మిగులమహితకృతిశ్రీవనిత యు సముచితరీతి। ధ్వనితల సద్వృత్తికృప్త ధన్యాశయమే॥ ౨౯॥

సూ॥ సప్రమోదంబుగ। ఔనోయిభావా నీవుపక్కాణ సేసినదంతయునిక్కంబ। అదియెట్లన్నను॥

క॥ పరసంతోషణకృతి తత్పరత న్వర్తిల్లుసుజనపాలికి సుగుణా । కరసమభిమతార్థంబులు । పరదిష్టముచే లభించు బహుదుర్గములన్॥ ౩౦॥

ఇద్దియెట్లనుచున్నావా కనుంగొనుము॥

ఉ॥ కంధిగభీరఘోర తరగర్భవిలీన హృషీకధోరణీ। సంధిత దుష్కవాటఘన శౌక్తిక మౌక్తిక జాలమెక్కడన్'బంధురభూమికుక్షిజ సువర్ణము నెక్కడ నవ్విపద్మినీ। బంధుకృతాంధ్య యాపాతవిభాసుర ధామము తోడగూడవే॥౩౧॥

మా॥ శహబాసు భావాతత్త్వ వేత్తవయితివోయి - అయ్యర్థంబట్టిరయ- విలంబంబన లంబింపంబడినదేని భావిభావుకవ్యూహంబులకుం బ్రత్యూహంబుగాఁగలదు- గానవిలంబితంబుగ సమంత తస్సం క్రాంతనిజగుణసౌభాగ్య కాంతంబగుపరికృత వసంత వనీకాంతంబధికరించి గానంబనూన గుణనిధానంబుగ నొనరింప వక్కాణింపందగు।

సూ॥ నేపథ్యాభిముఖంబుగ- చెలియరో సంగీత శారికా॥

సం॥ ఏమయ్యా ఓయార్యా యిచ్చటనుంటినయ్యా॥

సూ॥ మారిషభాషణంబులకు నీ శ్రవణంబులు శరణంబులయ్యెనా॥

సం॥ ఆర్య వేరుగఁజెప్ప నేల ఇద్దియయుత్తరంబైయొప్పు॥

ద్విపద॥ తనకు మేల్తతిగాగ దనరినసిరుల। నెనలేని సొబగుల నెడపకమించి। ముద్దుల నొసగెడి మొల్లలతోట। హద్దుమీఱిన వేడ్కఁ వదములఁబుచ్చి। తనచెలి మేల్బంతి తామరతీవె। యెనసిన యువమంత యింతయిపోవ॥ యామనిరాకచే నలతి గానట్టి। యేమరమిని బూనియెలమినిజేయు। సొంపులగుంపుల జూచువారలకు। నింపులౌ వేడ్కల నిడుచున్న దనుచుఁ। దావిమో తరిసేరి తనకెఱుగింప। వావిరివేడుకపడి దానిఁజూడ। మరునిసింగానికి మఱియు సురిడుచు। వరలు తేటులబారువచ్చెదానికడ॥

సూ॥ మర్ఝూ మర్ఝూ- ఆశ్చర్య రసార్ణవంబిప్పు డతివేలంబతివేలంబగుచున్నది - ఎప్పాంటె నంటివేని- తనకుమారీ కుంజరియగుమంజరి బాల్యాపగమనంబున నంకురత్తారుణ్య లక్షణంబుల వీక్షణలక్ష్మీయగుటం బరికించి యానందరంగదంతరంగ యగుచు శృంగారవల్లి సల్లీలా మతల్లియంపిన దూతచే నాహూతయై యాత్మీయ వయస్యావలోకన కుతూహల తనాయాత యగు నామోదరేఖ వృత్తాంతంబు ప్రాకరణికంబై నాయంతః కరణంబుననుండె దానికనుకూలంబుగ నకదా యీ ధ్రువ గానవిషయంబై యొనరింపంబడినది- అని సంగీత శారికనవలోకించి - బాపురే సంగీత శారిక బాపురే

మా॥ ఓయిభావా యిద్దియెట్టి విస్మయంబు - పరెంగి తజ్ఞాన ఫలకంబగు బుద్ధిచే నిద్ధస్వాంతులగు వారలకు నిసర్గంబకదా

సూ॥ అట్టిబుద్ధిసత్త్వకయ విస్మయంబు గలుగుచున్నదంటివిని।

మా॥ అద్దియిప్పుడభినవంబె।

సూ॥ గుణంబుచిత సమయంబునంగణియింపందగుంగదా।

మా॥ ఔనిద్ది తథ్యంబ. అనిపరివృత్త్యవలోకనంబొనరించి-ఓయిభావా భర్తృదారికయగు మంజరి భూమికంబరిగ్రహించి చంద్రరేఖయుం దదీయ వయస్యయగు నామోద రేఖావేష ధారిణియగుచుం దరంగిణియు నిట్లయేతెంచుచున్నారు-కాబట్టి మనము ననంతర నిర్వహణీయ కార్య నిర్వహణంబుకై యత్నింప వలయునని యక్కడనుండి వెడలిరి ॥ ౩౨ ॥

ఇద్ది ప్రస్తావన ॥ శ్రీ శ్రీ ॥ అనంతరంబున మంజరియు నామోదరేఖయుం బ్రవేశించుచున్నారు।

ఆ॥ హాళా మంజరి సుమాళంబుగ నుంటివిగదా।

మం॥ అత్తిక నీవచ్చుట నింక నింకని యద్దిగలుగునని నెమ్మనంబున నేన స్మిద నే॥

ఆ॥ హాలాయిట్లుంటివేమే।

మం॥ అత్తికా నీవు నాచెంగట నుంటివే।

ఆ॥ హాలా నీ కురంగట నవ్వమొదలుగల వారందఱున్నారుగదా।

మం॥ అత్తిక యీయవ్వ తొల్లింటి యవ్వయనుకొంటివే।

ఆ॥ ఇపుడు గ్రొత్తగ మఱియొకతె యేతెంచెనే।

మం॥ కాదే యవ్వయయిన యద్దియేకాని దానియాత్మమారినదే।

ఆ॥ ఓసిచెలియా కాదే తొల్లింటికంటె నీయాత్మమారినదే - దానినెఱుంగకయమ్మను వితగదూరుచున్నావే।

మం॥ అత్తికా। నీవుకొన్నినాడులు దడవున నుండుటనీయాత్మ యొండాఱుమాఱయ్యెనని తలంపందగునే।

ఆ॥ స్వాగతంబుగ। ఈచెలి పలుకుల కిపుడు యడ్డం బొడగూర్పం దగదు। కొంతదడవు దీని నుడువుల కొడంబడునట్లుండ వలయు - సప్రకాశంబుగ ఓసీ యవ్వయాత్మదడబడెనని కడునిక్కంబుగ నుడివెదవుకదా అద్దియెట్లో నాకుం దెలియ వక్కాణింపుమీ।

మం॥ అక్కరో యట్టడుగవే చెప్పెద - పిమ్మటనామాట బూటకంబు గాదని నీకతేటపడు- నాదళయంతయు వచించెద హావణిక నాలింపుము

క॥ చెల్లినీవూరికి వెడలుట। దొలిగా నాయెదనుమిగులదొడుగుగఁ దోరం। బు లునల్లని ముక్కుల మతిలలి బంగరు బొంగరంబులాగునఁ గంతుల్ ॥ ౩౨ ॥

క ॥ పొక్కిలి మిక్కిలి లోతగుఁ। జెక్కులులస్మెరువు వొడమె చెలివెడదతనం। బక్కునఁగొనున జిక్కుట।నిక్కంబిదియేమికింకొ నెఱినాఱయుమీ ॥ ౩౩ ॥

క॥ ఘనమ నాయుదరము సూచితె। వనజాక్షిరో పచ్చపట్టుబాతిగనుండుణ్। కనుమిపుడిచ్చటఁ బొడమెను। దనువగు నలనల్లత్రాచు తరముగ నేడుణ్ ॥ ౩౪ ॥

క॥ ఫిరుదులుగడుబరువులగు౦।జరణంబులు నడలయందుఁ జడజడములగున్। సరిలేని బలుపు నమరెడుఁ।గురువులు మఱిగురువులగుచుఁ గోమలికంటే ॥ ౩౫ ॥

క ॥ పుట్టొంది ప్రొద్దుపొద్దున। నట్టొందక పెంపుజెంద నవకము మీఱణ్। బట్టురవిక యొత్తుటచే। గట్టిగనా వెన్ను నవసిగాసియొసంగుణ్ ॥ ౩౬ ॥

క॥ తొలితో డెంబయ్యెను వెత। గలిగిన యెడనాకు నవ్వగడువంతలచే। నడరె డిది యట్టిదిపుడ। రిమ్మలిఁజూడదు వినియు నగునుమీఱిన వేడ్కణ్ ॥౩౭ ॥

గీ॥ ఎదకు నీవెక్కురులు వంతలిడునవైన। వగల మిగులంగ జెందను వా సిమీఱ। వెక్కురులు సూపిమందిడి వేగమనుపు। మనినవిని తలినగుటకునడరుదుగ డు ॥ ౩౮ ॥

వ॥ మరియు మన యవ్వ నడతయంతయు వింతరై గానంబడు-అది యెట్లం టివేని మునుపు నేనెప్పుడెప్పుడు సాటిబోటులం గూడి సయ్యాటంబులు సలు పువేళల నయ్యాకేళీ వశంబున వలువలు మాసినం గైసేత సెదరినను మిగులంగనలి గద్దించుచుండు - మఱియునుం దనువున నెప్పుడైన నొక్క వెక్కసు నిక్కంబై గానంబడిన దానికిం బెకు_లగు నుపచారంబులం గల్పించు - ఇప్పుడు కింకచే బిం కంబుసెడి యలసి సొలసి యీబాదకతం బాలోచించి మందు దెప్పించి యిప్పింపుమని పనిఁబూని బతిమాలిన వీనుసారనీదు - మఱియు నదనంబులగు నీకదుముల రాయిడి నెలమించు నాకంచెలు పటాపంచెలుగా వంచితంబులు గాగంగని నవనవంబులయి

పెలుచ వెలవెలయు వానిం దెప్పించి యిచ్చుం గాని లోనికి మందొసంగింపదు- వెలికి గట్టిగఁ బట్టయినం బట్టింపదు- పథ్యంబును జేయింపదు అనుటయు నప్పుడా యామెా దరేఖ యిట్లుదిత యౌవనయగు నావయస్యకులుకు లనలరు పలుకుల నిలింపాహార రస ధారలం బోలి వీనుల నానుచుఁ దనమనంబున ॥

క॥ తనువనికి సురభిసమయము। తనువిభ్రమములకు దోహదశ్రీవిభవం। బును రతివల్లికి గందము। ననువగుజవ్వనము చూవె యువనిదలంపన్ ॥ ౩౯ ॥

గీ॥ మధువుకంటె నధికమైన మదనిదాన। మకనకమణిమయంబైన మహితభూష। మంత్రసంస్కార రహితసుమాస్త్రి విజయ, లగ్నకాస్త్రము యౌవనలలితలక్ష్మి ॥౪౦॥

క॥ సంతసములఁగడునీనుచు। వింతగ బోడసూపునొడలి వేడుకచిన్నె। ల్సంతసిలక యీచిఱుతుక। వంతలఁజేయునవి యనుచు వగలఁగలంగున్ ॥౪౧॥

క॥ తొడవులుగఁ బొడముగుబ్బల। నడవడి నెదవెడదయగుచు నయికల్మి యగున్। నడుమనయు మనయసంపద। వడువునగడు బడలియున్న వన్నియలీనున్॥ ౪౨ ॥

సీ॥ మరుని టెక్కెపు సొంపు మఱలించుఁ గన్గవ గన్బొమలతని సింగాని సొబగు। మోమునంచమతని మొదటి ముల్కులకల్మి మోవియాతని తేజిబువ్వపండు పల్వరసయతని నాల్వాతూపులగుంపు నవతనిమామ విన్నాణపుసిరి। కుత్తుకాతనిగెల్పు గొనియాడుచిందము గైలునాతని తొలికాల్పులుతూపు। లెదవుట్టువులువాని యెలమి బొంగరములు మఱివేలుపుల తావుమల నిసువులు। గౌదలువానిసింగారంపుటద్దములీ నుల తనియవ్వ వెలయురూపు। వేనలికల్మి యాబిరుదు సొంపగు నల్లె బుజములాతని తోటఁబొలుచుతీవ। లారుతీరాతని యడిదంపు తీవియకొను నాతని యయ్యకడిదియ డుగు। పొక్కిలి యతని పొల్పొసగు కేళాకూళిసిరదులాతని తేరు పేరుటజ్జు। కురు వులాతని తావుగూర్చిన యనటులఁదనరు పిక్కలువాని తరకసముల। నడుగులు వాని రెండవమూడవ మ్ములగోరులాతని యత్తలారుసిరుల॥ నట్లు గావున నిదిమది నరయఁ బొడము। పరువమున బొల్చుచెలువమే పారసంజ। కడను గన్పట్టునెలవెల్గుకల్మి నెగడు। వేలుపుల త్రోవ చాడ్పున వెలయుసుగడు॥ ౪౩॥

గీ॥ అహహ యజ్ఞాతయశా వనరైనదీని। పలుకులలకల కండలపలుకులరుచి। లుములను వేలుపుల బువ్వకరణిఁ దెగడి। మనమునకు నిర్భరానంద మహిమ సేయు॥ ౪౪॥

ఇట్లుండ నేపథ్యంబున ఓసికనకాంగీ యయ్యగారు తన పుట్టింటనుండి యామోదరేఖ యేతెంచి యమ్మాయిగారి యొద్దనున్నదని యాలకించి యచ్చటి సేమంబుల రయ విచ్చేయుచున్నారు-కాని మీరందరును హవణికగనుండుఁడు-దారులందొలగుఁడు వేగంబతొలగుఁడు॥

కనకాంగి॥ ఓసిచంద్రినా యావు నేయనుచు నందఱుగలసి తమ కుచితంబుగ నచ్చటచ్చట నుంచున్నారు॥

సీ॥ ఘనసారమృగమద ఘనసారవీటికా సురభి పురోభ్యగస్ఫురణదెలుపఁ। జరణవిన్యాసముఖ రనూపురంబులు మదహంస కూజిత మధురిమగన। లలిత వేల్లిత భుజావలయ శింజతముల శ్రవణ మంగళపాళు లవతరింప। రసకుంభ కుంభదురసిజదుర్భర భరాభరణ దభ్రింబయి వడకనడుము। నిజవదనోద్యదంబు జచిదాగత భృంగములు ఘ్రాణచంపకాకలనఁ దొలగ। దృజ్మరీచిస్ఫూర్తి దిశల నీలాంబుజ వ్రజసంచిత శ్రీల రాసులొసగఁ। దనులిప్తమహిత చందన గంధ సంబంధమున గంధవహ మర్దితను జెలంగ।యావకార్ద్రి పదవిన్యాస చిహ్నంబులు నవహల్లక శ్రీలనవనికొసగ।కంధరాధార ముక్తాహారదీప్తులుకామునీ సంచారకలన లీవ। గమన వైచిత్ర్యంబు లమలచ్ఛదంబుల మదగజంబులమాద్రిమదమడంప। శరిపీవరనితంబ భారసంవహనజాయాసనిదాఘపయఃకణాళి। లలితచేటీ కరాకలితజ లార్ద్రాంచ దనిల శాబకపిపాసాప్తినుడుప। బంధుకుశలావబోధ సంవర్ధమాన। కుతుక బాలాతపావేశ వితతదీప్తి । మహితవదనాంబుజ శ్లాఘమానరూప।యగుచు వెల్వడునారాజ హరిణనయన॥ ౪౫॥

అహో॥ హాళాయమ్మ యేతెంచుచున్నది గాన నీనుడువుల నిపుడు నిలుపుము॥

మం॥ అత్తికా ఉన్నమాటకేమి జళుకే - అమ్మయెదుట నేనే వచించెదను నిక్కంబుగ నాలింపవే।

ఆ॥ హాళా నీవచనంబులన్నియును నాకు విదితంబులయ్యె నేనే యవ్వ

తో నాలోచించెదను గాని కొంత సేపూరకుండుము - అని తదీయచరణాంబుజ గుంజన్మంజుల మంజీరశింజితాధి శ్రీపణప్రముఖలింగంబుల నాదేవి నతి సమీపగతం గానెఱింగి తనకేల నాచెలికయిం గీల్కొల్పి యెదురుగంజని యామెయడుగులను గెందామరలకు నిజనిటలనయన విరచితమృగ మదకజ్జల గంధంబున -నించిందిరసంగతశ్రీ వెలయుంబ్రిణ మిల్లుమన్నది - దేవి - సప్రేమంబుగ సముచితోశీర్ముఖరముఖర విబోధిత తామరస యగుచు నెత్తి గాఢాలింగనం బొనర్చి గండంబులం - జుంబించి, ఓ నాపట్టీ యెన్నిదినంబులకు నాకన్నులకుం గర్పూరకలికవైతివే.

ఆ॥ ఓయమ్మవ్వా నీయవ్వ నాకట్టిభాగ్యంబు నేటికిం గలుగంజేసెనే- ఇత్యాద్యుక్తుల నభినందించుచు వారందఱు విహారశాలంజేరి సముచితాసనంబుల యథార్హంబుగ నుపవిశించుచున్నారు-

దే॥ ఓసిపట్టిరో ॥

చం॥ తనదు కృపాణవల్లి విమతాసృగసార తపాన మత్తయై। దనరుపిధానగేహమున దాసుఖవిశ్రమ మొందవేడ్కనా। యనతన యుల్లయంబునని జార్థములన్నెర। వేర్పపండితా। యనసభ ధర్మసంహితల హాయిగం బ్రొద్దులుపుచ్చు నేకదా ॥౩౬॥

ఉ॥ నూతన యౌవనంబున వినోదపరత్వము నంబుధానలీ। ధూతదురంతచింతనలం దూలకతాలిమికల్మినిచ్చలుౕ శాతమనీష ధర్మనయ శాస్త్రరతిన్గురు భక్తులైహితవ్రాతరిరక్షనుందురె విరాజదురుక్రమకీతి సోదరుల్॥ ౩౭॥

క॥ జనకుం డానతియిచ్చిన। వినయంబునం బూనిసుతులు వెసనాకృతులు। న్మనమునకు నెలమి మిగులగ। ననయము నెరవేర్చి యతని నలరిం చెదరే॥ ౩౮॥

గీ॥ అంబలక్ష్మీ సమారాధనాది నియత। విధుల నలసతనెందక వేడ్కలమర పూజ్యకృత్యమ్ములెల్లవిబోధ మహిత। యగుచు వెలయుంచుచున్నా నైయత్యమమర॥౩౯॥

శా॥ కోడ ండ్రందరు నైకమత్యపరులై కొండాడం గానర్హమా నాడెం బొప్పసుశీల వృత్తులయి సన్నాహంబుతో నిత్యము। న్వీడెంబాదిగ నూపచారములతో వేడ్కందగంజేరివే। చూడాం చత్తది తాజ్ఞులైజననికిం జూపింతురయ్యిష్టముల్ ॥౪౦॥

శా॥ రాజ్యాంగంబులు నెల్ల సారవిభవా కామంబులై యొప్పనే। ప్రాజ్యానం

దముతోడం గూడి సుజనుర్లాజైన మాయప్పనుం। బూజ్యాత్ముండని యాత్మనెంతురె మహాషోడా వృతస్వాంతులై । వ్యాజ్యాయోజిత యత్నులైన కుజను ల్వ్యాపన్యమాను ల్గదా ॥ ౫౧ ॥

ఆమా॥ ఓమహారాజ బిడా జన్మనూజానీవీరపత్ని విదుషీమ తల్లి నీయనుయోగంబు లెల్లవిదిత సత్యయోగంబులగుటం దద్వైవపదార్థోత్తరంబులై విలసిల్లుచున్నవమ్మా- దేవి-సానందంబుగ - ఓపట్టీ నీవువారివారిభావు కోదంతంబు విదితంబు సేయుట నాడెందంబు సురాహార సరసీని మజ్జనంబూని మిగుల నెలమివెలయుచున్నదే॥

ఆ॥ ఓయమ్మా యిదియేమి కొత్రిత్త యాప్త జనకుశలవార్తా- శ్రవణంబకాదా శ్రవణానందరసాయనంబు.

దేవి॥ బాలరో వారివర్తనంబులు విన వీనులు మిగులం గుతూహలంబు నొందుచున్నవే॥

ఆ॥ ప్రధానంబులగు ప్రతివచనంబుల వచించెద నాలింపుము.

ఉ॥ తాతసరితాపహేతి విమతవ్రిజ సత్త్వర వారిభంగసం। భాత మహార్వసప్త శిఖదాయ భుజంబగుచు న్వెలుంగదు।స్వాత తమోభర స్ఫురణ పర్వతకుత్సులయందకన్పడుఙ్। స్నాతదురంత పంకకృత సంకట కోటులువీచి కూటముఙ్॥ ౫౨॥

మత్తకోకిల॥ నీదుసోదరులెల్ల నెల్లడ నీతిభూషణ వృత్తులై । సాదరంబుగ సత్కవీశ్వర సారవాక్సుధ గ్రోలుచు । న్వాదశీలుర గెల్చుచు న్బుధవాదిగోష్ఠుల మీఱుచు। న్వాదితార్థ్యను జీవులై సరసాశయుల్గడు నుందురే ॥౫౩ ॥

క॥ రాముని పోలికఁ దనయులు। నేమంబున జనకునాజ్ఞ నెటుమన్నింపంగామింతురైన నాతఁడు। రామావశుడఁగుట పజ్క్తిరథి గాఁడుసుమీ ॥ ౫౪ ॥

గీ॥ అవ్వ సమ్మదమయ పిన్త యగుట నవిది । తాధిపతిదేవతార్చ నాహ్లాదితమతి । మిగులు తటివిదుషులఁ గూడిమిగుల వేడ్కఁబుణ్యగోష్ఠుల నుండును బూతవృత్తి॥౫౫॥

గీ॥ అత్తదయఁ బడయంగ మహార్థలాభ । బుద్ధినన్యోన్యబద్ధ ప్రభూతగాఢమత్సరంబున నుపచార మహితవిధుల। వెలయుచుండియుఁ గోడండ్రు భిన్నమతులు ॥౫౬ ॥

క॥ శరదాగమ కమలాకర । వరవైఖరి నప్పరాజ్య వైభవములస । త్వరికర భారోత్కరమై । కరమరుదుగఁ దేజరిల్లుఁ గమలాకరమై ॥౫౭॥

దేవి॥ సామోదంబుగ- ఓయామోదరేఖా నీవక్కడనుండి వెడలునపుడు మాయమ్మయు వదినెయు మరదలు నేమిచెప్పిరే.

ఆ॥ ॥క॥ తలినీ నునుపుంజెక్కుల । నలదిన కస్తూరి రచనయభివృద్ధముగా నలగొనిముద్దిడి సేమంబడిగితినని చెప్పుమనియె నర్మిలి మీకున్ ॥౫౮॥

నీవదినయితే ॥క॥ తనమోము నలరువీడెం । బునఁ-జెక్కున నొక్కచుక్క బొడమించియురం । బునసక్తార్ద్రింబగునఖ । వనజాగింజేసి కుశలవచనము వల్కెన్. ॥౫౯॥

అని వచింపుమనియె ॥క॥ తననుదుటన మరుకుంకుమ । కణగణములు పుప్పరేణు కార్యముగానీ । తనరు చరణాంబుజంబుల । కనయము మ్రొక్కెనని మరదలర్మిలి బలికెన్ ॥౬౦॥

గీ॥ పొడము జవ్వనమునఁ బుట్టియొడలమీఱు । నన్నెచిన్నెల నలరారిపలయు వరుని । కాలుతొక్కంది సకల సుఖాళిహాళిఁ । జెందుమని యవ్వ దీనికిఁ జెప్ప నంపె ॥౬౧॥

దేవి॥ సాకూతస్మితంబుగఁ గూతుంగనుంగొని ఓయామోదరేఖా మాయమ్మ యిట్టికందునకుఁ జెప్పనంపెనే.

ఆ॥ ఔ నమ్మా నిక్కంబుగా నేవచించెదనే.

దేవి॥ ఈబోట్టై యవ్వ దీవనలకు సంతసిల్లునని తలంచెదవా!

ఆ॥ ఓయవ్వా యిట్లంటివేమే?

దేవి॥ మంచిది యిదియిట్లుండనిమ్ము నీచెలి నామీదం గొండెంబులేపాటిప్పెనే?

ఆ॥ ఓయవ్వా నీపట్టికింజెట్ట ఘట్టెడిదానవే యిట్టినాలుకు.

మంజరి॥ సరోషంబుగ। నేను లేనిపోని నుడువుల నుడివినంగదా కొండెంబులగుట ఉన్నమాటన్న మన్ననసన్నంబగునా? నిక్కంబో హులిక్కియో కాని నేనిట్లంటినని తొలితొడెంబయ్యును ఎదనునీవెక్కురులు అనుపద్యంబులం దిరుగం జదివి

యక్కరో దీనికన్న నేనెక్కువ మినుకుల నీతోనేమైనం బలికితినే నిక్కంబుగం జె ప్పుమని వినుచున్నది.

ఆ॥ సంతోనవల్లింగాంచి ॥గీ॥ ముగుదతనమున నీచిన్ని బుడుతవయసు। బోడ ము వెక్కురులను గింకపుట్టువులని। తలచివగలొంద నిక్కంబు దెలుపకీవు। మిన్నకుం టివి తల్లియే మన్నన యిది ॥౬౨॥

॥క॥ ఈబాల బేలగాపున। నాబాల విదిత వయోంభవాంకముల శ్రీ। శాబా యుథగతి యువలకు। నాబారిని జేయునవని యారయదుగదా ॥౬౩॥

దేవి ॥గీ॥ మించియోపట్టి నీవు వచించినట్టి। వచనమట్టిదయైనం బట్టువడక నాననీయానమనమున నానం బూన। నానుడొందితి నానాడు నయమువలుక ॥౬౪॥

క॥ జాబిలి వోడమెడు నెడల। న్నావిరిగా నిరులు విరియు వరుసను వేళం। బావిర్భవించు పాయపు। తావింజెడదయ్యె ముగుద తన మీచెలికిన్ ॥౬౫॥

ఆమో ॥ ఆ॥ ఇంతదానవైన నీడెలుంగని పిల్ల। లెదుటనైనం దల్లియాలివువిడం దెంపుసేయ నేర కింపైన ముద్దరా। ల్తనముతోడ నెల్ల తతినిగడుపు ॥౬౬॥

దేవి ॥ కం॥ పెద్దలచే నేమంబునం। దద్దయుగరపంబడు చెపుండుందనరెడినడత। ల్వద్దన్నను విడి వెడలక। నొద్దన గడువేడ్క నుండునో చెలివింటే ॥౬౭॥

ఆమో॥ ఉ॥ అందరు బుద్ధిమంతులె హితాగమ తృష్ణం గృత ప్రియత్నులే। యందరకన్నందామస నయాధిక వృత్తివసింపగాములే। వందిత శైలియైనగురువర్యులబో ధల శ్రద్ధచూప్పనే। యందికొనుంద్రుతత్ఫలములప్పస మొప్పగలోకులెచ్చటన్ ॥౬౮॥

గీ॥ నీవు గురుజన బోధల నియతవృత్తి। జిత్తమునగూర్చి కఱచిన నుత్తమా త్మ। వగుటవాని సంస్కారములావయ వెపుడు। నీమనోవృత్తి నియమించు నేర్పు లమర ॥౬౯॥

క॥ దివిజుల యందును గురుభూ। దివిజుల దైవజ్ఞమంత్ర తీర్థములందున్। శివతాతి వృత్తులుజ్జ్వల। శివతాతిస్తుత్యగతి వశీకృతులెకదా ॥౭౦॥

క॥ సాధితములైన మహితస। మాధిని షేవులకుంగలలు మహిమదనర్ప। న్సా ధితములు గాకుండెడి। సాధుఫలము లిచ్చునట్లు జడులకు నిడునే ॥౭౧॥

దేవి॥ ఓపట్టీ- యిది యట్టుండనిమ్ము.

ఆ॥ వీని వలన మేలకాని సేగించుక। యేని లేదటంచు నెన్నిమార్లు। నుడివి యున్నవినగ నూల్కొనదింతైన। నేను దీని వంత నేఁజెరుప॥ ౭౨॥

క॥ నిబ్బితి విడిసేనెన్నడు। నిబ్బరముగ వీని నిజము నేరుప నేరం। దబ్బిబ్బు పడకయుండగ। గబ్బితనంబునను దెల్పిగావుము దీనిన్॥ ౭౩॥

ఆమో। ఓయమ్మా యానమ్మా నీమాట నయములమూటలై పాటింపందగు.

క॥ శిక్షకులెప్పుడు శిష్యుల। కక్షయమగు ప్రేమయున్న నదిమనమున నే। దక్షతను దాచి దానిని। రక్షణచేఁదగు నదనలరాజింపఁదగున్॥౭౪॥

మరియును.

చ॥ గురుజను లిట్లు జవ్వనపుగుర్తు లసాజముల న్నలంబులం। గురుకొని పిన్నవారలకు గోరికమీఱవచింపుటొప్పగా। దరయనమైన వారులఘుతాహిత చిత్తులమైప్రమత్తులై। కరము నయంబువీడి తమకంబున నెంతురు సాటివారిగన్॥౭౫॥

కావునను.

గీ॥ ఇట్టి మర్మపు సంగతు లిష్టసఖుల। వలన దెలియంగవలయును వలనుమీఱఁ। గానవావలనన యిద్ది గౌతుకంబు। దనరనాలించి సుఖిగావు తనుతమతిని॥౭౬॥

మ॥ చెలికారంబునఁ బట్టినెట్టి కతలన్ శ్రీమంతులు న్నిస్వులు। న్నలవత్తారతమంబులుండినఁ గడు న్నానింది గందోర్చిచిని। శ్చల విస్రంభమునం బరస్పరమ శేషాఖ్యాతరాహాస్యులై। విలసన్మైత్రిఁ బవిత్రివృత్తులయి యెవ్వేళ న్వసింపందగున్॥ ౭౭॥

గీ॥ కాననోతల్లి మేము సంగాతులగుట। వలయు పలుకులఁ బలుకుట వెలికిఁగాదు। కావునఁ దనరు వితములు గారవమునఁ। జెప్పిదీని మనంబున కొప్పసేతు॥౭౮॥

దేవి॥ ఓసి- నాకూనా-నీవెంతనీతిమంతురాలవే-నాయాశయం బంతయు వింతవీడి పచించితివి-తొల్లినీయమ్మనాకు- నయమ్ములు ~~నయమ్ము~~ గరపునపుడీ-యరతమ్ములను నిట్లు వచించెగదా॥

క॥ నెచ్చెలుల తోడనైనను। విచ్చలవిడి గ్రామ్య కథలు వీడంగఁదగున్। టెచ్చెరనగ వేతెంచిన। నచ్చపురదముల దృగవిషయంబుల జేయన్॥౭౯॥

కావున నేను దీని జడుపు వెడలింపం బ్రోడగానైతిని - కాననీవ దీనికిం దగు

మినుకులం బలికి తెల్లంబుగ నుల్లంబునం- గలవంతలం బెల్లగించి వింతలగు సంతసంబులం- బల్లవింపఁ జేయుము ॥

ఆమో ॥ ఓయమ్మా - నీవిక్కార్యం బింతవట్టు నాకుం దెలుపవలెనా - నాకిది మూర్తంబై బహిర్భూతంబైన - ప్రాణాంశ సమష్టియేకాదా ॥

దేవి ॥ ఔనేయమ్మాళూ. ఈయరతంబు నీవలపోరిచి యెంతయదనునకింత। చదువు గఱపుటచేతనే తెల్లంబగుచున్నది, మనము వేరుగ నుడువనేమిటికే ॥

ఆమో॥ ఓయమ్మా నీసంతసంబెగాదే - నాజీవితంబునకు రసాయనంబు - నీయానతియకాదా నాకీలు గంటునకు సూనకుతుకురాయి-మంచిది యిది యిట్లుండనిమ్ము పరిష్కృతంబైన.

క ॥ సుమహిత తౌర్యత్రికచం । క్రమణధురీణాగ్ర గణ్యగణ నీయయ్యెన్. విమలమతియింక రసకా । వ్యములం జదువంగ వలయు నవహిత బుద్ధిన్ ॥ ౨౦ ॥

గీ ॥ సరస కావ్యామృతాస్వాదసౌహృదమున । దీని జాడ్యము దొలఁగు నింతింత యగుచు । సకల హిమకర రుక్ఛటా సంగమమున । విరిసిపోవదె కేయిఁదిమిరభరంబు ॥ ౨౧ ॥

సాకూతస్మితంబుగ॥ క ॥ కావ్యరసానుభవంబున । దివ్యత్త్వప్రాప్తి మనోజ దేవనపరతన్ । నవ్య ప్రకృతియ యయ్యెడు । భవ్యగుణ న్వరుని దేగఁ బ్రయతింపు మికన్ ॥ ౨౨ ॥

దేవి ॥ సాశ్చర్య స్మిత వికాసబాలాతపాలంకృత వదనారవిందంబుగ - ఓసి నాపట్టీ -ముద్దుల పట్టీ - యీ పట్టికా యిట్టి యొల్లంపు నట్టువుల పుట్టువులు - ఆట్టైన నిత్తట్టి కట్టిదో యొకనట్టు పుట్టునని నే గట్టిగ నుట్టంకణం బొనరించిపక్కాణించెద.

నేపథ్యంబున ॥క॥ నల్లందనమున నిరులను । నుల్లంబునఁ దన్ను జెరుప నొగిమిన్నంటెన్। దెల్లంబుగఁ బొద్దనుచుం। దల్లడపడి మాకు మొదల దాగెడునీడల్ ॥౨౩॥

గీ॥ కర్మతు లొనర్చు నిగమసత్కర్మ హోమ । దేవనిర్దిష్టధూప ప్రదీపధూమ। పటలముల జయఘంటికా పటురవముల । నెమ్మి లెమ్మగ నాడెడు నీరదమతి ॥ ౨౪॥

చ॥ - సరణివశంబునం దరణి సామన సాయన మధ్యదేశముం। దొరకొని యుండఁ జాయగని తొల్లియశేష విశేష సక్తగాఁ। బరగిన దాటఁ దన్నినుడుఁ పాంసులగాఁ దలపోసియుగ్రుఁడై। పొరిగొనునంచు భీతయయి పొందుగనొందెడి దీన భావముల్ ॥౫౪॥

మ॥ చిరసంప్రాప్తరతోత్సవానుభవ సంసిద్ధాధికాయాససం। వరణోదీర్ణ మృణాళీ ఖండ కబళా స్వాదోన్మదాత్మంబులై। తరుణస్యందన పాదపక్షియుగముల్ దల్పంబులై యొప్పుతా। మరపత్రింబులఁ బవ్వళించెడిమిళన్మస్తాగ్రి నాళంబులై॥౫౫॥

చ॥ హరికరసంప్రబోధిత రమాంబుజ వాటములందునూటిగం। గురుతృషలుల్లసిల్ల మటికుత్తిక బంటిగ నానితేనియ। ల్వరమద సమ్మదంబులయి వారకతేటుల కూటువల్బర। స్వరమిళితంబులై శ్రుతిరసాయిత గీతములొలిఁ బాడెడున్ ॥౫౬॥

శా॥ వాతాఘాత దళద్దళావళి సముద్యాంత ప్రసూనద్రవ। వ్రాతాశాంతనిషిక్త మంజుసురభీవ్యాప్త ద్రుమాలాంచిత। స్ఫీతానాత పదేశ తల్పలముల నాసీనుల్యయానుల్విని। ర్ధూతాశాతర విద్యుతి ప్రిహతులై దూరాధ్వగుల్ని ద్రితుల్ ॥౫౭॥

గీ॥ తామసాశేష విధ్వంస ధర్మసుహృద। మైననీదు ప్రతాప సమాధిగనగ। గగనమధ్యముసేరి వికర్తనుఁడు। మిగుల వెలుగొందు మిత్రలక్ష్మీప్రియతను ॥౫౮॥

మరియును ॥సీ॥ సంపత్ప్రసపసద్మసత్క్షత్రవంశాబ్ధిలబ్ధోదయబుధ సంద్రుబ్ధమహిమ। విమలగుణాత్మతుల్య మహితసోదరసంతాన సంతతోజ్వల యశుండు। నిజగుణ ప్రసవౌఘ నిర్మితాను గ్రహామకరంద పుష్టసన్మధుకరుండు। తామసాహంకార దారణ పటు కలానాథాగ్రజన్మగుణాకరుండు। సహజవితరణ విషయ భూషాద్యశేష విషయితోష దసద్వస్తు విత్రప్రహృష్ట। విబుధరమణీమణీగణవిదిత పుత్రి। భావకస్తుత్యశుభోక్తి సంభావితుండు ॥౫౯॥

కం॥ కావునననుధర్మశ్రీ। భావుకతమ పారిజాత పదవాచ్యుండీ। భూవిభుఁడాచంద్రార్కము। గావుతసకలేష్ట సిద్ధిఁగాశ్యపినెల్లన్ ॥౬౦॥

॥క॥ అనుచు శ్రద్ధావిధిభర। మునననన్యానూపచారముల విప్రవరుల్। బొనరఁగ నర్చితపరమే। శునిపైఁ జెట్టుదురు మంత్రశుభపుష్పములన్ ॥౬౧॥

వ॥ మఱియు నీపారిజాతక్షితిపురుహూతుండ కారణ శరణాగత జనతాభరణాభరణుండును వివిధాధి నిధానదుర్విధ దుర్విధతాంధ తామిస్ర విస్రంసనాజ స్రసమాశ్రితఘస్రస్వామి మహోగ్రమహిముండును గావున నీమహారాజశేఖరుంగాంచి సేవించిన నాకసుఖంబులం బడయానగునని తలంచి మించిన కుతుకంబులం దత్తద్విద్యాన వద్యపద్యా చంక్రమణజంఘాల సంఖ్యావత్సంఘంబులు దూరాశావశులై దూరాశావశంబులనేతెంచి. స్వపాండితీనర్తన సమాహ్లాదిత భవదుపలబ్ధ తత్తత్తర్షతాసంజనితహర్షా క్రాంత స్వాంతులై వెండియుఁ దమకడలకు వెడలు నెడల నతివినయ భక్తిశ్రద్ధా భరంబులం ద్వదపనీతంబులగు పదార్థంబులం బాకంబులంగావింపించికొని సుస్థాస్నుచేతస్కులై యప్పరమేశ్వరు వివిధ తద్విధి విషయమంత్రంబుల నభిషేకించి సంపూర్ణోపచారరమణీయంబుగ నువికచస్యంద మానమరంద బిందు సందోహసుందర తరకుంద మహోత్పల నీలోత్పల విచికిలవకులసేవంతికా ప్రముఖ సుముఖ సుగంధ బంధుర కుసుమ స్తోమంబుల సురుచిరత్రిపంచపత్ర భాసుర తులసీబైలూపాది దళ విశేషంబుల సహస్రనామార్చనంబు లొనరించి మిలమిల మెలగు శాల్యోదనంబును గంధగ్రహవిషయ జీవనౌషధ వివిధ ద్రవ్య వాసనా సంవాసిత గోఘూమ సిక్థసంపక్వ శర్కరామయ పాయసంబును రసావధిలక్ష్యంబులగు నానావిధ భక్ష్యంబులును కంటకి ఫలాంశమత్స్యలా ప్రముఖ శలాటు మయంబులును మూలసూరణాది కందమయంబులునగు శాకంబులును బహువిధలేహ్యంబులును సర్షపామ్రజంబీర తదీయరస భావితార్ద్ర కాద్యుపదంశంబులును సాధు క్వాథ ప్రసాదిత పరిశుద్ధపయః పరిణామంబగుట సుందరీరదనాంబర పాటల ప్రభాస్వాదాడంబర పాటచ్చరకలంబులగు దధిశకలంబులును సుమహితపానభాజన విన్యస్తంబగు హైయంగవీనంబు నురసనామృతంబులగు సహకార కదళీకంటకఫలాది ఫలంబులనుం గనుంగొని భవదీయభక్తి విశేషంబున కరుదందుచు గతిసంభ్రమంబున నాపృపాకపికి సమర్పించి నిర్వర్తిత తత్కాలోచితకృత్యులై యమందానందకందళిత హృదయారవిందులై యభ్యాగతజనంబులతోడం బ్రతికబళంబునకు భగవంతుండగు నీశ్వరునినామంబులు భవదీయేష్ట కామస్తోమసిద్ధి ఫలకాశీర్వచనంబులతోడ సంస్మరించుచు భుజియించుచున్నారు దేవాయ వధరింపుము। ఇట్లనుచు ద్వితీయప్రహరావసాన సూచకంబుగ ఘంటామణిం బ్రహరించుచున్నారు। దేవి। ససంభ్రమంబుగ। ఓపట్టీ యార్యపుత్రుండు

విశ్రాంతికై శుద్ధాంతంబునకు రాఁదటియయ్యె నీటి కాదానవీజనాది కృత్యంబులనే సే వింపనేగవలయు దీని నీయుపాయంబులంగుశలినిఁగాఁ జేయుము ఇట్లునియమ నాం గీకరణంబుల నందఱుసంతసిల్లుచు స్వోచితస్థానంబుల కరిగిరి.

ఇదియాద్యంకము. శ్రీరామాయనమః.

—— :0: ——

## ద్వితీయాంకము.

శుభమస్తు.

---

పదంపడి మంజరి యామోద రేఖయుం బ్రవేశించుచున్నారు.

ఆమో॥ ఓభర్తృదారికా యవధరించితేయంబయుది తంబులు.

మంజరి॥ అత్తికానామినుకులు నిక్కంబులని లెక్కించుటకు మక్కువల వెల యించుచున్నవిగదా.

ఆమో॥ (స్వగ) ఇప్పటికయినందీనికి మాతయంతరంగంబు సంగతంబుగాద య్యె నయ్యో దీనిమౌగ్ధ్యంబు (ప్ర) అద్దియట్లుండనిమ్ము అమ్మా నీయుమ్మలికకై నెమ్మనం బునం జింతించుచున్నదని యిమ్ముగ నమ్ముచున్నావా.

మంజ॥ అట్లు నేనెట్లునమ్ముదునే యత్తికా నేనప్పుడప్పుడం తలింతలని వచింప రాని వింతవింతలగు వంతలనంతంబుల నొందుచానివలెఁ జెంతంగనుపించినను సంతసి ల్లుదానింబోలె నుండునుగాని యింతయేని గనికరంబుగలిగి నాపొంత మంతనంబుసేసె నే నానుడువులు హుళుక్కులనితలప వలనుగాకుండ నీయెదుటనే వచించితిగదా నీవు వచ్చుటంజేసి యేమితలంచెనో నాకింకనింకం బొంకంబుగం బలికింపుమని నను నీకొప్ప గించెఁగాన నీవలన నీగోడుపీడందగు। అమ్మవలె నీవూరకుండవని నమ్మెదనే నెమ్మనమ్మున.

ఆమో॥ సదరహాససుందర వదనారవిందయయి కౌఁగలించికొని వాతెరలం జె క్కులనొక్కి కురువునం గూర్చుండబెట్టుకొని ఓచెలియా యీమీద నీదిగులు నిము

సంబుల వెడలించెదనే నీకన్నది వలంతిగా కూరకుండేఁగాని. నేనట్లుజేసెదనా - బెగడు పిడుము వెసగన నీయుసురులకుం గసరు విసరించి పసిమి మసలు సంతసంబులనొసంగెద నాపలుకుల నాలింపుమని దానియెదకు బెడగుల జాడలనిడు నాజవ్వనంపునంగమచ్చల పుట్టువుల కతంబులు న్వాని వినియోగంబులు నిట్టిట్టని వీనులవినుచున్నది

మం॥ కో స్త్రీగందళ్కొత్తిగబ్బితనంబున నుబ్బు మబ్బుంబోలి యబ్బురంబుగ నిబ్బితి నిబ్బరంబగుచుఁ దన యెదయను త్రమ్మిన నుగప్పి మొగడ పోడిమింజేయఁదా వెలవెలబారు మొగంబునం దలపాంచియుంచున్నది.

అమో॥ ఓచెలియా యెందుకే నానన నెదవు నేలచూచుచుంటివేమే ఎందుకే ననుంగానవు నేనిట్లంటినని నామీద నలుకయుంగలిగెనే యనుచున్నది.

మంజ॥ (స్వగతంబుగ) దీనికేమని మారు మినుకు మినుకుదును ఊరకున్ననిది యుల్లసంబులాడు తెలివిలేమి నెకదా తల్లియుల్లంబుగానలేకపోతిని గాన నిపుడేమి సేయవలయు నోయని సందియంబునం గుందుచు సభయ వ్రీడంబుగం గన్గొనుచున్నది.

అమో॥ చెలియా బెదరు వదలి మాటాడవేని నాయాన.

మంజ॥ గీ॥ అన్ని తెఱగుల లగ్గుల నమరగోరు। నవ్వయుల్లంబు దెలియక నవయునేను। హొన్ను నానిడగుత్తుక నొప్పఁ బట్టు। దాని నురివేయు దానినిఁ దలఁపనొక్కొ ॥ ౧ ॥

ఉ॥ కన్నది సేయుమన్ననల గారవముల్పరికింపలేకనే। జిన్నతనంబున న్వెతలు సేయునవంచును నామెయూరునా। కన్నను సన్నమా తెలివి గల్గినదేకద యెద్దియద్దితా। వెన్నను సంగ సున్నమిడి వేవెతసేయదలంచితీవనుఁ ॥ ౨॥

క॥ తానువినగ నీతోడను। నేటులంటిని నటంచు నేరము నాపైఁ। బూని చికనలి మనంబున। జానుగన న్నేమిసేయు చాడ్పుడలచునో॥ ౩॥

క॥ అమ్మమనంబెట్లుండునో। యమ్మక చెల్లపుడు నీవయమరు వెరవుచే। నుమ్మగిలకుండ నెమ్మది। నమ్మలి కలఁ మ్మునేయ నొగిబూనదగుఁ ॥౪ ॥

అమో॥ (స్వగతంబుగ) ఈబాల నావలన నీనడుమం బొడమిన నడియాలంబు

లయందుఁ గింకలక్షణంబులను సాశంక వెడలించి పరువంపు గురుతులని యెఱిఁగి యావంత వీడియుంగన్నది దిన్నని మన్ననలకు విన్నపాట మరనరమరలంజేసి యేమిదండనంబు సేయునోయని బెగడుగొనుచున్నది గాన నిమ్ములగు నమ్మికల దీనినెమ్మనంబునకు సంతసంబు వెలయింప వలయు.

ప్ర॥ క॥ జడుపేలనీకునోచెలి। జడతంగద పలికితిట్లు జననియుమదినీ। వెడగుతనంబెఱిఁగికదా। వెడలునోయిది యెప్పుడనుచు వేసరుచుండున్ ॥ ౫ ॥

క॥ మనయమ్మ మిగులశీల। మ్మునననలరినయదియ కాన మోమోడ్పడిన్। మన మదుకొన్నమాటలఁ। దనమోమునఁ జెప్పవలసి తావెతఁజెందెన్ ॥ ౬ ॥

ఆ॥ జనులకెల్లనిద్ది సాజమైకన్పట్టు। తనయులెపుడు పెద్దతనమునొందు। ప్రియజనంబుగలిసి ప్రేమలుప్పొంగంగ। హాళులొందుదురని యెఱయుచుంట ॥ ౭ ॥

ఆ॥ జనకులకు నపత్యజాతంబులుండిన। మిగులఁ దండ్రిగోడుకు మేలకోరు। నమ్మయైనదాని కఱువదిమణుఁగులె। క్కుడుగఁ దములఁ జేయుఁగూతులగ్గ ॥ ౮ ॥

చ॥ అదియట్టులుండ లోకమున నందఱకుం దమయాత్మజన్ములం। దదనముగం జెలంగు కడునర్మిలియంతయు నొక్కటైననా। యదిమన యమ్మనీయెడల నందినప్రేమకు నుద్దిగాఁగనో। పదులఘుతూల లేశములు భర్మముతో సరియౌనె పెక్కులున్ ॥ ౯ ॥

ఉ॥ ప్రాణులకెల్ల లోకములఁబ్రాణము లైదని కింవదంతియా। ప్రాణములుండ సత్వములపారత మించెడికార్యపాళివి। న్నాణముమీఱఁ జేయుదురు నవ్యగుణాస్త తమాతనీవను। ప్రాణము లగ్గునుండగ నరాజిలునర్మిలి యెంతో చూడుమా॥ ౧౦ ॥

గీ॥ అట్టిహృదయాళువగుట నీయవ్వయెఱుక। వీడినీవొనరించిన వెఱ్ఱితనము। దలచిదండించు ననుకొంటదమ్మి పగతు। జూడగంటికిఁ గాకనియాడుటగద ॥ ౧౧ ॥

గీ॥ చిరతమెయిపుట్టువులు ప్రేమకిరవులగుట। మాతృపితలకు మిగుల ననాయవృత్తి। వారివిన్కల సరసకవారియున్న। సంసంబల పలికెదు సరసగతిని॥ ౧౨

క॥ బాలురనుడువులు వక్రత । పాలుపడియుఁ బ్రేమసేయువారికి మిగులం జాలగ ముదంబులొసగుచు। బాలేందుని మూర్తిపోలెఁ బాటింపఁబడుౙ ॥౧౩॥

గీ॥ నీవికను వీడు బెగడును నిన్నుదల్లి। గారవించునుఁగాని వికారమొంద। దర్భకోక్తులు పితలకు హర్షదములు। యగును నెటులైనఁగును మ(ప్ర)హారగతుల॥ ౧౪॥

మం॥ గీ॥ అక్కరో యిపుడిటు లీవుమక్కువమర। వక్కణలు సేయనామది వంతదొలగె। నిక్కముగ నేను బ్రతికెగ సొక్కుటుడిగి। వెక్కురుల నక్కలకిడెద నక్కజముగ ॥ ౧౫ ॥

గీ॥ ఇంతమాత్రపుమాట నాకింపులలరఁ। దల్లిదొల్లియ నుడివినఁ దల్లడిలక। వెర... పెఱుంగక హాళిచే వెరవరినయి। యుండుదునుగద చెలియరో పండువమర ॥౧౬॥

ఆ॥ తెలివిలేమి యనెడు తీంద్రంపు కింకకుఁ। దల్లియాలు వమరెఁడనరుతోడు। పాటుగాన నట్టిపాటులొందిన నాకుఁ। బ్రతుకు మందువైతి వెతలుదొలఁగ॥ ౧౭ ॥

ఆ॥ ఆడుబడుచు లందునర్మిలి యెప్పుడు। నదనమగుచునుండు నమ్మకనుచుఁ బ్రజలు సెప్పుకొందు్రు నిజము గాదదియెన్నఁ। జెలియ కని వచింపఁ జెలువమమరు ॥ ౧౮॥

ఉ॥ కావున నీవు నాకు హితకారిణివౌట పవిత్రికంబెనా। ప్రోవుటయందు నెక్కుడుగఁబూనితి ప్రేమను సేమమయ్యెనా। కీవుగదా హితాహిత సమీహిత బోధనిబద్ధ భావత। న్భావుకధాత్రి విల్లెపుడుఁ బాయకకావుము చాలవేడెదౘ ॥౧౯॥

అని ప్రార్థింపుచుఁ దానిచరణంబుల నెరగుచున్నది.

ఆమో॥ దానిం బైకెత్తి ముద్దిడి కురువుననుంచి.

గీ॥ ఈవిటుల నన్ను బతిమాల నేల చెలియ। కొర్తదానవె నీకు నేఁగొమరుమీరు। నీదుకోరికలన్నియు నేమమమర।వారకయ నెరవేర్చుట వరవునాకు ॥౨౦॥

క॥ ఇట్టులగుట నీకిప్పుడుఁ। గట్టిగ నేనొకటిజెప్పఁ గడగెదనీవుం। బట్టుగ నాపట్టునునిక। నట్టువడక చేసెదేని ననచుముదంబుల్ ॥౨౧॥

ఆ॥ నావచించుమాట నయమెుప్ప జేసితి। వేని నాదుజన్మ మీడితమగు। వనిత లంతుగాన నలరు నుల్లముతోడ। నట్లుజేసి ముదము లమరగూర్పు॥౨౨॥

క॥ పనిపూనియిట్లొనర్పగ। నినువేడెద నిజముసుమ్మ నిత్యప్రేమం। బునఁ గాన నాదుకోరిక।మనుపుము మహితాత్మవగుము మాన్యులలోనన్ ॥౨౩॥

ఆ॥ చెలిమియెుంతయున్న చలనివు భర్తృదారికవుగాన నిట్టిరీతినిన్ను। వేడవల సెనిపుడువేడుక లలరంగ। నాదుతముల నింపునర్మమర ॥౨౪॥

ఆమో॥ అక్కరో నీవిట్లు చెప్పెదవేమే.

ఆ॥ నీవ తల్లివంటినీవ నా మేనికి।జీవితంబవంటిజీవనాపు। కంబవంటి నిట్లుదయ యయగునన్ను। కూర్చియటుల నుడువ గుటవుతనమె. ౨౫

చ॥ మతిమతియిట్టునీవు బతిమాలుట నుల్లమునందలంపవం।చితమతిచేత నాయనెడు శేముషిగల్గును గానయద్దియున్। హితమని యెన్న గాదగదు హీనమతిన్నను గేలిసేయగా। గతకపుకాయ యంతయిన కార్యముగన్పడ కున్కినెట్టులన్ ॥౨౬॥

గీ॥ కనలినీవిట్టు చెప్పవుగాని చెప్పె। దేనిసాపడుటుడిగెద నెట్టిరనణముల నువీడెదవీడెద ముదముతోడ। మేనినైనను మేలనిమిగులనలరు ॥౨౭॥

ఆమో॥ సస్నేహహాసంబుగ దానిం గవుంగలించుకొని తనయూగుపీఠింజేర్చి వాతెరచివురుచేతం దానిగండంబులు నిబిడంబుగం బీడించి ఓసి నారతనాలకుండా యటుచేసెదవే నీవన్నమాటతప్ప కూడదుసుమీ అట్లయిన నాయభిమతంబు వివరింతు సావధానంబుగ విని యట్లొనరింప నుద్యోగింపుమా.

సీ॥ జాడ్యతమశ్ఛన్న సకల పదార్థౌఘ సంప్రకాశనవిధి సవితృదీప్తి। యాధి నిదాఘ మహాతపాభిమ్లాన కైరవ వనసుధాకర కరాప్తి।సలలితశర్మ బీజప్రరోహహేతుహృద్యాభ తీహృదయ ధరిత్రికంబుద విభూతి। ప్రమదవరాలంబ ప్రతిభావిలాసినీ విహరణాసేచ నక హారివనిక। మహితభూరి విధచమత్కార భాసురాలంకార భాసురరసమయైన। కల్పితినధూలలితాంగ వృత్తిరీతి గుణౌఘసౌభాగ్య విజ్ఞానజన్యహర్ష। పీయూషలబ్ధిఁ బవిత్ర

దేవాత్మత ధ్వన్యర్థవ్య విజ్ఞానధన్యతావి। భూతి సేవధిలక్ష్మీ బోధైకధనికధీ కౌముదీస్ఫుర ణ రాకాధిపేల। సకల చింతాంతంతు సంతానకర్తన కర్తరీప్రౌఢవికారలక్ష్మీ। విగళిత నిశ్శేష వేద్యాంతరత్వలక్షణ మహానందరసప్రసేవ। శారీరకాగమ జ్ఞానలక్ష్మీలబ్ధి శ్రోతృశబ్ద గ్రహసుఖదవచన। కల్లోలమాలికాఘటన ఘటాంభోధ మార్దవపారుష్య మహితవర్ణ।వాచ్యగ్రథనమూలపాక భాసురవృత్తిరీతి మయకృతి సంప్రీతిమాతి। శ్లాఘ్య కావ్యక్షీర సాగరాంతర్లీన సారస్యపీయూష సంగ్రహవిధి। మంథానభూధర మహిత విభ్రమరమ శ్రోత్రవపాపేయ సుఖితపుణ్య। జనసంవిద జరతా జననసుధారస ప్రసన మంథన భంగరహితశరధి॥ గీ॥ గానసాహిత్య విద్యయ గానసహిత। మగుచు సరసజ నాళ యాహ్లాదభరవి। ధానసువిధాన విభ్రమాధానియగుచు। సకల విద్యామతల్లియై శ్లాఘ్యమగును ॥౨౮॥

గీ॥ ఇట్టిసాహిత్యవిద్య నీవిపుడువేడు కడరఁ జదివిన నీనేర్చినట్టిగాన। కలను విమలమణికనక ప్రసాధనమునకా మోదసంపద నటన గాదె ॥౨౯॥

క॥ నీవిచదువుంజదివిన। నావేడుకలెల్ల మిగుల నయమహిమముచేఁ।జేవనలరు సిరులకరణి। నీవులవలె వినయకలన నితశోభములై ॥౩౦॥

క॥ ఈపనినీకు విధింపఁగ। నాపోవనియిచ్చవుట్టె నాత్మనునాకుం। దాపురమేల వచించితిఁ। గోపము సేయకయచేయు గోర్కులు మిగులన్ ॥౩౧॥

ఆ॥ చెలిమియెంతయున్న।చెలినీవు భర్తృదారకవుగాననిట్టి రీతినిన్ను। వేడవల సెనిపుడు వేడుకలలరగ।నాదుతములనింపు నర్మమమర ॥ ౩౨॥

క॥ పలుకులు ములుకులువోలుత। గలకండల పలుకులొండెగారాపుసిరి। స్వోల యింపునాదుకోరిక। నలరింపుము నీదు ప్రీతిననయము చెలిరో ॥ ౩౩॥

ఆ॥ ఇట్లుచేసితేని యింతకులోఁగడ।నీకుఁ గలిపినట్టి నిపుణవంద్య। మైనగానకలకు నర్మదక్షిణనొందు నటులసంతసిలుదు నట్లొనర్పు ॥౩౪॥

మం॥ తద్వయస్యా వచనరచన సమాకర్ణనజనిత చిత్రతంజితరి లిఖిత పుత్రికాకారపాత్రంబగు చుంగడు దడవుదాని వదనవిశదాంశు మండలంబున నిశ్చలబిర్ని

మేషంబుగ లోచన మేచకాంబు జంబులం గీల్కొల్పి యెట్టకేలకు.

క॥ ఇదియెట్టి వేడు కేచెలి। సదయతనను దెలివియీని సమధికవిద్యా । స్పదమొ నరఁజేయబూనితి। గదయిది యమనంబునకును గదరీతియగుఁ ॥ ౩౫॥

గీ॥ ఇట్లు వేడుటకాఁ బోలుహితము సేయు । వారికుపకార్యులయెడవర్తనంబు। ఘనుడు జీవనమిడు వేళ గర్జితంబు। సలుప బనియేమిగాదేని సమయమట్లు ॥ ౩౬॥

గీ॥ బెగడులిడుచును గొట్టుచుబిడ్డలకును । బెద్దలగు వారుబుద్ధుల బ్రేమనిడు దు । రహహానీవైన దెల్పుచు స్వార్థపరత। హితవిబోధము చేయుదు వెపుడుచెలియ ॥౩౭॥

గీ॥ గులకటాల్జతనంబున గోరువాని । కసురగురుడైవ తమణీ మహానిధాన । మ బ్బొటయకాదెయతి నీచహాస్యమతిని । యైననాకిటు దయసేయుదనుట దలఁప ॥౩౮॥

ఆ॥ గురులు శిష్యజనుల గోరంతరైనను। బ్రేమ వెలికినిడక బ్రీతియున్న। మూ సికలలనెల్ల వాసికెక్కెడుదాక। గఱపవలయు గర్వమెఱుగకుండ ॥ ౩౯॥

క॥ బెగడడకువ బత్తియునోలు । కగవేడినగాని కలలగఱప రువిబుధు। ల్జగతిని నీవైనమువిరి । విగనర్మిలి నేసిగఱపవేడుదుకహహా ॥౪౦॥

క॥ పెక్కులు వక్కణ సేసిన। గక్కసమది నీదుమదికిగావించునొకో । యక్క రోనిక్కము వినిచెద।మక్కువ మరజెప్ప నే రమనుపుము కృపచేన్ ॥౪౧॥

చ॥ తొలుతన తెల్విలేమి కడుమాషిత మానసనైతి నిద్దియే । దెలుపగనేల వే రుగను దెల్లమునీకయియుండు నింతయుం। దలిపనినిన్ను నమ్మెదను దప్పకనింతయకా ని యొుండు నే । దలఁపగజాణగాను గృపదాల్పుముగావుము వేడెదంగడుఁ ॥౪౨॥

ఆమోద॥ చ॥ చెలియరొ యెంత వింతమదా జేసితివేయిది గాక నీకునే । గలు ముల హాయులొలి జవిగాంచెడి దానికి నింతకంటె సే।బలువునిడందలంచెదనె పల్లవకో మల గాత్రదీనికే। కళ వళమందు చుండియును గార్యవశంబునఁజెప్పవచ్చె నే ॥౪౩॥

చ॥ గురువులశిక్షనొందక నిగూఢజడత్వము నన్వసించువా।రురుగుణులైన దా రుదమయోజము రంజిల జేయనింతయుఁ । వెరవరులొటకుం దగరు వెగ్గలమూ బెరడుం

డ హీరముఁ। సురుచిత నెుప్ప నొక్కొ నికషోపలకాషవిశేష రోషతఁ ॥ ౪౪॥

ఉ॥ కావున గర్ణముల్మిగుల గర్కశలోహ వికారవల్లివే। ధావితతవ్యధాభరము దాల్చి మణీమయ హేమకర్ణికా। భావిత తిన్వెలుంగ క్రియ బాళమునందగుబాధకోర్చి స౯। భావిత పాండితీమ హితమండన సంపదనుల్లసిల్లుమా ॥ ౪౫ ॥

మరియును బాండితీ మహిమ వాక్రుచ్చెద నాలింపుము.

సీ॥ గాఢవిమూఢ తాఘున తరతిమిరౌఘ విఘటన శారద విధువిభూతి । వైదే యి తాగ్రహావగ్రహ గ్లాన చిత్తోర్వీ యుత సస్య పీయూష వర్ష । మధిక యధాజాత తా తపక్లేశ సంహరణ గీర్వాణాపగాంబుసేవ। యనభిజ్ఞతా హితాఢ్యపయశఃపంకనిర్మో షణ భీషణ పావనఘృణి। యవిదిత హృదయనర్మాంకు రావిర్భావనవ వారివాహ ప్రభవభరంబు। సన్మాన సావాససంశ్లాఘ్యశుచియశస్సార సౌఘవిలాస సారసవని। రసిక భావుక భావరాజమణిస్థలీహార్దర సోద్గార హరిమకీచి। నిజనర్తనకలా వినిదీకృత స్వాంతశాంత వేద్యాంతరసభ్యసమితి। స్వరసానుభవచుంచుసమాశ్రితోరత్న సాత్కార ణోత్కట స్వవిభవంబు। సకలేప్సి తార్థనిష్పాదన దుశ్చరతరత పశ్చర్యాప్త ధాత్రు వరము। పరహృదయ చ్ఛందపరిభావనానల్ప శిల్పకల్పన కలా కల్పవల్లి। సుఖదుఃఖ సం ధా తృశుభతది తరకర్మ విధినిషేధవి బోధవిమలదీప॥ గీ॥ మవిరత ఐహితవిని యోగ హర్షితార్థి।జనకదంబకమైయును శశ్వదుదిత। మహితె వృధ్యను రుద్ధతాసుహితమగుటఁ। బాండితియ జనులకుఁ గల్పపాదపంబు ॥౪౬॥

గీ॥ మిగుల విఁసిల్లు సొబగులుప్రియుని ప్రేమ।వాని నెద్దియు వెలుగునవార్యభంగి। వానిఁగడునడరు యువతి పాండితికల। నివ్వియును దానఁదద్దయు నెలమినలరు ॥౪౭॥

క॥ గుణములనెల్లనుజాలిన। గానీయంబైన విద్యగానకయున్నం। బణితుఁడు గాఁజననోపఁడు। మణిశాణ విఘృష్టివీడి మహితంబగునే ॥ ౪౮॥

క॥ ధీరులుఁభావిఫలేచ్ఛా।ధారులగుటఁదాదికోగ్రతరఖేదములు। న్సారములదాల్తు రుచిర। స్ఫారయశ శ్రీసుఖములఁబచరించుటకై ॥౪౯॥

కావున.

గీ॥ నారికేళ తరువునాటి పావణిచే। ఫలము నిచ్చుదనుక(బ్రబలమయిన। బడలి కోర్చి సుచిర బహువిధ సుఖములు। నొందునట్లు నీవు నొందుజదివి ॥ ౫౦॥

మంజరి॥ స వినయామోదంబుగా.

క॥ తలియలతి తెలివిగలుగుట(। గలనైననునిట్టు కలల(గఅప(గదలపం। గలనా యటులైననుచే। టలగరుల దివంబు వోవుటకు( దలపనోకో ॥౫౧॥

ఇట్లు గాకున్నను.

గీ॥ అల్పులైనను జగతి మహానుభావ। భజనమున దారవర్ణతాపాతులయ్యు। నలసువర్ణ త(గాంతురయస్సు రసవి। శేషసంగతి రసమాట సిద్ధమెకద ॥౫౨॥

అక్కతంబున.

గీ॥ జడతచే నిపుడేన్నడు సడలియున్న। నీదుకృప నీమహార్థంబు నిర్వహింతు। నతిజడంబైన(దేజనా యతశలాక। వలెనదర్వవిధీరణ బలిమికలిమి ॥౫౩॥

క॥ ఇదియెటుల(జదువవలయునో। యదిమదికిం దేటపరుపు మర్మిలివెలయ। న్మదినుంచి దానినరసెద(జదివెద। నీకనికరంబు జక్కనిదగుటన్ ॥౫౪॥

ఆమోద॥ సాదరానందంబుగ.

క॥ నీచే(గాదంబి నివలె। నాచిత వచనరచనల నునభివనతావ్యా। కోచితధారల(బోలెన్। నాచేత మునుల్లసిల్లు నవసస్యగతిన్ ॥౫౫॥

క॥ చెలినీవిట్టు లనుటచే( దెలిసెను నీయుల్లమెల్ల(దెల్లముగానా। పలుకులు నీయెద(గడలి। న్వలెగలిసి తిరంబులగు తవరదలువోలెన్ ॥ ౫౬॥

ఇప్పుడు వివక్షితంబగు దివిషద్భాషాధ్యయన ప్రకారంబెటింగించెద సావధానంబుగ నవధరింపుము.

సీ॥ తొలుత నర్థంబులతోడ శబ్దంబుల(జదువంగవలయును శక్తిగాలది। నవి మనంబున నెపుడమరియుండుటకయి చింతనల్మాటి మాటిసేయవలయు(। బదపడి హాని

కఁబడ పదార్థంబుల సంబంధములఁజాలఁ జక్కగాను। విపుల విభక్త్యర్థ విజ్ఞానమమరం గఁ జదువుచుఁ దాత్పర్య సరణి గనుచుఁ। క్రమభవ సమాస కుసుమ సంగ్రథన విధిని దనరి యభినవ శబ్దార్థ తతులనట్లు । పొసగునటుల వితర్కించి పొలుపుమీఱఁ। జదివిన ను బాండితియమరి చక్కబడును॥ ౪౭॥

క॥ చదివిన పదములు మగుడం। జదివెడు నెడఁజేరవాని సంగతిలోఁబైఁ। బద ముల యరతము లరయుచు। ముద మొదవఁగఁజదువవలయు ముచ్చట లమరన్॥ ౪౮॥

ఇట్లధ్యయన ప్రకార నిరూపణం బొనరించి పదంపడి దైవజ్ఞ దత్త శుభ ము హూర్తంబునఁ గావ్యాధ్యయన ప్రారంభంబు విధి విధానంబుగ మహోత్సవంబు లు ల్లసిల్లం జేయించి యంచిత క్రమంబునం జదివించుచు నొక్కనాఁడాత్మ గతంబున॥

క॥ నాయాద్యోచ్చారణములు। నాయాసత దీని మంజులాత్మఁ దగిలెవా। లాయ ము విడువఁగ నోపవు। నాయమయి దెవరువరశరణము వదలెదరో॥ ౪౯॥

గీ॥ అహహ నాయుపదేశములన్ని। దీని నాత్మనంటి తొలంగక హాయినమరు । కుందనపురవణమ్మున గూర్చినట్టి। మణికణికల తెఱంగునమహిమ మీఱు॥ ౫౦॥

గీ॥ అతి సరసమైన దీని చేతోంబుజంబు। బుధజనులు సల్పు ఘనతర బోధము లను। వ్రాయమసృణ శిలామల ఫలకమగుచు। నొప్పుచున్న దివిప్పుయియొప్పులమర॥ ౫౧॥

ఆహా దీని మనీషావిశేషంబు॥

సీ॥ గూఢదురూహార్థ కోటిసాత్కృతికయి విమల మతింజేయు విగ్రహార్థ। పద్ధతి భేదనవేళఁ బరగు ద్వైవ్రీభావకలయై పదార్థసంఘటన తటిని । సంధికలాలక్ష్మి స హజయై యర్థ తాత్పర్య శోభాగతిఁ బరమయాన। రూపమై సిద్ధాంత రోహణాసన మయి కలిత చమత్కార కలనకలుము । ఎను సమాశ్రయమగుచును లలితరీతి। వినుత మగు దీని మతి యతి తనుతరాత్మ। యతి నిసితశస్త్రిఁజోలి పదార్థభిదల। మూర్తియగు నీతికై వడి ముదమొనర్చు॥ ౫౨॥

క॥ ప్రచురాధ్యాహార క్రమ। రుచిరంబగు దీని యాత్మ రోహద్వీచి। ప్రచుర స్ఫురంబు నహిమకర। రుచిపోలిక నామబోధ రోచిష్ణువగున్॥ ౫౩॥

చ॥ దురధిగమార్థ బోధ విధిదుష్పథ చంక్రమణోరు ఖేదులౌ గురువులకార్తి వ్రా వడచి గోములహాయిఁ జెలంగఁ జేయఁగా। నరయఁద దీరి తార్థవిభవానుభవంబునఁబొ ల్చు సమ్మదస్ఫురణ మనోజ్ఞ శిష్యముఖశోచిర బాశయమే సమర్థమా॥ ౬౪॥

శా॥ స్వోపన్యస్తములై తనర్చెడు మహాసూక్త్యర్థ భావంబులం। దీపంబై వెలు గొందు శాతమతిచేఁ దెల్లంబుగాఁ బ్రేమతో। నేపారంగని వీడి మల్లట మహా హిం బోలి నిశ్శంకుడై। యాపాలావయి వాగ్రసంబిడు జనుం డబ్బున్మహాభాగికిన్॥ ౬౫॥

క॥ అనుచు వచించు సుధీశ్వరు। లను దచ్ఛందజ్ఞనాట రాజిత మతినై। కొని యాడెద నాకిపుడిది। యనుగుణయగు శిష్యయయి మహాస్పదమగుటన్॥ ౬౬॥

చ॥ విడువక కొంతకాలము వివేకినియై యలపోర్చి నేర్చినం। గడువడిగాన నీ బుడత కావ్యములందగు మర్మజాతము। ల్విడివిడి తేటగాఁ దెలియఁ బ్రోడగు నీడగువారి కెల్లడం। బెడగడరంగ జేయు మటివెగ్గల మానుడి యాలమందినన్॥ ౬౭॥

క॥ సుమతియగు దీనిమనమున। నమరపఁబడు నాదువిద్యయతిమహిత మహీ। సమవహితక్ల్పప్త వల్లీ। సమమయి సుచిరంబురుఫల శాలిని గాదో॥ ౬౮॥

ఉ॥ కొంచెపు తెల్వి గల్గుటయుఁ గొంకక తామ వివేకులంచుదు। స్సంచిత గర్వులై యెఱుగఁజాల కలంతుల తెల్వికల్మల। న్వంచనసేయఁ గోరుదు రవారితు లైయుదిరైనఁ దెల్విచే। నంచితవే ద్యజాతవిహితాదరయై వినయంబునూనెడున్॥ ౬౯॥

క॥ కర్ణకుడును విద్యార్థియు। హర్షము చేఁదగినతటిని నలపుల నెల్ల। న్మర్షించి పాటుసేసినఁ। దర్శంబుల ఫలములంది తగమనుదు రిలన్॥ ౭౦॥

సీ॥ ఈ డేరతటి దీనికెపుడేగు దెంచెడుఁ బరువంపు చిన్నెలు బయలు వడెడు। చదువుల మర్మముల్జాల వశములగుఁ డీకుపాటులగు సుట్టీకిత్రములుఁ। కైసేత మెఱుగుల నాసలమరియుండు రసపు కబ్బముల సరసతమించు। చిట్టల రూపుల సేవింపమది యె చ్చువన విహారాదుల వలపు మెలగు। సరళితనుమించు సకులవచనరచనల। కుదుగకయ చేయు వక్రతనూహ బలిమి। సలలితవ్యంగ్య కలితార్థ సరణిమీఱు। భాషణ ప్రౌఢి మ యుఁ దీరి పరిఢవిల్లు॥ ౭౧॥

మఱియు నిది.

సీ॥ సాటిబోటుల మీఱు సౌరుతీరులఁగాంచి మురిపెంబు లలరఁగ మోవివిరుచు। నాలేఖ్య లిఖితాఖిలావనీ వరవరాకారము ల్పరికించి నీరసించు। స్వప్రతిక ప్రకాశావబోధచ్ఛల గ్రథితోపమాన వర్గా ప్రశస్తి। వ్యాఖ్యాతములగు నర్థాశయాంతరకల్పనలజేయు నిత హేతు లలిత భణితి। చెలులు దనచెంతఁ దమలోనఁ జెలిమిమీఱ। మరుని కలనుల సుద్దుల మాటలాడఁ॥ మోమునతమైన సిబ్బితి ముద్దులొలుక। వీనులిడు నిభృతాక్షియై వానిదెసల॥ ౨౨॥

గీ॥ ఆత్మనంబుధివలె యౌవనాభ్యుదయము। పర్వదినశర్వరీశునిపగిదిఁ దోఁప। విభ్రమార్భటు లురుభంగ విధలఁ బొడముఁగాని వానిని వారించు కతముగల్గదె॥ 23॥

చ॥ మరునకు గెల్పు లిచ్చినిదు మాయల మందుల పెట్టె విభ్రమోత్కర కమలాకర స్ఫురణగాఢ శరద్రమ భోగతృష్ణరీ। సరణ ఘనాఘనోదయము సన్మద బర్హిణ తాండవక్రియా। కరణ నవాబ్దమాను గద కాంతము యౌవనమెల్ల వారికిన్॥ ౨౪॥

క॥ ఇది యిప్పుడంతి పురమున। ముదమున నుండంగ వలయుముక్తవశయయై। యదిగావున వేగమయిది। సదువనలంకార కలల సమయంబయ్యెన్॥ ౨౫॥

ఉ॥ మంకుతనంబు వీడి గరిమంబుననొప్పెడు నోర్పుచొప్పునా। శంకతనొజ్జలంగనుచు శబ్దధధీతముల్గైన పాఠము ల్గొంకక చింతనల్సలిపి కూసమువీడిన తాత్రిచువోలెదు। శ్శంకలు సేయువారియతిసాహస మార్పున వేకలల్గ దా॥ ౨౬॥

చ॥ సకియిక గొంతవట్టదుపు సగ్గుట నొందకనుండఁబోలు వెం। డికడిమి వ్రానికొన్ని యగు టీకలఁ గూడిన నాటకంబులన్వికలతలేక నేర్చినప్రవీణ కలావతియై తనర్చునిం। చుకతఱియేని దీనిమఱి చోద్యముగాఁ జదివింప మేలగున్॥ ౨౭॥

చ॥ చదివిన కావ్యసర్గములచాల్గును మీదనలంక్రియా కలల్జదువగఁ బోలు తెల్వియును జాలినదై కనుపట్టుగాన స। మ్మద మమరంగ నిప్పుడు సుమాళముగాఁ జదివింప నొప్పున। ప్పిదపని జేర్చునుండఁ దగుఁ జేశల లీలలరాణివాసమున్॥ ౨౮॥

గీ॥ చదువు జెప్పెడి వేళలఁ జతురమతులు। శిష్యులెంత హావణికలఁ జేయు

చున్న । గట్టియను యోగములఁగట్టి నట్టునడిన । నీసడింతురు తదధికాభ్యాసము క
యి॥ ౭౯॥

గీ॥ అట్లు కాకున్న వారల యంతరంబు । గరువమునఁ బొంగితమ చేయు
కార్యములన । లసత నొందదె యటులైన లభ్యకార్య। ఫలములు గిడిసపడుఁగాక భ
వ్యగుణ నే ॥౮౦॥

గీ॥ లాలనంబున బహుదోషలాభమనియుఁ। దాడనంబున బహుగుణ తతియ
వాప్తి । యని పచింతురు విబుధు లట్లొట సుతుల । సేసరుల నియమింప విశేష మం
ద్రము॥ ౮౧॥

శా॥ అంతేవాసులనుండు ప్రేమలని గూఢార్థావ బోధక్రియా। సంతానంబుల
వెల్వరింపవలయుం జాతుర్యముల్దోఁపవా। సంతాభ్యాగమ రీతి ధీవ్రతతికిఁ సౌరభ్య
భాస్వత్కలా। సంతాన ప్రసవంబు లీనునది యాపత్త్రివ్రత న్వారికిఁ ॥ ౮౨॥

స ప్రకాశంబుగ॥

ఓ చెలి నీవికఁ గావ్యపాఠంబు నిలిపి ప్రత్యహంబును బూర్వాహ్ణా పరాహ్ణంబు
లయం దలంకార రూపక పాఠంబుల విశేష శ్రద్ధా సహనంబు లొప్పఁ జదువందగు.

మంజ. ఓయక్కా నీయానతి నాశిరంబునకు విచికిల కుసుమ సమాకలిత మహి
త మాల్యంబుగదా.

ఆమో. ఈకృతులభినవ సంకేత నికేతనంబులు గాన ననన్యవృత్తిత నభ్య సిం
పందగు.

మంజ. ఈజనంబు త్వదాజ్ఞావశంబే । అని యుభయులు నత్యుత్సాహంబున
సమర్యాదంబుగ స్వకార్యంబుల నిర్వహించుచున్నారు.

ఇట్లుండ నొక్కవాసరంబున - ఆమో.। ప్రకాశంబుగ . ఓభర్తృదారికా.

మంజ. స్వగతంబుగ - ఈమె యెల్లతఱుల నన్నుం జెలి శబ్దంబున సంబోధిం
చు నిప్పుడేమొకాని గౌరవాభిధానంబున నాహ్వానంబు సలుపుచున్నది - పరికింపనిది
సకారణంబయయి యుండుఁ గావున నియ్యెడ శిష్యాచారంబవలంబించి సవినయ భ

యభిరంబుగ సంభాషింపందగు - ప్రకాశంబుగ - భగవతి యీజంతువు శ్రీమదను శా
సన మహావ్రత విధానంబున నాత్మను గృతార్థంబు సేయం బ్రతీక్షించుచున్నది కావు
న ననుగ్రహింపందగు.

ఆమో. దరస్మేరవ్యంజకనిభృతనయనంబుగ। ఓసీ నీసంభాషణ వైఖరి ప్రౌ
క్షణ్యంబునం గానంబడు.

మంజ. స్వగతంబుగ ఆహా దీనికిం బ్రతివచనం బేమని వచింతు- స్నేహ
గౌరవ మర్యాదలు పరస్పర విరుద్ధంబులగుట నియ్యెడ నెద్దియు సావకాశంబై చూప
ట్టదు- "పశ్చాద్గర్తః పురతోంధు" వనునయంబభినయ విషయంబై ప్రాప్తంబయ్యె
ననియవనత వదనయై యూరకుంచున్నది.

ఆమో. స్వ। ఇయ్యెడనిదియె యుత్తరంబుఁ జెప్పంజొప్పుగానక విప్పగ
నొప్పు సంకోచంబున నవ్యాకోచ స్వాంతయగుచున్నది- కావున లాలనంబున దీనిం
బ్రకృతి నొందింపవలయు- ప్రకాశంబుగ- ఏమేచెలియా నేనిట్లంటినని సంకోచించె
దవే- నేనిట్లంటిననియలుగుచుంటివాయనికుచుపునంగూర్చిగండంబులంజుంబించుచున్నది.

మంజ. సవైలక్ష్యస్మితంబుగ- అమ్మా యిపుడునీచే నిట్లోనరింపంబడి జీవిం
చితినే.

ఆమో. ఇప్పటికియు నీమనంబునకుం బ్రసాదంబు గలిగెనని నాకుందోచదే.

మంజ. ఏమే సకియ యిట్లంటివి.

ఆమో. ఇఁకనిటులననే- నీడెందంబు ప్రసన్నంబయ్యెనని తెలిసికొంటినిగ
దా- కావుననీకొక్క నుడువు నుడువన్నాయుల్లంబు పల్లవించిన వేడుక నుల్లసిల్లు
చున్నదే.

మంజ. అక్కరో నీవెప్పుడు వక్కాణసేయఁదలచిన నాకుహితంబచేయుటకుం
బరికించి దుర్వహ భరంబారోపింపఁ బ్రార్థించువానివలె నెక్కుడు జతనంబునంజెప్పె
దవే- సహజవాత్సల్య సౌజన్యమాన్యులగు వారివర్తనం బాదియందతి పరుషంబైయవి
వేకంబునం దెలియంబడియు నేవిధంబునన్నైన దానిం బరిగ్రహించు వారలకుం గ్రమం

బున నమలగుడ ఖండంబు తీరున ననవరత రసం బొసంగు తల్లులు స్వరూప సంభూత ప్రేమధామ మానసులైనం బసిపిల్లలకుఁ బాలువ్రాయు తఱిని నోరు దెరువకున్నం జెక్కిలి నొక్కుదురుగదా- అక్కతంబున నీవును నాకొక్క కొన్ని మేలొనరింపం బరికించి యిట్లొనరించుచున్నావు- నాయంతరంగంబంతయు వింతగాక నీస్వాంతంబున కు విదితంబ- కావునం దావకీనాను శాసన సుధారస సమాస్వాదవ్యగ్రతా గ్రహంబులగు నాశబ్దగ్రాహంబులకుం దూర్ణంబుగఁ బూర్ణంబగు సమ్మదంబు సంధానింపుము.

ఆమో. సానందవిలోక నంబుగ- ఓసి పట్టీ యొక్కటి వినిచెదనీహృదయమ్మున గాఢముగ నాటింపుము- నీవింకం గావ్యపాఠంబులు నిలిపి ప్రత్యహంబునుం గొన్ని యలంకార ప్రబంధంబులుం గొన్ని రూపకంబులుం జదువ నేఁగోరెద నే.

మంజ. అక్కరో విధివిధంబున సంధానింపందగు నివ్యాహారముల మధుర తరవ్యాహారంబులం బోలియాస్వాదింపం బ్రతిక్షణ ప్రతీక్ష మాణంబగు నామానసంబునకు విలంబంబు సలుపుట సలుపులం జేయుటకయకదా.

ఆమో. ఇంతత్వరయేమే వాకుచ్చెద వినుము- దినదినంబునంబూర్వాహ్ణంబున నీయలంకార నిబంధనంబులు నపరాహ్ణంబున నీరూపకంబులుం జదువుచు నేతదంతరా వసరంబుల నధీతపాఠంబుల నామ్నాతంబు లొనరించుచుం బఠిష్యమాణ పాఠంబులు యోజించుచు విశేష శ్రద్ధాసహనంబులొప్పఁ జదువందగు.

మంజ. మహతినీయానతిగదా నాకు సౌభాగ్య కల్ప వ్రతతి- నాశిరంబునకు సువికచ విచికిల కుసుమ సమాకలిత మహితమాల్యంబునుగదా.

ఆమో. ఓసి పసికూనా నాయెడల నీకింత వినయం బేమే.

మంజ. అక్కరో గోష్ఠులయందు మాయవ్వ వంటిదాననైనను విద్యావిషయ సంభాషణ ప్రసక్తులయందు మామకీన మానసంబీ సాహసంబునే య నేరదే.

ఆమో. నేనేమిచెప్పుదు నీకెద్దియిష్టంబట్లు వర్తింపుము- ఈకృతుల్లభినవ సంకేత నికేతనంబులు గాననన్యవృత్తి తనభ్యసింపందగు.

మంజ. ఈజనంబు త్వదాజ్ఞా వశంబె కాదా మహదనుగ్రహంబని మహో త్సాహంబున సమర్యాదంబుగ నట్లు స్వకార్యంబు నిర్వహించుచున్నది.

ఇట్లు కొంతయవసరం బపసరింప.

పిదప నేతెంచుచున్నది సలలిత డోలాయిత భుజవల్లీ మూలవాచాలవలయకో టి స్థపుటిత మణిగణ ప్రభావిభాసిత పరిసర ప్రదేశయు నిర్గళ సంవర్ధ మానయౌవన మదనిభృత పరితః ప్రసారి తసితాంభోజ దళప్రృథుల నయనకాము దీవిశదీ కృత ప్రాంత దేశయు క్షుద్ర జనమనస్సు క్షౌద్రధారాధోరణీ మధుర రసాధార విభ్రమప్ర పంచన ప్రసంజిత వర్తనయు బహువిధ సుగంధ ద్రవ్యసంభరిత భవ్యతమ వీటీగంధ కషాయిత వదన ప్రసూత బిసప్రసవా ధ్యాహారా భ్యాగతా భ్యాశదేశ పరిభ్రమ ద్భ్రమరగణ నివారణ నిపుణనాసికా విలసచ్చాంపేయకయు నగుచుం గుంభస్తనియ ను చేటిక.

మఱియును.

సీ॥ క్రొమ్ముడి ముడిచిన కుందకుట్మలముల దండనిండిన తావినండ సేరి। ఝుంఝు మ్మనెడు సద్దుసొంపుగ సలిపెడు తేఁటికూటువలను దీరుమీఱు। పరివర్తి తాస్యతాప్ర త్యక్ష నాసికా చంపక కోరక చాకచకిని। నదలించుచును దృఢన్యస్తపాదాగ్ర సంల గ్నమంజీర విరావములను। నిబిడవలమాన మణికింకిణీ విరాజమాన కంకణ రశనాది మహితశింజి। తములఁ దనరాక దెలుపుచుఁ దనరుపీటి। కాయ తామోదవాసితాశాంత యగుచు ॥౧౩॥

ఆమో. దానిమిటారంపు నటనలంగని (స్వగతముగ)

గీ॥ అల్పులగువారు దమవృత్తి నరయుచుండి। యును విశృంఖల వృత్తిఁ జేయను త్కటాశ। యబలమున నుండుదురనుట యరయ నిక్క॥ మందుకిదియని దర్శనంబ గుచునుండు ॥౧౪॥

కుంభస్తని. ఆమోదరేఖం గాంచి యడనవ యదర- అమ్మగారూ దండాలు చి త్తగింపుడు.

ఆమో. గట్టివయసునం బెక్కటతటి మనుమని దీవించి- ఓసీ యెక్కడనుండివ చ్చెదవే.

కుంభస్తని. అమ్మగారూ యేలికరాణిగారి చెంగటనుండివచ్చితిని.

ఆమో. మాయమ్మకు సంతోషంబుగదా.

కుంభస్తని. సంతోషంబేయమ్మగారూ.

ఆమో. అమ్మయిపుడేమి సేయుచుండెనే.

కుంభస్తని. ఇంతకు లోగడసకులతోడంగూడి చదరంగంబాడుచుండం బదిని ముసంబులకుం దొలుతి నెవ్వతోకాని యెక్కడజడలాబి డేగుదెంచినది- అంతటనా యాట నిలిపి యాయమ్మతోడముచ్చటించుచున్నారు.

ఆమో. (స్వగతం) ఇయ్యెడనిది నుడివిన జడదారిబోటి చండయోగినిగావల యు- పరికింపనామె యాగమనంబు సకారణంబైయుండుఁగాని నిష్కారణంబు గానే రదు- ప్రకాశమ్ముగ- అమ్మనీతో నెద్దియైన నుద్దివాకుచ్చి పుత్తెంచెనే.

కుంభస్తని. ఆజడలమ్మ మనయమ్మాయిగారినిం జూడవేడుకం బొడగానుపించెఁ గాబోలు- ఏలికరాణిగారు దమతో మనవిసేసి యమ్మాయిగారిం దోడ్కొనిరమ్మని సెల విచ్చినారు.

ఆమో. స్వగ। ఇందుకెద్దియొ నొక్క గొప్ప హేతువ యుండందగు - అని నిష్పంద నయనంబుగం గొంతతరి చింతించి - ఆయెకాను - ఇందుకిది మూలంబుగా వల యు। ఏతదంతరంబునం గతి పయవాసరంబులకు లోఁగడ సర్వకలాభిమానిని యగు నాచండయోగిని కంతేవాసినియగు కల్పవల్లి నిజవిద్యా వైచక్షణీ వివక్షార్థంబుగ నా పెచేతం బ్రేషితయై కాబోలిచ్చటి కేతెంచె - అప్పుడు మన మంజరి దాని యనుయో గంబులన్నిటికిం గృతముఖ పిధానంబుగం బ్రతివచనంబులు వచించి పదంపడి యాబా లికను " సదూరేతిష్ఠన్దేవదత్త ఇవాభాతి " యను వాక్యమందలి యలంకారంబెద్ది! ఇచ్చటం దద్దేవదత్త శబ్దంబుల భేదవిషయంబు లగుటం బ్రసిద్ధోపమాన లాభాభావంబు ననుపమని రవకాశంబు - ఉత్ప్రేక్షయునట్టిదయ। కావున నీవాక్యంబుననలంకారం బెయ్యది నిరూపింపందగునని యనుయోగించె - అప్పుడా బాలిక యెయ్యది నుడువ

వాకురాక మూకయయి కూకటి చోటుం గోకుకొనుచు నుడుమని పట్టంబోయి మహా నాగంబుగ నెఱింగి బెగడు వడి మగుడు మాడ్కి (దన దిట్టతనంబను నీటి పట్టుకుంగట్టు తూటుగావించి కొని వెడలెఁగదా। పిమ్మట నాబాల యీయుదంతంబు దన యాచార్యతోఁ జెప్పంబోలు - తొలు తనయాచండ యోగిని యెప్పుడెప్పు డొరులు నా తెలివి గొంత మంచిదనివా(కుప్పు - నాయన్న నెవ్వగల చిన్నెలం గప్పుకొనుచు వితగ నీసడించునని వినఁబడు - కావున నియ్యెడ దేవిసమక్షంబున దీనిం బరీక్షించివంచించి యావంచన నాయందు సంచితంబుసేయం దలంచి యుండు - అందుకే కాబోలు నా యమ్మ యామెచే మంజరీ మాత్రంబు రావింపవలయునని నియమింపం బడియుండు కాకున్న నన్ను వీడి దీనినొక్కతెం దోడ్కొని రమ్మని పచించునా - ఎన్నడైన నేవి నరాని నుడువులాయమ్మ కుంగలవా - మంచిది యట్లుకానిమ్ము - పాండి తీరితిచేనాపె దీని నీసడింపం దగదు - స్తంభన విద్యా వినియోగంబునసైతే వంచింపందగు - ఆచండ యోగిని యనార్థాభిధాన మిగుల కుటిల స్వభావ పండిత మానిని యీర్ష్యాసూయామయాత్మ - కావున నిట్లొనరింప నుద్యోగించు - సరే సంఘర్షించుట మణికి నేగియే వైపరీత్యంబున దానికిం బ్రకాశ కారణంబయగు - ఇప్పుడొక్కటి కొఱంతయ్యె కానంబడు - అద్దియైనం దగిన మధ్యస్థుని లేమియ - పరికింపఁగనద్దియుం జూపట్టదు - దేవియా మాధ్యస్థ్యంబు సేయనోపు - మరియును మత్సన్నిధానంబున దీనివంచింపనోపమిఁగా నారాక కనుమతింపకున్నండె - నేను లేనియెడల దీనిచేతఁ దానవంచితయయ్యెనేని నదియభూయశ్శ్రేయంబు - దీనికొక రక్షంగూర్చి - పంపవలయు - అని దాని కొకరక్షంగూర్చి ప్రకాశముగ.

గీ॥ ఆంతరంబగును పధిచేనణతఁగోరు। వారలకుదాని కంటెన వారియైన। కపటమానియ వినయముగా నుపింప। వలయువజ్రము భేదించు వజ్రమకద ॥౨౨॥

ఓచెలి నీవిపుడు దీనితోడం గూడి మనయమ్మ కడకు వెడలి యచ్చటి ముచ్చటల నెచ్చెలికి చను దెమ్ము.

మంజరి. అట్ల చేసెదనని వెడలుచుది.

ఆమో. ససంకోచంబుగ. (స్వగతం)

చ॥ ఇది పసిహాన యొల్లెడల నింటవసించియు । తోచినట్లు తాఁజదువుచు సాధువృత్తి దివసంబులఁ బుచ్చుచు నేగిచేతల । న్మదిదల పోయనైన శుభమానస తన్ నిపుణాత్మగాకయుం। డదయ విహీనయాపె కపటంబున వంచనసేయఁ గోరెడుర్॥ ౭౬॥

క॥ సవిమర్శంబుగఁ జదివిన। సువిదిత వాక్యార్థులైన శుభవాక్తతులం । గవిజనులతోడ సభలో। సువిమలమతిఁ జెప్పటరయఁ జోద్యము మిగులన్॥౭౭॥

గీ॥ పుడమి నొకసారె బన్నంబు వొడమె నేని। నెంత కోవిదునైన ధీహీనుడండు౹ । బవిసిఁ బట్టొకసారి సువక్తయైన। విబుధుడండ్రి దిలోక వివేకమగ్నను॥ ౭౮॥

గీ॥ చండయోగిని యిదిజూడ సార్ధనామ యిది మిగుల బేలగావున నిపుడు డాని । చెంతకును జెరి యొటులవచించు నొక్కొ। నాయదృష్టము తీరెట్లు నాకెమగునో ॥౭౯॥

క॥ దుష్టులు లాభము లేకయ। కష్టము లొరులకును జేయఁగణగుదురెపుడున్ । నష్టాత్ములగు దురంతట । శిష్టంబున వృశ్చికాది దృష్టాంతమునన్॥౮౦॥

క॥ నేడీని మిగులఁ జదువరి। మోదముతోఁ జేయుదునని ముదితాశయయా । యాదేవి దయకునిప్పుడు నేదుర్గతి నొందకుండు నేర్పటులగునో ॥౮౧॥

ఇత్యాది బహువిధంబులం జింతాంతు సంయమిత చేతస్కయై యెదుటం గొంతదూరంబునం గాంచిసానందంబుగ.

ఆశ్చర్యము॥ దేవ్యను జీవిసి యస్మద్వయస్యగుణునకు మనోజ్ఞ సవికాస భాసుర వదన సారసయగుచు నిల్లెతెంచుచున్నది - దీని విభ్రమంబు వీక్షింపం బాలికరణికాభిలాషిత విషయంబై స్వాసాధారణ ధర్మం బొనరించుచున్నది - వెండియుఁ జెంతం బరికించి । స్వగ । సంతోషోదంతంబుం నివేదించు దానింబోలెఁ జూపట్టుడు.

ప్రి. ఓసఖీ మనోజ్ఞా యిపుడీ నాకన్నులకుం గర్పూర కళికవై యొప్పుచుంటివే యేతెమ్మి పీఠంబున నుపవిశింపుము - మనోజ్ఞ. అట్లుచేయుచున్నది.

ఆమో॥ ఓసి వయస్యా నేనిక్కడ నొంటరిగా నుంటినని దయనంటి మాయ మ్మ నిన్నంపెనా.

మనో. సస్మితంబుగ। ఓసి చెలియా ముగుదలు నిన్నొలిచి చండవృత్తుల యొడ లం బ్రచండ వర్తనులగుట నిండుగం జూచియు నీకు బెడంగడంప నాదేవి నాబోటి బోటిని నీకుం దోడ్పాటు సేయు నే.

ఆమో. ఏమే యిట్లంటివి - మనో - చెలియా యిదివరలో నేనెరుంగనే మంజరి యిపుడిట్లనిపించుచున్నది.

ఆమో. మంజరిట్లనుమన్న దే-

మనో. చెలియా యలతిగ నన్వితంబయ్యో నేక్షమింపుము - అద్ది ప్రత్యక్షంబు గ వచింప లేదు కాని దాని వాగుపన్యాసంబీయర్థంబు విశదింపఁ జేసెనే -

ఆమో. అదెట్లు నీకుం దెలిసె నే। మనో - సవిధంబున వసించి వీక్షించుట। వలన నే - ఆ - ఎప్పుడెక్కడ.

మనో. ఇప్పుడక్కడ.

ఆమో. పరినిష్పన్నత ప్రమోదంబుగ- అట్లైన నీబాల యమ్మ వద్దకు వచ్చుట సు త జరిగిన దంతయు సవిస్తరంబుగం జెప్పవలయు-

మనో- నీకు వినుటకై కుతుకంబయ్యో నేని దానిక్రమ వృత్తాంబుతోడఁ గూ డనుడివెద నాకర్ణింపుము-

సీ॥ సామంత కన్యకాచార్య యాచండ యోగిని దురహంకృత్యా గీర్ణవృత్త నీపొండి తీశైలి నిక్కారంబెరుంగక నిను వంచనలసేతు ననుచుదలచి। లోగడఁ నొకశి ష్య నాగడంబున నంపి పరిభూతయగుదాని వలనఁగినిసి। తొలుతనామంజరి నలయిం చి నిన్నును నీసడింపఁగఁ గోరి యిపుడుదేవి। కడకు నేతెంచి మంజరిఁ గానవేడు। క య్యె దానిని రావింప నియ్యకొనుమ। నంగనాదేవి యొడబడి యట్లుచేసె। నాయు దంత మతి రహస్య మగునుజుమ్ము॥౯౨॥

ఆమో॥ అవిదితబాలి యాశ్చర్యా బభినయించుచు - ఓమనోజ్ఞా యేమే యిట్లంటివి- ఆమె నాయెడల సంచిత వంచితాభిప్రాయ యగుట నిర్నిదానంబుగదా.

మనో॥ ఏమే చెలీ యిట్లంటివి- అందరు నీవంటి వారనుకొంటివా- కొంతెలగువార కారణంబ సాధుజన విధూన నసంబద్ధాదరులుగారే.

ఆమో॥ కౌను లోక స్వభావంబు భిన్న భిన్న వృత్తికంబు-అదియటుండనిమ్ము- ఆపె తల్లి యుల్లంబునకు మల్లడితోడనీబుడత డెందంబునకు బెగడువొడమించెనా.

మనో. అట్లుగాదె-

ఆమో. మఱెట్లు- మనో- వికాసంబుతోడ నుత్సాహంబే-

ఆమో. ఇట్లొనరించుట కెద్దికతంబు-

మనో. మాగ్ధ్యంబు కంటె నొండెద్ది.

ఆమో. ఇట్లయ్యెనా- మనో- మఱేమి-

ఆమో. ఇంతమాత్రంబున నామనంబు సంతసింపదు గాని యీబాల యచ్చటికేతెంచినది బట్టి జరిగిన యానుదంతంబు శ్రుతిసంగతంబుగ శ్రుతి సంగతంబుగా వింపుమీ.

మనో- నీయిష్టంబెట్లో యట్ల ముఖ్యాంశంబులు వచించెద నాలింపుము-

ఈబాలరాఁగానే దేవియా యోగిని దీనికింజూపి ప్రణమిలు మనివచించె పిమ్మట నిదియు సవినయంబుగనో భగవతీ యీబాల మ్రొక్కుచున్నదని జోత యొనరింప నుద్యోగింప నాపె యొందుకెందుకుఁ గూర్చుండుమని పదంబులు ముడుచుకొనియె. అట్లైన నీబాల తత్పరిసరంబున నెలఁగ నాదేవియో భగవతీ యీబాలిక దీవింపుమని వేఁడె- పిమ్మట నాపెయేమో మోము మటమట లాడించుచు దీర్ఘాయుష్మతి వికమ్మని దాకుప్రిచ్చెఁ గాని మహారాజ కన్యార్హంబుగ నాశీర్వచింపదయ్యె- తనమాటైయావత్సౌభాగ్య నిదానంబగునని కాబోలు పిచ్చరండ యట్లొనరించె.

ఆమో. సవికాసంబుగ- అయ్యెడ యమ్మయభిప్రాయంబెట్లుండెనో-

మనో- దేవియాత్మశుద్ధింబోలె గాంభీర్యగుణంబునను విష్ణుపదిగాదె- ఐనను నీవు ప్రష్టవ్యాంశంబను యోగించితివి కావున నతిసూక్ష్మ దృష్టిచేఁ జెప్పవలసె- అప్పుడు నేనును నాబోటులును దేవీవదనంబునందచూడ్కులు నిగిడించి యుంటిమి- దేవిపక్ష్మ ప్రపాతంబు లవమాత్రంబొత్రుటి మాత్రంబోకాని తిరంబయ్యెనని మాకుం దోచినది- కానియామె భావంబు మాకు దుర్జ్ఞేయంబు.

ఆమో. (స్వగతంబుగ) అమ్మయభిప్రాయంబు మాకౌననుటకు నంతమాత్రంబ పర్యాప్తంబు-ప్రి- మంజరి యాశయంబో.

మనో- ఇదిమిగులబాలగావున దీనిమనంబున నొక్కవికారంబం కురించినదని వచింపఁజాలను- కాని ప్రత్యుత్తర ప్రదానవేళలయందు నప్పుడప్పుడు దుల్యభావంబ కానియడఁకువజూడఁ దోచదు.

ఆమో. (స్వగతంబుగ) అట్లయిన నస్మదుపదేశంబు దానికి హృద్విలగ్నంబ

ప్ర. సరేపిమ్మట నేమయ్యెను

మనో. ఆయోగిని దీనింగాంచి యిప్పుడు పాఠంబెట్లు చదువుచుంటివని సవ్యాఖ్యంబుగా నానిర్వ్యాఖ్యంబుగా నాయను భావంబునం గాబోలునను యోగించె ఇదియందుకు భగవతి యాచార్యచెప్పిన చొప్పున నని యుత్తరంబిచ్చె-ఆపెసవైలక్ష్యంబుగ దీనింగని యాచార్య యెవ్వతెయని యడిగె- పిమ్మట నిదియత్న సంవేద్యధార్ష్ట్యంబుగ నాయాచార్య యామోదరేఖయనియె-ఆపెయాయామోదరేఖ భగవతీ పదాభిధేయ యగుచున్నదాయని వాక్రుచ్చె- ఇదికొందఱకుం గొందరు కార్యవశంబునంబూజ్యతాపదంబగుటయందేమి యద్భుతంబు గలదనియె! అంతటనామె కొంకకొంకలాడుచు నీవిద్యావైచక్షణ్యంబు పలక్షింప నేతించితినిగాన నెద్దియైననను యోగింపఁ జెప్పుదువాయని వచించె ఇదిసర్వతంత్ర స్వతంత్ర వాదినియగు భగవతి యెదుట మాబోటరుల్లు వచింప నెంతవారు- ఆయిన సరస్వతీ సన్నిధానంబు మూకలకు వాకులీన నిపుణంబ కాదా- కౌముదీయోగంబున నైందవదృషదంబులు దంచిత ఘనరసంబులగుట యవిస్మయంబే కావున ననుయోగింపందగు నేర్చినంత వచింతుననియె- పదంపడి యా

కెయిట్టిగౌరవంబు నీయాచార్య యందారోపింపుమనని యదియచ్చట సాజంబేయు ని నుడివె- అంతట నాయోగిని మందస్పందిత మస్తకయై విష్పంద నిరీక్షణంబుల వీక్షించి యిట్లిట్లను యోగింప నీమంజరియు నాపశ్నంబులకుం బ్రతివచనంబుల వాంతరకృతాక్షేప విక్షేపపూర్వకంబుగ వర్ణించె.

ఆమో॥ సామోదంబుగ- ఓసీ మనోజ్ఞా యీపసికూన యాచండ యోగిని యెదుట నిశ్శంకయై శబ్దంబులం జెప్పె నే

మనో. ఓసీ వర్ణించెనని నేనుజెప్ప నిట్లడుగుచున్నా వేమే-వినుమయ్యెడచం దంబు.

సీ॥ శబ్దధారావళీ సర్జన వేళల స్వాతీగతా సురాచార్య ఘటిత- కాదంబినీ హేల ఘనతర ప్రతిపక్ష పూర్వపక్షాద్రిదంభోళికేళి- యత్క్రించిదాగమిా యజ్ఞానమ హితాత్ములకు సుధాజలధర రాజిభూతి- యుక్త్యుపన్యా సచ్ఛలోద్గీర్ణబహుశాస్త్ర చర్చోర్మి విస్తబ్ధ శతజనాస్య- యగుచు శ్రవణానుభవ వేద్యహర్ష సారమయ వచన ధారల తతుల మహిమమిారి- దిట్టయైనట్టు లేక యదీకొనంగ నాపెయును విస్మయాబ్ధి లో నడరియుండె॥౬౩॥

ఐన నియ్యెడ నిది విశేషాశ్చర్య ధుర్యంబుగా నేరదు- "తేజసాంహినవయస్స మీాక్ష్యతే" యను నభియుక్త వచనంబు వితథంబె.

ఆమో॥ సవిమర్శంబుగ। ఔను నిర్దుష్టబీజ క్షేత్ర సంయోగంబున జనించిన యంకురంబు కారణగుణాధీన గుణంబయకదా.

మనో॥ బాగుబాగు యట్టి యంకురంబున కుంబర భాగ సౌభాగ్య సంపాదకం బగు సామగ్రి యబ్బెనేని యయ్యది మణిశలాకకుశాగ్రో త్తేజనంబుగాదా.

ఆమో॥ సస్మితంబుగ। మంచిది. ఇది యిటుండనిమ్ము। వేద్యాంశంబంతయుఁ గొంతగ నుండె। కావునం దత్రత్య ప్రసంగ రీతిని రూపింపుము.

మనో। సోల్లాసంబుగ- అవాంతర ప్రసంగ రీతులన్నియు నిరూపింప నేఁజా లకాని ముఖ్యంబులగు నుత్తర ప్రకారంబుల వచించెద నాకర్ణింపుము- వదంబనగా

విభక్త్యంతంబనియు నట్టి పదంబు వాచకంబు లక్షకంబు, వ్యంజకంబని త్రివిధంబని యు వీనిలో నసంకేత వృత్తిచే నర్థబోధకంబులు శక్తంబులు వాచకంబులు ననియు శక్యసంబంధ రూపంబగు లక్షణా వృత్తిచే నర్థబోధకంబులు లక్షకంబులనియు నభి ధా లక్షణాద్య బోధితార్థ జ్ఞాన జనకత్వరూపంబగు వ్యంజనావృత్తిచే నర్థబోధకం బులు వ్యంజకంబులనియు సంకేతంబునా నేతత్పదంబు వలన నేతదర్థంబు వేద్యంబను నీశ్వరేచ్ఛారూపంబ శక్త్యభి ధాది పర్యాయంబుల వ్యవహార్యంబనియు నందు దా శరథ్యాధి తాత్పర్యంబునం బ్రయుక్తంబులగు రామాది పదంబులు శక్తిచే నభిధేయ వాచకంబులగుట శక్తంబులనియు నాశబ్దంబులలో నిరవయ వశక్త్యపేక్షంబు నాస ముదాయ శక్తిచే నర్థప్రతి పాదకంబులగు పదంబులు రూఢంబులనియు నానికి వణి నూపురాది పదంబు లుదాహరణంబులనియు యోగంబు నానవయవశక్తి- తన్మాత్రంబు న నేకార్థాభిధాయకంబు యౌగికంబనియు నట్టి వివాచకాది పదంబులనియు; యో గరూఢుల నేకార్థ ప్రతిపాదకంబులు యోగరూఢంబులనియు నట్టి విశంకర సరో హాదులనియు- అభిధాలక్షణలను వృత్తులు శబ్దధర్మంబులనియు వ్యంజనావృత్తి శబ్దా ర్థోభయధర్మంబనియుఁ దీరాదితాత్పర్యంబు ననుదితంబులగు గంగాది పదంబులు లక్ష ణావృత్తిచే నభిధేయ బోధకంబులగుట లక్షకంబులనియు నట్టి లక్షణావృత్తి గంగ యందు ఘోషంబుగల దిత్యాది వాక్యంబునందలి గంగాది పదంబులే కాంత శక్త్య పరిత్యాగంబులగుటం దీరాది బోధకంబగు వృత్తియైన లక్షణ జహల్లక్షణయనియును నిదియ తీరగత శైత్యపావనత్వాది గుణగర్భితంబగుట ఫలలక్షణయనియు కుశ ల ప్రవీణాది పదంబుల వయవార్థ పరిత్యాగ పూర్వకంబుగ నిపుణాది పర్యా యంబులగుచో నిరూఢలక్షణయనియుఁ గుంతంబులు ప్రవేశించుచున్నవి యి త్యాది వాక్యంబులం గుంతాది పదంబులు తాదృశంబులుగాక తత్సంయుక్త పుర షాదిబోధకంబులగుట నజహల్లక్షణయనియు ఛత్రివంతులేగుచున్నారిత్యాది వాక్యం బుల ఛత్ర్యాది పదంబులుఛత్రివత్తదితర పురుష బోధకంబులగుటను మఱియుం బ్రతిపదంబున నేచంద్రుండు ప్రయత్న-సందర్శనీయుండయ్యె నా యీచంద్రుండు ప్రయత్న సందర్శిత సకల పదార్థ జాతుండయ్యె నిత్యాది వాక్యంబులం దదేతత్పదం బులు తదేతత్కాలాది కృతభేద పరిహార పూర్వకంబుగఁ జంద్రవ్యక్త్యాది మాత్రబో ధకంబులగుటను జహాదజహల్లక్షణయనియును అభిహితంబులైన విషయ విషయులగు

ముఖచంద్రాది పదంబులకు నభేద ప్రతిపత్తి రూపారోప జనకంబగు సామానాధికరణ్యం బాహ్లాదకరత్వాది గుణనిమిత్తంబయ్యె నేని గౌణ సారోపయనియుఁ నందుకు లక్ష్యంబులు ముఖచంద్రుండిత్యాది వాక్యంబులనియు నదియు సాదృశ్యేతర కార్యకారణాది సంబంధ నిబంధనంబయ్యె నేని శుద్ధసారోప యనియునందుకుదాహరణంబులువిద్యయధనం బిత్యాదులనియు విషయ నిగరణ పూర్వకంబగువిషయనిబంధనం బధ్యవసానంబనియు దానితోడం గూడినది సాధ్యవసానయనియు నిదియు గుణనిమిత్తంబయ్యె నేని గౌణసాధ్యవసానయనియుఁదద్భిన్న సంబంధనిబంధనంబయ్యె నేని శుద్ధసాధ్య వసానయనియు దానికి నితడు కల్పతరువనియు నితఁడాయువనియు క్రమంబున లక్ష్యంబులనియు నిట్లులక్షణావృత్తికి సాప్తవిధ్యంబు నిరూపించి వాఁడు వదాన్యుఁడు వీఁడుశూరుఁడిత్యాది వాక్యంబులందు వదాన్య శూరాది పదంబులు శక్తిలక్షణాద్య సిద్ధాశ్రియణీయావమానా సహత్వాద్యర్థ బోధకంబులగుట నాశబ్దంబులనుండు వృత్తి శబ్ద శక్తిమూల వ్యంజనయనియుం దదేతత్పదంబులుఁ దదర్థవ్యంజకంబులనియుఁ దదర్థంబులు తచ్ఛబ్దవ్యంగ్యంబులనియు- గంగయందు ఘోషం బిత్యాదులయందు గంగాది పదలక్ష్య తీరాద్యర్థంబులు శైత్యపావన త్వాద్యర్థబోధకంబులగుట నిచట లక్ష్యార్థంబు వ్యంజకంబగుటచే లక్షణామూల వ్యంజనయునర్థం బవ్యంజకంబనియుం దాదృశ ఘోషంబ విదిత సంతాపంబనఁగ గంగా పదవ్యంగ్యశైత్యపావనత్వాద్యర్థంబు ఘోషాశ్రియజన సంబంధి నిరఘత్వ రూపార్థ బోధకంబగుట వ్యంగ్యార్థంబు వ్యంజకంబనియు- విజనంబున నాశ్యామ నాయకునింగని రోమాంచాంచితతనువయ్యె నిత్యాదులయందు రోమాంచితతనువిత్యాది పదంబులు సంభోగాభిలాషా ద్యర్థగమకంబులగుట వ్యంజకంబులనియు నిత్తెఱంగున బహువిధత దవాంతరభేదోపన్యాసంబొనరించి సంయోగవృత్తిచే రసోపస్కారకంబులు గుణంబులనియు నవ్వి మాధుర్యౌజః ప్రసాదంబులనియు నితరమతంబున నివ్వియు శ్లేష సౌకుమార్యార్థవ్యక్తిసమతౌదార్యకాంతి సమాధులంగలసి పదియనియుం బరేతర మతంబున నివ్వియునుదాత్తతా సుశబ్దతా ప్రేయఔర్జిత్య విస్తర సౌక్ష్మ్య గాంభీర్య సంక్షేప భావిక సమ్మితత్వ ప్రౌఢిరీతి గత్యుక్తులుంగలసి యిరువది నాలుగనియు రసావస్థానసూచకంబులగునవి వృత్తులనియు నందత్యంత సుకుమారార్థ సందర్భాత్మికయగు కైశికియను వృత్తియత్యంత సుకుమారంబులగు శృంగార కరుణ రసవ్యంజకంబనియు నత్య

ద్భుతార్థ సందర్భాత్మికయగు నారభటియను వృత్తి యత్యుద్ధతంబులగు రౌద్రభీభత్స రసవ్యంజకంబనియు నీషన్మృద్వర్థ సందర్భాత్మిక యగుభారతి యనువృత్తి యీషత్సుకుమారంబులగు హాస్యశాంతాద్భుత రసవ్యంజకంబనియు నీషత్ప్రౌఢార్థ సందర్భాత్మికయగు సాత్వతియను వృత్తి యీషత్ప్రౌఢంబులగు వీరభయానక రససూచకంబనియు నాల్గు వృత్తులని రూపించి ప్రాచుర్యంబుగ విభిన్నపదత్వ లక్షణశబ్ద ధర్మవ్యంగ్యంబయి యానంద నిష్పందితా రూపంబగు మాధుర్య గుణంబు శృంగార కరుణాశాంతర సానురూపంబనియు దీప్త్యాత్మకంబును జేతో విస్తార నిదానంబును సమాస భూయస్త్వంబును నగునది యోజోగుణంబిద్ది వీరరౌద్రబీభత్స భయానకర సానుగుణంబనియు చిత్త సంవ్యాప్తి లక్షణంబను ప్రసిద్ధార్థత్వవ్యంగ్యంబును నగునది ప్రసాదగుణంబనియు నిది సర్వరస సాధారణంబనియు-గుణశ్లిష్ట వర్ణసంఘట నాత్మకంబులు రీతులనియు నందు బంధపారుష్య శబ్దకాఠిన్య రహితయు ననతిదీర్ఘ సమాసయునగు రీతి వైదర్భియనియు నోజః కాంతిగుణోపేతయగు రీతిగౌడియనియు నేతదుభయాత్మికయగు రీతి పాంచాలియనియు వాని నిరూపించి రసాపకర్షకారణంబులు దోషంబులనియు నందు శ్రుతికటుచ్యుత సంస్కృత్య ప్రయుక్తాదులు పద దోషంబులనియుఁ బ్రతికూల వర్ణోప హతలుప్త విసర్గ విసంధ్యాదులు వాక్యదోషంబులనియు నపుష్ట కష్టవ్యాహత పునరుక్తదుష్క్రమ ప్రముఖంబులర్థదోషంబులనియు వానిలోఁ గొన్నిటికిం బ్రకరణవశంబున గుణత్వంబును నిరూపించి నాయికానాయకాన్యతర రూపంబగు నాలంబన విభావంబునను స్రక్చందన చంద్రికామలయానిలకోకిలాలాపాద్యుద్దీపన విభావంబులను సలలిత కటాక్ష వీక్షణ భుజాక్షేపాదికంబులగు ననుభావంబులను పరగత సుఖదుఃఖ భావనాభావితాంతః కరణరూపంబగు సత్వంబున జనించిన వాట సాత్వికంబుల నంబరగు స్తంభ ప్రలయరోమాంచ స్వేదవైవర్ణ్య వేపథు వైస్వర్యాశ్రు నామకంబులగు నెనిమిది భావంబులచేత సర్వరస సాధారణంబులగుట వ్యభిచారి సంజ్ఞాకలితంబులగు నిర్వేదగ్లానిశంకాదిత్రయ స్త్రింశత్సంచారి భావంబులచేతను స్వాదుత్వంబు నొందింపంబడిన స్థాయిభావంబు రసంబనియునట్టిరసంబు రతిహాస శోక క్రోధోత్సాహభయ జుగుప్సావిస్మయ శమంబులు స్థాయిభావంబులగుటం గ్రమంబున శృంగారహాస్య కరుణ రౌద్ర వీర భయానక భీభత్సాద్భుత శాంతంబులను నామంబుల నుల్లసిల్లునని తదంతర తత్కృతాక్షేపంబుల క్షిప్రంబుగఁ

ప్రచండ వాతంబు జీర్ణపర్ణంబుల కరణింబరిక్షేపించుచు లక్ష్య లక్షణంబుల నిరూపించె.

ఆమో. సామోదంబుగ- చెలియరో మనోజ్ఞా యీపసికూన యింతకోర్చునే

మనో. ఇదియేమి యద్భుతంబు- వయసు చిన్నదిగాని తెలివి చిన్నదా- అది యట్లుండనిమ్ము - నేను నీకంటె దాని ప్రతిభావిశేషంబు మిక్కిలి యెఱుంగుదానను ఆబాల్యము నీవాచెలి కాచార్యవు - కావున నీకు విదితంబుగాకుండునే. కావున నీకిది యబ్బురంబుగా నేరదు- ఇంతకు మున్నెప్పుడును భర్తృదారిక విద్యావైచక్షణ్యంబు పలక్షింపని వారలకు నట్లు కాఁదగు॥ ఇదియనుభవదీయ శిక్షావిలసనంబే కాదా- కావునఁ బరికింపఁగఁ జిత్రంబుగాదు- మఱియును దీపంబు స్వభావంబున నతివిపులంబుగా నుండినను దమోవిజృంభణంబుల దరికిఁజేరనివ్వునే - ఆయోగిని తమో విజృంభణంబు సలుపనిది దీపశలాకయయ్యె- మఱియును- సుజాతంబగు మణిశలాకశాణోత్తేజితంబయ్యెనేని చకచక మినుకుల నీనుట యాశ్చర్యకరంబా- శశికాంత శిల శారద కౌముదీసంస్కృతంబయ్యెనేని పయఃపూరంబులం బరిపరింపఁ జేయుట విస్మయంబా- కావున నీకిది యొక యబ్బురంబుగా వింపందగదు.

ఆమో. సరంకోచంబు కరణి- రత్నంబు జాతిమంతంబుగా దేనినికషోపలని కావంబెట్టి విశేషంబు సంధింపంగలదు - ధరసారవతిగా దేని ధారాధరాదికంబుచే నేమగు- ఉపకర్తృ వర్తనంబునకుం బ్రకాశకరంబు పాత్రింబగు నుపకార్యంబు గదా. అది యట్లుండనిమ్ము - ఈబాలిక యభ్యాసాద్యవస్థ యాదిగవికసత్ప్రజ్ఞయై విలసిల్లుచున్నది.

మనో. ఇది యేమియబ్రము- జాతికలిక యుదయంబు నొందినది నాటంగో తెయకాదంబినీ సంగతిఁ గందళితా మోదగాదా.

ఆమో. అది యట్లుండుఁగాక- తదనంతరం బేమయ్యె - ప్రకృతకథ ప్రస్తావాంతరంబున నంతరితంబయ్యె। సాకల్యంబుగ విన్నను గాని నాచేతంబు ప్రీతంబు గాదు.

మనో. ఇంకను నీకు శంకయగుచున్నదా ఛాత్రజనజయంబునకై.

ఆమో. కృతార్థయై వచ్చినదానింగని కానినాస్వాంతంబు నిశ్చింతంబుగాదు కావున నవ్వలి వర్తనంబు వచింపుము.

మనో. అట్లేని యాలింపుము వక్కాణించెద- ఇట్లు చాల నిరూపింప నా చండయోగిని నిరుద్ధాక్షేపాధ్వయై గురుతమ ప్రయత్న నిహ్నుతెర్ష్యని సర్గయగుచు దీనికి బోధించు దానివలె దోషరహితంబులై గుణాలంకార విశిష్టంబులగుచు నొప్పెడు శబ్దార్థంబుల కదా కావ్యంబని కావ్యలక్షణంబుని రూపించెనని యర్థోక్తంబునంద

ఆమో. సాశ్చర్య విషాదంబుగ - అన్నన్నా యాపె యెంతశకురాలు అపర్యాప్త నిదానంబోకానొకండు మనంబునం గీలించుకొని యీబాలిక వంచింపనేతెంచి యిది పరిక్షిప్త స్వాక్షేప జాతంబుగ నుత్తరంబులు వచింపనేమియుం జేయనేరక యేతానస్మాత్రంబునం దనకాచార్యత్వంబు నిర్వహించుకొనను గాంబోలు తెంపరియై యిట్లుం నుడివె.

మనో. ఇది యంతట నూరకుండెనను కొంటివా.

ఆమో. మరేమి.

మనో. అంతియు నాలింప కెందుకుం దొందర నొందెదవు - పిమ్మట భర్తృదారిక యుక్తియాపెతలంపు సొంపొందనిచ్చెనా.

ఆమో. ససమ్మదంబుగ - ఇట్టిదానట్టి మఱియొక విశేషంబు గలదా యట్టైన నాకర్ణంబులు తచ్ఛ్రవణంబున నతితూర్ణోత్కంఠంబులగుచున్నవి కాన వచింపు మనంతరోదంతంబు వచింపుమని యతిత్వరాసక్తి నభినయించుచున్నది.

మనో. ఆవిడంపట్లు వచింపనిది సవినయంబుగ నాయోగినిం గని యోభగవతి తారు వచించినది నాకభినవ వేదనీయంబై యుండెననియె.

ఆమో. సవిషాదంబుగ - ఈబాలిక యిట్లన్నదా.

మనో. సావధానముగా నాలింపుము.

ఆమో. అట్లయిన వృత్తంబగు వృత్తంబంతయు నవ్యాహతంబుగ వ్యాహరింపుము.

మనో. పదంపడి యాపె సవికాస నయనయగుచు దీనింగని నీవుబుద్ధిమతివి కావున నీవంటి పాత్రింబునందు మాయుపదేశంబు సజ్జితంబయ్యె నేని మాకుపస్కార కారణంబు గాఁగలదని వచించెనను నర్థోక్తంబున.

ఆమో. (సాశ్చర్య విషాదంబుగ.)

అప్పుడమ్మ వదన విలాసంబెట్లుండె నే.

మనో. ససంకోచంబుగ నుండెఁగాని విశృంఖల విలాసంబై యుండలేదు.

ఆమో. మంచిది-తరువాత నేమయ్యెను.

మనో. పదంపడి యాబాలిక జననియభిప్రాయం బవగమించి మృదులసల్లాపంబుల నతివినయంబభినయించు- చిట్లనియె - ఓభగవతీ యిద్దియ కావ్యలక్షణంబు సరేకాని దీన నాకొక్కండు సంశయం బుదయించె - అనగ నా చండయోగిని సధార్ష్యగోపిత తద్వక్ష్యమాణాక్షేప సంకోచయై ఓసీ ఛాత్రజనవర్యా యీలక్షణం బయటే కాలంకారనిబంధన ప్రిబంధ్రభిమతంబుగావునఁ గంభీర వకంత ఘంటాయితంబు గదా- నీకెద్ది యిందు సంశయనిదానంబు.

మంజ. ఓభగవతీతాదృశంబులగు శబ్దార్థంబుల కావ్యం బయ్యె నేని యాకావ్యంబు నేఁజదివితిఁగాని దాని యర్థంబు నాకుంబుద్ధంబుగాలేదు- ఇకావ్యంబున నర్థగౌరవంబుగల దకావ్యంబున నలంకార గౌరవంబు కలదు- ఇత్యాది ప్రతీతులు లోకానుభవ సాధారణంబగుట నర్థంబులకుం గావ్యశరీర ఘటకత్వం బెట్లు పాటిల్లునని యనుయోగించె.

ఆమో. సాశ్చర్యంబుగ - భళా యీబాల బాగుగ ననుయోగించె - తర్వాత నాపె యేమివచించె.

మనో- అప్పుడాపె యేమియుంజెప్ప నోరాడకూరకుండె - తోలుతం గొన్ని

యొడలఁ గుయుక్త్యుపన్యాసంబు సేయఁబూన దేవియమాధ్య స్థ్యభరంబవలంబించినయ పథంబేర్పరచె - కావున మఱియేమిసేయు.

ఆమో. పదంపడి.

మనో. అప్పుడీబాల మఱిమఱి సవినయంబుగాన యోభగవతీ శిష్యజనవత్స లా నాయెడంగరుణించి యీశంకా పంకం బింకఁబ భవచ్ఛాత్రింజేయుమని వేడుట యను నెపంబున నధిక్షేపించె

ఆమో. సోల్లాసంబుగ - పిమ్మటంబిమ్మట.

మనో. అప్పటికి నూరకున్న దేవియు నామెంగని యోభగవతీ దానిం గనికరించి దానిసంశయంబు సంశయింపంజేసి శిష్యజనవాత్సల్యంబు ప్రకటింపఁజే య వేయని వేమఱు వేడుకొనియె.

ఆమో. (స్వగతంబున) అమ్మయు నామెయందు గౌరవంబువీఁడె- సోత్సా హంబుగ. ప్ర. పిమ్మట పిమ్మట.

మనో. పిమ్మట నేమున్నది తూష్ణీంభావంబుగాక.

ఆమో. పిమ్మట యమ్మ యేమిదలంచెనే.

మనో. అప్పుడా దేవి కూతుం గని మంచిది యదియట్లుండనిమ్ము కావ్యలక్ష ణంబు నీవే మని పరిష్కరించెదవని యనుయోగించె.

ఆమో. (స్వగ) అన్నా అమ్మ యుపకారతత్పరత (ప్ర) అనంతరంబనంతరంబు

మనో. అంతట నీబాల మాతంగని నేనాచార్యోపదిష్ట వాక్యార్థావధారణా సమర్థనయ్యును భగవతీ ప్రశ్న మహిమంబునఁ గదా యింతవట్టుతప్పులేకాని యొ ప్పులేకాని తోఁచినట్లు వచించితిగాని స్వాతంత్ర్యంబున వచింప నేనెంతదాననని వ చించె- అప్పుడా చండయోగినియు విదితదేవ్యభిప్రాయయై మంజరింగని యిదియు ను నాయను యోగంబకావునందల్లక్షణంబు సాక్షాత్కరింపందగు ననియె.

ఆమో. అంత నంత.

మనో. అప్పుడు మనమంజరి యడఁగువ దప్పకయ యాపెంగనిమీఁయెదుట దానినిరూపింప నేనెంతదానను మీయూహకైన మీఱరానిది కావుననాచార్యాస్మరణం బొనరించి నాకుఁదోఁచువటుల వచించెదఁ అక్కతంబున దీని నేమయిన బాధకం బుండిన నన్వేషించి కరుణాభరణత వచింపఁగోరెదనని రమణీయార్థ ప్రతిపాదకత్వంబు కావ్యలక్షణంబుగాఁ దగునని, వక్కాణించె.

ఆమో. పదంపడి యామె యేమనివచించె.

మనో. ఏమియు వచింపలేదు.

ఆమో. ఊరకుండెనా.

మనో. ఊరకుండను లేదు.

ఆమో. అట్లయిన మఱియే మొనరించెను.

మనో. అంతఁగొంతసేపు నిష్పందవిస్తృతంబులగు లోచనంబుల వియత్తలం బెల్లఁ బరిశుద్ధంబొనరించుచుం దలపంకించెను.

ఆమో. సాట్టహాసంబుగనోసి మనోజ్ఞా! యింక నేమియో వచించెద వనుకొంటి నిద్దియేనా దానికి వచింపవలసిన యుత్తరంబు.

మనో. మఱియేమనుకొంటివి.

ఆమో. సప్రమోదంబుగ అట్లె యనుకొందును - అనుచు నెదుటంగాంచి- సఖిమనోజ్ఞా యస్మచ్చేతను దంతగంబు ప్రాపితంబుగాఁబోలునే - చేటీముఖ్యకుంభస్తని యుల్లేఖించుచున్నది.

మనో. కాకున్న దీనికి నిచ్చట నేమి కర్జంబు.

ఆమో. మనకుం దొందర దగదు వచ్చినకార్యంబదియ వచించుగాక.

మనో. అటులగానిమ్ము ఏతెంచినకుంభస్తని అమ్మగారూ దండాలు.

ఆమో. దేవీ దయాపాత్రవై చిరంబు మనుము అమ్మాయి సంతోషంబుగా నుడెనే.

కుంభ- బాగాసంతసంబుతో నున్నారు.

ఆమో. ఏమి వృత్తాంతంబు.

కుంభ. ఏలిక రాణిగారు తమరినిమనోజ్ఞాంబగారితో నేతెమ్మని తమతో మనవిచేయుమని సెలవిచ్చినారు అందుకైవచ్చితిని.

ఆమో. మంచియని సఖింగాంచి - ఓమనోజ్ఞా యమ్మపుత్తెంచినసుద్ది యాలించితివిగదా - లెమ్ము వెళ్లుదమని యట్లుచేయుచున్నారు.

ఆమో. భగవతి చండయోగిని యామోదరేఖ ప్రణమిల్లుచున్నది.

చం. పరమేశ్వరునకై ప్రణామంబగుత.

దేవి. ఓపట్టి యిచ్చట నుపవిశింపుము.

ఆమో. అట్లుచేయుచున్నది - మనోజ్ఞయుం దనచక్కినిం జేరుచున్నది.

దేవి. ఓపట్టి యీయోగినీమణి స్వతః ప్రసన్నత నిజకటాక్షధారల నస్మత్పంకంబపనయింపుట నీదినంబు సుదినంబుగదా.

ఆమో. ఇందు కేమిసంశయంబు - ఓయమ్మ యిట్టి దివ్యంబొడం గూడుటనీ భాగ్యంబుగాదే యని యాయోగిని నాలోకించి భగవతి చండయోగినీ మమ్మును జితభాగ్యలం జేయంగదా నీయాగమనంబు- అనునర్థోక్తంబునంద జనమధ్యంబున రాజయోగిని యుత్తిష్ఠమానయయి యోగుణవతి యామోదరేఖా ద్రుతంబునకు స్వత్వంబు చేసికొంటివేని పరేంగిత జ్ఞానఫలాహి బుద్ధియ యనునభియుక్త తాత్పర్య విషయలక్షణబుద్ధిమతి వగుదువని నేదలంచెద.

ఆమో. ససంభ్రమంబుగ నాలోకించి సరభస సకృతోత్థానయై - భగవతి రా

జయోగిని జనాంత రితవగుటనినుం జూడ( జాలనైతిఁ గాన నాయపరాధంబు వితథం బు సేయందగునని ప్రణమిల్లుచున్నది.

రా. దానిం జేరి గాఢా లింగనంబున సన్మానించుచున్నది.

ఆమో. భగవతి యిటనుపవిశింపందగునని యిరువురు నిరంతరంబుగ నుపవి శించుచున్నారు.

దేవి. ఓపట్టీ యీమె యదృష్ట పూర్వ జనాంతరితయు లోఁగడ( దూష్ణికయు నై యుండుటంబట్టి సత్కరింపనే నెఱుంగనైతినే యని వినిచి సరభసకృతో త్థాన యై భగవతి యోగినీమణియని జోత యొనరించుచున్నది.

రా. దేవి సకల సౌభాగ్య సేవధియు సమస్త శస్త్రగుణ నిధియు నగు తనయా మణిం బడసితివిగదా । ఇంకను.

క॥ ధిషణాధిషణుని పదనఖ । సుషమాలంకృత కిరీట శోభిత మహితా । శే షావనీశు భూభృతి । శేషాకృతి సుతుని బడయు శివహితశివయై॥ అని యాశీర్వదిం చుచున్నది॥ ౯౮॥

దేవి. ఓపట్టీ యీభగవతి వృత్తాం తెప్పుడు జెప్పవైతివిగదా.

ఆమో. ఓయమ్మా యీమె వృత్తాం తిప్పుడు చెప్పనోప నైరింపుము-ఇపుడు పరిశీలనీయంబైన యొక యర్థంబు భగవతి వచించిన వాక్యంబునందుఁ గానంబడు వది పరిశీలింపవలయునని నామెంగని భగవతి రాజయోగిని యింతకు మున్న వ్యవహి తోదితంబు నాకు విదితంబు గాలేదు-కావున వెండియు దయసేయఁ గోరెద.

రా. మంచిదని ద్రుతంబున కిత్యాది వాక్యంబు పఠించుచున్నది.

ఆమో. ఎచ్చట ద్రుతంబునకు.

రా. భవదుక్త మస్మి నిత్యాది వాక్యస్థ ప్రథమ ద్రుతంబునకుఁ సభాసద జ నంబంతయు సాకూతంబుగం బరస్పరవదనావలోకనం బొనరించుచున్నారు.

చం. సధ్యార్ఘ్యంబుగఁ గృతోద్ధాన యగుచు। ఓదేవి దీని దుండగంబు సూచితి విగదా- తప్పని యొక్కింతయుఁ దలంపక యింతమందిలో నన్ను మిమ్ము వినాశితభాగ్యులం జేయ నాయాగమనంబని దూషించుచున్నది-ఇట్టి యసభ్యుల సభకు రావించుట నీవును దండనీయవే కాని నీవవిదితై తదాగమనంబు గలదాన వగుట నియ్యెడ నీయెడల దోషంబు. మాకు రోష ప్రభవంబు గా నేరదు-కావున నిది దండనీయ యని తిరిగి-యోగభ్రష్టయోగినీ యేమంటివి-నన్నెఱుగవా చూడిపుడు నిన్నేమి చేసెదనో యని సారెసారెకు సాటోపంబుగ సంభాషించుచుం బరిభ్రమించుచున్నది.

రా. సప్రహాసంబుగ-ఓసి పిశునాత్మా నిన్నెఱుంగనటే-నిన్నెఱుంగక నేనిట్లం టిననుకొంటివా-నీవతిదంభశీలవనియు నతిమాత్సర్య ధుర్యచర్యానటివనియు విద్యావ ల్లీ స్ఫురణాగణనీయ క్షుద్ర మంత్రోపాసనా సిద్ధిసమిద్ధ గర్వవనియు నే నెఱుంగుదు నే-అను నర్థోక్తంబునందు.

చం. ఓసి పాంసులా మదుపాస్యమాన మంత్రంబులం దూషించెదవే-చూడు మేమి సేసెదనో నామహిమ.

రా. ఓసి మూఢశిష్య జనమాన్య మహిమా-యేమో చేయుదునని పలుమాఱు ప్రేలెదవు-అందుకు నేను వారును వీరును గానుగదా-లేదా యట్లు యనుకొనుము-మంచిది యది యటుండనిమ్ము-నీవు సద్యోగి-నివై తివేని సుశీలయగు నీబాలం బరీక్షింప నీ యోగంబున కేమిసాధనం బనుకొంటివి- వైదుష్య గ్రహణంబుచే సంతోషించుట కని యందువా-దీని వాఙ్ముఖ సర్వతోముఖ నిర్ఝర ప్లవమాన మనీష వై దీనికెన్నియైనను పల్లవంబులు మిగుల నిదివరలో-ఁజింతించితివిగదా- అవి యన్నియుం బతివ్రతా ప్రహితంబులగు నభికానురాగ విలాసంబులం బోలి వితథంబు లయ్యెగదా- నేనిచట బ్రచ్ఛన్న వృత్తిచే నెందుకేతెంచి యుంటిననుకొంటివి-నీవు నీసామంత గృహంబులం జేసిన ప్రతిన యాలించి నీచేయు టుంటరి చెయ్వులు మంటగల్పనే-ఐన నాప్రయత్నంబంతయు నీయామోదరేఖ మోఘుం బొనరించె-అయిన నామనం బంతకంటె మహానంద సంవళితం బగుచున్నది - దీనికి మూలంబేమనుకొంటివి - ఈ యామోదరేఖ సంకల్పం జేసుమీ-కావున దీని సన్నిధియందుట నీవేమియు-జేయలేవు-కావున నానవ్వూని మిన్నకుండుము-లేదా యేమి సేయుదునో యేమిసేయుదునో యని సారెసారెకు వెఱపిం

ప నేల- నీచేత చేఁబడిన నయ్యోనేని మాకడం గనికరంబునీడి మొండగు దండితనంబు పొడఁ గానుపింపుము.

చం. (మహార్భాటంబుగ) ఓసీ కులటా మాబోటరులకు బెట్టిదంపు రవరవల నెట్ట పంట నేలనె రచియించెదవే.

రా. అసన్మహిమ ప్రదర్శనంబు కులటా ధర్మంబ కాదటే.

చం. ఓసి దుశ్శీలనాయింగితం బెఱుంగక పలుమారు నాకసరు మిగుల నేల తెక్కానిపించు చున్నావే.

రా. నీమహిమ యిట్టిదని యందఱకుం బ్రకటంబగుటకే.

చం. లోఁగడ నామహిమంబు ప్రకటితంబయ్యోనేని సభాక్షోభంబగునని సైరించితి - ఈదేవియు నిట్టి నిన్ను పాఱదోలింపక చమత్కారంబని చూచుచున్నది- కావుననిఁ కసైఁపనోఁప- కాచుకొనుము - కనుగొనుము - నామహిమ యని యసదుత్కటధ్యాన నిమీలిత నయనయై హుం మహా భైరవీయని ఫూత్కారం బొనరించుచున్నది- సభాజనంబు ససంక్షోభంబుగ.

కః ఇదియెట్టి దివ్యశక్తియొ । మదినెన్నఁగనలవిగాదు మనకుం బూత్కృ
త్యుదిత మహోల్కయి యెప్పుడుఁ దుదనెట్లగునో యటంచు దుర్మనసముగన్ ౫౦॥

రా॥ ఓసభాసదులారా బెగడొందకుండు - వినోదంబుగంగనుంగొనుఁడు అనుచునట్ల హాసంబొనరించి తననోటం గైకొని కబళించుచున్నది-(సభాజనం బత్యాశ్చర్యంబభినయించుచున్నది.)

రా॥ ఓసీ చండయోగినీ యాభీల జ్వాలస్వర్గాత్మకంబగు నీమహిమంబనాద్యంబై యుండెఁగదా.

చం॥ సరోషభీషణా కారంబుగ- కానిమ్ము- ఇపుడేమయ్యె- ఈసారెగాఁచుకొనుమని వెండియుం దొల్లింటి యట్లు ధ్యానంబభినయించి తనజటంబెఱికి నేలం గొట్టుచున్నది.

సభాజనంబు- అత్యాహితకబళిత స్వాంతంబగుచు- ఆహా యీదిష్టంబునందిష్టంబిష్టంబువీఁడి యెంతకష్టంబు పుష్టంబుసేసె- పీడవిడచినం బిశాచి యావహించెనను నయంబు హృదయంబున ననయంబు సంగమించుచున్నది- ఎక్కటంబున నీజట.

సీ॥ అసిత దృషద్యుగా భాభోగభీషణ భోగధిక్కృతయమో ద్యోగయష్టి। ప్రచురఫూత్కారధారాసము ద్గీర్ణ భైరవ గరళాగ్ని దుర్వారహేతి। వికట పరిస్ఫుర ద్ద్విజఘోరలోద్వాంత వినుఖుండ రాహ్వాస్య విధముఖంబు। శశ్వదుద్వమిత విష్వక్ప్రసర్పత్స్ఫులింగోత్కర ద్రావితాత్మ్యాహజనము। దారుణేక్షణ నిష్ఠ్యూత దహనకణము। ఘోరవలమాన జిహ్వాకఠోరహేల। మసకృదుదిత ప్రసార శూర్పాధి భోగ। మైన ఫణి యయ్యె మహదహిశాస్త్రిగతిని ॥౯౭॥

ఆమో॥ రాజయోగినింగాంచి- ఓభగవతి మహానుభావా యియ్యెడం బరిపూరిత భక్తజన మనోరథుండగు విష్ణురథుండ సమాహూతుండయ్యెనేని సభాసంక్షోభంబు మిగులంగాఁగలదు- కావుననీయుద్యమంబుప సంహరింపుము- శిష్యకల్పుండగు నన్ననుగ్రహింపుము.

రా॥ ఓయాళీ నీయాప్సితం బసంపన్నంబుగావుత.

ఆమో॥ భగవతీ మహదనుగ్రహంబని తిరిగియా కుహనా పృథాకువుంగనియెక్క ఫూత్కారంబొనరించుచున్నది-

సభాజనంబు- సవిస్మయనిష్పందనయనంబుగ - అన్నన్నా యీయామోదరేఖ మహిమంబు- యీబిడ యిట్టిదని యెన్నఁడు నెఱుంగ మయితిమి- శమివారయు సఖిశిఖంబోలె కాదంబిని యశనిరేఖ చందంబున నిజాంతరంబునఁదనమహిమంబు దాచిపెట్టినది- మంత్రముచు లేదు యంత్రమును లేదు తంత్రమును లేదు- ఉప్పని యూదుడు నాశాంబరీ దర్వీకరంబు కరంబదృగ్గోచరంబయ్యెననుచు బహువిధంబులం బరస్పరంబు మిగుల నాశ్చర్యంబభినయించుచున్నది.

చం॥ ఆత్మగతంబున - ఆహా యెంతకష్టంబు వాటిల్లె- మన మంత్రి మంత

యు వింతగనంతంబు నొందె- కావున నీవిపుడే వెఱవున దీనినోడింపం దటిగాదు ప్రచండ దోర్దండబలంబునన దండింపవలయునని సమహసాద్ధత్యంబుగ రాజయోగినిం గని- ఓసీ బూదిపూసూ నిన్నునిర్మూలింప నిట్టియుత్సాహంబు గావలెనే. యొక్క చపేటింకంబుడమింబడఁగొట్టెదఁబోడగనుమని మిగులం గర్జిల్లుచు బాహు- ప్రసారణం బొనరించి నా మెమీద లంఘింప నుద్యోగించుచున్నది-

సభాజనంబు- ఆహాకష్టముకష్టము- ఇదిపెద్ద తాటకవలె నీపెమీదం బడజతనం బు సేయుచున్నది- ఇప్పుడేమి సేయవలయునని సారెసారెకుఁదొందరనొందుచున్నది.

రా॥ ఓసభ్య జనంబా మీరేల కళవళపడుచున్నారు- ఇదియన్నివిధంబులందా టకయని చెప్పవచ్చు- కాని రామశిలీముఖరేఖ నాకు శరణంబైయున్నది- కావున నె మ్మదింగనుంగొనుఁడు.

చం॥ కరంబు ఘోరాకారయగుచు హరిణిమీదికి వ్యాఘ్రియుంబోలె లఁ ఘించి కొట్టచెయ్యెత్తుచున్నది-

సభాజనంబు- విస్మయకబళిత చయంబుగ ఆహాయీయోగినీ మణిమహిమ- యీపెంగొట్ట భుజంబెత్తబడుదు నాయత్తంబుగాక యట్లవిష్టబ్ధంబయ్యె- అనుచు వి స్మయ సమ్మదంబు లుప్పొంగ నవలోకించుచున్నది.

చం। సవిషాదంబుగ నధోముఖియగుచున్నది.

రా॥ దీనివృత్తంబంతయు మీకెఱుకపడదు- దీనియెదుటనచెప్పెద నాలింపుఁ డు- ఇదిమిగుల దంభశీల- కొన్నియగు శాబర మంత్ర సిద్ధులు గలుగుట విజృంభిం చి తాను సర్వతంత్ర స్వతంత్రియు మహామహిమయనియు నహంకార పూరితాం తరయై ప్రకటించుచు సామంత శుద్ధాంతంబులంజేరి వారికింగొన్ని యుపదేశంబు లొనరించుచు- దానసిద్ధురాలని తేటపడ నితరుల నందఱి నిరాకరించుచు దీనికిఁ గొం దఱు వెరఎక ననుయోగింప వారికిం బెక్కులగు వెక్కురులం జేయుచుండు- అక్క తంబున సాధారణ జనంబులు హరిణంబు వ్యాఘ్రింబోలె విశరణంబులై దూరదూ రంబుగం బరావృత్తంబులగు- దైవవశంబున నిదిసమీపించె నేని పాదాభి వందనాది

కంబుల దీనిం బ్రసన్నఁ జేయుచుండును- అక్కాంతంబునం గాయంబునం బోలిపొగడు ననుమిగులం బలిసి మైమఱచి నెక్కు- జనంబుల శిష్యులం జేసికొనుచు నెల్లజనంబుల ననేక ప్రకారంబులఁ గడుభీతులంజేయుచుండు- ఈలోఁగడ నొక్క సామంత గృహంబునందత్కుమారికకుఁ బాఠంబు సెప్ప నెడలఁ బ్రసక్తి వశంబున నక్కడ జనులు మన మంజరి బుద్ధిమతియనియు నా మోదరేఖ విశేష విదుషియనియుఁ బ్రస్తుతిచేఁ బ్రశంసింప నదియంత యిదియెంత వీరలకేమి దెలియునని యీసడించి చూడు నాశిష్యయగు దీనిచేత నిరువురనోడించెదనని ప్రతినఁబూని యాబాలిక నంపెనట- అంత నాబాలిక మంజరి చెంగటకేతెంచి యొప్పు జేమి జరిగెనోకాని దీనిచేతనపరాభూతయై తిరిగి పోయెనట- పిమ్మటనిదియాటోపంబు విశంకటంబై యొప్ప వారికేమియుఁ దెలియదని పించి వచ్చెదనని పంతంబువట్టినట- లోఁగడ దీనిదౌర్జన్యంబు గొందఱు సెప్పినను మనకెందు కీవనికర్మంబు వాఁడయనుభవించునని తలఁచి యూరకుంటిని- ఇప్పుడీ ప్రతిజ్ఞా వృత్తాంతంబు వినఁగ నిదియేదో దుష్కృతంబొనరించునని తర్కించి యామోదరేఖ గొంత పరిచితగావున దీనికేమి యొగ్గుసేయునోయనియు దీనిశక్తిం బరికింపవలయుననియు నిత్యాదికంబుల నిచ్చట దీని కృత్యం బాసమాప్తంబు ప్రచ్ఛన్నత నుండి వదంపడి దేవీ సంభావితురాలనగుదునని యిట్లుంటిని- కానియామోదరేఖ యిట్టిమహిమవతియని యెన్నఁడు నొక్కింతయైన నెఱుంగనైతి- ఇట్లని తెలిసిన రాకుండుదాననే-ఇదివీరినిరువురఁ వంచింప గొన్నినాడులనుండి జతనంబుసేసియ యేతెంచి యిక్కడఁ దనశక్తినంతయు వినియోగపరచెఁగాని యామోదరేఖారక్షితయగు దీనికి దీనిశక్తి పటుతమ ప్రాసాదాంతర్వర్తికి వృష్టియుంబోలెఁ దనరాక నెఱుక సేయుటకైనఁ జాలలేదు దీనివృత్తం బిట్టిదియని తిరిగి చండయోగినింగని- ఓసియోగిమానినీ యీయుదంతంబంతయు సూనృతంబా యనృతంబా- అలీకంబు వచించితివేని నీవుగురుద్రోహిని వగుదువనుచున్నది.

చం॥ అవమానా పత్ప్రాపావనత వదవయగుచున్నది.

దే॥ సవికాసాననంబుగ- భగవతి రాజయోగిని యీ మహామందిరంబెన్నఁడు పావనంబుసేయలేదు- మము నెప్పుడు నీమెంబరిచయింపలేదు- ఇట్లుండ మామీఁద నీమె యేలకోపించు- వంచింపనైన నేలఁదలచు- అనునర్థోక్తంబున.

రా॥ ఓ దేవీ యిట్టివారలకిట్టి యాచారంబు కొ్రొత్తయే యాకర్ణింపుము.

సీ॥ బడలిక జ్ఞాడలం బొడసూపకుండఁగ జతనము ల్బరికింప జాణతనము। గోర కసుంగఁగ గోరంతలైనను వంతలవింతలు వరగకుండ। జేజేలయిక్కలం జేరికొల్వక యుండ మిన్నేరు మొదలగు మేటిరేళ్ళ। బ్రుంగుడు లిడకుండ రోయిావిగాకుండ నొక్కింతి మల్లట నొడమకుండఁ। దానయేతే రవిప్పై నదమ్మ మమరనన్న కూళలు దాని నేమన్ననవిడ। కిచట నచటను నిడుదగు నిడుము లిడెడు।కసటు కర్జము లావరింపఁ గడగుచుండు ॥౬౭॥

మఱియును సీ॥ పరదూషణ పరుష పాషాణ వర్షణ దుర్గ్రహ ప్రేరణ ధూమ యోని। పరగుణ హరిణాంక కిరణ సంవరణ పార్వణ జృంభ ణోద్దామరాహు మహిమ। పామర ప్రమద సంపాదన పటుతమజాల్మ వ్యవహృతీంద్రజాలహేల। సాధుజనావి సంసర్జనమూర్తి మదాగంతు కాఘ మహాసమృద్ధి। యైహికాముష్మికార్థ సహాయవచన।రచన వల్లీనికృంత నలలిత హేతి నిరయ నిరయ వ్యథావమాన నిరుపమాన।భోగసంధాన పటుదూతి మూర్ఖరసన ॥౬౮॥

దే॥ భగవతి రాజయోగిని కాషాయదండ మాత్ర ధారణంబున యతులరతియోగిలక్షణ లక్షితులగు భవాదృశులును సంసార సంగతులగు మాదృశుల కెల్లం బూజనీయులు- కావున యోగినీవృత్త పరిశీలనంబునకు మేమెంతవారము- అసాధ్వ సాధుతా పరీక్షణంబు పరస్పరంబు మీకయొప్పు.

రా. దేవి సాధుగ వచించితివి - ఇదియ మహాత్ములని సర్గంబు కానిమ్ము- "పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్" అనువచనార్థం బాబాలగోపాల విదితంబకదా.

దేవి. భగవతి యట్లైన నామెయందొక నెపం బొనర్పం దగదని నేనెంచెద- ఎందునుండి యని యందువా విన్నవించెద- "ఆయుఃకర్మచ విత్తంచ విద్యాని ధవమేవచ। పంచైతానివి లిఖ్యంతే గర్భస్థస్యైవదేహినః॥ సుఖస్య దుఃఖస్య నకోపిదాతా పరోదదాతీతి కుబుద్ధిరేషా" ఇత్యాద్యభి యుక్తోక్తులం బరికింప నాయాజంతువులకు

ననుభవకాల వశంబులై సుఖదుఃఖంబు లేతేరనవి పరకృతంబులని చెప్పుటకెట్లుపయో
గమ్మను నర్థోక్తంబునంద.

రా. దేవి కరుణావసతి యీతపయోగిని సలిపిన నవ్యనవ్యవ్యసనంబులు శరీరు
లకు స్వకర్మప్రాప్తంబులగుట దీనికి నేనో నిదానంబులు గామినిది యర్పనీయయనియు
దీనికి శిక్షమోక్షం ణీయంబనియుఁ గాబోలు.

దే. సవినయమ్ముగ - భగవతి నీకు విదితంబుగాని యర్థం బొకండు గలదే.

రా. దేవి సాధుశీలిని యేమమ్మా నీయకార్యంబు - మంచిదియది యటుండ
నిమ్ము - నీయనుయోగంబునకుం బ్రతివచనం బీనలయు - "అహింసా పరమోధర్మః -
ఆత్మవత్సర్వ భూతానియః పశ్యతి సపశ్యతీ" త్యాది మహర్షి తాత్పర్యంబు విమర్శిం
ప నేజంతువునకును హింససేయఁ గూడదనియు సర్వసత్వంబులయందు నాత్మదృష్టి
గలిగియుండవలయునని తోఁచుచున్నది. మఱియు గానాది షట్కంబు సుచిరపర
లోక శర్మ ప్రతిబంధకంబును దాదృశదుర్గతి ప్రాపణ నిపుణంబును నగుటంగదా బ
హిర్విపక్షవై లక్షణ్యంబుగ నంతశ్శత్రు లక్షణంబున గణనీయంబయ్యె - మఱియు నకా
రణ ద్వేషణా కరుణాది గుణంబులు దుర్జనైక శరణంబులనియు విచక్షణులచే వి
వక్షింపంబడు - దీని ప్రవర్తనావిధంబైతే నంతయు మీకు నెల్లంబకదా - దీని వృత్తిము
రోదరాదుల కరణి స్వానర్థైక నిదానంబే కాదు - వ్యాళ్యాది వృత్తుల చాడ్పు నంబరాన
ర్థసంధాన ప్రధానం బగుచున్నది - కావున వానికింబోలె దీనికిని ప్రతిక్రియ దం
డ రూపంబగునది యొనరింపఁ బడెనేని లోకోపకారంబగు - ఇప్పుడీ లోకంబు నంద
లివారు యత్కించిద్వ్యథా జనకంబులగు మత్కుణాది కంబులనే సైఁపనోపరు -
శక్తులగువారు దమకు నికారకారణం బంతకుం దోలుతఁ గాకుండియు నంతంత నగున
ను తలంపున ఘాతుక సత్వంబులు లోచన గోచరంబులయ్యెనేని వీనివలన నెండఱు
పాయంబునొంది యుండురో యింక నెందఱు అందఁగలరోయని ప్రయత్నంబునం జం
పుదురుగాని యేరుపేక్షింతురు - అట్లొనరించినవారిని సాధువులు సైతము శ్లాఘింతు
రు గాని యుపేక్షయైనఁ జేయుదురా - బహుతర భాషణంబుల నేమి. భగవంతుండగు
నవ్వాసుదేవుండును దుష్టనిగ్రహంబునకయ కదా యవతారంబు లెత్తి యధిక ప్రయ
త్నంబునఁ గష్టంబుల కోర్చి కృతకృత్యుండయ్యె మఱియునుం దలఁచుగ లోకోప

కారార్థంబులైన కార్యంబులు నిందనీయంబులై ననర్థోత్పాదకంబులు గామియ కాక మహార్థోత్పాదకంబులు నగు - నూడలేదా లోకములో పశుహింసాది కృత్యంబత్యంత నిషిద్ధంబయ్యును యాగాదులయందు దేవాది ప్రీతికరంబై స్వర్గాదిలోక ప్రాపకంబ గునని యక్కదా శ్రోత్రియులు దానిం గైకొనుదురు - కావున వృజిన వర్తనయగు దీని కి నేనొనరింప నూనిన దండం బొనర్చించి తీరెదను

దేవి. (స్వగతంబుగ) అకటా సవిసవి యకటా- చరణబాధకు నౌషధ సేవం దలచిన నీక్షణంబులు కాణంబులయ్యెనటులుండు నాయర్థ్యమంబు మనంబునకు సంకోచ వికాసాద్య వస్థలు కాలవశంబున శాఖిప్రముఖంబులకుం బతిత పల్లవితత్వాదులం బోలె ననధ్యాహృతంబులయ్యె నేతెంచు నసుటకు నిదియ తద్దయు నిదర్శనంబయ్యె- ఈచండ యోగిని యనాత్మనీనయు దురహమ్మత్య వరుద్ధబుద్ధియు నతి మూర్ఖయు నగుట స్వాపరాధంబు మైకొని ప్రార్థింపదు. ఈ రాజయోగిని యైతే దీనికాపథ పరివర్తనంబు నివర్తింప నుద్యమించుచున్నది. సరేకాని యీకృత్యంబు మన యెదుట జరుగుట భవ్యంబు గాదు. కావున నీమె యనుగుణగణ్య గావున నేతీరు ననైనం బతిమాలి యీమెను నిరుపప్లవం జేసి పంపందగు.

ప్ర. ఓభగవతీ నీకుం బ్రతి లపితంబులు వలుక నేనెంత దాననమ్మా : భవాదృశుల దర్శనాదికంబు మాదృశ విధేయజన ప్రియసంధాయకంబు గావలయుంగదా- నాని కేతనంబునకే యింగితంబునన్నైన నేతెంచి వికలాత్ములై పోవ నైపనోప - ఈమె యుదిత భవదీయ మహిమ గలది యగుటమీఁద నిటువంటి యనుచిత కృత్యంబు లొనరింప నోటువడి యుండు మఱియు మహాత్ములకు నచిర క్రోధంబును నపరాధుల యెడలం గొన్నివారంబులు సహనంబు నిత్యాది గుణంబులు సహజంబులుగదా. - కావున ననుం గరుణించి యీమెను నిరుపప్లవం జేయుము.

రా. దేవి నీవకదా ధర్మశీలవు. ఎప్పుడెటనని యంటివా యపరిమిత ప్రేమ ధామంబును సుగుణైక నిధానంబును నగు నపత్యంబునకుం గీడు వొడమింపం బూనిన చండిపోతులయందు సైతము కనికరంబుకరంబుగ గానుపించు చున్నావు. కావుననో యమ్మా సంసారిణియు వీరపత్నియు మహారాజ మహిషియునగు నీయమలధర్మబోధకం

బులైన వచనంబులు మాకుం గురూపదేశంబులంబోలి సమధిగమ్యంబులై యున్నవి. కావున మేమాయోగినులము వేషధారిణులముగాక ఆశ్రమాచారంబున నిషిద్ధంబుగాని నీవమాకభినంద నీయవు. అని తిరిగి చూచి ఓసీ పరమపతితా దురహమ్మతీ చూచితివే దేవిధర్మంబు నీచేసిన దుర్వృత్తంబులీదేవి యెఱుంగక నున్నదనుకొంటివా ధర్మపరాయణ యనుకొందువుగాని యవిదితయని తలంపకుము. నీచేసిన దుండగంబున కీదేవి యన్నివిధంబుల నీకు ముండనంబు సేయించి మస్తకంబునకు శస్త్రంబుగ సుధాబిందువులం బొడిపించిరాసభ యానంబున నగరంబు నందంతటం ద్రిప్పించి నీచేత వంచితులైన వారందరు నతి కుతూహలంబునం జూడ ఘోషణ సలిపించుచు నగరంబు వెలువడింపదగు గదా- ఐనం జూచితివిగదా నీయందలి కనికరంబు నీవకారణంబుగనకదా యనేకుల విపత్కదంబంబులకు మూలకం దంబవైతివి.

చం. సక్రోధప్రేక్షణంబుగ వదురు వదురు ఇంతకుందతీ యయ్యో- ఇపుడు నిన్నేమనంగలను - తొల్లి మహేంద్రుండు బిసాంతరంబునం దాగియుండలేదా - మహేశ్వరుండును నొక్క యదనున, లింగపొట్టకాయ నడుమ నిమిడియుండెనని కింవదంతి - జగతి విదితంబైయుండలేదా దేహికిం గాలవశంబున నప్పుడప్పుడా యీయవస్థలు సంభవించుట కాశ్చర్యంబా.

రా. సభవారింగని చూచితిరిగదా యీకుంక యింకనైన మంకుతనంబు వీడక పొంకంబుగ బింకంబుల నుంకించుచున్నది. -ఇది మిగుల మాత్సర్యశీల - కావున నిపుడు వీడంబడిన వేటుదప్పిన కాలవ్యాళి వలె నరాళవృత్తింజేయఁగలదు.

దే. సాకూతంబుగ నామోదరేఖ నీక్షించుచున్నది.

ఆమో. భగవతి రాజయోగిని విదితశీలయగు నీదేవి నీకు మాననీయ యయ్యేనేని నీపేయవయ వస్తంభసంబువలన నవిలంబితంబుగఁ దొలంగింపవలయు.

రా. కష్టం బాహాతద్దయు కష్టంబు - దేవి మాకును గురుప్రాయ యని వచించి యుంటేనిగదా - కావునందు దాజ్ఞోల్లఘనంబు సేయందగదని తిరిగి యాపెంగని మనితివి పొమ్ముపొమ్మనుచున్నది.

చం. స్వాయత్తాప ఘనయగుచున్నది.

సభాజనంబు సవిస్మయా। కాంత స్వాంతంబగుచున్నది.

దేవి. సవినయ సంభ్రమంబుగ - భగవతి చండయోగిని నీపీఠంబున నుపవిశింపుము.

చం. ఇది మాకొక సత్కారంబా చాలు చాలు కూర్చుండి నట్లే.

దేవి. భగవతి నీకు నేనేమపకారం బొనరించితి నమ్మా కానీ మాబోటి సంసారు లొనరించునవి యన్నియు నపరాధంబులే - సహింపం గోరెదను - మాయందుఁ గరుణించి తల్లక్షణంబుగఁ దాంబూలంబు గైకొనుము.

చం. మంచిది కాలాంతరంబునం గావచ్చునని గమనోద్యోగ యగుచున్నది.

రా. ఈతులువకు నీదేవిసత్కారం బర్హంబా పోనిండు శాంతంబు పాపంబు. శాంతంబు పాపంబు.

చం. తిరిగి సామర్షంబుగం గనుంగొనుచు - మంచిదని యెల్లకాలం బిట్టదని తలంపకుము.

రా. (సభాజనంబు గని) చూచితిరిగదా దీని దౌర్జన్యంబు. (తిరిగి దానిం గని) ఓసి మొండికట్టే యీతప్పు నీదిగాదే - ఏమంటివా - నీదుర్వృత్త విమర్శనంబు నాకిచటం జేయనలవిగాదు. ఈదేవి లోకసాధారణ యనుకొంటిని గాని యిట్టిదని తెలియనైతిని - నీవిప్పుడు దేవిసంరక్షిత వగుట కేమియుం జేయనేర - కాని యింకనైనం బుద్ధిగలిగి యుండుట లగ్గు - కాకున్న నపస్మృతివై పోదువు సుమీ నిక్కంబ పోపోయనుచున్నది.

చం. మంచిది మంచిదంచు ససంరభంబుగ వెడలుచున్నది - బద్ధాంజలిపుటి యగుచు చేటిక యేతెంచుచున్నది.

చేటిక. ఏలికరాణి గారూ మహారాజుగారు స్వారి వెడలి తిరిగి వేంచేసినారు. కార్తాంతికుండారు గంటలు గొట్టినాఁడని వెడలుచున్నది.

ఆ. అమ్మకు నగ్న్యుపాసనా తత్పరుండగు నాయన సేవింప సమయంబయ్యె.

రా. సాయం సమయ విధేయకార్య నిర్వహణంబునకై మాకును నుటజంబు సేరందగు.

దే. భగవతి రాజయోగిని మదీయ ప్రణామంబుతో నీవీటింగైకొని దీనినన్ని విధంబులం బ్రవృద్ధవగుట నీసభ్యులకుం దాంబూలంబులు దయసేయఁ గోరెదను.

రా. ఆహా యనుగ్రహం బనుగ్రహంబని యట్లొనరించుచున్నది.

దే. నికటవర్తినియగు మంజరిం జూచుచున్నది.

మం. భగవతి మంజరి యభివందనం బొనరించుచున్నది.

రా. దానింబట్టి కురువులం గీలించి సుగంధ తైల సంవాసిత తదీయ చికుర సంక్రాంత సౌరభ సేవనంబున గంధ గ్రహంబునకుం బండువొనరించి చెక్కులం జుంబించి.

క॥ శ్రీతనయోజ్జ్వలు ధర్మ। శ్రీతను జీవనుని విజయు సేవించి వరుఁ। శ్రీత తి సుభద్రి వగుచును। శ్రీతరుణింబోలి సుసుత సేవధివగుమీ॥ ౯౯॥

దే. భగవతి యీసత్వంబు ప్రసన్న భవద పాంగ ప్రసార సుధాసార వర్షంబున నపగత పంకయగుటకుం దలంచి యభ్యర్థించుచున్నది.

రా. దేవి కల్యాణ శీలిని - కార్యాయత్తతఁ జెప్పను సత్యంబు - త్వత్స్నేహార్ద్ర లాభంబ కదాయస్మత్కల్పిత సుకృత జాతఫలంబు.

దే. భగవతి యెంతమాట వచించెదవు. శిష్యజన వాత్సల్యంబున నాశీర్వదింపుము.

రా. కల్యాణి నాయంతరాభి ప్రాయంబది - బాహ్య వ్యవహారంబులయందు నీకాయత్తనే.

దే. అనుగ్రహమ్మను గ్రహమ్మనుచున్నది. అప్పుడందరు స్వకృత్యంబులం దలచుచు స్వావసథంబునకుం జనిరి॥ ఇది ద్వితీయాంకము. శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

# తృతీయాంకము.

అనంతరంబు ప్రవేశించుచున్నారు సుమతియు సంయమియునను తపస్వినులు.

సుమతి॥ సఖి సంయమిని యెన్నిదినంబులకు నాకన్నులకు నీమూర్తిని గర్పూరకళికం జేసితివే.

సంయమిని॥ ప్రియాళి! భవదీక్షణ హారిణ కిరణకిరణంబులం గ్రోల జకోరంబుల ననుకరించియున్న నానయనంబుల కభాగ్య రాహురేఖ యొకటి ప్రత్యూహంబయ్యె.

సు॥ ఏమే ప్రియాళి! సఖిసమ్మాన సార్థంబేగి యిట్లనుచున్నావు

సం॥ అవిమాదృశయగు మందభాగిని కేల లభించు.

సు॥ అదితొల్లి మిగుల గుణవతియనియే వచింతువుకదా.

సం॥ నావచించుట యట్లుండనిమ్ము నిపుణులు పరీక్షింప నిక్కాలంబున నిద్దేశంబున దానిబోలువారు గలరే.

సు॥ నీవు రహారంగంబు వలనం గదా యేతెంచెదవు.

సం॥ ఆనగరంబున కాయభిధానంబు జన్మాంతరీయ ప్రాయంబైయుండె.

సు॥ లోకోత్తర గుణోత్తరులగు నామహారాజ దంపతులు శృంగారవల్లీ పారిజాతుల సేమంబున నుండిరిగదా.

సం॥ ఇదివరకు వారట్లుండవచ్చునని తలచెదను.

సు॥ నీవు వారినింగనలదా.

సం॥ వారు నగరంబున నుండెనేని యీయాత్రంబునకా నగరంబు పాత్రం బగునా.

సు॥ వారు బలవత్సరి పంథినిగృహీతులయ్యెనా.

సం॥ వారికొకరు పరిపంథులుండిననగదా యీమాట.

సు॥ అట్లయిన వారికి నాధ్యాత్మిక తాపంబెయ్యదిగైన నొడగూడెనా.

సం॥ అట్లయిన నిదివరకుం గుశలులని యెట్లువచింతుననుచు బాష్ప దయా కుల నయనయగుచు నత్యుష్ణంబులగు నిశ్వాసంబుల విసర్జించుచున్నది.

సు॥ మంజరి క్షేమవతియకదా.

సం॥ ఆమాట నేచెప్పజాల.

సు॥ సవిషాదంబుగ జయంతుచే నిరియింపబడెనా.

సం॥ అదియునుం దెలియదు.

సు॥ ఆమోదరేఖ యెచ్చటనుండె.

సం॥ అది మంజరి వీడి యుండదుగదా.

సు॥ మంచిది యానగరంబేమి కావలయు.

సం॥ (సగద్గదంబుగ) అతిప్రియత్న సముత్పాటి తాక్షరయగుచు శిఖిశిఖా ఇత్యర్ధోక్తంబున. ప్రద్యోతన ప్రీతికాళ ప్రతాప సంభరిత జగత్పారిజాత వసుమతీ కాంత పరిపాలితంబగునని యదృశ్య భూతంబు తద్వాక్య శేషంబు పూరించుచున్నది. అతిమధురగం భీరస్వనంబున - నిరువురు ముహూర్త మాత్రింబతిని బిడవిస్మయ విష్ట బ్ధ హృదయులగుచున్నారు.

సు॥ సఖీ నీవచన పరిపాటిం గలిగిన యాశ్చర్యాకూపారంబు నొకకూపకంబు సేయుచున్నదే. యీయదృశ్య భూతవచనంబు కానిమ్ము మరియు దీనమనంబునునా కుం బ్రసన్నంబగు నీకెట్లున్నదో.

సం॥ ప్రియాళీ! నాకునట్లగు కానియీయవస్థ ముమూర్షు విజ్ఞానంబగునేమో.

సు॥ ఓతపస్వినీ! నెమ్మదినొందుము. ఇదివరకు విన్నపలుకులకైన నాయభి ప్రాయంబభివర్ణించెద. సావధానంబుగ నాలించి పరిశీలింపుము.

సం॥ సుమతి స్వాన్వితాభిధాన వచింపుము.

సు॥ నీవక్కడకుంజనిన పిమ్మట నేదో యొక యుపద్రవంబున నగరంబునకు హుత వహాహుతత్వంబుపన్యసింపంబూని యిట్టి యమంగళవచనోచ్చారణంబునకైనో రాడకుండ నాయక్షరంబు లెట్టకేలకు బలుకంబడిన నదియ శాపంబగునను తలంపున నాభాగధేయంబు తూర్ణంబుగ నావాక్యంబు పూర్ణంబుసేసె. కావున యట్టిమహా ను భావవే.

సం॥ శివశివ- నేనెంతదాననే యట్లనుటకు- బాధిత బాధనంబు సలిపెదవు గదా.

సు॥ ఓవయస్యా మనమాగంతుక సంగతులమే యట్లనుటకు పోనిమ్ము- నీతా త్పర్యంబు మదుపన్య స్తార్థవిషయంబయ్యెనాలేదా- నీహృదయంబును ప్రసాదంబు నల్పంబయిన నొందెనా లేనా- అదినిక్కంబుగ వచింపుము.

సం॥ అట్లుగనయ్యెనే.

సు॥ సఖీ. మరచితివా యిపుడు "ప్రమాణమంతఃకరణస్య వృత్తయ" య నునభియుక్తోక్తి అందుకుం బరాధర్క్య నిదర్శనంబు నదృశ్య భూతవచనంబ.

సం॥ సఖీ. ప్రకృతివశంబున శోచించుటగాని యవశ్యభావిని మనమేమినే యగలము- అయిన నీయుపశ్రుతి శ్రుతిసంగతంబయి చిత్తంబున నుత్తంభనంబగు చున్నదే.

సు॥ సఖీ యూరడిలూరడిలు వారికి క్షేమంబయగు.

సం॥ "సత్యమస్తు వచనస్తవ" యని పలుమారు యభినందించుచున్నది.

సు॥ సఖీ యిదియంతమాత్రంబు వినుమిక నొక నిదర్శనంబు వచించెద. ఇప్పుడీలగ్నంబున నీయాగ్రహంబు లీయీ విధంబుననుండెంగదా కావున శాస్త్రిం బు వాస్తవంబయ్యెనేని వారలకుంగుశలంబేల గలుగదు చూడుమా.

సం॥ సఖీ నీవువచించిన యర్థంబెల్ల సత్యంబ- అందుక సంశయంబులేదుగా నియక్కడంగలిగిన యుపప్లవంబునకు మనంబు నీరై యిదియంతయని పించుచున్నదే.

సు॥ సఖీ! యదియొకయబ్బురంబా "ప్రేమపశ్యతిభియాన్యపదేపి" యను వాక్యంబభియుక్తోక్తంబుకాదే.

సం॥ సఖీ నీవు వచించిన యర్థంబునంబట్టి నిశ్వాసమోక్షణంబున కవకాశం బుగానుపించుచున్నది.

సు॥ సఖీ చూచితివా యారాజ దంపతుల కుశలంబు దైవంబకామించియు న్నది. కావున నేటికీవిశయంబు.

సం॥ కొంతవట్టుబోధితనైతిని- మంచిది.

సు॥ నీవిచ్చటంజేరినది యాదిగ జరిగిన వృత్తాంతంబంతయు వినగోరెద వచింప వలయు.

సం॥ సఖీ యాకర్ణింపు మిట్టివృత్తాంతంబు మందభాగినై వచింపవలసె. అప్పు డీయుదంత ప్రకారం బంతయు నీకు విదితంబొనరించియకదా యిక్కడ వెడలితిని క్రమప్రయాణంబుల నక్కడంజేరి ప్రియసఖి నామోదరేఖం బొడగంటిని- అదియును నిరుపమసౌహార్దర సంబునందనుప నామహారాజపుత్రియుఁ దొల్లి విదిత పూర్వయుసావ్ చార్యయగు దాని మన్ననల నవలోకించుచున్నదియు సరసాశయుఁనగుట దానికంటె నధిక ప్రేమ విశ్వాస భరంబు నలరించుచుండె - కావున సుఖశ్రీంబుగ నయ్యాకలా పరిసంగంబులం బ్రొద్దుబుచ్చుచుంటిమి - ఇట్లు జరగ నొక్కనాడు కల్యంబున నేను ను నామోదరేఖయు మేల్కని యథాపూర్వంబుగఁబ్రాభాతిక కృత్యంబులు నిర్వ ర్తింపంజేసి వాస ప్రాసాదాంతరంబున నుపవిశించి యథాపూర్వంబుగ నదివరకు మం జరిరామికై హేతు వితర్కంబులు సలుపుచుండ నయ్యెడ దాని చేటిక సపిషాదంబు గనేతెంచి మముంగని.

కం॥ ఇదియేమొ వింతదలపుఁడు। మది మన యమ్మాయి గారు మరచిరి లేవన్।నిదు రతలిమంబు వలననుఁ। నిదురింరాయిగనుపడదు నాకు నెమ్మది తోలఁగఁగ ॥ ౧ ॥

గీ॥ కనులు మూయుఁగొంత కాలంబు వేగంబు। నులికి పడుచులేచి యొక్క తరిని। చేతులలరజాచుఁజెర చెరమీరగ। నూర్పులొనరఁజేయు నుష్ణగతుల ॥ ౨ ॥

ఉ॥ గొబ్బున లేచి పానుపున గూర్చుని విప్పులఁజేసి కన్నులన్। నిబ్బరమొప్ప గాం
ని మరి నెయ్యపు టీకులు నాటిలంగ ద। బ్బిబ్బులు వల్కుచున్ వెసద బేలున బెద్దవ
వుప్పతిల్లగా। నబ్బురమొప్పఁగానబడునయ్యాయె బోర మొగంబు నంటగన్ ॥ 3 ॥

గీ॥ ఇట్టి వెక్కురులురువులై పుట్టుచుండు। గింకయోగాక గాముల మంకుతన
మొ। పిలిచినను జూపునైన నాకలర నిడదు। గాన కర్జంబు తెరువు నివానతిమ్ము ॥ ౪ ॥

ఇట్లు చేటిక మాటలు శ్రుతిపుటంబులం గటూత్తరంబులై పడ నప్పులు నాసఖి
యామోదరేఖ నిసర్గంబున నతి గంభీర హృదయయయ్యు హఠాత్ప్రాప్తమైనాకగో
త్రిపాతంబున నంభోధిస్థలింబోలి విశీర్ణాత్మయగుట ము ర్తమాత్రి సందర్శితా
భ్యంతర వికారయగుచు నిట్లని చింతించె.

చ॥ సరసబిసాంకురంబున కసహ్య మహోగ్రహ వగ్రహంబు। సుందరకదళీ
ద్రుమంబునకు దారుణపాత మహాభిఘాతమున్। సరసిజినీవ నీమణికి శైశిరకాలవి జృం
భణంబునై గురుహృదయాధి సెరెనిది గొంకకనింక విసంకటెట్లగున్ ॥ ౫ ॥

కం॥ ఓయమ్మ యిట్టి కష్టము। లాయమ్ముల బారి మాడ్కి నాయమ్ములనే। గా
యమ్ములిడెడినాకే। నాయమ్మున బ్రితికెదీవు నాటిన నెడలోన్ ॥ ౬ ॥

అనుచు విచేతనయై పుగమింబడె.

సు॥ ఆహా సంయమిని పరంపరా దుఃఖంబు సమదెంచె.

సం॥ సఖి నాయంతరంబు నీకు విదితంబకదా- నీవెట్టైనం దలంపుము - ఆస్వా
దిత మంజరీ గుణగణరసంబగు నాచెతంబట్టి దురుదంతశ్రవణంబున సంతసంబు విదళి
తంబు గాకుండె నంతకంటె వింతయెద్ది.

సు॥ ఔను ప్రేమానుకంపా సంపాదిత మార్దవస్వాంతులగు వారికిట్టి భావం
బు దుర్భావంబే - ఇక్కడున్న నామనంబు పరితపించుచున్నదే - కానిమ్ము - పిమ్మట
నేమయ్యెను.

సం॥ కొంత సేపునకది తెలివొందిన పిమ్మట మేమిరువురము మంజరి నికేతనంబు నకుం బోతిమి - ద్వారపరి సరంబు సేర నలపాలసంబులగు దాని విలాపాలాపంబులు నవ్యక్తంబులై వినుపించె - అప్పుడావయస్య మనమియ్యెడ నీకవాటంబు విఘటితంబు సేసి యీద్వారంబున జేరందగదు- ఇట్టు పరివర్తించి వెళ్లుదమనియె- పిమ్మట నిరవురముం గలసి నిశ్శబ్దంబుగందదీయ శయన నివేశకుడ్య గవాక్షంబాశ్రయించితిమి.

సు॥ తాదాత్వికతదాలాపంబులు వినుటకో.

సం॥ ఔను.

సు॥ ససంభ్రమంబుగ - ఏమి యేమి - అది యేమి వచించెను - మీరేమి విం టిరి। వచింపుము వచింపుము.

సం॥ నితాంత దయనీయాకారయగుచునది యప్పుడిట్లని వచించె.

శా॥ స్వీద్యత్సాధ ఝురీ ధురీణ వచన శ్రీపుత్రతాబోధక। ప్రద్యుమ్నాంక రతిప్రియాద్యరస నిష్పాదిత్వ ముఖ్యంబులౌ। ప్రోద్య ద్ధర్మములం బ్రసూన ధను వై పు ణ్యాత్మతఁ మీరి యాయుద్యోగిఁ శివహర్షదైక శరత స్థాత్మంచు నిర్జింతువా॥౭॥

ఉ॥ అ ర్థుడు మున్ను మున్న విమలాత్మత నెంచి యసాధు సాధుతల్ స్వార్థ మ సంగ్రహించుఁ బిదపన్నెప మెన్నక నెక్కతంబున। న్వర్థముగా దలంచి యన పాయత మన్నన సేయుఁగాని యేగర్హణముఁ దలంపడు జగంబున నిద్దె కదా సుధర్మమా॥ ౮॥

క॥ శివశరధి విధులునొక కార్యవశమ్మున సేకరించి హాలాహల బా। డవశశ ముల విడరుగదానవతాప కళంక సేవనము లయ్యెగదుఁ॥ ౯॥

సీ॥ తొలుత నే బ్రార్థింప దొలగితినంటివా సాధువా శీల విజ్ఞాన మిదియ। పదపడినాకోర్కె పాగతం త్రాదుల నెడసేసితంటివా యది యనృతమె। పరిణయ పణముచే బంధించి తంటివా యట్లుగాకున్న నాకవన మెట్లు। పరిరంభణాదుల వశవు గా వంటివా నా నేరమేయది నానకతము। ఐన ననుమతిచేనను నెలమి మిగుల రతుల వెలయించి రాజసమతుల మెప్ప। నిప్పుడా ప్రేమ విడనాడి యేకజేసి వెడలుటే నీతి

నీకు వివేకివే వ॥ ౧౦॥

సీ॥ ఎక్కడ జూచిన నీవకర్పడుదువు మనమున నీమూర్తి యెనసియుండు శేముషి యెప్పుడు నీమహా వ్యాపార గుణపరిశీలన గోచరమగు। నినుజూడ వేడుక నేత్రముల్ వ్రాలవు నిన్నంటి లేవ నేనిపుణగాను। ఏమియు రుచిగాదు హితము సే సెదవేని నీకర్పగించుదు నికను మేను। చెప్పదలంచిన మాటలు సెదరిపోవు నాయక స్థను దెలుపనానాడు మనము నీకడకు వచ్చియుండును నిజము సుమ్ము రమ్ము రతులిమ్ము నన్నెనిపొమ్ము లెమ్ము॥ ౧౧॥

క॥ బాధిత బాధనమిటులే వైధము వధసేసెదోకు వైరి విధమునన్। సాధనము నిన్నుజేరగ నాథుడవై యట్లుసేయు నాహిత మొప్పన్॥ ౧౨॥

గీ॥ నన్నుగడు వేడి గారామునన్వరించి।మించిన రతుల లాలించి సంచితాశుడ వయి వంచింపబూనితి నవయజేయంగితవ యిటుసేయ నీకేమి కీర్తి కలుగు॥ ౧౩॥

గీ॥ ఆత్మదానంబు సేయునీ వర్హుడవని। తలంచుచుండంగ నిపుడు దుర్లలితవృత్తి। సుభగతాంజన మిడినాడు చూడ్కులందు దొంగిలించెద విటువంటి దురిత మేల॥ ౧౪॥

గీ॥ స్వాపహరణంబు మిగుల దోషమ్మనియెదు। మాట దెలియదా మతినేను మానమలర। నాత్మనిడగోరి యున్న నునకటదాని। కమృతోక్తులు దగునె మోహంబు సేయ॥ ౧౫॥

క॥ అవిదిత రతియగుననునను।భవ విషయ తదీయ శర్మ బాటించి హ్రుతా। న్య విషయ జేసిటు వగలను।నవధీరణ సేయదగునె యంతర్వ్రాతతన్॥ ౧౬॥

క॥ పరపురుషుతో వచింపగ। వెరవెఱుంగని ననిర్గంస విజిత వ్రీడన్। స్వరసికతజేసి మతిరతి। పరవశ నొనరించి విడుట పరధర్మమొకో॥ ౧౭॥

ఉ॥ మానగు నీదురూప మహిమా హృతచేల్పన యైతినైననా। నేను స్వతంత్రగానిదియు నీతిహితార్థము గాదు కావున। న్మానుమటంచు బెక్కులగు మారులు సెప్పిన నల్లి బిల్లిగా। జానగునట్లు పల్కి వివశాత్మను జేయుట నాయమేకదా॥ ౧౮॥

క॥ నీమనముబోలె తనువును। వేమరు జపలాత్మమగుచు విలసిల్లెడునే। ప్రేమించి చూడగనుపడు। గామించి గ్రహింపబోవ గడుమాయఘుగుణ్॥ ౧౯॥

సుమతి॥ ఓసీ! వయస్యా యీయర్థంబు బోధించెడు వాక్యంబులు పల్కెనా? యీపద్యంబులనే చదివెనా?

సం॥ ఓయాళీ! బాగుగ నడిగితివి- నిక్కంబ చెప్పెద. అది పచించిన వర్ణ్ణానపూర్వియే యీపద్యంబులు. ఏతచ్ఛ్రవణ కౌతుకంబుచేతనే యయ్యెడ మాటువడి యుంటిమి.

సు॥ ఓసివయస్యా- యీమంజరి యెంతకవయిత్రియే- మఱియును దాని ఖేదంబు ప్రత్యక్షంబుగఁ జూచుచుండియు నేకవార శ్రవణంబున హృదయంబున ధారణంబెట్లు చేసితివే.

సం॥ తాదృశ దశావారాశి మగ్నయగునది రచింప మేమిరువురమే ఏకతానత నుత్సాహంబు సలిపి ధారణంబుసేయుట యిది యొక గొప్పతనంబనుచున్నావా?

సు॥ దాని రూపగుణంబులే యాశ్చర్య ధుర్యంబు లనుకొంటిని- వైదుష్యంబంతకంటె నాకంటికి నిస్సంకటంబుగ విశంకటంబై కానంబడుచున్నది - యిట్టి బాలకట్టి కష్టంబీ దిష్టంబున డిష్టంబు రుష్టంబైన నష్టంబు చేయందలఁచి పుష్టంబు బొవరించునే?

సం॥ యీకృచ్ఛ్రంబు తుచ్ఛంబుగా నవిచ్ఛాయతం బొంద గర్జంబులేదు శర్మమయ ప్రియ సంగమంబున నిది సువిధేయ ప్రతి క్రియయ.

సు॥ అవును సత్యమే - సంరూఢ యౌవనయగు నీ సరసాత్మ స్వప్నంబున స్వసదృశనాయకుని తోడఁ గూడి క్రీడించెగాఁబోలు - అదివరకు నవను భూతతాదిక రతి రీతి సంస్కార సంవాసిత స్వాంతయగుట నీదృశ వికారంబు నొందెడు.

సం॥ కాక మరియేమి.

సు॥ మంచిది- యిదిగాక యింకొక యంగద గలిగెనని యందువా.

సం॥ మరేమని దలచుచున్నావు.

సు॥ సవిషాదంబుగ! ఆహా! యెంత యాభీలము - అవిదిత ఖేదాది ధర్మంబుల దీనికినిదియు మహావ్యసనంబని తలంచుచుంటిని - ఇంతకంటె నధికంబగు నింకొకవంత చింతగ నేతెంచెనా.

సం॥ దానికే కాదా! యీమంద భాగ్య జీవనంబు గర్హించుచున్నది.

సు॥ అది యేది.

సం॥ బహుజన ప్రాయోపవేశ దీక్షావిధాయకంబగు నాచెలుల యదర్శనంబే.

సు॥ సవిమర్శంబుగ అందుకే గాఁబోలు నట్టి కల్యాణవాణి నభంబున శ్రవణ శరణంబయ్యె - ధైర్యంబు సవీర్యం బొనరింపుము.

సం॥ సఖీ యద్దియ నాప్రాణంబుల నాత్మతో బంధించు చున్నది - కాకున్న నీపాటికే యావృత్తాంత స్మరణంబున నాయసువులు విశరణంబులుగాకుండునా?

సు॥ సఖీ యదియ సూనృతంబు - కావున విషాదంబు వీడి యనంతరోదంతంబు శృతి సంగతం బొనరింపుము.

సం॥ సరే! దివ్యవచనంబిట్లు రోచనంబయ్యెంగదా వీరలకతంబున ముమూర్షువులగు సహస్ర సంఖ్యేయ జనంబులలో నొక్కండైన శుభంయువు గాఁగూడదను నిర్బంధం బున్నదా - అన్ని విధంబుల నాయందరకు మంగళంబసంగతంబు గావలయు - ఆలింపుము - పిమ్మట నాయామోదరేఖ దాసి యవస్థంగని యవ్యవహితంబుగ నీచే నుదితంబైన యుదంతంబ మూలంబని చింతించి నాకేలువట్టికొని యప్పటిదారంబు దరికిం జని యాకవాటంబు విఘటిత పక్షంబు సేయ నిరువుర మంతరంబునం బ్రవేశించితిమి.

సు॥ చెలియా - మీరిరువురు దనచెంతం జేర నామంజరి సంజాత ప్రబోధయై మంజుల వర్తనం బొనరించెనే.

సం॥ లేదే యప్పుడనుత్తాన శాయినియై యున్నదాసంగని యామోదరేఖ రెం

డుమూడు సారులు క్రమ గంభీర స్వరంబునఁ బిలువ నప్పటికిం దెలివివీడి యుండిన గరతలంబున గొట్టె - అంతట నదియు నులికిపడిలేచి యతి యత్నంబున జూడ్కుల నిగుడించి మముం దెలుసుకొనె - అంతట నా మోదరేఖ దానింగని ఏమే! చెలియా! యిప్పుడొక జాము ప్రొద్దెక్కె ఇంకను లేవలేకపోతివి - అననది ఓచెలియా! యెందునుండియో కాని నామనం బిపుడు మిగుల వికలంబై యున్నది. కావున గొంచెము సేపు నాతప్పు సైరింపుమని ననుం జూచుచు నాశయ్యం గూర్చుండుడని సూచించి వెండియు నామృదుల పరిధాన వసనంబున నిండుగ ముసుంగు వెట్టుకొని పవ్వళించె.

సు॥ చెలియా యిదియట్లొనరించుట యంతకుం దొలుత నుల్లంబు మల్లడి నొందినదిగాన దానింబొందు పలుచుటకు (గాబోలునే యట్లొనరించె.

సం॥ చెలియా యామోదరేఖయు నట్లు వితర్కించి నాతోడం గూడ ననదు దవ్వు గనుండు తళిమంబునం గూర్చుండి యట్లు విషాదంబునం జింతించె :—

మ॥ చెలి యీబాలిక బాహులాంతర తమీ సేవం బ్రపూర్ణాత్మ యుత్పలి నీ సుందరి రేఖవోలె మిగులం భాసిల్లు నట్టైన నా। ఖల రాహుస్మృతి దోపదానివలెనే కాలుష్య వీతాభయై యలతి శ్రీబోడ సూపునిప్పుడు గడుస్నా హాగితం బెద్దియో॥ ౨౦॥

చ॥ కనదురు తారుణీభరవికాసి మనోహర గాత్రపాత్ర యీ। వనరుహ నేత్ర చైత్ర కృతపల్లవ పుష్పమనోజ్ఞ మూర్తియై। తనరెడి వల్లి వ్రాలె మహితా కృతి నొప్పునవీనకాద్రవీ। తనయవిషానిలాహతి నితాంతము తాంతగు దానిబోలెడిన్ ॥ ౨౧॥

క॥ ఇది యిట్టగుటకు నెద్ది యొ। మదిదలపగ నొక్కకతము మరియమరదగున్। అది పరికింపగ జవ్వన। ముదిరమగుట చేత బోడము మోదపు కతమే॥ ౨౨॥

ఆ॥ మిగుల గోల యగుచు మెలగన యిది యిప్పు డిట్టి మరుని వగల నెలమి దొలగి। యిట్టులుంట దల్లి యీక్షించి నటులైన। నేమి దలచు నొక్కొయెదను గదిరి॥ ౨౩॥

క॥ ఇది పరువపు చిన్నెల సిరి మదిదెలియగ లేక చేల మనసున దెవులం।

బొదవిన చెట్టుకతంబని।యదురుగ దీనవ్వగాంచి యలరునలజడిగ॥ ౨౪॥

గీ॥ దీని చేలతవంబెవ్వ దిరిగి చను ను। పాయమడి యాలములనియ బయ లు వడగ। బమను వీడి యెరుగు నొ యిది మరిమగని। కూటువల కుల్ల మెప్పుడు గూ ర్చునొక్కొ॥ ౨౫॥

క॥ అనుచుం బెక్కు తెఱంగుల। దనరెడి తలపోయుటలను దలకొని యపుడు। న్వనరుచు నుండెడి యాతలి। గనుగొన వినదవ్వునయ్యెగద చేని వెతల్॥ ౨౬॥

చ॥ సుకృత సమార్జనైకమతి సూరిజనస్తవనీయ వృత్తితీ। ప్రకర ఖరప్రతాప విని వారిత దుర్వహగర్వ శాత్రవ ప్రకరుఁడు నాట నీమహీవరాగ్రణి వారణ శీపురీ మ త। ల్లిక కిపుడేగ వేడ్క భువిలేక కుటుంబ సమాజయుక్తుడై॥ ౨౭॥

ఉ॥ ఆయన దేవి ధర్మమహితాశయకోక వధూపమేయ సం। స్థాయదమే య భక్తి భరభాసుర గాననమూని ప్రేమతో। నాయమదృశ్య జీవిత మయాత్మకుఁడౌ పతితోడ నేఁగు బౌనాయమ కానిదిని నిటనాటిగ మించుట యక్కజంబగుణ॥ ౨౮॥

క॥ బందుగు లెందఱునున్నను।సుందరులకు రమణుతోడ నూచించుటయుణ। న్మందము గాకుండుట నీ। యందపు పతితోడ నేఁగు టచ్చెరువగునే॥ ౨౯॥

క॥ రవణము లన్నిటిలోపల। యువతులకు నిజేశభక్తి యొప్పగు సుమ్మా। దివి దారలు వేలుండినఁ గువలయపతివీడి। ఉయి గొమరొప్పునొకో॥ ౩౦॥

ఇద్ది యాశ్చర్యంబు.

క॥ తనకంటె నేనుదీనిని। మనుపగ నొసపరినియనుచు మతిమతిదలచే। మన మున నాచేతని డెను। జనువున నాదేవి యెట్టిచందపు మనసో॥ ౩౧॥

ఇదియిప్పుడిట్టి కష్టంబు లనుభవించుటకే కాఁబోలు.

గీ॥ నేను నీతోడ వచ్చెద నెలమి మీఱునమ్మనాయనలనుగూడి యలరుచునన। నది వినక యిక్కడే యుండుమనుచు నన్ను। వీఁక చేసుంచెగాని రావెడలదయ్యె॥ ౩౨॥

క॥ నాయన చెంగటనుండిన నాయమచేఁ దెలుపఁబడ రాగ్రణి నొకని, న్నాయమమర రావించి యాప్రాయము సఫలంబుసేయఁ బోధగదా॥ 33॥

గీ॥ ఇపుడు నేనేమిసేయగనొప్పుదు నిది। మరుని వేడికి మల మాడుచుండు। నెంతసేపని కతలచే నీసడింతు దీనివేదన కటాకటా దీననైతి॥

జగంబున జంతు సంతానంబునకు నెద్దియైన నొకవింత వింతగ సంబయ్యేనేని వానిస్వాంతంబు నితాంతంబునంతంబు నొందించు - ఆయాధియు బ్రహ్మ ధన స్పంధానితం బయ్యేనేని నతిబంధుర ధీరతా ధురంధరులైనను సందుశ్రిత చేత. విగతమతులగు చున్నారుగదా॥ అదియెట్లంటే॥

గీ॥ తత్వ విద్యల నెల్లను జదివి చదివి। యనుభవంబునఁ గూటువలను నితాంత తుచ్ఛ సుఖకారులని యెంచి యచ్ఛమతిని విడువ లేరయ్య యోయెంత వింత బుధులు॥ 34॥

మ॥ అతి దర్పోద్భట దుష్టఘోటక పటుప్రారంభ సంరంభ సంహతిరంహః క్రమ వక్ర విక్రమహృషీకౌఘ ప్రతిష్టంభన। తత్క్షతిలా భాశ విశీర్ణ పర్ణగిళ నాకీర్ణ వ్రతుల్సద్యతుల్ధృతి కష్టాప్త వృషంబుతో మడయ నాకృష్టుల్గదా కాముచేన్॥ 36॥

సీ॥ సహజచలంబైన స్వాంతంబు బంధింప సూత్రంబుకాయోగ సూత్రముల ను। జదివిత దర్థంబు చతురతఁదెలిసియు నట్లు వర్తించియు నాప్తతతికి। నిరతంబు గరపుచు నేర్పరులైనట్టి నియమ ధనులకైన నిల్పరాని। దైయుండు వనయంబు నాధైర్య మటుగానఁ గూటువతమి మదిఁ గొరలెనేని। మిగుల ఖేలగు నీబాల మెలకువమరఁ। జవిగొనవని కూటువుల హాయి చనువుగాన। నెట్టిమది దిట్టసేయునో యెఱుగరాదు। తగు వెరవు నెద్దియో నాకు దలపరాదు॥ 37॥

సీ॥ విమల కలాపూర్ణ కమనీయ హృదయేందు మండలీమ్లానితమః ప్రభూతి। శ్లాఘ్యసంకల్ప పుష్పామోద సంభృతధీ వల్లరికి దావతీవ్రసక్తి। ఘనతరమూల వికాస మహోత్సాహ భూరుహ వ్రతతికిఁ బుప్పిపురుగు। సంపూర్ణసార నిర్ఝర వేగవిష్టంభ పరిపాటి కనఘంబు పాటువేళ। యతికఠోర మహాధైర్య హాటకాశ్మ సంద్రవీకర ణోజ్వల జ్వాలవహ్ని। యగుచు నెటువంటి మగటిమి నంటువారిసేగి వంతలు వింతలు

సేయకున్నె॥ ౩౭॥

క॥ మ వలె (వెలుగుగుములను)(బ్రొద్దు వెలుగుల।రూపు( మిటారములగను ల వృద్ధతకర । జూపుల( బటలము పోలిక। రూపణచు వెతల్వ?మోద రోహముల హహా॥ 3

నిబహుభంగుల నా మోదరేఖ చింతించుచుండ నామంజరి యుల్లంబు ప పేసికొనియు నతివిరళ విదిత బాహ్యాభ్యంతర గ్లానియగుచు నచటం గూ ది
ంి.

సు॥ పిమ్మట ( బిమ్మట.

సం॥ అంత నామోదరేఖ దానింగని యతివిక్లబాత్మ యగుచు నేమే చెలియా యిట్లుంటివన నదియు సనిశ్వాసంబుగ నభినవం బుగనపూర్వం బగు సంజ్వరంబు। నిరర్గళంబై యాత్మ బొడమె నిపుడు సవిస్తరంబుగ దానిం జెప్ప నేరననియె - అంత ట నదియు వితర్కిత తదభిప్రాయ యగుట నపుడు పెక్కులం బలుకక హితంబుగం భుజింపుచుండు మౌషధంబునకు జతనంబు సేసెదననియె - పిమ్మటం గమలా కదళీ విశేష ఫలాదులును శర్కరామిళిత పానీయంబు లాదిగాగల పదార్థంబులు నాహా రంబు లిడుచు సార తరఘనసార బహుళపటీర పంకాలేపంబున నతి సరసబిస శకల కల్పిత గ్రైవేయాది భూషణంబుల నభినవ పల్లవ శయన నిషేవణంబుల నానాడును మఱునాడునుం గడపెంగాని దానికి స్వాస్థ్యంబు బొక్కింతయు నొడల గూడదయ్యె (సాప్రనిశ్వాసంబుగ) అంతవారికిం బ్రిలయకల్పంబగు నొక వాసరంబు ప్రాప్తం బయ్యె - అవ్వాసరంబునను యథాపూర్వంబుగం బ్రాభాతిక కృత్యంబు లొనరించి యథారుచి విరచితాభ్యవహారులమై కొంతతడి తొల్లింటి యట్ల నానాచాటు కథల నొనరింపుచుండినను దాని మనంబునకు వినోదంబు గాదయ్యె - అంతం గాలయాప నోపాయంబు సేయంబూనియుపవన విలోకనంబునకుం బైనంబు సలిపి ముప్పూర మందుం బ్రవేశించితిమి - అంత నిరుపమ నయనోత్సవ బహువిధ వర్ణ భాసుర కిస లయకుసుమ ఫలభర మనోహర తరుల తాకుంజ పుంజంబులును - తటరుహ నిబిడ విటపివిట సాటంక మంద మంద సంస్పందమాన గంధవహాకంపిత కమలాంతరగళ ద్రేణుకణగణ పింజర మంజులాంబు విహరమాణ సారస ప్రముఖ వివిధవాసిత ముఖర

ప్రాంత దీర్ఘికా విభూషితంబులును। సముచితాహార లాభ ప్రమత్త శుకపికశారికాది కూజిత వాచాలత త్ద్వివయంబులును - భూయిష్ఠదిష్ట వర్ణనీయ సౌభాగ్య భరితంబులునగు నుద్యాన విషయంబులం గనుచు మంజరికిం జూపుచు వానివాని వర్ణింపుమని యుత్సాహంబు నెచ్చించుచు దాని కల్పనా కౌశలంబునకు సమ్మదించుచు నచ్చటచ్చట సంచరించుచు నొక్కెడ సకపట మృత్యు ప్రాయంబగు నొక్క హరిణంబు గంటిమి.

చ॥ నయన మరీచి వీచికల నల్లని దింటెన పూలసోనల న్వియదవనీవలగ్నము న వింతలఁజేయుచు ద్రష్టృవీక్షణ। ప్రియజరఠత్తమాల దలపేశల పర్వదపర్వ భాసురోదయన విషాణ విద్యుతి విధమ్ములఁ గ్రుమ్మరుచున్న దానినిన్॥ ౮౦॥

కం॥ స్వనిరీక్షణముల యువతుల కనిశమ పత్రపనుజేయ నడరు ఖురముల న్మనుకులఁ బరిసరధరణులఁ గనదహిరిపు రత్నమయత గడునిడుదానిన్॥ ౮౧ ॥

కం॥ వియదవధి నరయఁగోరియొరయమునఁ బవమాన వాజిరహినోడింపన్। నియతినెమృగధర మృగ పరిచయముఁ గోశళ్వదుదిత సత్ప్లుతిదానిన్ ॥ ౮౨॥

మ॥ అతిచిత్రోత్ప్లవన ప్రిపాతవిధిచే నాకాశమున్భ్రష్టలి। న్నత కోట్యగ్రి నిశాతశృంగ శశశశ్వద్స్పర్శ ణప్రిక్రియ। న్వితతోత్సాహమున న్వెలుంగుమ విన్భిన్నంబులంజేయ నాతతతర్షంబున మించుదానిఁగడు నుద్యచ్చార సంరంభమున్ ॥౮౩॥

సు. సఖీ దీనివలన నేమి వారు మోసపోయిరి - అయ్యయ్యో వారి పాలికిది రెండవ మారీచుని మృగావతారంబయ్యెఁగాబోలు నే - కట కటా.

సం॥ చెలియా యదియే యిది యేమోనని తలచెదనే.

సు॥ చెలియా యది యిది గాదే - ఆమారీచుండతినీమండై నను రామ భూమి కాంతర్విత్తాత్మయగు నామధునిషూదనునిచే నిహతుండై యప్పుడముక్తుండయ్యెఁ గదా.

సం॥ వయస్యా నీవచనంబు సరేకాని తొలుత నరసింహమూర్తిచే నిహతులగు హిరణ్యకశిపు ప్రముఖులు వెండియు రావణాది జన్మంబుల నొందలేదా.

సు॥ మంచిది యది యట్లుండనిమ్ము - పిమ్మట నేమయ్యెనే.

సం॥ పిమ్మట నామంజరి దానింగని సముదిత కుతూహల పిహిత పురాతన మనోవేదన యగుచు నత్యాదరంబునంగనుచుండె - అయ్యెడ మేమును దీనికింగొంతవట్టు చిత్త విశ్రాంతి గలిగెనని సంతసిలితిమి గాని యిట్టి యాత్రిం బేతెంచునని యించుకంతైన నెఱుంగకుంటిమి

సు. పిమ్మట నేమయ్యె.

సం. అంత నామాయలమారి జింకయుఁ బోలకంబుగఁ గురంగట విచిత్రాచారంబులం జరియించుచు డాయంజేరుచు నతి విస్రంభంబు విజృంభింప నుత్కంఠంబై యకుంఠ విభ్రమంబులలర నవలోకించుచు మెలఁగుచుండ మంజరి దానింగని యిది పోషిత మృగంబుగాని యరణ్యంబునవలన స్వయూథభ్రష్టంబై చనుదెంచినది గాదని యెంచి మించిన వేడుకంబట్ట నుద్యోగించె - ఆమోదరేఖయు దీనికిన్ని దినంబులకు మనోవినోదనవ్యాసంగంబు బవిసి యిచ్చంబోసంగెనని యంతరంగంబున సంతసిల్లుచు నోసి వయస్యా యిది నీహృదయంబునకు సుందరంబై గనబట్టె నేని దీనింబట్టుకొని మన యింటం గట్టిగఁ గట్టివేయుదమే యనిన నదియునుం దద్దయు సంతోషించె. అంతట నాయిరువురు నేనును వెంటవంట దానింబట్టంగమకించి కొంత యుసదు దాని తోడంగూడి పరువులిడి నెట్టెట్టో దానింబట్టుకొనిరి - పిమ్మట నాశాంబరీ కురంగంబును నమ్మిక కిమ్మగునట్టుల బెదరు వదలి పెంపుడు దానింబోలె పెంపులసొంపుల వెలయించుచుండె - అంత వారు నవారియగు నెలమి దానిలోబడుటం గొనియాడుచు నొక్కొక్క కేల దాని శృంగంబు పట్టుకొని పెరకేల విశ్వాసోదయంబుకై దాని వీపు నిమురుచుం దదీయ లాభహర్ష విషయంబులగు భాషణంబుల పలుకుచుండ నాకుహనా కురంగంబు ప్రచండ గండ భేరుండంబు కుంజాల బాలికంబోలి యొసపట్టిన వారింగోష్ఠులం గీలించికొని దివ్వక్కున తన యుక్కు మిక్కుటంబై గన్పట్ట నెట్టన మింటికి నెగసె - అప్పుడామోదరేఖ మంజరితోడ నోచెలియా యిప్పుడు మనకుంగడుఁ గడగండ్లోడమె నటులుండె గాన దాని కొమ్ము గట్టిగంబట్టుకొని యుండుమని వచించె- ఇంతమాత్రంబు వినిపించుటవరకు నాకురంగం బతిదూరంబుగ నంబరంబున కెగసె-నని వారలండలచి హారనియాక్రందించుచున్నది.

సు. కొంతతడవు విస్మయ విషాదంబుల నిష్పందమాన పక్ష్మయగుచుఁబదంపడి

డెందంబు కుదిలంబొనరించికొని సఖియునురులం గసరుకొనకు - సమయవశంబునం బొడము నిష్టానిష్టంబులనుభవింప నేరికిందీరు - అని ముహూర్తమాత్రంబు సింతించి యోచెలియా దీనిం దలంప నావామ నయనంబదురుచున్నదే - మనంబును విమలంబగుచున్నది కాని యావిలంపడదు అప్పుడట్టు జరుగుటంబట్టి నేనిప్పుడిట్టు వచించుటైతే తెంపరితనంబే - కాని యాయానిదానంబుల వారికి నెట్టి సేమంబ కలిగియుండునని నిక్కంబుగం దోచుచున్నది.

సం. సుమతి నివచనంబు నైనన్నను నొక్క దేవుండుండునా - మేమందఱము మందభాగ్యుల మే యయితిమి.

సు. సఖి యట్లు వచింపందగదు మీరందఱుం బురాకృత సుకృత జనితాదృష్ట వశంబునం బ్రమోద మందిర హృదయులరకాంగలరు- మంచిది యది యటుండనిమ్ము - పిమ్మట నిచ్చట వారెవరేమి జరిగించిరి.

సం. ఇట్లు జరుగ సమీప వర్తనులైన కర్మకరులు హాహా రవంబులు సెలంగనా ఘోరంబు గనుంగొని కరంబు గోరగింత గోడులిడుచు నారాజమాతకుం దెలిపిరి - పదంపడి యామె వారలదైన యంగదకెట్లు విషాదంబు నొందవచ్చునో యట్లు వగచి తాపంబునంబడి ప్రాణంబులు వీడెదనని యట్లొనరింపబోవ నచ్చటి రాజపురుషులేతెంచి వారి జాడ నిక్కంబుగం దెలియక నిట్లొనరింపందగదు - కావునం గొంత తడి దాలు కొనిన మేమంతటం బరికించి వారి జాడం బొడగని క్షేమంబు తెంచెదమని విశ్వాస జనక వచనంబులం జెప్పిరి-అంతట నారాజమాత మంచిది మీరిట్లు వచింపుచుంటిరి గదా - నేనిప్పుడీ జతనంబునం దొలంగెద - ఈదినంబు దినకరవాసరంబుగదా - అవ్యవహిత భావియగు నీవాసరంబున నీవేళకు వారలందొడ్కొని వచ్చినను లేదా వారల సేమంబు దెలిసివచ్చినను సరే - కానినాడు నాయీయొడలు హవ్యాశికశనంబు సేసెద . అట్లొనరింపకున్న భర్తృఘాతినీలోకంబునకు జనియెదనని శపథంబు వెట్టుకొనె - అంతటం బురజనంబులతోడ వారును నోమహారాజపత్నీ వీరమాతా మేమట్లొనరింపమేని నీసేవనంబునకెట్లు నెయ్యంబున నొడంబడియుంటిమి యట్ల లోకాంతరంబునను సేవింపంగలవారమె - అట్లు గాకున్న మాకెల్ల నింతకు లోగడ నిర్మించిన ఘోర నరకంబుల పర్యాప్తంబులగుగాక యని దిరంబుగు ప్రతిన పూనిరి.

సు. అకటా యకటా యెంతకష్టంబుప్పతిల్లెనే.

సం. సకియా మఱేమనుకొంటివే - నేను వారిం గలయఁ గృతనిశ్చయనై యాబాల్య ప్రేయసివగు నినుంజూడ నేతెంచితిని.

సు. చెలియా యట్టోడఁ గూడ నేనని నేనిన్విడిచియుందుననుకొందువా-అట్లుగాకున్న వారల శపనమే నాశపథంబనుచు నతి దూరంబునం బురోదేశంబున దృష్టిఁ బ్రసరింపం జేయుచున్నది - అయ్యెడ నొకతుక కాపాలిక భిక్షార్థినియై యేతెంచుచున్నది.

గీ॥ జఘన సంవరణీకృత చారుచిత్ర। కాయ కృత్తి యుదివ్యయోగాంజనాభి। క్లృప్త తిలకాంచ దళికయుం గీర్ణదీర్ఘ। మేచక కచాళికృత జటామిళిత పార్ష్ణి ॥ ౪౪॥

ఆ॥ విమలశల్య శకల విహిత సద్గ్రైవేయ। పాణిలగ్న గురుకపాలపాత్రి। యమల భూతికలిత యగుట నుచ్ఛ్రితగుచ్ఛ। కలిత కల్పశాఖ కల్పరూప॥ ౪౫॥

శా॥ స్వీయాలోక మరీచి వీచికల నాశీతద్యుతిద్యోతన స్ఫాయన్నీలకువాల జాల విలసద్భాగం దివింజేయుచుం। ఛాయోదార విరాజమాన ముఖసంజాతాంబుజాత భ్రమవ్యాయామాగత చంచరీకముల నిర్వ్యాపించు చున్నాసికన్॥ ౪౬॥

చ॥ అతిసితభూతి క్లృప్త ని[illegible]ానువిలేపన యాటనంత రాతతపరి శుద్ధసత్త్వ మహిత ప్రభయుం దిమిడుండలేక బా। హ్యాతలము దేహమూల పరమాణుగణాంతర వీధుల న్వెనిర్గతయయి యొప్పెనస్థలపు రాజిలఁ జేయు మనోజ్ఞమూర్తియై॥ ౪౭॥

సు. ఓచెలియా యెదుటం జూడుము - ఇది యొక మహాయోగిని యని నా మనంబు మిగుల సంతసిల్లుచున్నది.

సం. సకియా నాచేతంబును నీచిత్తంబు ననుకరించు చున్నదే.

సు. ఇట్టియోగినులలోఁ గొందఱు పరోక్షంబులగు భూతభావివర్తమాన కాలికోదంతంబులు దమ ప్రజ్ఞామహిమ వలనఁ దెలుపుదురని పెద్దలు వినిచెదరు - మన జిజ్ఞాసా విషయోదంతంబుదలఁప శుభ నిదానంబులుగానుపించుచున్నవి - కావున మన మీయర్థంబు నీమహాభాగవలనఁ దెలియందగు.

సం: ఓవయస్యా నీవచనంబు సత్యంబుగావుత యని వచించుచుండ భవతిభిక్షాం దేహియనుచు నా కాపాలిక ప్రవేశించుచున్నది.

సం. సంభ్రమ సంవృతవిషాదంబుగ లేచి ఓభగవతీ మా యాయుశ్శేషంబునకుం ఫలంబుగదా నీకిదునాతిథ్యంబు సుఖంబుగ నీయాస్తరణంబున నుపవిశింపుము- కాపాలిక యట్లొనరించుచున్నది. సుమతి సంయమినులు సాదరంబుగం దొలుతం బాద్యంబిడి పదంపడి మధురతర ఫలమూలమృణాళఖండాది వన్యాశనంబుల సమర్పించుచున్నారు.

కా. తదుప పాదితాహారాభ్యవహారాతి సంతృప్తాత్మ యగుచు ఓతపస్వినులారా భవద్దత్తంబగు నాహారంబు నాచేతంబునకు మిగుల సుఖవిహారంబుల నొసంగుచున్నది.

ఇరువురును సాంజలి బంధంబుగ భగవతి యతిపావులమగు మాజన్మంబునకుం బురాకృత దుష్కృత సంతానంబు పరిమితంబయ్యెనేని నీసందర్శనంబు సాధుతా జనకంబగునని తలంచెదము - మఱియు నాసన్న వినాశలమగు మాకైనమరణ వేదన భవదవలోక నామృత ఝురీ సేవనంబున మనుష్య సులభంబై నస్వరానందంబై యయస్సు రసవిశేషసంగంబున సువర్ణంబగునట్లు నతిలవణంబగు లవణోదశంబరంబు ముకిరోదర సంవాసంబున మధురతాధురం ధరంబగునట్లుం బరిణమించుచున్నది.

కా. ఇరువుర సవిమర్శంబుగ నవలోకించి ఓతపస్వినులారా యిట్లేల వచించెదరు - మీకు నింకం బెక్కు జీవితకాలంబు గలదు - మీలక్షణంబులం బరికింప సుకృతి చిహ్నంబులయ కానంబడు - కావున నిట్లేల మిగుల నిర్వేదంబు నొందెదరు - ఇరువురు భగవతి భవాదృశులకు నఖిలవేద్యవస్తు జాతంబునుం గరతల కలిత- మహాఫల కల్పంబై యుండ నేక-విషయంబగు మామనోవ్యధానిదానంబు జిజ్ఞాసావివక్షా విషయంబయ్యెనేనిఁ దెలియనిది యెంతమాత్రంబు.

కా. అటయ్యెనేని పరికించి వచియించెదనని జటాంతర నిగూఢంబగు కరండికం దీసి యందలి సిద్ధాంజనంబున ధ్యానపూర్వకంబుగ కనుంగవంగై సేసి ముహూర్త మాత్రంబు ధ్యానాధీన యగుచు సాద్భుతానంద సముత్సేషంబుగ ఓతపస్వినులారా

మహాశ్చర్య ధుర్యంబగు వ్యసనంబు పస్థితంబయ్యెఁగదా - ఐనను భవత్సౌహార్ద్ర పాత్రంబగు కన్యకాద్వయంబునకుం గుశలంబ ఇరువురు సవిస్మయ కందళ దానందథువుగ నొండొరుల నవలోకించుచున్నారు.

కా. ఓచెలులారా మదుదితంబు భవజ్జిజ్ఞాసి తార్థాను మతంబకదా.

ఇరువురు సోల్లాసంబుగ - భగవతి యీవ్యసనంబు మహదాశ్చర్య ధుర్యంబని యానతిచ్చితివి - అది యెట్టిదో నిభజింపఁగోరెదము.

కా. కియదవసరంబు కల్పితదివాత నత్వంబులగు నాత్మీయ నయన కువలయంబులకు రాకాంతరీ యత్వంబు సంధించి సస్మితంబుగ - ధీరు సత్వధురీణంబగు నాహారిణంబు సలలిత దృష్టి పాతమాత్ర విహితస్వపరీ భావంబగు నాతరుణీ ద్వయంబుతన విషాణంబులం జేపట్టదానితోడఁగూడ మింటికెగయుటకంటె నొండెయ్యది యబ్బరంబు ఇరువురు స్వవిజ్ఞేయార్థ లాభ ప్రమోద సూచకంబుగ నన్యోన్యం బవలోకించుచున్నారు.

కా. ఓచెలులాలా మీరు విలక్షభావం బభినయించుచున్నారు మామకీన వచనంబులు సూనృతతానికేతనంబులు గాలేదా (ఇరువురు సవినయభయోదయంబుగ ఓభగవతీభవాదృశుల యుదితంబులు శ్రుతి సంగతంబులగుటనకదా శ్రుతి సంగతంబులగు భవన్మహిమాతిశయంబునకేమి విస్మయ నివసనుల మైతిమి.

కా. మదీయ వ్యాహారంబులు భావత్క భావనిగూఢార్థ నిదర్శనంబులయ్యెఁగదా.

(ఇరువురు సప్రమోదాతిశయంబుగ భగవతి భవద్భాషితంబులాస్మాకీన జీవనలగ్నకంబులని- మిగుల సంతసిల్లుచున్నాము)

కా. నావలనఁ దెలియంగల యర్థంబులెల్లను పర్యాప్తంబులయ్యెనా.

ఇర్వురు- ప్రాంజలి బంధంబుగ - భగవతి కరుణగుంటిదేని విజ్ఞాపనీయంబొకండు గలదు.

కా. సపరిహాసంబుగ మిమ్ములం జెలులనుకొంటిని గదా మీకేల సంశయం బు - సవిస్రంభంబుగం బ్రష్టవ్యాంశంబులన్నియు ననుయోగింపుము తగిన యర్థంబు లం బ్రకటించెద

ఇ. భగవతియనుగ్రహార్ణవంబతి వేలంబు మాదృశకృపణ జనంబులందతివేలం బు అస్మజ్జీవన నిదానంబగు సఖీభావు కోదంత సుహాను భవంబున నిరాధులమైతిమి అట్లయినను "శ్రేయసి కేనతృప్యతే" యనునయంబవలంబించిన వారము గావున వల సినంతమట్టుకు నాశాత్యాగంబు గోరువారమయ్యెను నీయెడ నస్మన్మానసంబు లమితా శాపర్యటన జంఘాలంబులయ్యె । అక్కతంబున నాకురంగంబెట్టిదో దానిచే నాచెలి కత్తియ లెల్లెచ్చటికింజేర్పంబడిరో యిప్పుడెయ్యెడ నెట్లుండిరో మున్దేమిగాఁగలరో యావృత్తాంతంబంతయు సంతతంబుగం గరుణించియానతి యిడఁగోరెదము

కా. మీయభిలాషంబెట్టో యట్లయగుఁగాక యనికొంత సేపుధ్యానాధీనమన స్కయగుచుఁగన్నులు విచ్చి తేరిపారంగని సంయమినుద్దేశించి ఓ చెలియా మృగంబు వారలం దనకొమ్ముల నంటించికొని మింటికెగయుటఁగురంగట నీకంటనీవకంటివికదా.

సు. సఖిసంయమిని చూచితివే భగవతి మాహాత్మ్యంబు.

సం. సఖి "కిం న సాధ్యం మహాత్మనా, మనునార్య భాషితంబు వితథంబే మ ఱియు" యద్దుష్కరం, యద్దురాపం యద్దుర్గం యచ్చదుస్తరం। తత్సర్వం తపసాసా ధ్యం తపో హి దురతిక్రమ" యనియభియుక్త జనోక్తి ముక్తాఫలంబు మాడ్కి నతివి మలంబై తేజరిల్లదా.

సు. సఖి భవద్వచనంబునూనంబ యీయుక్తి లేతావదవసరంబు శాబ్దత్వంబు నంబ్రమాణంబని యెఱింగితిమిగాని యివ్విధంబునం బ్రత్యక్షత్వంబునం బ్రమాణం బగుటఁ గానమయితిమిగదా అద్దియిపుడు గంటిమి.

కా. చెలులారా యేరికియుం బూర్వపూర్వంబులగు ననుయోగంబుల నుత్త ర యాథార్థ్యజ్ఞానంబులుత్తరోత్తరంబులగు ప్రతి వచనంబుల విశ్వాస జనకంబులగుఁ గావున మదుకంబెద్దియైన ననసభూతంబయ్యెనేని నావంక శంకవిడనాడిమగుడ నడుగందగు.

ఇ. భగవతి భవాదృశులగు పుణ్యమూర్తుల భాషితంబులొకప్పుడేని వంధ్యంబులగునని మనంబుననైనఁ దలంపలేము.

కా. దైవదత్తంబగు జ్ఞానంబున వచించెద। అదియును మదీయ ధ్యానానుసారంబుగం బ్రస్ఫురింపఁగలదు సావధానత నాలింపుడు.

ఇ. భగవతి మహాప్రసాదంబని కరపల్లవంబులు ముకుళించికొని తదీయ వదన నళినాధీన నయన వ్యాపార మనుకర ప్రకరులగుచున్నారు.

కా. ఆహరింపఁబెట్టిదని కదా తొలుత ననుయోగించుచున్నారు. అనినిష్పందనిరీక్షణంబొనరించి ఓచెలులారా యది యలోక సాధారణంబు. విశేషంబేమఁటిరా వినుండు. తొల్లియొక తపస్విని మాత్సర్యాత్మ విద్యావైచక్షణ్యంబున వీరల నోడింతునని తగువారిముందఱం బ్రతిననూని వీరలకడకేతెంచి తానవానిశిష్యచేతం బరాభూతయై యచ్చటి వారిలోవగునొక్క తపస్వినిచే మిగుల నీసడింపంబడియె. అదిదద్దయు దుర్వృత్త చిత్తయగుటఁ దనతపో మాయాబలంబున నొక్క దారుణ గీర్వాణ విద్వేషణు రావించి యీకన్యకాద్వయంబు వంచించి యతిదవీయంబగు నొక యంతరీ పాంతంబునంబడ వ్రేయుమని నియమింప వాఁడును శాంబరీ హరింపబై యేతెంచి యట్లొనరించె.

ఇ. సోరస్తాడనంబుగ హాహామహా పాతకిని మానుషవేష నిహ్నుత దుష్క్రవ్యాద ప్రకృతి చండయోగిని యిదియంతయు నీదుష్కృత విలసనంబే మాపాలికిద్వాదశాష్టమజన్మస్థులగు భూచ్ఛాయాతనయ తరణి ధిషణులయ్యెకాత్త్యంబ వైతివి. ఓసి తులువా యిట్టి దురితార్జనంబకే నీతపోయోగంబునకు ఫలంబు. అనియాక్రోశించుచున్నారు

కా. ఓచెలులారా శివింపుఁడు దైవంబుశరణంబుగల వారలకెట్టి దురాత్ములైన నొక్కింతయు నేగి నేయ నేరరు.

ఇ. భగవతి వీరట్టి వారైన నిట్టియాపద నొందుటనుం బట్టుగుదురా

కా. అట్టు వచింపవద్దు. ఇదియును శ్రేయో నిదానంబు.

ఇ. ప్రమద మదోద్రేకంబున "సత్యమస్తు వచస్తవ" యని పలుమారు పచించి భగవతి సిద్ధ సాధనంబగు మావచనంబు సైరింపుమనుచున్నారు.

కా. మంచిది మరేమడుగుచున్నారు.

ఇ. భగవతి యల్ప మహిమగల కుజనులు సాధువృత్తుల నేమియుం జేయనేరరుగదా.

కా. వారుదురభిమానంబు వహించి యిహపరంబులకు దవ్వగుటంగాక యొండెద్ది యొనరింపంగలరు.

ఇ. భగవతి యిట్టి దురాత్ములకుం బరంబు మాటయటుండనిమ్ము జనులందఱు వీరివలన భయంపడెదరు వారుగావున నిహంబునకు దూరంబగుట యెట్టుసంధిల్లు.

కా. చెలులారా "అత్యుత్కటైః పుణ్యపాపైరిహైవఫలమాప్యతే" యనునభియుక్త వచనంబు మీరెఱుంగరా.

ఇ. భగవతి వినియుంటిమిసరే. ఇట్టిదుష్ట మహిమగల దీనికిని గొండొక కీడు వాటిల్లునా.

కా. ఇది యనగ నెంత.

ఇ. భగవతి యట్లయిన లోకంబులకు నిరుపద్రవంబవికలశార్దూలంబగు నరణ్యంబున హరిణగణంబులకుం బోలెవిలసిల్లుంగదా.

కా. భవదుక్తంబు సత్యంబ.

ఇ. భగవతి దీనికెట్టి చెట్టవాటిల్లునో వినఁగౌతుకంబగుచున్నది.

కా. అసదుతతీ పరికించి సవిశ్వాసంబుగ దీనికి నిహంబునంజెట్టగాఁ గలదిలేదను నర్థోక్తంబున.

ఇ. భగవతి దీని దుష్కృతంబిహంబున ఫలించుటకుం బర్యాప్తంబుగాదో.

కా. కాదంటినా.

ఇ. ఇది యేమిటి.

కా. వినదట.

ఇ. సాద్భుత ప్రమోదంబుగ భగవతి యదియెట్టు నీవు సూన్మృతోదితవు గావు న నాయుదితంబు వినుటకు మావీనులు మిగులం దమకంబు నొందెడు.

కా. ఇంతకుమున్న సభలో వాదావసానంబున నొక్కతెచేత మిగుల నీతపస్విని యీాసడింపంబడెనని వచించితివిగదా. అయ్యెడ -నాసభ్యురాలా దురితాత్మం గని యింక నేరికైన నెగ్గొనరించితివేని యపస్మృతివైపోదువని శపించె. దానివలన నా మాయా హరిణాకృష్టంబగు నీసఖీద్వయంబుతోడన దాని స్మృతియు మింటికెగసె. అదియు నపస్మృతియై సకల దుఃఖభాగినియయ్యె.

ఇ. విస్మయోల్లోలితప్రమోదసుధార్ణవంబునందుమునింగియెట్టకేలకున్మజ్జనంబు లొనరించి భగవతియాప్తానాప్త జనకల్యాణవ్యసనజ ప్రహర్షంబు నతిశయించుచున్నది గదా భవన్మహిమాను భవసంభవ సంతోషంబు.

కా. అదియెట్లు.

ఇ- ఆరణ్య సంచార శీలవైనను మహారాజ శుద్ధాంత సంవృత్తవార్తలసైతము దృగాలీఢంబులం బోలె వచించుచున్నావు. అనిసాపత్రిపలుగుచు భగవతి మాయయ్య వివేకంబు సైరింపుము. సకలలోక వర్తమానంబులు త్రైకాల్య గోచరంబులు. ప్రత్యక్ష విషయంబులంబోలెఁ గాంచెడువారికి మదధిలంఘున జంఘాలుండగు నాజగత్ప్రాణ తనూభవునకుఁ గుల్యాతరణంబు వాతినిదియేమి ప్రాశస్త్యవస్త్యంబు.

కా. మంచిది యిద్దియు మీకు నిదర్శనంబకదా.

ఇ. భగవతి త్వదుక్తంబు సర్వంబు సత్యంబనియకదాకరణత్రియంబున విశ్వసించుచున్నాము.

కా. సంతోషంబే ఇంకనాచెలికత్తియ లెట్లెచ్చటికింజేర్పఁబడిరో చెప్పవలయుగదా. వినుడు ఆశాంబరీకురంగంబు దమతోడ నుప్పరంబున కెగయుడుఁ బెద్దకన్నియ దానినలోక సాధారణ హరిణంబని తలంచినిజతపోమహిమంబున దహింప నా

ద్యోగింప నట్లొనరింప వలువదని యశరీరవాక్యొ కటి మింటవినఁబడె. పిమ్మట నదియే మియ్యఁజేయ నేరక తనచెలిని దానికొమ్మగట్టిగంబట్టుకొను మని వచించి యిట్లు విల పించుచునట్లుసనియె॥ ద్విపద॥ ఎవ్వరైనఁ బుణ్యాత్ములిలనుండిరేని-నవనవ సుకృతముల్న యమొప్ప జెంద । నెలకొను కోరికల్నెయ్యమ్ము మీఱ। దలతురు మదిలోన ధర్మ తత్పర తఁ। గలనులఁగలసి పగఱనీసడింప । వెలయు బంటుతనంబు వింతనొప్పెదురు । దీనుల మనుపంగఁదివురునుల్లములఁ । మానైనవాఁడు కల్మిహానిగైకొందు)ఁ। దేవుఁడిచ్చిన శక్తి దేజ రిలుచుండ । కావుమను జనులఁ గావకనుండ । నేతెంచు పాపంబు లిట్టిట్టి వనుచు । వాతఁజెప్పఁటకయి వలను గావనుచు । తెలిసికొందురు వారిఁదీరిగావంగ । గలిగెడి ధర్మం బు గడు నెక్కుడనుచు। దానని హపరముల్దవిలి యెల్లెడల । జానగు హాయుల సమకూర్చ ననుచు । నెద నెంతురనిశంబు నింతయ కాక । నుదలిప్తులగు దుష్టమతుల వధింపఁ। బొ డమిన యశములఁ బుడమి నెల్లెడలఁగడుఁబడయంగను గామింతురెలమి।అట్టి వారికి మేము నడరు మొ)క్కులిడి। గట్టిగ మాయవంగదలఁదెల్పెదము। చిత్తగింపుడు మీరు సేమంబు సేయ । నత్తమిల్లని యాత్మ నాదరముంచి । సాహసీలురకెల్ల సంస్తవనీయ । మాధురీమహిత సంభాషణ నిపుణ।విమలాన్వయోద్భవ వివిధకలాజ్ఞ । సుమబాణలక్ష్మికి సోదరియనఁగ । వెలయు పుణ్యాకారవితతశుభలక్ష్మి। కలిత యౌవనజన్మ కన్యాలలామ। యైన యీ బాలిక యాంతరంబైన । మానస వేదన నురలింపఁదలచి । యుద్యానవనము న నుత్సాంతమీర । హృద్యాగములఁ జూపు హేలతో నుండ । నకట యెవ్వడొ కాని యసురాధముండు । మకురుమాయలమారి మారీచసముఁడు । మాయాకురంగమై మాచెం తఁజేరి । యాయావిలాసములతివినోదముగ । నెచ్చిచరించుచు నిచ్చల బెంచి । మచ్చి కలలంప నుగువలమనుట। నతిమూఢమతులమై యది పెంపుడిదని । మితిమీఱు వేఁడుక మేమప్డుదాని । కొమ్ములగీలించి కలుకుచుండంగ । నిమ్ముగనింగికి నెగసి పఱతెంచె। తొల్లిభూపుత్రి)నిఁ దు ×వఁ తేఁడు ।బల్లిదుండునునైన పక్తికంధరుని। బాతిమమ్మిప్పుడీ పలలాశనుండు । నీతియొకింతయు నేరకదుష్ట వర్తనుండగుచును వడిఁగొనిపోవు । గర్తంబులో మమ్ముఁగలుపుఁగాబోలు । కొమ్మలు విడినను గుంభినిఁగూలి।యెమ్ములెల్ల విరిగి యిపుడ చచ్చెదము । కావున్న మమువీఁడు గడగేమి సేయు । నోహత్సితుని వీని నోడింపరాదు । గడుగాయతనమున గడిదేరినట్టి ॥ గడుదిట్టయగు పంక్తి గళునకువీడు। జతయఘచుండును జగతినాహాంటె । వితతబలుండు రవికుల ప్రదీపుఁ । డగురాముఁ బోలునఘుఁడెవ్వఁడేని । మిగిలియుండినవాఁడుమిక్కుటంబైన । తనబలంబున వీనిఁద

గఁబరిమార్చి । వనజాక్షి దీని నావసువాత్మజాత । వలెఁగరగ్రహణంబువారక చేసి లలిత సుఖంబులలర మనవలయు । ననుచు శారికవోలెనతినిష్ఠురముగ । మను నాసవీడియ మతిమతిమీఱి । వాపోవుచును మూర్ఛపంచిత చెలికి । దాపోపశమనంబు దరిగానలేక । కడగండ్లఁ గడలిలోఁగలసి గడునలసి । వెడలంగనప్పుడు వియదంతరమున । గాఁవశమున నాకాలికంబైన । కాలాంబుద మొకటి కమనీయమగుచు । శీతలజలకణాసేకంబుసేయ । నాతతమూర్ఛచే నాబాలయపుడు । పరిముక్తగయై పరిపరివిధంబులను । బరగు నెలుంగుతోఁ బలుమాఱు నేడ్చె ॥

అనుచుఁ జిత్రింబునం జిత్ర కల్పిత (తిమఁబోలె ము ర్త మాత్రంబు మిన్నక యుంచున్నది.

సం. సఖి సుమతి యీభగవతి యింతవరకును ననర్గళంబుగ వచింపుచు నిపుడేమొకాని సందేహ సంధిగ్ధాత్మయగుచు విస్మయంబున నిశ్చలాంగియగుచున్నది. అయ్యెడ వారికి నెయ్యదియైన యపాయంబువొడమదుగదా.

సు. సఖి యూరక యపాయ చింతనంబేల బేలతనంబునం జేసెదవు. మనకు నడుమ నడుమ నిట్టి వితర్కంబులు గలుగు నేమోయనికదా తొలుత వారి కుశలోదంతంబానతిచ్చె.

సం. సఖి నీవచనంబు సత్యంబ అకాండ తూష్ణీ భావంబునంబట్టి యిట్టు వితర్కించెద.

సు. ఇక నేమి విశేషంబులు భగవతికి ధ్యాన గోచరంబులగుచున్నవో యంతియకాక వేరొకండుండఁ నోపదు. అంతంగాపాలికసస్మిత వికాసాననంబుగ ఆహా దైవ మహిమ అన్నా వీరి భాగ్యంబు.

ఇ. సాశ్చర్యప్రమోదంబుగ భగవతి వింతగ నేదోయొక విశేషంబు యోగవిషయంబయ్యెనని మాకుసంబధ్యాహరించుచున్నది మేమాలకింపందగినదేని దాని వినగనతి కుతుక పల్లవిత చేతస్కులమను చుంటిమి.

కా. సంప్రసన్న విలోకనంబుగ చెలియలారా? ఈ నాయుద్యమంబు కిమర్థకంబు భవచ్ఛ్రవణ విషయీకరణ ఫలంబేకదా.

ఇ. భగవతి యటులైన భవుకకల్ప వల్లియగు నీయనుకంపంగృతార్థులమే.

కా. మంచిది యది యట్లుండనిండని సంయమినింగాంచి ఓచెలియా యా యిరువురలో రాజపుత్రియగు నొకతెకు నిట్లు వెలువడుటకుం దొలుత నీషద్వ్యవహితంబగు నొకయామినీచరమయామ భాగంబున నొక్కటగు స్వప్నంబయ్యెందుగదా.

సం. సాశ్చర్య ప్రమోదంబుగ భగవతి యది యిట్టి స్వప్నంబయ్యెనని నాకుం దెలుపలేదు.

కా. నీవచనంబు నిక్కంబ అట్లయిన దానియొక్క స్వాప్నికవికారంబు పరదినంబున నీకవగతంబయ్యెనా లేదా.

సం. సవిస్మయాతిశయంబునం జూచుచున్నది.

సు. సఖీ యద్భుతాబ్ధిలో దేలుచుండి తత్కల్లోల సంఖ్యానంబు సేయ బూన నవధిగల్గునా కావున భగవతి సోత్తరంజేయుము.

సం. భగవతి కొంత వితర్కితంబ.

కా. అవునది యేమని వితర్కితంబయ్యె.

సం. సభయ సంభ్రమంబుగ భగవతి స్వప్నంబున నొకపురుషుని తోడంగలిసినది.

కా. ఇద్ది నిజంబేకదా.

సం. భగవతి యాసమయంబున నేనుం దాని చెలియును దాని దశంగని యెన్నుకొంటిమి.

కా. అమ్మహానుభావుండె కదా యెయ్యెడల వీరలకు రక్షకుండు.

ఇ. సంశ్లిష్యదాశ్చర్య సమ్మదంబుగ భగవతికి నాపురుషుండు మహానుభావపదవాచ్యుండయ్యెనా

కా. అవును ముమ్మాటికగును అందు విచికిత్సకత్యావధంబంటె.

ఇ. భగవతి వాని కులశీలాదికంబు లాలింప వీనులు మిగుల నర్థులగుచున్నవి

కా. అట్లయిన గొంతవట్టు వచించెద నాలింపుడు.

సీ॥ స్మరహరువలె సర్వ మంగళాంకిత దేహుండమల భూత్యుజ్జ్వలుండధిక వృష్టి। భుజగేంద్రు వలె బహు భోగసక్తాచలాత్ముడు బలి సద్మైక భూషణుండు। పరమేష్ఠి వలె ముఖ పద్మ నృత్యద్వాణి సత్య లోకావన సాధు చరితు। డమృతో దధివలె పద్మాశ్రిత స్వాంత రాసక్తాచ్యుతుడగాధ సత్వశాలి 7 యుత్తమ క్షత్ర సంభవుడు రుతరపరితాప దీపిత సుజన పాప చరిత। తిమిర సంవృతి సుచరిత దివ్యమహిమ। హిమకరోజ్వల కీర్తి యా హేలిమూర్తి ॥ ౪౫॥

ఇ. సానందంబుగ భగవతి యారాజకుమార పరమేశ్వరుం డయ్యవసరంబున నెయ్యెడనుండె. వీరల నెట్లు కాపాడె నుడువంగోరెదము.

కా. సాశ్చర్యంబుగ అతండవ్వేళలోగడ దీనితో నను భుక్త సంయోగ సౌఖ్యుండు గావున దీనికంటెం దద్దయుంగళిత ధైర్యుండయ్యు నుత్తమ క్షత్రి ప్రభవుం డగుట నతి ప్రయత్నంబున నంతస్సంస్తంభిత కామవికారుండగుచు నసహాయుండై యాఖేటకపటంబున నశ్వారూఢుండై యరణ్యంబునకు న్వెడల వీరల భాగ్యవశంబున నాతురంగమంబతి కురంగ తురంగ వేగంబై కాంతారంబునం గడు దూరంబరిగె. అంత నాతండసమశర శరప్రహార జర్ఘరితాంతరుండు నవశమహాశ్వ పారిపితాయ తదేశుంమును గావున నతి ప్రయత్నంబున గొంత తడికి నావాహంబు నతిమనోహరి తరుపరిక రభాసురంబగు నొక్క సరోవర తీరంబున నిలిపి పీతపానీయుండై దాని యుంద్రావించి యొక్కండగు వృక్షమూలంబునం గట్టి మంద మందప్రస్పందమాన గంధవహసంపాతిత గంధగ్రహ విషయి పీయూషాయమాణ సౌరభ్య సంభరితంబులు నతి ప్రౌఢంబులు వితస్తిమాత్ర మిళితంబులు నగు కుసుమ విసరంబుల సంవృతంబగు నొక్కతీర పరిసరంబున శయనించి, స్వప్నాను భూత తదీయలాలితీ తరుణిమరతిలక్షిత విలసితంబులం దలంచుచు మీరిన నుత్కంఠగుంఠితధైర్యుండును సమ్ముగ్ధ హృదయుండు నునై యుండ నయ్యెడ వారలట్లరచుచు నరుగుమండిరి.

చ॥ నృపవరుడిట్టి వారి మెుర నిష్ఠురథాంగ వధూవిలాపమై। నృపరవశోక్తి

శో|| త్రికుహరాంతరముంజని యాత్మతచ్ఛు చా । వ్యపగత జాగరూకత దయాది గుణంబుల శేపసంభ్రమీ స్వపచయమొప్పదీర సరసాశయుడైదివిజూచెనంతటన్ ||౫౦||

గీ|| భంగరాహిత్య సంకటా పన్నులనుట గద్గదికదూలుగళములు కరుణ నతఁ । కినినటింపింపుచున్న వారిని గనియెను । జింకకొమ్ముల వెన్నంటి చిక్కు-వారి || ౫౧ ||

క|| పిమ్మట నారాకొమరుడు । సొమ్మసిలగ డెందమపుడు। చోద్యోద్భూతిం। దిమ్మనయగు బీరంబున। గ్రుమ్మరుమది నిట్లుదలఁచెఁ గోవిదతలరన్ || ౫౨ ||

గీ|| కొండొకండగు రక్కసి కూట వృత్తి గాని సాధారణంబిది గాదు తలప, గోలఁగొట్టక యుండగఁ గూలదవని। నట్టొనర్చిన వీరికే చెట్ట యగునొ || ౫౩ ||

క| వెన్నంటి దీని నుండిరి। కన్నియ లిరువురును వన్నె గలుషముఁ గాగన్| సన్నపు గోలలఁ గడుపున। జెన్నుగ వ్రేయనగుఁ దాన శిథిల బలంబౌ|| ౫౪ ||

క| అటులైన బుడమి దిగఁబడు। నటు మీదట వలయు కర్జ మరయగఁ దగున । న్నటుయిటులని తలపక వెసనటమట వెరవరిని వీని నణగింపదగున్ || ౫౫ ||

అని ధీరుండై నెమ్మనంబునన్నరికించి

గీ| చెంత నున్నట్టి సింగాణిఁ చేత బూని।ద్రోనలఁగోలలఁగలుకుల దూసిదాని కడుపు నిండంగ వేసెనా కడిది మగఁడు। నదియుఁ బలుకాలి మెఃము దొరగుచు నొప్పె || ౫౬ ||

ఇ. సపరిమోదంబుగ ఓసీ ఘాపిష్ఠ మృగమా నీపని యియ్యేనా కూలితివా నేలను. పడితివిగాని మాచెలులకు మోసంబు వాటిల్ల లేదుగదా. ఓచెలులారా మీక ష్టంబులు నష్టంబులై సంతృప్త సుఖులైతిరిగదా యని తద్దయు హర్షించుచు న్నారు.

కా. ఓసఖులారా యిల్లలుకగానే పండుగైనదనుకొంటిరా. ఇదియవారలంద ఱకని వార్యధైర్యత్యాగ సమయంబు.

ఇ. సవిషాదంబుగ భగవతి యది యెట్లు.

కా. బెగడు వడక యాలింపుడు. ఆస్పృష్ట శల్యంబు గర్భంబునందంతట నిశిత శర శల్యనిఖాతంబగుచు నాకూటహరిణంబు.

సీ. ఆగుల్ఫలంబమా నాసిాఘోరాకారధూమలచ్ఛాయాది భీమజటుండు నర్థని ష్ఠ్యూత మహాహాద్రినీఖండ దారుణా భోగ్రదగ్రదశనముఖుడు। సితశల్య భిత్త సంధి త భీషణ కపాల తరళకగ్రైవేయ భరితవక్షు। డగుట కహ్వాశ్రేణి కాజస్ర సంవృత ప్రాభాకరీ ఝరీ భ్రమకరుండు। నిబిడ నీలగ్రీవ నిష్ఠురోరస్థలీ స్థగిత స్వగోచరా శాముఖుండు। బంధుర విగళన్మదాంధ సింధుర కరగంధ వంధ్యాకృతి ఘనకరుండు। వీక్షాసముద్గీర్ణ విస్ఫులింగార్భటీ పటుఘోర తారకా బద్ధ దృష్టి। యతినిశితాశితా యసశలాకోదగ్ర మసృణోదిత శ్మశ్రుమహిత ముఖుడు। ఘనజఘనాబద్ధ ఘణ ఘణాం శబ్దన ఘన ఘంటి కావళీ ఘటితతరళను। డఖిలజనుష్మద్ధృదఖి దారణ పటిష్ఠదారుణ భ్రమణవిధాచణుండు। నిష్పతద్భిదురధ్వని కఠోర నిస్సరదట్టహాస ధ్వానకుట్టి మాస్యు। డాత్తపక్షచ్ఛేతృ తాపరాధవిరోధి మధనోత్పతత్కృష్ణ మహి భృదాభు। డతికఠోర కుఠార మహాశరాస। శరధి పరిఘాఘన ప్రాస చంద్రహాస। ముసలశూకు సూలేరి ముఖ్య వివిధ। భీషణాయుధ నివహవిభూషకరుడు ॥౫౭॥

అగు నతి దారుణాసురా కారంబునం బరిణతంబయ్యె.

ఇ. సాత్యా హితక్రాంత స్వాంతంబుగ భగవతి యాబాలికలప్పుడెట్లుమనిరి.

కా. సప్రసాదము- సుఖంబుగ మనిరి.

ఇ. సానందంబుగ భగవతి యని యెట్లు సంఘటిల్లె.

కా. వినుండు.

మ॥ మును వాండ్రెందన కొండ్రదేః జేసికొన నుద్భూతేహుండౌటంగదు న్వీన యం బమిడలియు న్వెలుంగ మదిలో వియ్యంపు భావంబునన్గనియాబాలికలార మీరు వగకుం గాకుండు దేనియ్యెడం గనుపింతున్నటు శక్తి శిమ్మటను మీకామంబు పూరించెదఁ ॥౫౮॥

ఉ। నాదగు వింత శక్తి నలినాయతలోచన లారగంటిరే। నాదెసమక్కువన్న

నసునం జరియింపుడు జంతు వీఁడివి । స్నాదపు చందమొప్ప నిక నాకవధూజన మాన సాధ్బుతా। పాదక శర్మ జాతముల పొలుగ మిమ్మొనరింతు నమ్మడీ ॥౧౯॥

క। నేనిట్టి రక్కసుండని మానసమున బెగడు విడుదుమహితాత్ములరా । మీన యమునకుందనరిన । వానిగ నెన్నుదుగు నన్న వారితముదచేఁ ॥ ౨౦ ॥

మ। కను నీచుండగు వీఁడు మిమ్మును గొనంగాబోలు నన్నాజిలోవడి నోడిం చెడినో జనుండునిపుడే వానిన్మహా హేతులన్। మృడపత్త్రంబులఁ గూల్చి కాల్చి విలసన్మీనాంక రూపుండనై । విడనాయాసమ మర్త్య మాన్య వసతి న్వేవుచ్చెదన్నే చ్చెదన్ ॥ ౨౧ ॥

క। అనుచును దన మాయాబలమున నాయసపేటికపుడు ముగ్ధాకారం । బను వుగరచించి యందున వనజాస్యలవారినుంచె వైభవమలరన్ ॥ ౨౨ ॥

ఇ. భగవతి యయ్యంతరంబున నిరువురంతరంబున నేమంతనంపు వృత్తినున్న వారు,

కా. అప్పుడా భర్తృదారిక యేమియు నెఱుంగక విక్లబత నొందియుండె. తత్సఖియైతేపౌనఃపున్యంబునందా దాత్వికశుభనిదానంబుల ననవధీరితధైర్యయై యె ట్లో యీయాధి విధాయకంబు వృథా సంభవంబగుననియు నిట్టి యవస్థయందు భవ్యం బునవ్యోదయంబై యవ్యాహత ప్రభావంబగుననియుఁ జింతించుచుండె.

ఇ. భగవతి పదంపడి యేమయ్యె.

కా. అప్పుడాకండల తిండిపోతు సంవర్త సమయ నిర్నిద్ర మహారుద్ర రౌ ద్రాకారుండగుచు నారాజకుమార రమా కుమారుంగని యిట్లనియె.

గీ। తొల్లి వఁ బోయెదు పీడలఁ దొడరి పిలుచు । జేరికైనను గీడొనరించునది యుఁ । బ్రికట మైయుండ నంబర పథికునన్నుఁ గతము లేకయ కొట్టితి కాయ మెగ్గొ ॥ ౨౩ ॥

క॥ తరుణుండవు సుకుమారివి చిర సమయము బ్రతుకఁ గలవు సిరిసంపదలన్ కరుణయ పదమందిడి నీవరయక యిపుడేల కోరెదన్య జగంబున్ ॥ ౨౪॥

క॥ నయరూప మరయ నాత్మోదయము పరగ్లాని దీనిఁ దలపక యవిపర్యయ వృత్తినుండు వానికి నయఫలమెటులబ్బు దుర్మదాంధాత్మునకున్ ౬౫॥

గీ॥ తనకు నెరవేర్ప రానివై తనరు కర్జముల దురభిమాన మూనిన మూలఁబడును। గాన నీవిపుడు తొలగుము కాకయుంటి । వేని నీయంగ బిసముల నెలమిఁ దిందు ॥౬౬॥

గీ॥ మూఢమృగమాత్రుఁదలచిన స్నోహబుద్ధిఁ జంప నేసితివంపఱసొంపు మీఱ । దీనవధ్యుడవయ్యు నజ్ఞాన మాగమునకు మార్జకమగుటచేఁ బొడవితిపుడు ॥౬౭॥

కం॥ కదనమునన న్నెదుర్కొన । మదమునఁగడఁగి దవరేని మనుజాధమ సం మదమయ్యె నీవిటులగుట । మదకరిహరిఁ గొట్టఁబూనిమలయుట గాదే ॥ ౬౮ ॥

ఇ. సవిషాదంబుగ భగవతి యాదురాత్ముండిట్లు సమదగర్వాటోపంబునం బలుక నాక్షత్రియ సుత్రాముండెట్లు వానిసోత్తరుంజేసె.

కా. అతండును వాని పరుషభాషణంబులాలించి తైలధారాభిషంగంబునంబోలి ప్రజ్వలించుచున్నదైనను క్రోధోపష్టబ్ధంబు ధీరోదాత్తుండు గావున సంస్తంభించి నయమధురంబుగ వానికిట్లని పచించె.

చ। అబలల సత్కులోదితల నర్హగుణోజ్వలలైన కన్యలం । బ్రిబలమదంబు నిట్లు గొనిరానుచితంబె నృశంస వృత్తినీ । దు బవిసి యింకఁ బొంకమరి దూలును గావున వీరివీరి చోట బయలడించి మించిన మిటారపు హోయులనుల్లసిల్లుమీ ॥ ౬౯ ॥

శా। రాజన్వంతము సుమ్మి యీవిషయ మింద్రాదిప్రసాదాప్త నిర్వ్యాజపస్ఫుట విక్రముండు ప్రబల ప్రత్యర్థి నిర్జేతవి । భ్రాజద్దీన జనా వనాంచుఁ డనఁగా భాస్వన్మతుల్బోలు నీరాజొక్కింతయు నైఁ పడిట్టియఘుమున్ రక్షస్స చింతింపుమీ ॥ ౭౦ ॥

అంతనారక్కసుండు మహారాజ వచనంబుల కలిగి యతనితో నిట్లు వచించె.

గీ। నీదు బలిమేనెఱుంగుదు నీవు నన్ను। బెగడుపరచగ బలికెదు బీరమ్మమర। నింతమాత్రివశుడ నొక్కొయిపుడు నీకు । గిబ్బసద్దులకడరునె బెబ్బులిలను ॥ ౭౧ ॥

క॥ ఎడ్డెతనంబున నాపని। కడ్డంబులు నీవు సలుప నడరెదవేనిం। జెడ్డలుగడు నిన్నిప్పుడు। సడ్డయొనర్పకయ వెసగ సడలించుఁజుమీ॥ ౭౨॥

ఇట్లు వచించు రాత్రించరునకు నాయనంతాకాంతుండు గ్రీష్మఅనిట్లనియె.

ఉ॥ ఓరి సురారి నీవిపుడు నుజ్జ్వలబాహు బలుండనంచు మాయారణకోవిదుం డను నహోన్నృడ నంచును గావరంబుచే। వారకనందు విప్రిడు భవన్మహిమానలమే త దాధిధా। రారభసాహతంబగుట రాసభవృత్తి నెఱుంగవొగదా॥ ౭౩॥

క॥ నేనీయెడఁ గామశరాళీ నిహతుడనగుట మిగుల లీనబలుడనే। యైనను ధర్మజారి రక్షయ నానావిధబలసమృద్ధి నాకగును జుమీ॥ ౭౪॥

ఉ॥ కావున వీరి వీడి సవికా సమనస్కుడనైన నాదు సం। భావన కాశ్రయం బవయి। భావుకసౌహృద భావమేర్పడం। బావనవృత్తి చేమనుము పాయమిదౌనటుగాక యుండినం। దావకగాత్ర ఖండముల ధారుణిఁగప్పెదనొప్పవిప్పుగన్॥ ౭౫॥

గీ॥ ఇట్టి చెట్టల నొరులకు బెట్టు వారి మట్టగింపక నెట్టనమానడితడు। పట్టు విడుకట్టు దలపుము పట్టివనుచు। నిట్టుగట్టిగఁజెపుదునీతట్టు చెలిమి॥ ౭౬॥

గీ॥ దురభిమానము వీడి నిర్దోషవృత్తి। వీరిబుడమిని దింపుము వైరముడిగి। అట్లుగాకున్న సమవర్తికతిథివగుదు। విద్దియాప్తోక్తి యనిమది నెలమిగనుము॥ ౭౭॥

అంత నయ్యాతుధానుండు దుర్భర క్రోధ విధాని ధానుండగుచు నాసుందరీమందిరంబగు మందసంబు దనమహిమంబుచే నంబరంబునందనిలిపి- యారాజశేఖరు మీద - నంధకుంబోలె నతినిశాతరో పారోపణంబు సేసిన నతండు నతిపుణ్యాభాగ్యంబగు నైపుణ్యంబున బాణంబులం బ్రయోగించి వాని నన్నింటి నిందుత్తుయురగం ఖండించె మరియు నప్పుడా మేదినీజాని దనుజ కుంజరులు సౌమిత్రి సుత్రామ జిత్తులంబోలి పరస్పర ప్రహరణ ఖండనంబుల నన్యోన్య శరీర సంధిభిదా సంధానంబుల నతి చండవృత్తియు నాగ్రిహధన సంవర్ధితంబగు ప్రధనంబు సలిపిరి. పదంపడి యయ్యసుర మహామహిముండు గావున దివ్యాస్త్రంబులం బ్రయోగింప నావీరకంఠీరవుండు పరాస్త్రిఖాదిని యను నెక్క శక్తి వానివలనం దనకు సంరక్షణంబుగా సంధించి నా

యసుర నెఱకలు ఖండించుచు భండనంబొనరించుచుండ వాడును దన దివ్యవరప్రభావంబున సంపూర్ణాంగుడై కనుపడి యదృశ్యుండై నానా విధప్రహారణంబుల మిగుల బాధింప నారాజకుంజరుండు సంజనిత ధైర్య ధుర్యుండగుచు బరమాయా విభేదియను నొక్క యస్త్రంబునందదీయ మాయాబలంబు దినకరుండు నిజకరప్రకరంబునఁదిమిర భరంబు కరణి స్మరణీయత నొందించి వాని నీక్షణ లక్షణీయు నొనరించి.

క॥ తనకాఢి జనకుడగుటను। దనునకు సరిసేయ వేరియదహానాస్త్రము ద ప్పునబెట్టి రవ్విరక్కసి। తను విడిసురసుతను సురత ధన్యుండయ్యెన్॥ ౭౫॥

ఇ. సహర్షాతిశయంబున భగవతి శాంతము- పాపము. శాంతముపాపము. అ స్మదీయంబగు సఖీద్వయి సైంహికేయ నిర్ముక్తంబై సమగ్రసూక్ష్మయగు సుధాసూతి మూర్తియుంబోలె నిరార్తియై క్షేమంబున నడరగదా.

కా॥ వారికి సమగ్రక్షేమంబింకఁగాఁగలదు.

ఇ॥ సవితర్కంబుగ భగవతి విజితాభియాతియయాతి సన్నిభుండగు నాభూవల్లభుండు వారలం గరుణించి తనపురమునకుం దోడ్కొని పోలేదా.

కా. దైవంబందుకు సంహింపలేదు.

ఇ. భగవతి పదంపడి వారివార్త యేమయ్యె.

కా. చెలులారా అయ్యెడ నొక్క మహాసమీరణంబు విసర నామందసంబు తదీయవేగంబున గగనంబున నతిదూరంబు దానరువ్వంబడి యొక్క మహారాజ ప్రమదావనాభ్యాంతర గల్పితంబగు క్రీడాశైలీయాయస్కాంత పరిస్తరమయ సముచ్ఛ్రిత శిఖరంబుచే నాకృష్టంబై సుకృత వశంబున నచ్చటందిగె అంతనారాజ మహిషి అత్యాశ్చర్య ధుర్యాత్మయగుచు నా పేటిక నేరంజని వారిం గని వారిదావ వెలువడించి మించిన యుత్కంఠతో గారవించి మనుపుచున్నది. ఇపుడు వారికి సేమంబు ముందుమిగుల భవ్యంబు గాగలదు. సవిశేషంబుగ జెప్పుటకిప్పుడనవసరంబు గావున నింకనీవ్వాత్మాంతంబు మీరలడుగ వలువదు.

ఇ. సాంజలి బంధంబుగ భగవతి యాప్తజన కరుణావతీ క్షమింపుము క్షమిం

పుము. పిమ్మట నాజగతీపతిశచీపతి యేమయ్యెనో యుపదేశింపం గోరెదము.

కా. సాదరంబుగ జెౌను. తదుదంతంబును మీకు న్వివతగినదియ వినుడు.

మ॥ అయసత్వంబున నాఖలుందునిమి దివ్యాస్త్రింబునన్ క్షత్రియాన్వయ
చంద్రుండతడప్పుడేగె నిజసంవాసంబుకై యుజ్జ్వల। జ్జయజా నందధుకౌముదీఘన
సమాజత్త్వద్వఘూలోక నాత్యయ సంవర్ధిత తద్వియోగ భవశుక్తా పార్ధితుండై క
డుక్ ॥౭౯॥

దీనికొాకకతంబుండె గావున యనంత రోదంతంబు మీకడుగం దగదు.

ఇ. మఱియుసవినయంబుగ భగవతి భవద్వచన సుధా స్వాదనముచేసి మేమి రుపురముం బ్రతికితిమి. ఇంకం బహుజనంబులీ వ్యసనంబునంబట్టి యనల ప్రివేశంబు సేయ సమకట్టియుండిరి వారికి బ్రితుకుతెరవెఱుంగింపంగోరెదము.

కా. ముహూర్తమాత్రింబు యోగంబవలంబించి ఓచెలులారా భవదుదితంబు సూనృతంబ. యీబాలిక జనకులు దేశాంతర స్థితులగుట దీనిపితామహిరాజ మాత యీవ్యసనంబు సైపనోపక యనల ప్రివేశంబు సేయ సమకట్టి యప్పుడు నిజప్రే ష్యలచేతం తదానయనంబునకుం బ్రితిజ్ఞాతయై కొంత గడువుసేసె. ఆరాజపురుషు లుందమశక్తి కొలది కృతప్రయత్నులైనను మోఘీభూత మనోరథులై యీవాసరావ సానంబునకుం జేరగలరు. పిమ్మట నారాజ మాతదహనావగాహనంబొనరింపనుద్యో గింపఁదదీయ జనంబులుం బెక్కులు సుక్కక నట్లొనరింప నుద్యమింతురు. అకటా మహాత్కష్టంబు పస్థితంబయ్యె.

ఇ. భగవతి యిట్టికష్టంబు దిష్టంబుచేఁ బుట్టంబయ్యెనేని నారాజదంపతులు ను నష్టప్రాయులేకదా.

క్రా. ఈయాపదయందుకుం దగయున్నదే.

ఇ. దుఃఖాతిశయంబు ప్రకటింపుము భగవతి యాబాలికల కుశలోదంతంబు వారికి శ్రుతిసంగతంబేని నీకడగల్ల గడలుల పాలగుగదా.

కా. వారలకుశలంబు దెలిసినవారందఱు సేమంబున నయుందురు.

ఇ. ఆపురంబతి దూరంబున నుండుట నిప్రవృత్తి వారికెట్లు ప్రవృత్తియెట్లగు.

కా. ఓచెలులారా మీరువగలం బోగలకుడు, దీనికి నొక్కయుపాయంబు వాకుప్పెచ్చెద నట్లు సలుపుడు.

ఇ. తదవసరప్రాప్త ప్రాణుల కరణి మహోత్సాహంబుగ భగవతి మహా ప్రసాదంబు. కృపదెలుపుము.

కా. ఓచెలులారా మీరు వారి కుశల వృత్తాంతం బట్టిట్టు దెలిసినట్లు నొక్క లేఖలిఖింపుడు. ఉదయంబున నీఘంటికం బూజించి మదీయాహ్వాయ స్మరణ పూర్వకంబుగ నాలేఖ దీనికింగట్టి విడుడు. ఈ ఘంటికయాలేఖం దీసికొని యవసరంబున నారాజమాతకునిడును. మఱియును వెంటన నే నెయ్యెడనున్న నాచెంగటకుంజేరు.

ఇ. భగవతి యక్లైన నందఱు బ్రతుకుదురు.

కా. అందుకేకాదా నేనిట్లు వచించితిని.

ఇ. భగవతి యేతల్లేఖాపేక్షణావసరంబున భవత్సన్నిధానంబు గోరెదము.

కా. చెలులారా యీవాసరంబున దినకరుండు చరమగిరి కందరంబునకుంజేరకమున్న యిప్పటికనతిదూరంబుననున్న శివాలయంబున కరుగవలయు. ఎల్లియుం దాని కవ్వలనుండు నొక్క పుణ్య పుష్కరిణికి సమయమజ్జనంబున కేగవలయు కావున మీరొండు వక్కాణింపకుడని యాత్మీయ మేఘలాఘటితంబగు నొక్క కింకిణిం దీసి వారికిడి నేనుందునాయని నిర్గమించుచున్నది.

ఇ. నాపెత్తో గొంతదూరంబునుగమించి నిజ గౌరవోపచార సంవర్ధితో వాత్సల్యయగు నాపెచే నాజ్ఞప్త నిజావాస గమనులై మగుడుచున్నారు.

పిమ్మటం బ్రవేశించుచున్నది. నిర్వేద కరినాత్మ రాజమాత పరిచారికాంస విన్యస్త కరతలయగుచు విషణ్ణ బంధు ప్రధాన జన సంకీర్ణాంబరా, సాభ్యంతర మంటపంబు పదంపడి యుచితాసనంబునం గూర్చుండి అంతటనిట్లయ్యంగని

ఓయి కొమరులారా మన పడుచుల సుద్దియెద్దియైన నింతమట్టుకు నేమియు

నెఱుకపడలేదుగదా.

పరిధానజనంబు. మహారాజపత్ని మాయలక్ష్మీదేవి హృదయంగమ వార్తాప్రకాశనంబునకుం గుత్తుక బిగియబట్టియుండె.

రాజమాత. ఓయి యీయభాగ్యంబునకంతకు నేగదా ముఖ్యభాజనంబు. ఐన నాశ్రియవశంబున మీకును వయస్సంబంధంబున నగ్నికింబోలె నియ్యుపమర్దంబు సంభవించె.

అని మనుమరాలిందలచి.

ఉ॥ నీముఖ శోభ కోడిబిసి నీప్రసవంబును, యానలక్ష్మికిన్, సామజరాజముం బదకిసాలతలాంతర మాశ్రయించుటక్ । నేమము మీర రాజమహిషీ పదభూషిత వైచిరంబు సత్కామములన్ వెలుంగు దనుకౌతుకమిప్పుడిటయ్యె నక్కటా ॥౭౦॥

క॥ కరహల్లకదళదంగుళు । లలరెడు కజ్జలపు రుచుల నడరించెడుని । యలకములును బొడవొటను । గరమాయువును బొడవనియఁ గడుకొంటిఁగదా ॥౭౧॥

సీ॥ పర్వేందు బింబైణ భవ్యేక్షణరమలఁ గాశ్మీక శ్రీకార గంధఫలుల । గనక దర్పణకంబు కరికుంభనభముల గాంగేయ బిసజసౌ గంధికముల । దక్షిణావర్త హృత్ప్రివ స్నిగ్ధ సైకతరంభాప్రకాండ గోరాజవాల । హస్తపల్లవకచ్ఛ పాభాభరంబుల నిమికాతంబైమతెనిబిడమసృణ । దూరదూరవి నీల సదూర్మి పట్ట । గుణసముత్కర లక్ష్మిచేగొమరు మిగులు । నీదు మెయిగాంచి తలచితి నిరత మమిత సుత మహారాజ సుఖముల నుకలవనుచు ॥౭౨॥

క॥ జననీ జనకాన్వయముల । కనఘాత్మ తదీపమగుచునమలసమాఖ్య । వనధి నిమగ్నా శేషభు వనుడగు సుతుగనుదువనుచు వరలుదునుగదా ॥౭౩॥

గీ॥ ఇట్టులనుకొంటిగాని నే నెల్లయెడల । నిట్టియంగదగలదనియెప్పుడైన । నెఱుఁగఁగలనైన బవిసిని నెఱుఁగ నెవరు వెరవరులగుదురు బుడమి వెట్టినైతి ॥౭౪॥

క॥ ఎక్కడి విపినచరమ్మృగం । బెక్కడ శుద్ధాంత జనము లెక్కడదానం । బెక్కు

ట వారరయంగా। నిక్కము దైవంబ దీనినిజమెఱుగవలెన్ ॥ ౯౫ ॥

చ॥ జగముననుండు జింకలవిజంభితనంబున మీఱియుండునీ మృగమెటువం టిదో యకట మీఱిన సత్వము చేత నిర్భరన్। నిగనిగ జూడ వేదుకలనెయ్యమునం దన కొమ్ములంటగా। బగగొని వారిగైకొనియ పారెను నింగికిదేమి చోద్యమో ॥౯౬ ॥

చ॥ ఇది తలపోయ నెక్కు యసురేశుని మాయగ దోచు నిక్కువా। మది బ గవారు పొంగి యవమానపు మాటలు మాటిమాటికిం। బ్రదిలము వీడియాడి ననపాయ త మించునకీర్తి కోడి యేయెదదళితంబుగాగ నెటులేను సహింతు వహింతు బ్రాణ ముల్ ॥ ౯౭ ॥

అని కోడలిందలచి.

ఉ॥ కోడల నాదు డెందమతి కుత్సితగండ శిలామయంబుగా। కోడినదాని యంగదన కుంతిత వృత్తి గ్రహించి యప్పుడే। చూడగరా కనష్టమగు సుమ్ముభవన్మన మైతె యప్పుడే జాడయొకింతలేక కులిశాహతిబోలె నశించు నిక్కమా ॥౯౮॥

క॥ ఈమాట వినుటతోనే।యామానముదూలి నీవు హాహాయనుచు। న్నామా వశేషితగుదు వుసీమాతిగమయినయట్టి నేగెటులోర్తున్ ॥౯౯॥

శా॥ నాయుల్లంబను నౌధసంబున నవీనప్రేమ ధారావళిం। బ్రాయః ప్రసన్నత మూర్తిజేయ మిగులం బ్రీత్యగ్రవత్సాత్మవై। చాయంబోలి యొకప్పుడున్విడక నాశర్మ ప్రమోదాను సంధాయిత్వ వ్రతశక్తి చేనిజసుఖా దానోర్ఘ్నితా సక్తివౌ ॥౧౦౦॥

ఉ॥ అత్తయుఁగోడలుం జగతినార్జవ ముఖ్య మహాగుణంబులన్। చిత్తరపాటు వీడి సతతంబున కామమహాజనంబు చే।హృత్తల వంద్య వృత్తులయిహృద్యత నొప్పియు నొండొకండుతో। హత్తరటన్న మాటగగనాబ్జముసేయుదుసాధుశీలతన్ ॥౧౦౧॥

సీ॥ పాద్దున దమ్మిపూబోలి విప్పగు సొంపులలరగ ముద్దుల గులుకునీదు। నెమ్మోము నూచిన నెటినెలములుమీఱ నానాదు వేదుకల్హాయులగును। నెలవగుచుండు ను నేమంబు వెలయంగఁ బిన్నవయ్యును గడుమన్ననలర।జేజేలకుం బోలె జిగిగల్గు బ త్తిచే నాకారగింపు లనయము సలిపి। కానినీరైన నానవు కరముపూవు। బోడివైనను

మగనితోఁ బుట్టువులను । గాంచినయెడల చెలియండ్రి గలుగునర్మిలి వెలయింతువు నిను బోలు లేమగలదె ॥ ౯౨ ॥

ఉ॥ దైవము ధర్మవత్సలతఁ దప్పకయుండిన నిట్టికష్టము। ద్రావగ నొందునైన ను బురాకృత కర్మము లెట్టివారికిం। బోవగఁజేయశక్యములె పుణ్యముపాపములన్మొయిళ్లచేఁ-జేపసెడంగఁజంద్రుపలె సేమముసేయ నెకింతయోర్చనే ॥౯౩॥

చ॥ పెనిమిటి మేనితోడ ధృతిపెంపున నామెయినప్డు హవ్యనా। హానున కొసంగినందివిషదాలయ మందు బుధేంద్రివంద్యనై। తనరెడి భోగముల్వతి హితంబుల నందఁగవచ్చునందు నేఁగని యుభవద్గుణానుభవ కామననట్లొనరింప నైతిఁగా॥౯౪ ॥

ఉ॥ కూతులు పెక్కులైన నినుగోముల రీతులఁబోలలేరనీ బాలికిఁ బ్లిన్లయినఁ బ్రియవాదితఁజాలదు పోషణంబునన్ నీతుల గారవింప జననీ హితుఁడైన సుతుండుసుందగ౦। తాతత పుణ్య యట్టినిను సాపదగాంచెటు దాల్తుఁ బ్రాణముల్ ॥౯౫॥

ఇట్లు విలపించి మంత్రులంగని ఓకొమరులారా పిల్లలరోయ నటిగిన సేనాపతి వచ్చెనా.

మం॥ మహారాజ పత్ని తారునిఁ మించిన యవధి సమాప్తంబగుటం బరికించి కొందరు రాతులతోడ విషణ్ణుండై యేతెంచి దీనుండైయుండె.

రాజమాత॥ దైవంబు సహకారంబుగాని యెడల మనవిషాదంబేమి సేయసమర్థంబగు వానినిక్కడకు రావింపుడు.

మంత్రిలట్లొనరించుచున్నారు. సేనాపతియు దీనవదనుండగుచు నేతెంచి స్వోచిత క్రిమంబుగన్ బ్రిణమిల్లుచున్నాడు.

రా॥ మంత్రివరుఁగాంచి- ఓయీ యీతండస్మదను శాసనంబున నియ్యెడ వెడలి ఎట్లెట్లు వర్తించెనో యనుయోగింపుము. మంత్రివరుండట్లొనరించుచున్నాఁడు.

సేనాపతి. సాంజలిబంధంబుగ। అఫల ప్రయత్ననివేదనంబవకేశిసేవనంబు। ఐనను మహారాజపత్ని చరణంబులయను శాసనంబున వాక్రుచ్చెద నాలింపుఁడు.

రాజమాత. ఓకొమరులారా యీయుదంతంబు శ్రుతప్రాయంబు మీరికమసలక నింధనంబుల సమకూర్చి దహనంబు దరికొలుపుఁడు దుర్విషహ విషాద దుర్భరంబగు నీశరీరంబు భరింపంజాల.

మంత్రి॥ దేవిమహాతి యానతి యని యట్లుసేయ నియమింపుచున్నాఁడు.

రాజమాత॥ మంత్రివరుం గాంచుచున్నది.

మంత్రివరుండు సూచించుచున్నాడు.

సేనాపతి. నేను న్మఱిగొంటలు తురంగ సాదులు నియ్యోడనుండి వెడలి నింగికెగసి పఱచు నాకురంగంబు వెన్నంటి దానికొమ్ములఁ గరంబులంగీలించి యార్త్రవంబులం బొగలు వీరినిరువురంగనుగొనుచుం దోడనయతి దూరంబరిగితిమి. అట్లతిదూరం బరిగి యొక్కెడ నరణ్యానిలోఁజేరి యతినిబిడకంటక మయవల్మలతా తరు వితాననితాంత సంవృతంబగుట నచ్చోట ముందు నడమటకోడి మింటవారిం గనుంగొనుచుండిరి. మఱికొందఱు పిఱుందదెసకేఁగి పలుదెసల కరిగి యచ్చటచ్చట వారిం గనుగొనుచుండిరి. ఇట్లుండనా కురంగంబుమీదిక తిదూరంబరుగ నాయతదృష్టి ప్రదాననిపుణంబులగు కాచమయ లోచనంబులందాల్చి హావణికంగనుం గొనుచుంటిమి. అంతటనాలుగు గంటలయ్యె- అత్తఱి నాకితవకమలంబును దరంబు పరిదరంబుల నవిరళంబుగానాటంబడిమూడంబడె. పిమ్మట నావాతాయువు గతాయువుగాక బహుప్రహారణనివహోవహంబు నతిఘోరంబునైనకర్బురాకారంబు ధరియించె. పిమ్మట నారక్కసుండొక్క మందసంబు సురుచిరమణిగణఖచిత కాలాయసశలాకామయంబుగల్పించియాబాలికల నిరువుర దానంబెట్టి యేమోచెప్పెనని చూపట్టెఁగాని యవ్వివినఁబడవయ్యె. పదంపడి భూగతుండగు నొక్కనితో గొంతసంవాదంబు గలుగునటులఁగానుపించె. పిమ్మట వారిరువురకు నతిదారుణంబగు పరివిదారణంబునకు సూచకంబులగు కలంబనికురంబంబుల నూర్ధ్వాధః ప్రసారంబులు గనుపించె. అనంతరంబ నడతరత్నంబుచరమగిరి శిఖరావతరణంబుసేయు సమయంబున ధనంజయమయంబగు నొక్కదివ్యాస్త్రంబు క్రిందనుండియుంబరంబున కేగయ నారక్కసుం డప్పేటిక గడియదబుణ వియత్తలంబునరుద్వె. అంతలోన నాదివ్యపరిహరణంబు సముజ్వలజ్వాల జాలదుర్విలోకంబగుచు దావపావకంబు శుష్కవిట పికరణి నాపిశితాశను భసితావశేషితుంజేసె. అయ్యవస

రంబునందాదృశకృశాను పరికాశం బవలోకింప నేరక నిమీలిత నయనుల మ గుటం బిమ్మట నా పేటిక జాడం బొడఁగనుటకు నెంతియత్నంబు సలిపియు వెరవఱు లము గాక పోతిమి. పదంపడియెన్ని వెఱవుల చేతనైన నెట్టిదుర్గమ విషయంబులైన నెం త దూరంబులైన నంతటం బరికింపఁతిమిగాని యాయస్త్రిపరియోక్త నిలిచిన తావును వానిగమనాగమనంబులకు సూచకంబులగు చరణచిహ్నా దికంబులైనం గానవశంబు లుగావయ్యె. నివ్విధంబునం గుప్తమ్మరివితథ మనోరథులమై దేవీచరణ శాసనాను సర ణంబు నవ్వట్టి నిరర్థకంబులగుట దుర్భరంబులగు నసువులతోడ నేతెంచితిమి ఇదిని క్కంబు. అని విరమించుచున్నాడు.

తత్రత్యజనులందరు నతివిస్మయ విషాద గ్రస్తచేతస్కులగుచున్నారు. అయ్యె డనొక చేటికయేతెంచి దేవి కర్ణంబునం గొండొక పలుకులు నుడువుచున్నది.

రాజమాత॥ ఓకొమరులారా పౌరులు గొందఱు దైవికంబగు నీదుఃఖంబున న నలంబు న జొరఁజతనంబు సేయుచుండిరని వినఁబడె. వారొకప్పుడైన నట్లొనరిఁపంద గరు కావున నీమీదనట్టిపలుకు నాపీనుల కందించిన వారుమాయెడల ద్రోహులగుదు రు. ఇద్దిమదీయ శాసనంబని యందఱకు నెరింగింపం దగుననుచున్నది. తత్రత్యజనంబు లన్యోన్య వదనావలోకనం బొనరించుచు పిమ్మటన మనమందఱము పావకాహుతీ కృ తాత్ములమగుదుమని సూచించుచున్నారు.

రా. అయ్యనలంబుంగాంచి

గీ॥ అజలపరిసేక సాధ్యమనాశు గేంధన సహకారము నీశుద్ధనంజయమున। కాశ్ర యంబగు తను విదియడరి కాల్ప నీశిఖి సమర్థ మనుట ధీహీనతగద ॥౯౬॥

కావున నేను గృతస్నానయై యేతెంచువరకు సారవంతంబులగు కాష్ఠోత్కరం బుల నిపుడనలంబునకు నవిరళంబవిరలంబుగ నొనరింపుడని నియమించి నిష్క్రమించు చున్నది. తదాప్తలోకంబంతయు తద్విషాదవ్య థాభరంబు సైపనోపక యాత్మీయ పా వక ప్రవేశ ప్రతిబంధకంబగు నారాజమాత యనల ప్రవేశంబు ప్రతీక్షించుచున్నది పదంపడి ప్రవేశించుచున్నది. విశుద్ధస్నానయు నిర్వర్తిత తదవసర సముచిత విహిత కృత్యయునై రాజమాత

రాజమాత॥ విహిత హేతివాృత సంవళితంబగు నావీతిహోత్రి మండలంబు గనిముమ్మారు ప్రదక్షిణంబు సలిపి యర్థ నిమీలిత నాసాగ్రి ప్రణిహిత దృష్టియగుచు స్వేష్ట దేవతాధ్యానంబొనరించుచున్నది.

చ॥ మనమున వంతల న్వదలి మానగు సంతసమందు మిప్పుడీయనలములోఁజొరంగనగు యత్నము మానుమటంచు మంజులస్వనమునఁదెల్పురీతి సురవర్త్మమునంగడు మ్రోగుడిచ్చుచున్దనరెడు కమ్మతోఁబడెఁదదంజలిలో నొకగంటయత్తఱిన్ ॥౯౭॥

క॥ పదపడియు జ్వలశీలాస్పదమగు నాయనలమునకు పరితః క్రమణంబొదవి యదినాను మధుర నినదమయి మధుకరము రీతి నభమునకెగసెన్ ॥౯౮॥

రాజమాత తద్దయు దద్దిరిలుచున్నది.

మంత్రివరుండు తదీయ ప్రస్సృతిగళితంబగు నాలేఖనంతరంబక్కైకొనుచున్నాఁడు. తత్రత్యజనంబంతయు నాశ్చర్య ధుర్య ప్రమద ప్రకాశిత గద్గద స్వరంబున ఓయీ మంత్రివరా ఇదియేమిటి.

అందఱంగని సవికాసవదన సారసుండగుచు దారస్వరంబునఇదియావదస్మత్ప్రాణసంత్రాణంబునకై దైవవశంబున నేతెంచినశుభోదంతని వేదక లేఖ.

రా. జీవజ్జీవితయగుచు సాద్భుత ప్రమోదయగుచు ఓనాయయ్యా యిదియిట్టిదని యెట్టునిశ్చయించితివి.

మం. దీనిమీదంబొదలు పదావళిం గనుట.

రా. దానివచింపుము.

మంత్రి. శుభముసకుశలసర్వావాప్త-జన మహనీయ విభవయగు రాజమాతకు సంయమినీలిఖతంబు.

రా. సమృద్ధ జీవితయుంబోలె నోయీయాయిది నిక్కంబైయుండునా.

మంత్రి. మహారాజపత్ని వీరామాతా తపస్వినీమణియగు నాసంయమినీ లిఖితం బిట్లేతేర సంశయింప నేల.

పరిజనంబు. ఓయమిత సుకృత చరితా యిదియు మహానిదర్శనంబు.

క॥ దాని పరిక్రమణమున గృశానుఁడు విష్టబ్ధదాహశక్తితజడుఁడై। మానగుపిం
ఛ కుసుమనిధాన శ్రీవాసీయగుని తెడుగను వేడ్కన్ ॥ ౯౯ ॥

రా. తదీయశిశిరతను వెరగందుచున్నది. తత్రత్యజనంబులం దరపావకంబు
గాంచి సంతోష భరిత స్వాంతులగుచు దానిం గరంబులనంటినిబ్బరంబగు నబ్బరంబు
న నుబ్బుచున్నారు.

రా. ఓయీ యాకమ్మవిప్పి యయ్యుదంతంబువినుపింపుము.

మంత్రి. మహారాజ పత్నీ యియ్యెడ నిట్లుండి వినందగదు. అహార్య వస్త్రం
బులు ధరించి సముచిత పరికారంబున నాస్థాని నలంకరించి యీకుశలవార్తయాలిం
పఁగోరెద.

రా. అట్లయగు గాంకయని నిర్గమింపుచున్నది.

మంత్రి. పరిసరవర్తియగు నారక్షకునింగని సవయస్యరాజపుత్రీ కుశలవా
ర్తామృత ప్రదానంబున నస్మదీయ జన మనస్సముజ్జ్వల జ్వలన నిర్వాణంబొన
రింపుము.

ఆ. మహాప్రధాన శేఖర యియ్యవసరంబున నేతాదృశాను శాసన పాత్రుండ
నగుట ధన్యుఁడననుచు వెడలి యట్లొనరించుచున్నాఁడు.

పిమ్మటనారాజమాత తదవసరసముచితమహాహార్య వేషయగుచు నుచిత క్రమంబు
న నాస్థానింబ్రవేశించుచున్నది.సర్వ జనంబులుం డమకుందగు చక్కఁల ఁబిక్కటిల్లి
న వేడుకల మక్కువఁ మర నుపవేశించుచున్నవి.

రా. ఓయి మంత్రివరా యింక నాలేఖాబంధంబు విఘటించి దాని యర్థంబు
వివరింపుము.

మంత్రి. మహాతియానతి యని యాయుత్తరంబు విప్పి మహారాజపత్నీ యువ
ధరింపుము. శ్రీమన్నిజ సుచరిత విహితామిత సమీహిత వితతియగు రాజమాతకు

త్తరోత్తర ప్రవర్ధమాన సమృద్ధి సంసిద్ధ గనాశిషంబొనరించి లిఖించు కుశలోదంతంబు. అక్కడంబొడమునంగిడకు సుమతితోఁ గూడ జింతించుచునెడల సంప్రీతి కుల దైవత ప్రేరిత దూత వనితం బోలె నొక్క కాపాలిక యేతెంచె. అయ్యెడం బ్రసక్తివశంబున నావంత యూపంత వేదింప నాభగవతి యావృత్తాంతం బంతయు నిజమహిమంజేతస్సంగతంబు సేసికొని యిసుమంతయైనఁ గొఱంతవడకుండ కుశల ప్రధానంబగు మనబాలికలవిషయకృత్యకారంబు విశ్వసనీయంబుగం దగిన నిదర్శనంబుల వచించె. ఇప్పుడందు ముఖ్యాంశంబు లిఖించెద నాలించి సంతసిల్లవలయు. మన బాలికలం గొనిపోయిన కురంగంబు చండ యోగినీ ప్రహిత దనుజమాయా పరిణామంబున మార్గ మధ్యంబున నొక్క మహాపురుషునిచే నది విద్ధంబై యప్పటి యాసురాకారంబు వహించె అయ్యెడ నారక్కసుండు భూతలవర్తియగు నాపురుష కంఠీరవుతోడఁ గలనొనరింపనుసులుకై మన బాలికల నొక్క దివ్యంబగు పేటికయందుం బెట్టి గట్టిసేసి దానిం గొన్ని కరంబులం బట్టుకొనియపోవుచుండె. అంత నావీర హర్యక్షుండు దివ్యాస్త్రంబొక్క టేయ నాయసుర యాపేటియగరంబు దూరంబుగ రువ్వి గగనంబున నాపరిహరణ ప్రహారంబున స్మర్తవ్యుండయ్యె మన బాలికలును నామందసంబున సురక్షితలై యొక్క క్షేమధామంబు సేరి కుశలంబున నుండిరి. మఱియును వారు కతిపయవాసరంబులకు నుత్తుంగ మంగళ సంగతులగుదురు. ఇందుకు ముఖ్య నిదర్శనంబీలేఖ చేరుట యాదిగాగల కార్యంబులును లోగడ వాదావసరంబునం బరాభూతయై దుర్లపితయగుట నొక యోగినిచే శపింపఁబడిన యచండయోగిని యిపుడున్మాద చర్యయై యుండుటయునగు. ఇద్ది పరికింప హానిసేయ నిడిన మందు దృష్టవంతునకురసాయనంబయ్యెనను నయంబనుకరించుచున్నది. “క్వభోగమాప్నోతి నభాగ్య భాగ్జన” యను నభియుక్తోక్తి తథ్యతమంబకదా. కావునమీరందఱు నెలమి వెలయుఁడు. నేను గతిపయ దివసంబులకేతెంచి యావృత్తాంతం బంతయుసాంతంబుగనివేదింతు. కావున సవిస్తరంబుగ లిఖింపలేదు. ప్రహర్షితస్వాంతవై యుండుము. ఇద్దియ యనేక భావుకానుశాసనంబు గ్రహింపవలయు. ఇద్ది సంయమినీ లిఖితంబు.

తత్రత్యజనంబులందఱు దాని శ్రవణద్వారంబుల నాస్వాదించి దుర్విషాభిషంగులు పీయూష సేవనంబునంబోలె సమధిగత స్వభావులగుచు నానంద తరంగితంబగు నాశ్చర్య సాగరంబునం దేలుచున్నారు.

రా. సానందంబుగ అహో తపస్వినీమణియగు సంయమినీదాక్షిణ్య కరుణావాత్సల్యాదిగుణ గణ గరిమంబు.

పరిజనంబు. మహారాజమాత యావదస్మజ్జీవనంబునకుఁ బునర్జనన జనకంబామె యకదా.

మం. దీనికేమిసందియంబుమఱియుమహిమ మహనీయతమంబై చూపట్టుగంట యెక్కడ లేఖ దెచ్చుట యెక్కడ ఇంతియ కాదు దానిఁ బ్రదక్షిణంబెక్కడమహానలంబు శీతలంబగుటెక్కడ.

పరిజనంబు. తద్యము భవదుదితంబగు తథ్యంబు తపోమహితులగు మహితాత్ములకు దుష్కరంబెయ్యది. సరే అస్మద్విపాద పక్షీకందంబగు నాచండ యోగినియపస్మారితానిహత చేతనయగునని యాతపస్విని ద్రావె మగదా యద్దియుం బరికింపందగు.

రా. అదియు నట్టిదైయుండు. అట్లగుటయు వీనికంటె నాశ్చర్యంబా!

పరిజనంబు. తాదృశతద్వార్తా శ్రవణంబుచు నాధునికానందసహకారంబ.

మ . ఓయెప్పుడెక్కడ

ప్రతిహారి చేతెంచి సప్రణామంబుగ మహామంత్రిశేఖర దేవర యానతి శిరంబుగై సేత సేయ సేవకుండు వేడుకొంచున్నాడు.

మం. ఏతత్పురపరిసరారామంబుననుండు చండయోగిని యిపుడెట్లుండునో పరికింపందగు.

ప్రతిహారి. మహంతి యానతి యని నిర్గమించి వెండియు నేతెంచుచున్నాఁడు

మం. ఓకృత్యకృత్యుండవై యేతెంచితివే

ప్రతిహారి. దేవర యానతికి సేవకుండ నేయవధరింపుడు అయ్యమ్మ యొప్పుదంబున సొమ్మసిల్లి నమ్మరాని యోజంగుప్పురుచున్న దని యమ్మలందఱు నెమ్మనంబున సమ్మదంబులలర నమ్మకంబుగ వచింపుచున్నారు.

పరిజనంబు. అట్టి యోగినీమణి శాపంబు మోఘంబగునా యిట్టి సంయమిని లేఖనంబు వితథంబగునా.

రా. సానందంబుగ కొమరులారా వినుండు. ఇప్పుడీయాపత్తిమిర భరవిదారణంబుకై సకల సద్గుణ గరిష్ఠయగు నావధూమణి భాగధేయంబ పార్వణ హరిణకిరణ మండలంబని నేదలంచెద.

తావజ్జనంబును. సోల్లాసంబుగ మహారాజమాత యిద్దిబుతంబ సకల కల్యాణ విలసితయగు దేవిచేతనీయన్వాయంబు సకల సంపత్సంపన్నంబుగాఁదగు. కావుననిట్టి యుపప్లవంబు విదితంబుగాకుండ నంతర్హితంబగుటకు నాదేవి సుకృతంబనిదానంబగుట కెద్దివిచికిత్స.

రా. అందఱుంగని ఓయీ యాదినంబిదిపరకు మహానిరయ బాధానిధానంబైన గొండొక భాగధేయంబున నిపుడు జీవించితిమి. మనమిపుడు గడుబడలియున్నవారము గావున వేశంబ గృహంబులకేఁగి మాధ్యాహ్నికక్రియల నుచిత క్రమంబుల నొనరించి విశ్రమింపఁదగు.

తత్ప్రత్యాజనంబులు మహారాజపత్నీ మహాతి యానతి యని యందఱు నిష్క్రమించిరి. ఇద్ది తృతీయాంకము. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

——— 0 ———

---

అనంతరమందు విదూషకుండు ప్రవేశించుచున్నాఁడు.

వి. స్వ. ఆహా, కార్యాంశంబున నారాకకెంత తడవయ్యె - సుహృదేక జీవనుండగు మహారాజ మధుకరుండొకప్పుడేని మదీయ దవీయస్థితి సహించువాఁడు గాఁడు నిజేంగిత నివేదనంబులకు నన్నొక్కనిన పాత్రంబొనరించినవాఁడు - కావున మనంబున ననుందలంచుచు నెంత చింతించుచున్నాఁడో - మఱియు నేయే తలంపుల నెట్టెట్టు మెలంగుచున్నాఁడో - యద్ది యాలోచించి చెలికానిం జూడందగు - కావున మార్గాంతరంబున నంతరంబున కేఁగి పరిచితంబులగు తత్రత్యజనంబుల వలనం దదుదంతంబు విదితంబొనరించికొనవలయునని యొక్క ద్వారంబునం గొన్ని యడుగులు నడచి యెదుటం గాంచి - ఆహా మన తలంపు మిగుల వీలు నొందెడు - ఇచ్చట జనసంబాధం బొక్కింతయు లేదు - విస్రంభకథాభాజనంబగు కుంభస్తని దేవీ చేటీముఖ్య యిట్లేతెంచుచున్నది - కావున దీనితో సంభాషించి తత్తద్వృత్తాంతంబు లాలింపందగునని యెదురుగం జనుచున్నాఁడు.

కుంభస్తని - ముందటం గాంచి - అయ్యా మీ సేవకురాలు దండమిడుచున్నది.

వి. సవికాసంబుగ ఓసీ స్థిర యౌవనవై చిరతరావపరంబు మనుము.

కుం. సమనాక్షిప్తంబుగ - నేనింతమాత్రపు దీవనకేనా నోచుకొంటిని.

వి. నిత్య సుఖాలోకంబగు పరలోకంబునకు లగ్నకంబై తనరు గమనపదంబున బ్రవర్తిల్లుచు సకల సంపత్సమృద్ధవగు నీకింతకంటె నాశాస్యంబగునది యొండెద్దీ.

కుం. ఇద్దియ కనికరంబునందనరు దేవర దీవనయని సంతసిల్లెద.

వి. ఓసి కుంభస్తనీ కుశలంబుగ నుంటివిగదా.

కుం. దేవరయక్కటికంబట్టి.

వి. సంతోషంబు - దేవియు మహారాజును నాత్తజనంబుగ నమణమయంబులగు శమణంబుల ననుభవించుచున్నారుగదా.

కుం. ససంకోచంబుగ - కొంత తఱి యట్లు జరిగె.

వి. సచింతావైలక్ష్యంబుగ - ఇప్పుడో.

కుం. అట్లుండలేదు.

వి. ఇయ్యెడ నేరికెట్టి వెక్కురుదయించె.

కుం. ఒరులకైన లెక్కింపనేల.

వి. రాజదంపతులకేనా.

కుం. ఔను.

వి. అది యెట్టిది.

కుం. పబువు వారికి నొడలు కింకయు రాణిగారికి నందునుండి డెందంపువెత యునైయుండె.

వి. సవిషాదంబుగ - ఈబాద యెట్టిది.

కుం. ఇట్టిదని యేరికిం దెలియరాదు.

వి. అకటా నా ప్రియవయస్యుండగు మహారాజమధుకరున కెప్పటినుండి యీ వేదన.

కుం. ఈనడుమ నొక్కనాడు వేకువను దొల్లింటి యట్ల మేల్కని యత్తఱికిం దగిన చెయువుల సలుప బలిమివిడి వింతలగు వెతలకుం బాల్పడియుండె - అంత రాణిగారీసుద్ది యాలించి వెజ్జులరావించి కొన్నికొన్ని మందులిప్పించిరి - మఱియుండాను నప్పుడప్పుడు దఱుచుగఁ జెంతనుండి నలయక నూడిగంబులొనరించుచుండిరి గాని యాయనగారి మేన నేమంబు నొక్కింతయుం బొడగానము.

వి. అబ్బబ్బా యిప్పటికి నట్లయుండెనా.

కుం. ఇప్పుడట్లుండిన మేలయుకాదా.

వి. సనిశ్వాసంబుగ - ఇప్పుడప్పటికంటె యాబాధ ప్రవృద్ధంబయ్యెనా.

కుం ఔను - ఏలికలెల్ల తఱుల నుల్లంబునకు లోబడినడుచువారు గాని ముందు వెనుకలం బరికింపరు - ఒక్క యజ్ఞున నెంత సంగాతులైన బెగడు పడుచున్నైన

జనుపు పీడిదైయున మేలు నుడువులు పలుక వాని నాలింపరు మఱియు వారి నలుకం జూతురు.

వి. ఓసి చెలీ నానయసుస్యుండస్వస్థుండై యపథ్యకార్యంబు లేమైన సలిపెనా

కుం. కాశన్న నిట్టివందు రెట్లువిందగు.

వి. అట్లయ్యెనా - ఆహా కానిమ్ము - అది యెట్టిది.

కుం. కింకనింకిన మానిసులు జంకు విడిక మెలకువ నుండందగుఁగదా - ఈయ నగారైన నట్లుండలేదు.

వి. మఱియేమి చేసెనే.

కుం॥ ఆనెగులట్లయుండ నీనడుమ నొక్కనాడేరికిం జెప్పకయ యదను గడు పుటకై యొంటిగఁ దేజనెక్కి యెక్కడెక్కడ మసలియోకాని ప్రొద్దునుగ్రుంకినపిమ్మట చాలసేపునకు నేతెంచె- ఆ రేయి మిగుల బడలికగలిగెనని సాపడలేదు- మరునాడు రాణిగారి యానతిఁగింక సగఅలేతెంచి సంచులు విచ్చి మంచిమంచి మందులు దీసి వీనిసేకరింపుడని యెంతబతిమాలిన వానింగొనక మీరిడినమందులు నాకుసేమంబ సేయ నడరియుండలేదు గావున మాయానవైయున దాక మీరీచెంతకుం జేరందగదని యానతిచ్చిరి. కావునవారు మొగంబులు సిబ్బితివాంచికొని వెండియురానోడిరి. మఱియు రాణిగారితోడను నామెయి సుకంబు గలుగునందాక నాతావుకే తేరవలువదని సెలవిచ్చిరి. మఱియుం గొలువుగాండ్రడియ్యెడఁ దమదమపనులం గనుపెట్టియుండి యాయనగారి యానతిచొప్పున నాయాకొలువుల నెరవేర్చుచున్నారు. బుద్ధిగుడును సాపడుట యునుం దొలుతఁగల చెయువులన్నియుఁ దొల్లింటి యట్లు జరుగకుండు. ఇంతియకాదు! నాయానతిలేక నేవారు నిటీకుతోటకు జేరందగదనియానతిచ్చిరట.

ఇట్లుండ నేరికిన్నినంబున నెచ్చరిక యెచ్చయి యచ్చువడి యుండలేదు.

వి. సనిశ్వాసంబుగ- అన్నన్నా యెంతకష్టంబు పస్థితంబయ్యె! సుఖదుఃఖప్రాపణ నిపుణంబగు దిష్టంబెరికి నుల్లంఘింప నలవికానిది. మన మేమిసేయంగలవారము సరే. మఱియు నంతఃపురవార్తా విశేషంబులేమయినంగలవా.

కుం. సవి చికిత్సితంబుగ నుంచున్నది.

వి. ఏమే సంశయించుచున్నావు.

కుం. ఏమిచెప్పుదునయ్యా.

వి. కలయుదంతంబులు.

కుం. వానివినుటకయకదా యీసందియంబు.

వి. నాతో వచించుటకు నిట్లు సందేహింపవలసివచ్చెనా

కుం. రాణిగారియానతి యట్లొనరించుచున్నది.

వి. ఆయానతియెట్టిది,

కుం. మేనివలన నుసుకుల నెపంబాపునట్టిది.

వి. సాశ్చర్యంబుగ - ఆహాయెంతక్రూరనియమనంబు-

కుం. కాకున్న నామనంబు మీయెడల నిట్లుండునా,

వి. అట్లయిన దీనిం దెలియుటకు నాకుదయించిన యభిలాషంబవకేశ కుసుమ సమానంబేనా.

కుం. అట్లని నేనెట్లు నుడుకుదు.

వి. దేవీదరంబంతరంబుగ నితరకారణంబు దీని వినిపించునెడల జూపట్టదు గదా.

కుం. మరేమి.

వి. అందుకొక్కయుపాయంబు వాక్రుచ్చెద వినుము - ఈయుదంతంబు మదుదతంబున నితర శ్రుతి సంగతంబైనం గదా యుపాయాశంక సేయందగు అట్లు గాకుండ శపథంబొనరించెద.

కుం. అట్లైన మీయెడల నాకు దాపరికంబేమి గలదు.

వి. అట్లైన నిదియ తథ్యంబు - వక్తవ్యంబంతయు సవిస్తరంబుగ వక్కాణింపందగు.

కుం. అట్లైనన్వినిపెద నెమ్మది నాలింపుడు - ఈనడుమ నొక్కనాడు రాణి

గారు మహాను గడియల పొంగిద్దు తరి జలువ తెమ్మెరం జవిగొన నంతిపురపు తోటలో నుండు నుప్పరిగకొన తావుకు నేను మఱియు నిరువురు వరవుకులుం గొలువంజని యచ్చటం గూర్చుండి మావలన నాయా సుద్దుల నాలించుచుం గాలు గడుపుచుండిరి

వి. పిమ్మట నేమయ్యె.

కుం. అచ్చటచ్చట నెత్తుగరతనంబులం జెక్కినదియు నినగోలలచే దట్టంబగు వలవరిగలదియు వక్కణసేయ నలవడని వెలవెలయునదియు నొక్క మందసంబు నిమ్మళంబుగ నింగినుండి దిగజారె.

వి. సవిస్మయంబుగ - ఆపిమ్మట

కుం. మాకందఱకు మిగుల నబ్బురంబయ్యె.

వి. పిమ్మట.

కుం. అప్పుడు రాణిగారు మించిన యెచ్చరిక విడిగలేవి మాతోడంగూడన యామందసంబు జేరికిం జనిరి.

వి. పిమ్మట నేమయ్యె.

కుం. రాణిగారయ్యెడ వేళంబతాము దాని తలుపు విడంజేయ జతనంబు సలిపియు మిగుల మెత్తనగు కైచిగుళ్ళు గలవారుగావున నోపలేక నాకు సైగ సేసిరి- అయ్యెడ నేదానిగడియ వెడలించితిని.

వి. అందేమియుండె.

కుం. అందుంగొన్నియగు రవణమ్ములతోం గూడిన పదుమలిరువురుండిరి.

వి. వారియాకారంబెట్టిది.

కుం. సొగసరులలో నేరనైనం బూరికేనిందలంచుటకైనం దమిసేయని రాణిగారికి సిబ్బితితోంగూడ నిబ్బరంబును నబ్బురంబు దమరూపు గబ్బితనంబున నొసకించి నద్దమున్నవి.

వి. సాశ్చర్య నిశ్చలతార విస్తారిత నయనంబుగ - ఆహాయెంతమాటంటివి

కుం. ఇది నేనన్నది గాదు సామ్రాజ్ఞీరాణిగారు సెలవిచ్చినదే.

వి. అన్నా యెంతవింత- అదియు నిజమేకావచ్చును - ఇంత ప్రపంచమందె క్కడెక్కడ నేయేవి శేషంబులున్నవో యెవ్వరెట్లు తెలియనేర్తురు - ఈశ్వర సృష్టియం దుండు వైచిత్ర్యంబాయనకే కాక పేరికిం దెలియ నలవడు - కానిమ్ము దేవిగర్వ సంబంధంబు నిక్కంబుగ శిథిలబంధంబయ్యెనా.

కుం. అందుకెద్ది సందియంబు.

వి. ఇదివరకు వచించిన వచనంబులలోనిది నాకు మహానంద సంధాయకంబు. మంచిదే పిమ్మట నేమయ్యె

కుం. అయ్యెడ రాణిగారు వారినిరువురంగొంతసేపు రెప్ప వాల్చక పరికించి తాన నెమ్మిదాన నిశ్చలకంఠంబై యిట్లు రావించిరి.

వి. సరంపడి.

కుం. రాణిగారు మిగులంగారవించి తాము గూరుచున్న సరుపునందే వారికిచ్చ వచ్చినట్లు తావుసంగిరి.

వి. అంతవట్టుకు గారవించెనా.

కుం. ఇదియెంతమాత్రి.

వి. మఱియు నెట్లుగారవించె.

కుం. వారిరువురు గూరుచున్నపిమ్మట- ఓకన్నియ రతనమ్ములారా మీరలిరువురు మొయిసారులై యేతెంచిన లెస్సబవిసి యేలిక కలుములగొ కాకున్న మముంగనికరింప విచ్చేసిన వేల్పుల వెలదులగో పక్కాణింపం గోరెదనని యడిగితి-

వి. గగనంబుననుండి యట్లవతరించుటంజెస యిట్లను యోగించుట యనవరతంబు సాంప్రతంబ అందుకు వారేమి వచించిరి.

కుం. వారిలో ఔద్దఃడుమధు సిట్టూర్పు నిగుడించి-మేమట్టి వారముకాము- ఇది-

యుత్తమ క్షత్రియ కన్య- నావలనం గతిపయంబులగు కలలం గఁటచినది- సోదరీ నిర్వి శేషంబుగఁ బాలితయయియుండు- ఒక్క కారణంబున నిక్కడే తేరవలసివచ్చె- తక్కినవృత్తాంతంబు కాలాంతరంబున దెలుపందగుఁ గానియిత్తరి జెప్పఁదగదనియె.

వి. పదంపడి.

కుం. అయ్యెడ రాణిగారు వారల మిగుల మన్నించి మీ యిచ్చవచ్చినట్లుమా యంతిపురంబు నందుండవలయునని యడఁకువమీఱం బలికి వారల నిలిపిరి.

వి. పిమ్మట నెట్లుండిరి.

కుం. ఆ తీరి వారికిందగిన చందంబుల మెసంగుటలం గావించి కొంతయద ను చదువులమాటలం గడిపి పవ్వళించిరి.

వి. మఱునాఁడేమయ్యె.

కుం. పొద్దుటిపూటయుం గొంతసేపే మేమో విద్దెలపలుకులం జరిపి యెచ్చు గ మెచ్చుకొని కొంతతడి నాకడనుండ వలయునని వేడికొని పూలతోటలోనుండు పటికంపు మేడలో వారిని విడియించి మీ రిచ్చట నేయుండవలయు-మీకుం గావలయు నరతంబులెల్లం బనికత్తెల చేనందఁజేయుదు- నేన యప్పుడప్పుడు మీకడకే తెంచెదనని వినిచి యప్పుడు నాతోనున్న చంపకాంగికిని శంపాలతకును మాత్రమే వారికొలువున కానతిచ్చిరి.

వి. అందుకద్దియేని కారణంబుండునా.

కుం. అందుకు కతంబు మిగులఁగనున్నది.

వి. అదియెద్ది.

కుం. వీరలఁజూడ యొరులకుఁ బొడసూప కుండునను తలంపే.

వి. అగుఁగాక దానంగలుగు నవర్థంబేమి.

కుం. అట్లయినం బబువువారి కంటంబడగలరు గదా వారు.

వి. ఐతే నేమి పోని.

కుం. అయ్యో పిచ్చినాయనా నాపబువు వారొచిన్నపడు మంగనివం జేపట్టు గొన కనూరకుంనురా.

వి. అట్లగునా.

కుం. మఱేమి- దానిచదువుల విలువఁ దెలియ నే నేరనుగదా- అదిగొప్పరాచ కొలమందుఁ బుట్టినందును దానిలక్కనంబులె సాకిరి తనంబిడు- దానింగన్న యెరకినిది మెయి నూనిన మెఱుపు తీవయో కాకున్న నట్టిబెసమ్ముల దొరవలపుల తళ్లియగు బలు పత్తియా లేక తాతదేవర యెల్లజగంబులం దుండు చక్కదనంబునకు మారుగ నెంత జతనంబొనరించియో దీనింబుట్టించెనో. ఇవ్వి దొలుఁతెంగల తెరకటింపులు తెలవరుల కు నేరికిం గలుగవు.

వి. అన్నా యీనాడున నీమాడని రాచపడుచులు లేరుగదా నీకయింత యబ్బురంబయ్యెనా.

కుం. నేచూచిన నాడిది యొక్కటేనా- పెక్కునాదులెరుంగుదు- అందలియ లరుబోండ్లు రూపరితనంబునఁ బేరొందిన వారిలో నేఁ గాననివారుండిరా- ఇదేమిలెక్క జేజేలపై దలులం బెక్కులఁజిట్టలంగాంచితిగదా- ఎజ్జగంబునుంచలి యువిదలును దీని నుద్దికై పేరువడరేరు వారందఱు మగవారికే వలపులం గులికించిరికాని నీవెచెపుమా యేయాడుది యేయాడుదానికిఁగాని యొక్కడైనం గౌగిలింతతమిఁ గలుగఁజేసెనా- దీనిరూపైన నట్టిదియ- ఇందుకు నేన సాకిరినై కణకణలాడు నగ్గుల నిగ్గు మినుకుఁ నీను మానికంబులంబో లెదోయిల మూడునాడులైనంగట్టిగఁబట్టనోపుదు.

వి. అట్లుగా అన్నా యెంతవింత- కానిమ్ము. అట్టిసంశయంబు గలిగిన దేవివా రినెందుకు విడలేదు.

కుం. వారిగొనంబులంజదువులం బట్టి వాగుదనకడనుండ వలయుననుక్రొచ్చు విచ్చనెచ్చరిక సేయనేరమి.

వి. అట్లయిన వారినెక్కడనుంచె.

కుం. పూలతోటలోనుండు తనకై సేతయుప్పరిగలోఁ బైయంతరువులయందు

వి. అబ్బా రాజుకైననీ పెనెలవులెక ప్రవేశింప నలవడని తావుగదా యది

కుం. అందునుం దేకాదా యట్లొనరించుట - ఇంతియకాదు -వారింగనునప్పు

డు పనికత్తెలము మేము మువ్వురముంటిమని పలికితిని గదా - మాలో వారినిరువుర వారింగొలువ యానతిచ్చి మమ్ముంగని వారిరాక మీమువ్వురకంటె యొరులేరను నెఱుంగరు గదా- ఎల్లైనఁనాజాడ బయలు వెడలిన మీమువ్వురనుసురలతో నుండఁగ నేపాతించి మీద గోడ గట్టింతునని గోరంబుగ నొట్టు వెట్టికొని తీండ్రింబుగ నాన తిచ్చె.

వి దేవి యన్నిటం భామినీమణియ కదా.

కుం. అన్నిటననుటకు నేనెఱుంగను గాని యలుకంబట్టియయితేసట్టిగయ.

వి. కానిమ్ము - ఎవ్విధంబునైన రాజునకుఁ గుశలంబుగావలయు.

కుం. ఆయనగారిసేమంబకదా మనకందఱకునుసురలమందు - ఓసామీ మీకు దండములు - ఇయ్యెడ మనము దడవుండఁగూడదు - జరుపంగల కర్జంబుల జరుపుడు - నే సెలవు గైకొనియెదనని నిర్గమించుచున్నది - విదూషకుండును మహామార్గంబు ప్రవేశించుచున్నాడు.

పిమ్మటం బ్రవేశించుచున్నారు విదూషకుండు కంచుకియును.

కం. ఓయగ్రజన్మశేఖరా జోహారులయ్యా.

వి. ఓహో భద్రముఖుఁడా యిష్టంబుల వర్ధిల్లుము.

కం. పెరనాడునుండి యెప్పుడేతెంచితిరి.

వి. ప్రత్యూషంబు సమీపింప గృహంబునకేగుదెంచితిని - పదంపడి మహారాజు వయస్యదర్శనత్వరమాణమానసుండనగుటం దదవసరసముచితంబులగుకృత్యంబులం గతిపయంబులననిర్వర్తించికొని యేతెంచితిని.

కం. ప్రభువువారి నడుమంగొన్ని దినంబులనుండి మీరాకకు దద్దయుం బ్రతీక్షించుచున్నారు.

వి. ఆహా ఆశ్చర్యము - మాదృశులమ్మహారాజునకెందరు లేరు - లేదా యా నృపశిఖామణి యాశ్రితవత్సలుండు గావున నటులుంగావచ్చును.

కం. పరులయెడ నిట్లుగుఁగాని మీయెడల నిట్లు తలఁప.

వి. మఱియేమి.

కం. ప్రభువువారికి మీరు పంచప్రాణాధిష్ఠాన దైవతంబని.

వి. అదియెట్లు.

కం. యావద్వ్యవహార నిర్వహణప్రధానులైన ప్రధానులకే దుర్లభదర్శనుండగు రాజు నిరంతరాభిలషిత భవద్దర్శనుండగుట.

వి. స్వమనంబున - వయస్యుని స్థితి కొంతవట్టునకుఁ దెలిసియున్నను నవిదిత ప్రాయంబుగ నభినయింపవలయు.

ప్ర. నయనిలయుండగు నృపమండనుండు ప్రధానులకు దుష్ప్రాపవిలోకనుండగునా.

కం. ఈసమయంబిట్టిది.

వి. ఆవృత్తంబెట్టిదో యుండుగాక మహారాజవయస్యుండీపాటికిఁ గృతస్నానుండై జపంబొనరించుచుండుఁగదా యని జపశాలామార్గాభిముఖుండై చనుచున్నాడు.

కం. ఇట్లెచ్చోటికరుగుచున్నారు.

వి. మహారాజనికటంబునకే.

కం. ప్రభువు వారిచ్చటలేరు.

వి. మఱియెక్కడ.

కం. నందనోద్యానాంతరంబునందలి హేలానిలయంబను హీరమంటపంబున.

వి. ఉషఃకాలావసరంబున వినోదోచిత మంటపాశ్రయణంబున కేమి కారణంబు.

కం. అస్వాస్థ్యంబు.

వి. ఆహా నావయస్యుండస్వస్థుండైయున్నాఁడా - ఎట్టిది యాయస్వాస్థ్యంబు.

కం. అద్ది యేరికిం దెలియ నశక్యంబు - ఐన మీకశక్యంబుగావలయునని యా యామంటపంబుచెంతకుం దోడ్కొని పోవుచున్నాఁడు.

వి. భద్రముఖా నేనిచ్చట నుండెదఁ గాని శాకాక నావయస్యమణి కెఱింగిం పుము.

కం. అబ్బబ్బ సాకచ్చటకుఁ బోవనాశతిలేదు - మీరంతరంబునకుఁ బనివిసుం డని నిగళాపించుచున్నాఁడు.

పిమ్మటం బ్రవేశించుచున్నాఁడు - సుహోశాజుమధుకరుండు విరహజ్వర భరిత శరీరుండగుచు.

రా. ఆహా నియతి విపరీతంబైన నంతయుఁ దద్విధంబయగు తథ్యంబ.

చ॥ హిమకర రశ్ములుఁ గ నిటలేక్షణ వీక్షణ విభ్రమంబులోఁ। గమల సతస్ప రత్నవనకంబుల హీశ్వర పూత్కృతంబులా । విమల పటీర కర్దమము వింతఁగఁ జితిక పంక శంకమా । సుమకిసలాత్మ తల్పమును శుష్క కణావళి కల్పితాత్మమా ॥ ౧ ॥

సీ॥ పల్లవంబులనఁ దత్పాదములప్వాణుల నిజసంగ కృతహిమానితనలరుట । పీయూషరశ్మినా ప్రేయసీవదనంబ నయన కర్పూర కణరుచియగుట । చందనమనఁ దద్దశనమహః పటలంబ దర్శనమాత్రశీ తలదమగుట । బిసవల్లులనఁగఁ దబ్బింబోష్ఠి భుజముల స్వాంగ సక్తిన్యస్తసంజ్వరములగుట । సరస సారస దళవిలసత్కిసలయ । విసర విరచిత హారియంత్ర వితతులెల్ల । సూక్ష్మసంస్మృతి శీతల తాపలబ్ధి జనకములె తత్కచవసన సరణిఁజూడ ॥ ౨ ॥

చ॥ మదనుఁడనంగుఁడౌటఁ గొరమాలిన డయ్యపు మేను బూని నాయెదనివసించి మించిన వహేలన బుద్ధిని బాధసేయునీ । హృదయు మహీనహారి మహితేద్ధతమాగ్ని శిఖాళికంబునొతడవయశాశ్రయంబు విడి తద్దయు సౌఖ్యము లెట్లుగాంచునో ॥ ౩ ॥

క॥ ఇపుడీవల ద్రొశవేకెను । డుపుటకు నెల్లౌషధములు డొంకుసకట త। ల్లప నాంతర వీటి యుదశ । నపరిచ్ఛదమబ్బుఁ జేని నాశమనిజమా ॥ ౪ ॥

చ॥ సమసిపిశాచమై - పడిన సద్విధులన్ సమయింప వచ్చుఁగా । కమహితిజీవితుండయి సగర్వతఁ జేరిన భూరిమార్గణక్రియముల సంహరింపనగు గష్టముగాదిది చచ్చి చావను । న్న మదను వీని నెట్లు కలనంగని నెట్టన నెట్టవచ్చునో ॥ ౫ ॥

సీ॥ అచలాత్మ తను మెప్పు కుచతటి ఘనరసాత్మతమీఱు విలసదంతరము చేత। శుచిమయాత్మతమించు శుభరదనంబులఁ గమలగంధాత్మత ఘనత మీఱు। వదనాంతరంబున వరలు పుష్కరమయాత్మత నెచ్చు నవలగ్న తలము చేత। నరుణాత్మకంబగు నధరదళంబుచే నమృతాంశుమయతనొప్పగు ముఖమున। స్ఫుటిత మూర్త్యష్టకంబుచే ఘటిత మగుట। శ్రితకమలపాణి వృషపదిశ్లిష్ట సర్వ। మంగళాభిఖ్యత నిదియ మహిమహేశ్వ। రాత్మరక్షణ మిడదగు నతనువలన॥ ౬॥

ఆహాహాయన ప్రాయనాడికంబగు నీసమయంబు నెట్లు గడుపుదు - వయస్యుండు నిదివరకును రాక తడవు సేయుచున్నాడనుచు నితాంత చింతాతంతు సంతాన సంయమిత స్వాంతుండగుచున్నాడు.

పిమ్మటం బ్రవేశించుచున్నాడు విదూషకుండు.

వి. ప్రీతి షిద్ధ సర్వాప్త జనప్రవేశుండగు వయస్యుండు కంచుకి ముఖంబున నన్నాకారితుంజేసెఁ గావున హేలానిలయాంతరంబ ప్రవేశించెదనని సమీపించి గవాక్షాంతరంబున విలోకించి - ఆహా యెంత కష్టంబుపస్థితంబయ్యె.

సీ॥ వాఁడియు వరలు దివాతనమల్లికా సౌరభ శేష గుచ్ఛంబు పగిది। మంత్రి సంరుద్ధమై మల్లడి పొల్పడు మహితాహి కైవడి మదనిరంత। నిష్యంద నిస్సార నిర్విణ్ణవారణ వరము చందంబున వలఁపమాత్రి। లక్షణీయాత్ముఁడు రజనీశుచాడ్పున పాటినొందినసరిత్పతివిధమున। నహహమహిమ మహత్తరమహిమ హేంద్రమణి సముహాఁగుణ మణీరమాప్తశరధి। యైన యీనావయస్య పంచాస్యుడిప్పుడు। దురవలోక దశావశమానుఁడయ్యె॥ ౭॥

అని తలంచుచు సమీపంబునకుంజని - జయించు జయించు వయస్యుండు - శేషాభిలాష విశేషలాభంబున.

రా. స్వ. మూనృతాస్పదంబగుతబ్రాహ్మణాశిషంబు.

ప్ర. వయస్య యిచ్చటనుపవేశింపుమని యతని కరంబు గొని కూరుచుండం జేసె - ఓయీ వయస్యా యెంత తడికి నాకన్నులకుం గర్పూర ఘుటిక వైతివి.

వి. వయస్య నాకియ్యెడ నియతిచే నుపస్థితంబైన యర్థంబు నీవ వచించితివి-

అని వయస్యుని సావధానతం బరికించి యంతరంగంబున

గీ॥ మొయిలు పింజలుగప్పిన మురిపెముడిగి। యడరు చందురు తరున నమరు మోము॥ మించు మంచదరించిన మంచి గలుగు। తమ్మినమ్ములకిమ్ములై తనరుఁ గనులు॥ ౮॥

గీ॥ కాఁచిముంచిన యపరంజి కరణిమేను। మోము నూర్పుల సోనకు మొగిలు కలిమి। ఎండ చెండిన తూడులదండితనము। నొడలి భాగము లితనివి గడిమి నొందు॥ ౯॥

క॥ నవకము గడుఁజెడిపోయిన। నవయువములు దొలుత టవియ యగుటనితండా। యవని వరుండని తెల్పెడు। శివశివ తటతరులు గ్రీష్మ సింధువు బోలెన్॥ ౧౦॥

ప్రకాశంబుగ - ఏమోయి వయస్యా నీయాత్మ పరికింపం బ్రబలతంత్రి సంరుద్ధంబు కరణిఁగానుపించుచున్నది.

రా. వయస్యా యేమి వచింతు.

వి. ఉన్నదే.

రా. ఎద్దియుఁ గానంబడదు.

వి. నీయంతరంబు దొల్లింటిదై యుండెనా.

రా. అద్ది తొల్లింటిదే కాక నడుమ మటియొక చేతెంచునా.

వి. నీయాత్మ తొలుతంబోలె నవికృతంబై యుండెనా.

రా. నీకేమి తోచుచున్నది.

వి. వికృతంబైనదని.

రా. నీవితర్కంబు వితథంబగునా.

వి. తన్నిదానంబు దురూహంబగు.

రా. ఏమని వచింతు.

వి. ఓపిప్రియవయస్యా యీయాధిమూలంబు నావలనఁ గోపనీయంబె.

రా. మానసికవ్యాపారంబు లాత్మకుంగోపనీయంబులగునా.

వి. నే నెవ్వాడను.

రా. నీవాత్మవేకావా.

వి. అట్లయిన నాకెట్లు తెలియకుండు.

రా. తెలిసియయుండు.

వి. ఏమని.

రా. స్వప్నంబని.

వి. తత్ప్రకారం బెట్టిది.

రా. సావధానమానసుండవై యాకర్ణింపుము.

చ॥ ఫలభరనమ్రకమ్రబహు భవ్య మహీరుహ బృంహిత శ్రీమంజులకుసు
మ ప్రసూనతతశోభన సౌరభపూరితాంతర । స్థలమమలాంబు భూరివిధ సారస కైరవ
పూర్ణ దీర్ఘికా విలసద దభ్రవిభ్రమకవిభ్రమ రోఘమహాఘ్న నాదము౯ ॥ ౧౧ ॥

అగునొక్క మహోద్యానంబవలోకించితి.

వి. ఐయస్య లెస్స లెస్స. పదంపడి పదంపడి

రా. ఆయారామాంతరంబున నొక్క మహాసౌధంబవలోకించితి.

వి. సానందాభినయంబుగ - ఐయస్యా అది యెట్టిది.

రా. వినిచెద నాలింపుము.

సీ॥ అతిమృదు తూలపూరిత దృకుత్స్వవ చైనకమ్ర పటీకృతకశిపుతతుల । నతి
తాలముగ్ధపయః ఫేనవిశదాంతరాసక్తముకుర చిత్రాళిభిత్తి । మూలకల్పితమహో మా
ర్ఘ్యపధాన వీధులసకల హరికరలలితాస । నన్యయవ రేఖల నవరత్నదీప పాంచాలికాదిమ
హార్ఘ సముదయములం । దత్తదుచితవిహాయ సజ్జితబహుభేద । శిల్పకల్పిత మణిమయా
కల్పకాంగ । సంప్రకీర్ణేక్షణా స్వాద్యసకలభాగ్య । తత ఘనానద్ధసుషిరవితానముల
ను ॥ ౧౨ ॥

అలరుచున్నదియు.

శా॥ నీలోద్యోజ్వల చంద్రపాద విసరోన్నిద్రోప వన్యంతరో దారోదంచిత దీర్ఘికా కుముదసంతానప్రకాశాహ్వాత । స్ఫారామోదసమీర దారితముఖస్వాయన్మహా మాఘ్య భూసౌరభ్యస్ఫురణోర్మికా సంవలిత కుత్యాభోగ దృగ్భోగముల్ ॥ ౧౩ ॥

చ॥ ఉపరినిబద్ధ చంద్ర కిరణోత్కర సంక్రమణస్ఫుట శ్రవద్విపుల విధూపలోద్వమిత విస్తృత వారిపరిపూరితాళిన। ధ్రపరమ హేమనాళ వితతాస్య విదృబ్ధనిరంధ్ర రంధ్రకాళ్యుపచితమైహిక ప్రసరణోదిత శీతలతోప కంఠముల్ ॥ ౧౪ ॥

వి. సానందంబుగ - బాగుబాగు పిమ్మట నేమయ్యె.

రా. సోత్కంఠంబుగ - ఆమహాసౌధంబు చతుర్థ భూమికా ముఖశాలాపురోంచలంబున మహారాజ కన్యార్హంబులగు సమున్నత పీఠంబులం గూర్చున్న నిఱువురు కన్యలం గంటిని.

వి. సోల్లాసంబుగ - తర్వాత తర్వాత.

రా. అన్యోన్యదం దోలుతవినిద్రితుండైన విషమశరుండు నాహృదయంబున మేల్కనియుదయుండై స్వాశ్రయ భేదనంబొనరింప నుద్యోగించె.

వి. సాశంకంబుగ - అవసరగ వేషణ కుశలుండుగదా విషమేషుండు - వెనుక వెనుక.

రా. అవిదితస్థలంబున నుండు నపరిచితలైన వనితల కడ కఱుగుట నీతిగాదని యెంచియుఁ దదీయ సదేశంబున కతిసాహసంబున నేగితి.

వి. వయస్యా యీసాహసంబు నీదనుకొంటివే కాదుకాదు-బలాత్కార ప్రవర్తనుతయగు నాదర్పకుండే.

రా. సజుగుప్పంబుగ- వయస్యా యట్లుకానున్న నిట్టి యవినీతార్థంబు నిశ్చంకుండనై యేనొనరింతునే ఇపుడిట్లు నేవచించుటగాదు-తొల్లినీ వెరుంగవా నావర్తనంబు.

వి కాంభర్తీయకాహా యిట్లువచించితి- మంచిది పదంపడి పదంపడి.

రా. నేనతిధీరుండనై తమచెంతకుం జేర వారలును సవిస్మయంబుగం గాంచిరి.

వి. ఇద్దియుచితంబ తాదృశావసరంబునం దాదృశస్థలంబున నజ్ఞాత పురుష ప్రవేశంబేరికి విస్మయ జనకంబుగాదు.

రా. ఇంతియకాదు- మానస ప్రసాద సూచకంబగు వికాసంబున నతరు నిరీక్షణంబులం గాంచిరి.

వి. నీవు మహారాజ లక్షణ లక్షితుండవుగదా- వారును మహాకుల ప్రసూతలు గావలయు- కావున నీయెడం దగిన గౌరవ విధాన బుద్ధి వారికుదయించె పదంపడి పదంపడి.

రా. వయస్య కతంబెద్దియొకాని యువతీయంబగు కన్యారత్నంబు గద్దియ నించుకైనం దొలంగక నిబ్బరంబుగం జూచుచయుండెనని యర్థోక్తంబున.

వి. వయస్య తన్నిదానంబు నీకు దురూహంబయ్యెనా.

రా. కేవలంబు తథావిధంబుగాదు నిశ్చితంబునుగాదు.

వి. నీకేమిదోఁచినది.

రా. తారుణ్య సౌందర్య సత్కుల ప్రసూతత్వాది గర్వంబునని యొక పక్షంబున.

వి. వయస్య యిద్దిసూహంబుగాదు.

రా. నీకేమి దోఁచుచున్నది.

వి. భవదీయ తారుణ్యాది లక్షణ నిరీక్షణైక తానత్వంబున.

రా. నీకట్లు దోఁచెనా.

వి. ధీరోదాత్తుండవగుట నటువచించవు గాని నీకుమాత్రమట్లుదోఁచలేదో నీవయాత్మవని వక్కాణించెదవుగాని హృదయ మర్మంబు విడనాడవు.

రా. సానునయంబుగ- వయస్య కోపింపకుము ఒకపక్షంబున ననియంటినిగదా.

వి. సరేమంచిది- పిమ్మట నేమయ్యె.-

రా. పెద్దయగు లలనా లలామంబు సౌహృద నిష్యందులగు విలోకనంబుల నాశంకాతప్తంబగు నాశరీరంబు శీతలితం బొనరించుచు లేచి పరిసరవర్తియగు నొక్క మహార్హపీఠంబు గానుపించి దీని నలంకరింపుడని వచించె.

వి. బాగుబాగయ్యె పిమ్మట.

రా. నేనుగూరుచున్నంబిదప నాపె నిజపీఠంబునం దుపవిశించె.

వి. వారిరువురం గంటివిగదా- వారయ్యవసరంబున నెట్టిభావంబునకుం బాత్రంబులైరి.

రా. వారిలోఁబెద్దయవీయనీ భావంబునకు.

వి. యనీయనిసిరో.

రా. సాపత్రపతన తానుండగుచున్నాడు.

వి. విస్మృత ప్రతిజ్ఞా తార్థుండవైతివా.

రా. సాహసం బవలంబించి- లేదు వయస్యా వచించెదనాలింపుము స్మరానల సందగ్ధ హృదయ సంజీవన సుధాధారయని.

వి. సానందంబుగ- సాధువు వయస్యసాధువు- ఆబాలికయట్టి లావణ్యాదిగుణ మండితయే.

రా. దానిలావణ్యం బట్టిదంట-ద్వితీయయుం దానికి సోదరీప్రాయ శుభలక్షణంబ.

వి. భవచ్చేతస్సేనయగు నీబాలిక రూపంబాలింప మిగులఁగుతూహలం బగుచున్నది.

రా. నాచిత్తంబునకు వినోదకారిణంబైతివి- వచించెద నాలింపుము.

సీ॥ లేనెలవెలిమాలి లెస్సల్గడించిన దాని నెన్నొసటికి దారిలేదు। మరువిండ్లు వాడక మఱిమఱి నెఱిగిన దానికన్బొమలకుఁ దరములగును। వల్లగల్వలు సేరినయము సేవించినదాని కన్నులకగు దవ్వునుండ। సంపెగ దిరముయి సొంపొందఁగొల్చినదాని నాసకుఁ దగుదరికిఁజేర॥౧॥

దొండపండుల లచ్చి దొడరిఁగొల్చిన దాని వాతెర కగుననివాళిఁబట్ట। మగరాల యుద్ధముల్ మసలక నవియూన దాని చెక్కులులకు దాపునుఁడు। తిమ్మిపూవులకల్మి దావి నెచ్చుట దాని నెమ్మోమునకు నగు నెమ్మిసకియ। తఱిమబ్బు లుబ్బులుడలకోనినందాని నెఱుల నెనఱుఁలంద నేర్పరులగు ॥౨॥

బంగారు తూడులు ఎవిసినక్కటికంట దాని భుజములజితముగడించు। చెందొవల్ గందఁ సేవసేసినదాని కైదోయిచే బూన గరువమొందు । పైడిఁ గొండలుసేరి బత్తిగొల్చిన దాని చనుదోయి యందంబు సైపఁదగును । ముచ్చిమ్మతిన్నె సొంపులఁగఱచిన దాసి వెన్నుకు వెన్నునవ్వు నయ్యగు ॥ ౩ ॥

నవకమునంటిన వటులు గొల్చినదాని కురువుం సొంపులఁగొమరు మిగులు । కుసుమ పొట్లపు వెల్వ గోరిఁ గొల్చిన దాసి నునుపు పిక్కలనొత్త నూలుకొనును । తలిరాకు కలుములు దవిలిగొల్చిన దాసి యడుగులకగు వారవుడులు గాఁగ । నఘరంజిమను మెత్తనిజియైన దాని మేనికి జాయ పగిగాఁగ నిండియుండు ॥ ౪ ॥

గీ॥ కాని మెండుగ నిండిన కలికితనము, మెచ్చుచున్నట్టియన్నియ యామొదలిపాళ్ళ। లో నొకటి కైవను బుడమిలోన మాద్రి। గాక యున్నట్టి సొబగుల కలిమిరూపు ॥ ౧౫ ॥

వ॥ కచనిచయంబు మేచకవికాసకనాకచి చాకచక్యమాలుచిర నిటాలమాళశరరోచితలాళిలి లబ్ధవర్ణమా । కుచరుచిచారు హేమనల కుట్మల కోటి పదాపనీద్యమా నచిర రుచిందనుద్యుతియు హాయి గళాగళి నీసడించెదుక ॥ ౧౬ ॥

గీ॥ అపుడు విరిసిన కైతక హారపత్రి కోటి శోభల మిగులన కూటవృత్తి । నఖరంజేయుణవలానఖి నతిసముల్ల । కాత్తికంబులు దాని దోగంతరములు ॥ ౧౭ ॥

సీ॥ తన్ముఖ శ్రీకోష్ఠి చగుల నూణాంతగపాదపారికగుదోషాకరితయ । నయన లక్ష్మీనర్ణనము మనంబునఁ జేరశ తులావళికివి విసారతయగు । కన్బొమల్లనుగొన్నఁగాము కోదండమునకు నగు మధు పగుణాభిషక్తి । దశనరేఖా శ్రీలదర్శంప శౌక్తిక శ్రేణికి ముక్తాత్మ రీతియ యగు ॥ విమలకపోల భావిభివముల్లముసేరమణి దర్పణము దృషన్మయమ యగును । సురుచిర గలలీల చూడ్కులకెక్కిన నలకంబు వునకుశంఖాత్మతయగు । తదురోజ సౌందరీ ధార వీక్షించినఁ జక్రముల్పరసాత్మసాదితముల । కౌనుకన్పడు వేని గగనంబునకుఁ ద్రివిక్రిమ పదత్వముల సత్క్రిమనుయగును ॥ వళిపాళిమాంజులి వాసించిన నిత్య భంగతాసక్తి తరంగతతికి । రుచిర రోమావళి రూపుగాంచిన నల శ్యామలాహికటిలేశ యుతయుతగు । పాక్కలిపాలుపు చూపులకు పాలైన నాసర్గసిక్తి సైప్రదు గాసారతయగు । ఘనజ ఘనాభిఖ్య గనసైకతములకు ఘనగోష్ఠిదుర్గలో

కలలను తనరు ॥ సురుచితంబాభిఖ్యఁ గోచరింపఁగ నేని చక్రంబులపూరంధ్ర సక్తమయ్యె గు । మంజులాంక శ్రీలు మగిఁ జేరెఁగరముల కగును మాతంగాత్త తాపశ్యాప్తి । సద్గతి ప్రథిత తచ్చరణ సౌషమిఁ జూడ పద్మావళికగుఁ బంకజసితి । తనువల్లి సుషమగన్గొని న సన్యోత్ఫుల్ల కనక ప్రసూనాళి కాంచనంబ ॥ యిట్లు గావున లోకత్రయాశ్రయాన వద్య సౌందర్య సంపద వగలఁదీసి । మదనుచే ఖిలజగన్మనోమథన విధికి । గానిజేసెను నిక్కమై తనరు నిదియ ॥ ౧౭ ॥

గీ॥ దాని కౌనును సరిగాగ దగుదు ననుచుఁ। బల్కి చదరున సింగంబు పన్ని దంబు । వలన బరికించు వేళను దొలగితొలగి। నోరు దెఱచుటచే దెఱనోటిదయ్యె ॥ ౧౮ ॥

వి. ఓవయస్యా శాదృశకన్యా నిరీక్షణంబునం గృతార్థుండవైతివి - పిమ్మట నేమయ్యె.

రా. ఆబాలికయును సాగసంబుగ నభినవ హిమకర కిరణ సంస్పృష్ట కువలయ దళ శ్రీగర్వ నర్వంకషంబులగు నయనంబుల నిరీక్షించి నాకిట్లనియె.

ఉ॥ నీదగు మేని చిన్నములు నిక్కముగా బరికించి మాధవ నీ మేదిని నెల్ల నేలఁ దగి మేలగు రాకొలమందుఁ బుట్టు ట న్నోసముగాఁగ దెల్పెదు నమూల్య గుణాకర యి ట్టివేళ నీవిదరికేల వచ్చితి సదీహిత మొప్పగ జెప్పుమంతయున్ ॥ ౨౦ ॥

వి. ఆహా యాబాలామణి వచనరచన చాతురీ పరిపాటి - మంచిది - నీ వేమి వ చించితివి.

రా. ఇట్లంటిని.

క॥ కార్య వశంబున నైనను । నార్యాకారంబైన యనృతమాడ బెగడుదు నా సూర్యప్రభవకులుఁడనక । వర్యామతి దెలియుమీవ తక్కిన గుణముల్ ॥ ౨౧ ॥

ఉ॥ నేనిపుడైనఁ గొంత ధరణీవలయంబున నాజ్ఞ సిద్ధిచే । మానితు దైతిసర్వవి ధ మంగళ రేఖల నుల్లసిల్లునీ । పాణిపలంబ నంబయిన బాటిగ నీయపనీ ప్రభుత్వ మిం । తేనిఁ గొంతలేనటులఁ దెల్లమునుల్లము సంతసిల్లెడున్ ॥ ౨౨ ॥

మ॥ విదుషీ సంస్తుత శేముషీ మహిత నీవేత్తృత్వ మస్మాదృశావాళ దయాధా
తుక శీల పాటవ మిగుల న్నాశ్లంబుతో నర్థినై । మదకందర్ప దర్ప్రపహాణమున కైమన్నీడ
నైనంగళ । న్మదతం శేరితినింక జేయునది నన్మన్నింపవి చెప్పందగుశ్ ॥ ౨౩ ॥

వి. ఓయీనీవిట్లు వచింప నాబాలామణియేమి వచించె.

రా. ఇట్లు వచించె.

క॥ విదితా శేషసుచరశుఁడ।వదితి సుతాధీశ సముఁడవగు నీచేతన్ । ముదితాత్మ
గాఁగ జనకుల మదిగోరెద నేను విబుధ మానితచరితా ॥ ౨౪ ॥

క॥ పరవంశంబునఁ బుట్టిన పరపర్ణినులకు వన శుము బాల్యమునందు।న్వరయోగ
దశను బరతయు పరమని పచియింతురు గద వాగీశులిలన్ ॥ ౨౫ ॥

వి. ఆబాలామణి యుక్తి యుక్తంబుగ నిజానురాగం బుపన్యాదించుట మిగు
ల ధీరయుఁ గలావతియునై తోఁచు.

ఓవయస్యా మరియొక తెరైయెనం భవదీయ దర్శనమాత్రింబునదు)త స్వాంతయై
కంతువ్యధనంతంబు నొందింపంగోరి నిన్నే కాంతునిగ జేసికొనదా.

మంచిది కానిమ్ము- పిమ్మట నేమంటివి.

రా. ఇట్లంటి.

క॥ అనపేక్షిత సురుబాంధవ జనమతి సమంగ్రహేను సరణమవిదితేం। ధనకు
శ పహ్ని పురోధస। మనధి గతామ్నాయ నియమితాచారమునన్ ॥ ౨౬ ॥

ఉ॥ శింజిత హృద్యమండన విశేష శుభాత్మక వాద్యహృద్యమున్। మంజుల
కాంతమాన తతమంజు మనోహరవేది హారియున్। మంజు నిరంధ్రి భిత్తికృత మానిత
చిత్రి మహాపమాజము । న్మంజుశరాగ్ని సాక్షికము -గాత్రివిచిత్రి పవిత్రపా
త్రిమున్ ॥ ౨౭ ॥

క॥ అను గాంధర్వ వివాహము। మిగులుగ శోభావహంబు మీనాభిజ్ఞా।సగురుక
నుప నీశులకుం దగునది కన్యాస్వతంత్రి భావాదకమున్ ॥ ౨౮ ॥

కావున నిట్టిధంబగు పరిణయంబున ననుంగరుణించి విషమ ప్రహారణు వలవ
శరణంబ పగుమని మిగుల వేడికొంటి। మఱియును.

మాలిని. సుచరిత పరిపాటీ శోభితంబౌఁగదున్నీ వచన మరయునైన న్వస్తుబు
ద్ధిం దలంపక్। అచలసుకృత శీల స్థాయి రాజన్య కన్యల్ లుచిఁగలయుర గాంధర్వోపప
త్తిన్సనీతీ ॥౨౯॥

క॥ నేనీకర్హుఁడనైన న్నానె నదియాదియు నేనిమానకనిపుడీ। సూనశరశరాళివ్య
ధ మానవతీ విదిత వృత్తిమనువుము నన్నున్ ॥౩౦॥

వి. బాగుబాగువయస్యా నిరుత్తరావకాశంబుగవచించితివి. పిమ్మట నేమయ్యె.

రా. ఆబాలామణి యేమియు వచింపక నవనత వదనయైయుండె.

వి. ఆహా యీబాలామణి యెంత ధీర. కాకున్నను వనితలు ప్రగల్భలై యంద
ముగనొకాను రాగంబు పరిచితులయందుం బ్రకాశింపఁ జేయుదు. నీవవిదితుండవు.
ఇద్దరయైనం గన్నియ కానసిద్దియు మిగులనాశ్చర్య కరంబుగాదు. మంచిది. దీనికొ
కవయస్య యున్నదని వచించితివిగదా. ఆపె యీసంభాషణం బంతయు నాలించి
యేరికి నేమియు వచింపలేదా.

రా॥ అప్పుడాపె యీబాలామణింగని యిట్లువచించె.

గీ॥ అర్హులగువారు నన్నిట నార్యవృత్తి। నాత్మరక్షణముఁ గోరి నాత్మ జేర। నా
త్మదానంబుచే నైన నరయువారి। మనుచుటయె కాదె ధర్మంబు మతిమతులకు ॥౩౧॥

క॥ గణనాతీత సుధీనుత। గుణగణ భూషణులు దన్ను గోరినవారి। న్గణియించి
శోర్యకీర్తి ద్రుహిణు వరదుని జేసికొనుటయెగాదెయిలన్ ॥౩౨॥

వి. మేలు మేలు బాగుగ వచించెఁగదా యావయస్యామణి. అందుకీ బాలామణి
యేమివక్కాణించె.

రా. ఏమివచింతు। అప్పటికిం బ్రతికూలంబుగాన వచించె.

వి. ఏమని.

రా. ఇట్లని.

క॥ ననుఁగని కడుఁ గనికరమున। మునిపిన తలిదండ్రులకును మనుసుపరిచి
యనువున మేలొందుట నాకనయము నెదుతనముగాదె యలరుదురెపజల్ ॥౩౩॥

క॥ చెలినీ వెఱుఁగని న్యాయంబులు లేవిలనైన నిట్లు ముగుదగు నాకుం। దెలి పెదవు దమ్మమనియో తెలివింబరికింపఁ దలచి తెగ నాడెదవో ॥౩౮॥

వి. పిమ్మట.

రా. అను బాలామణికి నావయస్యా గత్నుంబిట్లను- ఓ చెలియా నీవిట్లంటి వి యింతమాటే నిపునంపనీయవా నేను వంచకురాలనా.

బా. కాదే యాళి యిట్టితలంపే నాకుఁబుట్టిన నిట్టేల పచింతునే- ముగుదను నాపున నేమియుందోచక నట్లడిగితినే.

వయస్య॥ చెలి సరోజ యట్లయిన వచించెద వినవే- రాజకన్యలకు గాంధర్వ పరిణయంబు విధిగ్రహణీయంబనియు కాదా తొల్లి కుముద్వతీ శకుంతలా వత్సలాదేవయాన్యా దులు మాహాకులీనలు తత్తాదృశ గుణగణ మహార్ణవులగు మైథిలీశు దుష్యంతపురుకుత్స గసంజయాది క్షత్రియాన్వయోత్తముల గాంధర్వవివాహంబునం బరిగ్రహించి యిష్టభో గంబులనుభవించి సకలజన సమ్మాన్యతం బ్రశస్తికెక్కిరని నీవెఱుంగుదువా లేదా.

బాల. ఎఱుఁగుదును గాని ప్రాచీనాధునాతనంబులగు నాచారంబులకుం బె క్కులకు దేశకాలాది భేదంబువలన గ్రాహ్యాగ్రాహ్యతలు గలుగుటం జేసియు జనకవశన గుటయు నామనంబు సందేహ గేహంబగుచున్నదే.

వయస్య. ఓ చెలియా యివియన్నియు దత్తోత్తరంబులు గావటే.

బా. చెలియా యిపుడేమి సేయువలయునే.

వి. నేవచింపనది యుత్తరంబు లేదు - అని వారిరువురను స్వసంకేత భాషచే సంభాషణంబయ్యె.

వి. లెస్స లెస్స - గుణ నిరూపణ నిపుణయగు నావయస్యామణి సహాయంబు న తాత్కాలికంబగు నీయభిలాషంబు ఫలిత ప్రాయంబగునని తలంచెద.

రా. ఇట్లుగాదు ఫలితంబయ్యని వచింపదగు.

వి. ఆహా నీవగదా ధన్యుండవు - ఇది యిటుండనిమ్ము - తదీయ సంకేత భాష నీవెట్లెఱింగితివి.

రా. తదీయవదనావలోకనావసరంబున వాణీవదనావలోకనావసరంబునంబోలె బుద్ధి ప్రతిభాత్మత నొందె. కావున నాశబ్దంబులన్నియు మనంబునంగీలితంబులగుట ననంతరంబు తద్ధ్యాన ప్రసన్న మానస్కృతచేఁబరికింపఁ దదీయశబ్దావయవంబులగు వర్ణంబులే తదర్థప్రతిపాదకవిపర్యయంబులయ్యె - ఆకృతంబున నెఱింగితి.

వి. అప్రతిమ ప్రతిభాభాసురుండవుగదా వయస్యా నీవు - మంచిది - పిమ్మట నేమయ్యె.

రా. అయ్యెడ నావయస్య యాబాలికం జూచి యోచెలియా యభినవాభోషితంబగు మల్లీమతల్లిక నిన్న గోరకితంబయ్యె పుష్పితంబు గావలయుఁ జూచివచ్చెదఁ గాని నిపుణంబుగ నుండుమనియుపవనాంతరంబునకు వెడలె.

వి. ఆహా యాలలనామణి యెంతకలాపలి - కృతకృత్యుండవైతివే - పదంపడి యేమయ్యె.

రా. అయ్యెడ నాబాలామణి సందుగ్ధముగ్ధమందాక్షానురాగ రసాల సంబులగు నిరీక్షణంబుల నంతరంబున కే నెమ్మని పిలుచు దాని కరణింబలుమారుఁ జూచి వెడలి॥

సీ॥ ఈగదిలోనుండి యాగదిలోనికి నాగదిలోనుండి యావలిగది। కేళాలలోనుండి యాశాలలోనికి యాశాలలోనుండి యువతులుండు । శాలకు నతివిలాసాతియ సంస్పృష్ట ఝుణఝుణాత్కార సంజనిత హర్ష । మంజీర పక్షాది మహితపుడనముగ వెడలుచు నొక్కచో నడకగొనుండి । వాతాశ దడవుచు నాకు దన్నెఱుఁగించుటకు నూపురాంఘ్రి ఘట్టనము నిడుచు । నాఱడచే పదయున మెటింకియ వెంటనంటినఁ గొంటెయై తొంటి చొప్ప । మరి మరి దిరుగుచు మురిపెమ్ములీనుచు నాసౌధభూమికాహాసే విక్రమ । లన్నియుఁ బొడఁగన నవకాశమిచ్చుచు నొక్కొక్కచోటను జక్కనైన । మెఱుపు తీవియకరణిని మెఱసి మెఱసి పల్లగుల్లాలఁ బెట్టుచు మరి మరలుచు। రతిశచీకేళిమందిర లలితదత్త । హీరభరముపరి భూమికి నువవు నేరె॥ ౩౫॥

వి. పిమ్మట నేమయ్యె.

రా. క॥ స్వస్తికమునఁగుచమండలి హస్తోపలాంగుళిక పోల హసితాధరమున్ ।
శస్త్రల్లలితములఁ గప్పుచు నుస్తనియదిమోము నేర్చి సుధుపకళమ్యాక్ ॥ ౬౬ ॥

క్రింద నిలువంబడియుండె.

వి. ఓవయస్యా యాశయ్య వర్ణింపుమీ.

రా. ఓవయస్యా నావివక్షావిషయంబగు నర్థంబీవ యనుయోగించితివి- బాగు బాగు - వినిచెద నాలింపుము - అనుచు సోత్సాహంబుగ.

చ॥ అభినవ పర్ణివర్ణమ సృణారుణ విద్రుమ కాండక్లృప్త వల్లభ ప్రురుష ప్రమాణ రుచిరాంఘ్రియు నంతర సక్తసంస్కర । తృభమణి ఖండ మండిత సువర్ణమయోజ్వల చిత్రపాత్రికా సుభగమహాశ్మదండ భృగి శోభిత మంజుల కాయమానముగ॥ ౩౭ ॥

చ॥ స్ఫుట తమ శక్ర గోపగణ శోణ తృణీకరణక్షమప్రభా పటల దృగుత్సవ ప్రభవభావుక పట్టగుణౌఘచిత్రిసం। ఘటనసుమూస మంజిమవికస్వరమాలతి మాంజులీల సత్పుట కృశబంధురాత్మ పరిబర్హ మహామహనీతమోపబర్హణముగ ॥ ౩౮ ॥

చ॥ సువిమలవర్తులోరుతర శుక్తిమణీగణ క్లృప్తఝల్లరీ కవచిత కోటిలోచన వికాస విభూతిదకాయమానమ । ధ్వనితత ధృద్ధముగ్ధకనదంబుజ రత్న విహంగపాళికానివహమహావితాన పరిణీత మహాద్భుత చారురూపముగ ॥ ౩౯ ॥

చ॥ శరదప్రదాత పక్షగిరి శపిభువాసర నిర్నిరోద భాస్వర శిశిరాంశు బింబవిల పచ్ఛశరర్భజరోమజాళి ని । స్ఫురపరతూల సంభరిత సూనసముత్కర పేశలోపధాన రచిత చిత్ర శీర్షతల నద్ధల సత్ఫలకాభిరామముగ ॥ ౪౦ ॥

చ॥ సురుచిర గౌరహీర మయ సుందర కేసర వారపూరితాంతర పరచంద్రికాంత కలితచ్ఛద బంధురకైరవోత్కర । స్ఫురితసముల్బణాభ్యుదిత శుభ్రిమ యూఖమయూఖరాచిషీ భరిత గృహాంతరాళ పరిభర్త్సిత దీపక కాయమానముగ ॥ ౪౧

క॥ నిగనిగ మెఱుగుల మెలగెడు। తగురతనముల చిదురుపలదనరు కరణులం । తెగినెచ్చు పైడి పలకల మిగులనవలరారు వెడదమెట్లులనోలిన్ ॥ ౪౨ ॥

తనరినదియును.

వి. వయస్యా యిట్టిదైన దాని వైభవంబునకు గొంత నీవగ్ర నాకౌశలంబునకు గొంత - కానిమ్ము పిమ్మట నేమయ్యె.

చ॥ మదనుఁడు దానితోఁ గలప మక్కువతోఁ వను మాటిమాటికిం। బదనగు నమ్ములంబరపి బాధలు సేయుచునున్న ధైర్యము । న్వదలక మూక భావమున పర్త్రిలజేయుచు బత్త్కమంబులన్। సుదతిని వెన్కఁజేరి మృదు శోభినఖంబులఁబ్రిక్కలంటితిన్ ॥ ౪౩ ॥

వి. పిమ్మట నేమయ్యె.

రా. గీ॥ దానవంచిత కిలికించిత ప్రతీక। యగుచుఁ దొందరఁ జెందివియాలతారణి । నెదురుగను భుజవల్లుల నీరు బారు। నాదు గళముఁ బగిలించె నాతియపుడు॥ ౪౪ ॥

వి. ఆహా వయస్యా నీభాగ్యంబేమని పవియింతు బ్రహ్మానందస బ్రహ్మచారియగు తాదృశ బాలామణీ స్వయంగ్రహణ సుఖంబనుభవించితివి. పిమ్మట

రా. మ॥ అపురూబాలిక చేష్టితంబులు విహారాంతత్రి పాయంత్రిణాత్యప పూర్వోత్తర సంధులాట రసిక స్వాంతానుభూతిక్రమై । కపరిజ్ఞేయ రసోల్బణంబులు పరిదుగ్ధానంద సందోహముల్విపులశ్రీసూక్ష్మతైక లక్ష్యములునై వెల్గొందె నత్యంతమున్ ॥ ౪౫ ॥

గీ॥ ఇవ్విధంబున నభిమత హేల లలర నలరు విల్తుని సేవలు సలుపుచుండ। బ్రిమద సంగతకోక దంపతిరుతముల బలయువై తాళికస్తుతి పాఠమమర ॥ ౪౬ ॥

క॥ ఆయెడ మేల్కని కన్నులు। పాయంబున దెఱచి చూడ బమిగప్పి మనం ।
బామొలనాగను గానమి నీయానదురంత చింత నియమితమయ్యెన్ ॥ ౪౭ ॥

క॥ ఏదెసఁజూచిన నదియే మోదమడుచుఁ గానఁ బడెడు ముద్దులుగులుకన్ ।
ఏది వినబడినఁ దన్మృదు। పాదాంగడ శింజతముల భావముదగులున్ ॥ ౪౮ ॥

గీ॥ కాని తాకలగఁ బోవఁగ గలికి యపుడు। మాయమై పోవు కానుప్రమము

లం(జేరి| కన్నుమూసిన వెంటన కానంబడుచు| నన్ను గనుగొంటెవేయని నగుచుం బలుకు॥ ౪౯ ॥

క॥ అపరిచితుండవగుటచే| నెపమిడి చేసపుడు నీకు నెయ్యముమీఱ | యుప ఘనము దాచితి య్యెడ నపశంకత నొసగితి ననయముం జేకొమ్మీ ॥ ౫౦ ॥

గీ॥ మరియు నా కేళి వేళల జరిగినట్టి మాటలను దాహరించి నామాన మడర | నుల్లసంబుల నాడుచుం బల్లవించు (ప్రేమననయంబు ననుమూరుం బేరువాడి ॥ ౫౧ ॥

క॥ ఇది కలయని యెట్లెన్నుదు| నది జాగ్రద్దశలం జేర ననుభవ పథము | స్మది బమని యెటుల నుడువుదు విదితము లెల్లను మెలంగు వితత స్ఫురణన్ ॥ ౫౨ ॥

వి. వయస్యా యయ్యవసరంబున నబ్బాలామణి ధరించిన వసనంబెట్టి చాయ గలదై కానుపించె.

రా॥ విను వచించెద.

క॥ సురభి పయఃఫేనచ్ఛవి భరితంబైనను దదీయ భవ్యవపుశ్శ్రీ | ఖరపరిష్కృత మై మేల్బంగరు మెఱుగులకుముల మిగుల ఘటియించునదై ॥ ౫౩ ॥

వి. వయస్య విశిష్ట ప్రియద వన మహోపకరణ మహనీయ సౌధలోద్భుశ బాలామణీవిలోకనాదికంబులు స్వప్న శాస్త్రింబున నభీష్ట కల్యాణ ఫల(ప్రదంబుల నివి హితంబులగుట వీనిలో నొక్కొక్కటియు నుట్టిదగుటకుం దద్దయు సమర్థంబు - అట్లుండ నన్నియు నీకనుభవ విషయంబులగుటం దదవసరంబు ప్రభాతప్రాయంబగుట ను నీకు వేగంబ సత్యమ్మాభీష్టార్థంబులు లభించు.

రా. స(ప్రమోద వికాసంబుగ - సత్యమస్తు వచస్తవయని నా రెప్పారెకునుడివి ఓవయస్యా నాయభీష్టం బాకన్యారత్న లాభంబుకంటెం గ్రక్కున దెద్ది - అద్దిలభించిన స్వర్గరాజ్యంబైన నభిలషింపను.

వి. వయస్యా నీపతిమాత్రంబు సంఖ్యావత్సంఖ్యాత వైదుష్యండవుగదా. స్వప్నదృష్టంబైన యర్థంబు జాగ్రద్వ్యవహారంబున ననుభవించుట కభిలషించుట సమంజసంబేనా.

రా. కారు వయస్యా నే నెఱుంగుదు - ఐనను మనోవృత్తి తాదృశంబయ్యె అట్లైన వివేకధారవాభ్రాంతి పంకంబపనయించుచు మనంబునకు బ్రసాదంబు సంపాదించుచుఁ గాలయాపనంబునకై యొక్కరుండన మృగయావ్యాజంబునఁ దురంగమంబారోహించి పురపార్శ్వ కాంతారంబునకుం జన నయ్యది యాత్మీయ రయాతిశయ ఖంజీకృతకురంగ తురంగంబై వశసంగతంబుగాక ముహూర్తమాత్రంబున నతి దవీయంబగు వయనంబతిక్రమించి యవిదితంబగు నొక్క యరణ్యానీగర్భంబున నిలిచె

వి. ఆహా బహుళంబగు కష్టంబనిష్టతమం బాదిష్టంబున బ్రాప్తంబయ్యెఁగాఁబోలు.

రా. ఇదివరకు నట్లకానంబడుచున్నది.

వి. అయ్యెడనైన బడలిక యొకటి రెండు దినంబులం బథ్యాహారాది నిషేవణంబులఁ గుందవచ్చునే.

రా. ఈయాయాసం బట్టిదనుకొంటివా - కాదు - అక్కడ గొంత కర్జంబు జరిగె నద్ది వచించెద నాలింపుమని యాహరిణాహృత పారిణేక్షణల సాత్త్రాగవ శ్రవణంబు దొలుతఁగ జరిగిన వృత్తాంతంబంతయు సవిస్తరంబుగఁ దెలుపుచున్నాడు.

వి. స్వ. ఆహా యెంత యాశ్చర్యము - ఆపేటికాంతరస్థిత కన్యారత్నద్వయంబ కాఁబోలు కుంభస్తనిచేఁ దెలుపంబడినది - దైవంబీతని కాబాలామణి సంఘటింపనిట్లొనరించెఁ గాఁబోలు - కాకున్న నిట్లు తటస్థించునా అని స్వర శాస్త్రరాద్ధాంత ప్రకారంబున నాడీ పరీక్షణం బొనరించి యాకన్యామణి నితండు పరిణయింపం గలవాడేయని తలంచి.

ప్ర. ఓయి వయస్యా దురాత్ముండగు నాయసుర సమయించి యార్తజన త్రాణంబున ధన్యాత్ముండవైతివి - వారును వివిధమనోరథ విధంబున వర్తింపఁ గలరు ఇయ్యెడ నీకు విషాదాతిశయంబున కెద్ది నిదానంబు.

రా. కలదే నిదానంబుత్తమంబు.

వి. అద్ది కథనీయంబేనా.

రా. నీకు గోపనీయంబు గలదా.

వి. ఐన దాని నాలీనులనిండింపుము.

రా. ఆకస్మాద్ద్వయంబు స్వప్నంబున నాచే జూడఁబడినదయని తద్వపు ర్భావాది నిరీక్షణంబునం దదీయ స్వరంబునం దదుక్తి వైఖరీ విశేషంబునను నిక్కంబు గఁ దోఁచుచున్నది.

వి. ఈయుదంతంబు నితాంతం బద్భుత విశాంతంబై యుండె - అమందసం బు వసుంధరయందుఁ బ్రవేశింపఁదగు - అట్లైన దాని సంగతిం బరికింతము - విషా దంబు వీడి మజ్జనాది కార్యంబులు నిర్వహింపఁజేయుము - అని దారంపు దెస గనుం గొని - ఓయివ్వండక్కడ - ప్రతిహారిప్రవేశించుచున్నాడు.

ప్రతి. ఓసుబ్రాహ్మణ మణీ నీయనుశాసనీయంబనుశాసింప నీజనుండు గడు వేడుక పడుచున్నాడు.

వి. చెంతకుంజని వానికర్ణమూలంబున నిట్లని జపించుచున్నాడు.

ప్రతి. భవదనుశాసనంబతి మాననీయంబని యట్లొనరించుచున్నాడు.

వి. వెండికడు నంతరంబునకుం జేరి - ఓవయస్యా యియ్యెడ నొక్కమంత నంబొనరించితి దేవి యేతెంచుఁగాని నీవియ్యెడ బొడమిన బడలిక గడు నిబ్బడి గా నభినయింపుచుండుము - మరియు నత్తరి జరుగు చెయువులన్నిటికి విలక్షత వీడి యేమియు ననుయోగింపక నానుకూల్యంబుచే నుండు.

రా. సోద్వేగంబుగ - ఓరీ ఛాందసుఁడా యెంత పని నేసితివి.

వి. నేనేమి నేసితి.

రా. అనిష్టంబు.

వి. ఇది యనిష్టంబెట్లా.

రా. దీనికంటె మఱి యొక్కండను నద్దియెద్ది.

వి. ఏమనుండి.

రా. అద్దినీ వెఱుంగవు గాంబోలు - కానిమ్ము వచించెద వినుము - దేవి పూర్వమందే నాయందన్యాసక్తత శంకించుచుం బ్రసక్తిమాలియుం జిడుముడిలిడుచుండు నేతాదృశంబులగు నిదానీంతన వికారంబుల నాలోకించెనేని మిగులం గుపితయగు - ఇట్లగుననే కాదా యామయవ్యాజంబున నేరికి నలక్షితుండనై యిట్లుంటి.

వి. వయస్య యట్లగునని కాతరత నొందకు - దేవి నీయందతి మాత్రింబనుకంపాసంపాదిత సౌహార్దసాంద్రతయగు నటుల నొనరించెద.

రా. ఆహా కష్టము - నీవుం దోచినంత సేయువాండవు గాని పౌర్వాపర్య విచారపరుండవు గావు - మదీయ భాగధేయవశంబునం గాంగల కార్యంబులు నెరవేరం గలవు - కావున నీయిష్టప్రకారంబున వర్తింపుము.

వి. మంచిది యీభరంబంతయు నీకెందుకు - నీవూరక చూచుచుండుము - కర్తవ్యార్థంబంతయు మన కియవ్వగకు లాభకరంబుగ సంఘటించెద.

రా. ఇయ్యెడ నీవేమి లాభంబు సంపాదించు కొనందలంచితివి.

వి. తినంబోవుచు రుచులడుగనేల - చూచుచుండుము.

రా. ఇట్టి యవసరమందును స్వకార్య తత్పరతయేనా.

వి. స్వయంతీర్ణః పరాంస్తారయతి యనునయంబు భవదీయ శ్రవణ నిలయంబు గాలేదా.

రా. సప్రమోదంబుగ - వయస్య యాత్మసాదృశ్యంబున నన్ను నభిమతార్థ సంగతు నొనరింపుము.

వి. అందుకేమి సందియంబు - నేను వచించిన కరణింగను కని నివసింపుము.

రా. అటుల సలిపెదనని యాతనితో నిష్టాలాపంబు లొనరించుచున్నాండు.

**పిమ్మటం బ్రవేశించుచున్నది భర్తృపీడాకర్శితాత్మయగు దేవియు సఖియు.**

సఖి. ఏమే వయస్యా దివాతన శశికల కళణి మిగుల శోభనీయాత్మవై చూపట్టుదువు.

దే. సవిషాదంబుగ - సఖి యీసమయంబున సమయింపనలవడని కడగండ్లకుఁ బాల్పడితిఁగదా.

స. ఎప్పాంటెనంటివే చెలియా యిట్లు.

దే. ఆర్య పుత్రునకుం బెక్కు దినంబులఁబొడమిన యవస్థ యెఱుంగవే.

స. చెలి యిదివరకు నట్లెయున్నదా

దే. అట్లున్న నేమంబే కాదా.

స. నేను విశదంబుగ నెఱుఁగఁగాని యది యట్టిదో వచింపుమీ.

దే. ఔను ఈనడుమ మనము గలియమింజేసి యిచ్చటి సుద్ది నీకొక్కింతయు విదితంబు గాకుండు - కావున విని చెద వాలింపుము - ఆర్యపుత్రుండు లోఁగడంగింకం జిక్కి యుండుట నీవెఱుంగుదువు గదా - అట్లుండియయో నడుమ నొక్కనాఁడొక్కరుండ ప్రొద్దు పుచ్చుట కని సంజనుజ్ఞాయుండమావు నెక్కి వేట పొంటెఁబేరడవి కింజనెనట - ఆరేయి రెండవ జాము కొంత జరుగఁ దిరిగి యేతెంచెనట - పిమ్మటం బరిచారకులెరును సెలవు నొందక సౌ చెంతకు రావలువదని యానతి సేసెనట - మరియు నొక్కరుండ యాయుద్యాన సౌధంబున నివసించెనట - ఈయుదంతంబు మరునాఁడు దయ సమయంబున దేవిని యాతని చెంతకుం జేరి చూడఁ గద్దయు వివశుండైయుండె - మరియు.

చ॥ అపరిమితావనీశ మకుటాంతర హీరదుదార శాసనుం । డుపచితదర్ప విద్విషది భోత్కర ధైర్యభిదామృగేంద్రి రా । వపటిమ చాపటంకృతియ.వాక్పతి మస్తకతారలీవిధా। నపటుమనీషుఁడైన పతి నాకు వశుండయియుండు నర్మిలిన్ ॥ ౫౭ ॥

గీ॥ అట్టివాఁడయ్యు నన్నని యపుడు పగతుఁ జూచుకదణినిఁ బెడమోము సొలపు మీఱఁ । జేసె నేనిది యేమని వాసిఁదొలఁగి యడుగఁ బిడుగున సరిగాఁగ ననిరొనిట్లు ॥ ౫౮ ॥

క॥ ఓరాజపుత్త్రిని న్గన । నారాటము డెందమునకు నభివృద్ధమగుఁ । నీరాక నే వచించెద । మారాడక మఱలి పొమ్ము మఱి యడుగకుమీ ॥ ౫౬ ॥

అని యుత్తరీయంబున నొడలెల్ల నిండంగప్పుకొని కన్నుండెనని బాష్పంబులు విడుచుచున్నది.

సఖి. సాశ్చర్య ఖేదంబుగ, ఓచెలియా యెంతమాట పుట్టెనే. ఇద్ది పరికింప జాబిల్లి బిల్లి వలనఁ బిడుగువొడముటయుఁ దమ్మిపూలోనుండి యుల్క వెడలుటయుఁగ వోధంబు వలనఁ గాలకూటం బావిర్భవించుటయు నవనీత పిండంబువలన విస్ఫులింగోత్కరంబుదయించుటయు సాధుజనాననంబు వలనఁ బరాపకారైకార్థంబగు భాషణంబు వెలువడుటయునై కన్పట్టు. సమయ వశతంబొడమునవస్థా విశేషంబులనుభవంబు వీఁడి యేరికి నిరూపింప నలవడవు. సైపుము. పదఁపడి యేమయ్యె.

దేవి. సఖి యప్పుడు నామనం బతిమాత్రంబు క్రోధావమాన విషాద నిర్దగ్ధంబగుట నెట్టిదశనొందెనో వచింపఁజాల. అట్టి దానవై వెంటన యేతెంచి కొంతతడికిం దాలిమిం దెచ్చికొని బ్రతికియుండిన శుభములఁబడయువచ్చు ననునయంబు జీవంబున కాధారంబు సేసికొని యవధారిత ప్రాణ పరిత్యాగోద్యమంబునఁ దొలంగితిని.

సఖి. సాశ్చర్యవిషాదంబుగ. హాయెంతపనిపుట్టె. సఖి తొలుతం దత్తరపాటున ననుచిత వికార పరవశవయ్యును బదంపడి సూహామహనీయమనీషవైతివి. అయ్యెడ నీకు "సహసావిదధీతనక్రియామవివేకః పరమాపదాంపదం - వృణతేహివిమృశ్యకారిణంగుణలుబ్ధాస్స్వయమెవసంపద" యను కిరాతార్జునీయ పద్యంబుపస్థితంబయ్యెనని తలంచెద.

దేవి. సఖి యౌను.

సఖి. చెలి యట్లగుటంజేసి వెసఁగ సకల సౌభాగ్యసంపదలకు జననికేతనంబగుదువు.

దేవి. చెలియ యిదివరకైతే యట్టి తలంపు విలసిల్లుగాని యధునాతన స్థితి వితర్కింపఁ బోచకున్నదే.

సఖి. అది యెట్లు.

దేవి. పెక్కువాసరంబులనుండి స్నాన పాన భోజనాది కృత్యంబుల నెక్కెంతయైన వర్తనంబు దలవక నైదాఘునిమ్న గౌఘంబు చాడ్పున నతికృశుండై యార్యపుత్రుండుండ నాశుభాభిలాషంబెట్లు ఫలించునని తలఁతు.

సఖి. కించిదవసరంబు చింతించి. ఓచెలీ యిద్ది భూతావేశమూలకంబేమో యని తోచుచున్నదే.

దేవి. సాశంకంబుగ. వయస్య యార్యపుత్రునకు వద్ది గలుగునే.

సఖి. ఆయనకుఁ బురాతన మహిమంబునంజేసి యిది యనధ్యాహార్యంబే కాని యిప్పుడు సూహనీయంబుగావచ్చు. అది యెట్లంటివేని విను. గ్రహంబులుద్దారుణంబులగు నరణ్యంబుల శరణంబులం జేసికొనియుండుననియు దుర్బలులగువారు దారసిల్లిన వారి నావేశించి బహు భంగుల బాధించుననియు జనశ్రుతి సంగతంబగు. కావున నీ వయస్యుండును లోఁగడఁ గింకనతి ఖిన్నుండైయుండి యచ్చటి కేగఁ గావున నవ్విసోఁకియయుండందగు. కావున భవదేకప్రాణుండగు నీతండు నీయెడ నిట్టి విరసవర్తనంబు సలుపునా.

దేవి. సఖి నీకు నిట్లు తోచుచున్నదా.

సఖి. ఔను - ఇది యటుండనిమ్ము - పెఱలకేరికైనా నిట్టి వితర్కంబు గలిగెనా

దేవి. ఇంతకుమున్న మాకెవ్వారికియు నిట్టి యూహ యుదితంబుగా లేదు గాని సుబ్రాహ్మణుం డార్యపుత్త్రి ప్రియవయస్యుండగు విదూషకుండతకు లోఁగడనే యాయనంగని యేమి పరికించియోగాని గ్రహబలిసాధనంబులగు పదార్థంబుల నహాజనంబుచేఁ దారిపించికొనియే తేరవలయుననని వార్తన సేసె.

అట్లైన నద్దియ నిక్కంబగు.

దేవి. తదీయ వచన విశ్వాసంబున నేను నట్ల సలుప నుద్యోగించితిని.

సఖి. అట్లైనం దడవు వీడి వేసఁగ నట్లొనరింపుము - నేనును వెండియు నేతెంచెదనని నిర్గమించుచున్నది దేవియుఁ దాత్కాలిక కృత్య నిర్వహణంబుకై యుద్యోగించుచున్నది.

పిమ్మటం బ్రవేశించుచున్నది. ప్రాణనాథ సౌధంబహుజన సంవాహితత్రినయన ఫల పరిస్థూల మహాస్వాద ద్వాత్రింశల్లడ్డుక మహారజత పాత్రియుఁ దాదృశపాక పాటల గోక్షీర భరిత కనక కలశయుఁ బరిమిత పరిచారికానుగతయు దేవి.

వి. ఈషద్దూరంబున దేవిం గాంచి- రాజాంజలిం ఘటించి వయస్యా దేవియేతెంచుచున్నది గాని విపశుండవు గాక వైరస్యంబభినయింపుచు దేవితో సేవచించు వచనంబులకనుకూలంబుగ నప్రమత్తుఁడవై ప్రవర్తింపుమని దేవి కభిముఖంబుగ.

దే. సుబ్రాహ్మణ యాజనము ప్రణమిల్లుచున్నది.

వి. దేవి సమగ్ర సౌభాగ్య సాధ్వీమతల్లిక యగుత.

దే. సుబ్రాహ్మణ భవదాగమంబునంజేసియియ్యెడ నిచ్చటికి రాఁగలిగె.

వి. దేవి యిట్లు వచింపనేల యంతరమ్మునకేతెమ్ము.

దే. అందుకుఁదొల్లింటి యార్యపుత్రుండు గాడు గావున నేనొల్ల.

వి. దేవి యవశంబునం బొడము దోషంబు లెన్నుట మహితమతుల కుచితంబేనా.

దే. (స్వ) ఆర్యపుత్రునకట్టి వికారము వొడమ నొక్క కారణంబుండవలయు - (ప్ర) సమనాగమర్షంబుగ - అవశత కెద్ది నిదానంబు.

వి. ఇయ్యెడ నేవచింపం జాలను గాని నేనుడివిన చొప్పు చేసితివేని యప్పుడాలోచించి వచించెద.

దే. ఇపుడేమి సేయవలయు.

వి. ఈపదార్థంబులతోఁ గూడఁ బతిచెంత కేతేరవలయు.

దే. ఆర్య పుత్రుండు మిగుల నలుగఁడుగదా.

వి. ఇట్టి సంభాషణంబుల కిద్ది యవసరంబే.

దే. పరిభవంబు విషాద ప్రభవంబుకదా.

వి. తత్కర్తృచిత్తవృత్తివికృతిం జెందకుండిన.

దే. అట్లైన నీయిష్టంబు చొప్పున వర్తిల్లెదనని యందరితోడం గూడి పతి సమీపంబున కేతెంచుచున్నది.

వి. దేవి ఈవస్తువుల నిక్కడ నివసింపం జేయందగు.

దే. అట్లాజ్ఞాపించుచున్నది.

వి. దేవి వయస్యుం డెట్లుండెనో చూచితివా.

దే. కాంచి చింతాకులిత స్వాంతయగుచు హాహా యార్యపుత్రుండు.

కం॥ గృహపాళీ దాహకహుత। వహమహాదాభీలకీల వాతాటోప। ప్రహత మగును పవనాంతర। విహితకురసకదళి తరువు విధమునునుండెన్॥ ౫౭॥

ఉ॥ కాంచి జలంబులందిడిన కాంచనవల్లికవోలె వెల్లనై। నీచరుచిన్ వహించు మెయి నిద్దితముల్ పలె భద్రలీలలన్। దోచవుకన్ను లూర్పులతిదూరములై కడు వెచ్చనెచ్చగా। వీచెడునీతడిప్డు వెతవెల్లుల పాలయియుండు నయ్యయో॥ ౫౮॥

మఱియు.

చ॥ దినకరదీప్తి సంవరణ దీనసుధాకర మూర్తివోలె నీ। తనితనురూపు తద్దయు మదావళితీవ్రవికీర్ణ నీరస ద్వనరుహశోచనీయమును వక్త్రము గాత్రము లెల్ల నాహుతా। శనగతిందాంత పల్లవదశావళతంగను నిప్పడక్కటా॥ ౫౯॥

అనుచుం బరిదేవించు చున్నది.

వి. దేవి యీపీఠంబునం దుపవేశింపుము. ఈబలివస్తు పాత్రంబిచ్చుట నంపించుము.

దేవి. (యట్లొనరించి) యోయి సుబ్రాహ్మణా చూచితివిగదా నీవయస్యునవకుం బొడమిన యవస్థ.

వి. దేవీ యౌను. కాలవశంబున నెట్టివారికి నెట్టికష్టంబులు నేతెంచుట విధి తంబకదా.

దే. ఈరాజిట్లు కృశించుటకే నిదానంబసిత పక్షాయితం బయ్యెనూనేఁ బరి కింపం జాల నీవు సుగ్రాహ్మణుండవగుట శక్తుండ వగుదువని తలంచెద.

వి. దేవీ యిటువంటివారి కారణంబులు నిరూపింప నేనును మిగుల నెరవతిని గాను. అయిన నాతెలివి బలిమికొలఁది వితర్కింపనిది గ్రహావేశ మూలంబని తోచు చున్నది. అందుకుఁ గతంబును ఖిన్నుండై యుగణ్యానిం బ్రవేశించుట గావచ్చు.

దే. దీని నికర్కుంబెట్టు విస్పష్టంబగు.

వి. అద్ది పరీక్షించుటకరయే కాదా నీకట్లు వార్త నంపితిని.

దే. నీవు వచించిన వస్తువులన్నియు నానీతంబులయ్యె నిపుడేమి కర్తవ్యంబు.

వి. దేవీ యీపదార్థంబులన్నియు నీతని మోముచెంతకుం జేర్చి యోగ్రహ వరమాయాగ్రహంబువీడి యిపుడీయర్థంబు లాస్వాదించి యీయనకుం గుశలంబు సంపాదింపుమని ప్రార్థించి కొంత తతి యట్లుంచి పదంపడి యొక్క దుర్గతి విప్రున కు యత్కించిద్దక్షిణా సమేతంబుగా దానంబొసంగుము. అట్లగునం బిమ్మట దాని గుణాగుణంబులు గొంతవట్టుకుఁ దెలి యుందగు.

రా. స్వ. ఆహా యీతఁడెంత గడుసు చాపలంబున లడ్డుకంబుల భక్షింపం గోరి మదీయంబు మదన నిదానంబగు వాధికి గ్రహావేశ మూలకతం గల్పించుచున్నాఁ డనుచు వికపితాననుండగుచున్నాఁడు

వి. దేవీ మావితివా సయున్యని వదనంబు మన మీబల్యర్పణవిధిఁ దలపఁగా సంత వికసితంబగుచున్నది. కావున సత్వరంబుగ బలివర్పింపుము.

దే. అట్లొనరించుచున్నది.

రా. తదీయ కైతవ ప్రమాదాకలన నిదాన హాసనంబ పహ్నవింపంజాలక ము ఖంబు వికాసాధీనంబు సలుపుచున్నాఁడు.

వి. దేవీ కనుఁగొనుము. ఈరోఁడ వయస్యాని యాననంబు దొల్లింటికంటె వికాస విశదంబగుచున్నది. కావున గ్రహంబీయెడ నీతనిఁ గొంతవట్టుపడి బలిద్రవ్యం బావహించి యాస్వాదించుచున్నదని తోఁచెడి. ఇద్దియ నిక్కంబుగావచ్చు.

దే. సుబ్రాహ్మణా యిదికామినీ గ్రహంబు గావలయు. కాకున్న స్త్రీయాజ్ఞోవిజితపుం గ్రహాధీశ్వరుండైన యార్యపుత్రునిఁ బరగ్రహంబు లెట్లు బాధింప శక్తంబులగు.

వి. దేవీ నూనంబ భవదీయ వ్యాహారంబు మానంబని యెంచెదను. అదియును మున్ను మున్ను విస్పష్టంబుగాఁగలదు.

రా. స్వ. సభయంబుగ ఆహా కష్టము కష్టము. ఈమూఢుఁడు దొలుత నాకెఱుంగింపకయు దేవి రాపించె. ఆపె నగ్గాంచి యీవికృతి కామినీ గ్రహావిధానంబని యట్లో వితర్కించి వచించుచున్నది. ఇంక మిగుల నధిక్షేపింపక మానడు. కావున నిత్యశంకితయగు దేవివల నంబరీభవభీతుండనగు నాయెడల దీని యుద్యమంబు వ్రణవ్యధార్తునకుఁ గటుశలాటుపంక లేపంబగుచున్నది అనుచు సదైన్య క్రోధంబుగ విలోకించుచున్నాఁడు.

వి. విదిత తదభిప్రాయుండగుచు - ఓ గ్రహరాజమా నీ నిక్కంబు బయలు వడునని చింతింపకు - ఈజీవి చాలదనియు విచారింపకు నీయిష్టం బొడఁగూర్చెదము - అని కేలింగాంచి - ఓ దేవీ వయస్యుం డనామయుండయ్యె నేని మన మేమి సేయ నెయ్యది గొఱంత.

దే సుబ్రాహ్మణ మన సౌభాగ్యంబంతయు నార్యపుత్ర మూలకంబకదా - సంతోషంబున నట్లొనరింతము.

రా. వికసితముఖుం డగుచున్నాఁడు.

వి. దేవీ వయస్యుం డీనాఁడెను దొల్లింటికంటె బ్రసన్నుండయ్యెండునని నే నెంచెద. నీకేమి తోఁచుచున్నది.

దే. నాకునట్ల తోఁచుచున్నది.

వి. దేవి యట్లైన నార్యపుత్రు సెజ్జంజెంది కుశలం బనుయోగింపుము అను కూలంబులగు నుత్తరంబు లొసంగె నేని మీద నాలోచింతము.

దే. మంచిదని యాతని తళివాంబునం దుపవేశించుచున్నది.

రా. దీనస్వరంబున దేవీ శాంతకురమ్ము తావకీనకర సరసిజ స్పర్శవంచితం బగుటచేతం బాచితివా నా మేనెట్లున్నదో యని యత్యుగ్గారం బొనరించుచున్నాఁడు.

సీ. సవిశేషంబగు విషాదంబునం గలుషిత మనీషయగుచు హా యార్యపుత్రా నీకిట్టి కష్టంబు గ్రహమూలంబై యేతెంచినని తెలియలేక యవివేకంబునఁ బాపలమూలకంబని తలంచి మహాపరాధినైతినిగదా.

రా. దేవీ నాయభాగ్యంబునకు నీవేమి సేసెదవు.

దే. ఆర్యపుత్ర యీయభాగ్యంబునకుం బ్రధానస్వామిత్వంబు మదధీనంబ - అని యతి యత్నసంస్తంభిత బాష్పయగుచుఁ దనపాణి పల్లవంబున నతని మేనంట౦ బుడుకుచున్నది.

వి. వయస్యా యీనడుమ నుపవాసంబుల మిగులం డస్సియుంటివి - ఇపుడు బుభుక్ష యేమైనం గలదా.

రా. సనిశ్వాసంబుగ. ఇదివరకైతే యామాట శ్రుతిపుటంబులకుఁ దప్తసీస సరసత నిచ్చెడిది గాని యిపుడట్లుండలేదు.

వి. దేవీ గ్రహంబీషత్ప్రస్తంబగునని తోఁచెడి - దాని సంగతి యంతయుఁబదం పడి పరికింతము నీవు వేళంబ వయస్యునకు నిష్టంబులగు పాకంబుల సలిపించి యథేష్టంబుగ భోజనం బిడుము.

దే. ససిశ్వాసంబుగ ఆహా యెన్ని దినంబుల కీభాగ్యంబునకుఁ బాత్రం బయితిని - కాని యింకొకమాట ఇద్ది నీ చేతెంచుటచే నిపుడు నాకు లభ్యంబయ్యె మొదటినుండి నీవియ్యెడనుండిన నింత కష్టంబు వాటింపక పోవును.

వి. దేవీ గతంబునకుం బరితపించుటయు భావికిం బరిశీలింప మియుమూఢ లక్షణంబులు గాని పండిత లలామంబులుగావు - కావున నిప్పుడట్లు సలుపుము,

దే. ఇంతకంటెఁ బెరకర్జం బెయ్యది - ఇది యెంతసేపు ఇదిగో యుద్యోగని ష్క్రమగత జనసమేతయగుచు నిర్గమించుచున్నది.

రా. వయస్యా దేవి సపరివారయయి దూరంబుగ వెడలెనా.

వి. చాల దవ్వటిగె.

రా. ఓరి శఠుఁడా యెంత కార్యం బొనరించితివి.

వి. సహసంబుగ నే నేమిసేసితిని.

రా. నీ వెఱుంగవా యింతకంటెఁ గర్తవ్యం బెద్ది.

వి. నీకు దయ్యంబు సోకెనని బలిచ్ఛలంబున లడ్డుకాదులం దెప్పించుట.

రా. కాదా.

వి మఱియేమి సేయుచున్నావు - నిన్నఁ బ్రొద్దువనఁగా నత్తిసరన్నము దిని బయలుదేరి రాత్రి వేళ నిద్రలేక నెనిమిదామడలు నడిచి నడిచి ప్రొద్దు పొడుమట వ రకు వచ్చితిమి. ఎంత యాయాసము గలిగియున్నదని చెప్పరాదు - ఒకమూల నాకలి యు నొకమూల నీ యవస్థయు నొక్కుమ్మడి బాధింప దొణంగె - కావున నట్లొన రించితి.

రా. సస్మితంబుగ - ఓరీ మూర్ఖా నీకు బుభుక్ష గలిగిన నంతరంబునకేగి య డుగ నిష్టంబులగు నర్థంబులు దేవి యొసంగదా.

వి. సరె బాగుగానే చెప్పినావు - ఇట్టి నియవస్థ కట్టి విపాదించు దేవిని నా కాహారంబిడుమని యడుగుటకు నేనంత ఛాందసుండననుకొంటివా - అదియునుం గాక శాసనంబున సిద్ధించు కార్యంబునకుం బ్రార్థించువాఁ డెట్టి వెఱరి.

రా. ఔరా మంగి వెరపరివి.

వి. ఇంతమాత్రిమే చేతఁగాకున్న నతిదుర్లభం బగు నీయభీష్టం బెట్లు సమ కూర్ప నేర్పరినగుదు

రా. సస్నేహంబుగ వయస్య యట్లు పరికించుచుంటివా.

వి. సప్రియ కోర్థంబుగ - కాకున్న మాకుం బ్రతుకు టెట్లు.

రా. ఓప్రియసఖా దానింగూర్చి యెట్లాలోచించు చున్నావు.

వి. ప్రియ పరిణామంబగు నవర్షంబున - ఓయీ కొంతసేపూరకుండుమా నేనాకటి కోర్వలేక యెంతో యాలోచించి యీలడ్డుకంబులు దుగ్ధంబుతోఁగూడరా వించికొంటిని. పిమ్మట నెంతో యుపాయంబుని దేవికిం దగిన పల్కులు పలికి యిక్కడనుండి వెడలించితిని. ఇప్పుడవి విన నుద్యోగించిన స్వప్నదృష్టయగు కన్యామణి సెజ్జకుం జేరినఁగాని నన్ను భుజింప నివ్వనట్లున్నావు - చాలుచాలు - కొంతసేపూరకుండు.

రా. సాతిహాసితంబుగ - ఓకి మూఢా నీవు సర్వదా యుదర పూరణ పరాయణుండవేగదా.

వి. సధార్ష్ట్యంబుగ - బ్రాహ్మణోభోజన ప్రియయను వచనంబు మఱచితివా- ఇది నానొసట నే విధి వ్రాసెనా.

రా. సస్మితంబుగ - సుబ్రాహ్మణా యథేష్టంబుగ నీలడ్డుకంబుల నాస్వాదించి - దుగ్ధంబానుము.

వి. సవికాసంబుగ వయస్యా యట్లు వచింపుము బాగు పిదప నెమ్మది నున్న నన్ను నడుగం గలయను యోగంబుల నడుగుము వచించెద - అంతవట్టుకు నడుమ నడుమ మాటలాడింపకు.

రా. మంచిది - అంతవట్టునకును నీకు విముఖుండనై యుండెదగాని యిష్టంబు వచ్చినట్టు భుజింపుము.

వి. సవిహాసితంబుగ - మహారాజవు నీవట్లుసేసిన బ్రతుకుదును. లెస్స లెస్స యను యట్లొనరించి పరితృప్తి నభినయించుచు వయస్యా యేమంటివి.

రా. నాయభిప్సితంబు ఫలితంబుసేయ వెరవెద్దియైన జింతించితివా.

వి. అవునుగాని నీవొక్క చెయువొనరింపవలయు.

రా. వయస్యా వచింపుము - దానిశిరంబునం జేసెద.

వి. స్వప్నదృష్టయగు దానియాకృతి యొక్క చిత్రఫలకంబున వ్రాయవలయు.

రా. సప్రమోదంబుగ - మహనీయంబీ యనుశాసనంబు.

వి. అట్లయిన దిష్టంబు నీయిష్టంబ కష్టంబుగ నెరవేర్చునని వితర్కించెద.

రా. నీవితర్కంబు సుతర్కంబగుత - అట్లయిన నాజీవితం బుచితంబగునని నిశ్చయించెద.

అని నిష్క్రమించుచున్నారు.

పిమ్మటం బ్రవేశించుచున్నారు బ్రాహ్మణి సపరిచారికగు దేవియు.

బ్రాహ్మణి. పరిచారికం గని - ఓసీ కనకాంగీ దేవి మిగుల నవసియున్నట్లు గానంబడు - కతంబెయ్యదియో.

కనకాంగి. ఔనమ్మా దొరసానిగారు మనంబున నవసియున్నారు.

బ్రా. అందుకయ్యది కారణంబు.

క. ఏలికగారి యొడలునం గడుబడలిక వొడమె - దొరసానిగారందఱి గతితలపంటివారు గారుకదా - దొరగారిమేన నొక్కింతయైన వెక్కరు గలిగినవారికంటె మిక్కిలి బాధనొందుదురు.

బ్రా. దేవి సతి శిరోమణి రమణైక ప్రాణ సకల ధర్మతత్వజ్ఞ గావున నిట్లుండవలసివచ్చె - ఆహా యెంతకష్టము - రాజుగారికి నస్వాస్థ్యం బెన్నివాసరములనుండి.

క. పెక్కునాళ్ల నుండి యమ్మా.

బ్రా. సుధా సదృశంబులగు నౌషధంబులకు సేవధులై ధన్వంతరి సదృశులగ్గనగదం కారులుండిరి కదా వారియెడ నొడయని కారోగ్యంబు సొంపొంద నొనరింపరేని రాజకృత గౌరవ పోషణ పాత్రత్వంబులవలన నెట్లు విముక్తులు గాగలరు.

క. అందుకు నేనేమి నుడువగలనమ్మా.

బ్రా. దేవి వదనంబున లక్షించుచున్నది.

దేవి. సనిశ్వాసంబుగ - నియతికృతంబులగు సాభీలంబు లనుభవింప కేరికిఁ బరిహరణీయంబులగు.

బ్రా. దేవి యజ్ఞానవశంబున నిట్లు తలంచుటయ కాని తత్త్వదృష్టిం బరికింప నంతమాత్రింబే కాని యొక్కటి యాలోచింపవలయు - జన్మాంతరకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే। తచ్ఛాంతి రౌషధైర్దానైర్జపహోమార్చనాదిభిరిత్యాద్యభియుక్త పురుషప్రోక్త విధులు శ్రుతి విధంబులై విలసిల్లుచున్నవికదా - మహారాజుగారికీవిధులన్నియు సుకరంబులే - కాక ఫలదంబులును - కావున నవియాచరింపఁబడ లేదా - ఆచరింపఁబడియు వితథంబులయ్యెనా.

దే. ఈయెడ నెవ్వియు నొనరింపఁబడలేదు.

బ్రా. ఎందునుండి.

దే. ఆర్యపుత్త్రుండీయెడ నెందుకు నవకాశంబీకుండుటను.

బ్రా. కొన్ని దినంబుల నేయుపాయంబులైన వినియోగింపఁ జేసెనా.

దే. తొలుతం గతిపయవాసరంబు లౌషధ సేవం జేసె.

బ్రా. తొలుతం బొడమిన తనువికృతం బెట్టిది.

దే. ఒక్కనాఁడు ప్రభాతంబున మేల్కని యత్యలస భావపరీతుండై స్నానాది కృత్యంబుల విముఖుండై యుండె - అయ్యెడం జికిత్సకుల రావించి యౌషధ ప్రయోగంబు లొనరింపించితి - అయితే వారివచన ప్రకారంబు మితాశియై యుండవచ్చునా యట్లుండలేదు.

బ్రా. దేవి భవద్వచన సాధనంబుండకదా యా నృపశిఖామణి.

దే. ఔను నిక్కంబకాని యియ్యెడ నానుడువుం గరుణింపఁడయ్యె నేఁడుం గేవలాహార స్వీకారాభావం బయ్యె నేనిఁ దద్దయుఁ గృశుండగునని యొత్తి వచింప వెఱచితిని.

బ్రా. ఈయెడ నౌషధసేవ సలుపుచుండెనా.

దే. లేదు.

బ్రా. అందుకెద్ది నిదానంబు.

దే. అట్లుండ నొక్కనాఁ డేకాకియై యనుయాయియగు ననుచరవర్గంబు మరలించి మృగయావినోదంబు సలుపుదునని నాతో వచింపక యే యొక్క మహాశ్వం బారోహించి చనియె. మరలి రాత్రియందు సార్ధయామం బతీత ప్రాయంబుగాఁ జేతెంచి యాయశ్వంబువలన నవరోహించి సంఘటితేతకవాటుండై యుపహర్మ్యాంతరంబున నుండెనట. అంత నశ్వపాలకుండేతెంచి యాయశ్వం బతిమాత్రఖిన్నంబుగాఁ దలంచి తగిన యాహారంబిడి దాని సంరక్షించెనట. మరునాఁడు దినకరుండుదితుండైన కొంతతటికి లేచి యశ్రాంతాల సతాక్రాంతుడగుచు నాత్మీయదర్శనాగతులైన భిషగమాత్యాది వర్గంబునకు సరేకదా నాకును నానియమంబువీడి రాఁగూడదని శాసనంబు విదితంబు సేసె.

బ్రా. ఆహా యెంత ప్రమాదంబు సస్థితంబయ్యె - మహారాజునిసర్గంబున రీషకుసుమ సుకుమార శరీరుండును సౌందరీవర్ధిత రతిరమణుండు - ఇట్టివాఁడు నవసి మహారణ్యంబు సొరఁదగునే- ఆయరణ్యం బతిమాత్రదృప్తక్రవ్యాద బలాత్కారసంహత మహాభూతంబై యుండుట బహువిధగ్రహాక్రమంబునగు - ఈయెడ నీ మహారాజతి ఖిన్నుండై యుండెఁగావున నెద్దియైన నియమ నాపహించి యుండవలయు కాకున్న నిట్లాహారాది పరాఙ్ముఖుండై యుండునా.

దే. సవితర్కంబుగఁ బరిచారికం గాంచుచున్నది.

ష. అడఁకువమరరాణిగారూ డెందమునం దలంపుఁడు ఈయమ్మగారు వినిచిన పలుకును నిక్కంబై యుండు - జగంబున నిట్టి సుద్దులు గలిగేయున్నవి.

దే. సుబ్రాహ్మణి నీవచనం బాదరణీయంబై యుండు - అదియు నాలోచింపవలసినదే - దీని నిక్కంబు తెలియుటకేమియుపాయంబు.

బ్రా. దేవీ [illegible] సనాది పక్షంబున నితరమనోగతార్థని వేదన సమర్థ

లగు విప్రప్శ్నిక లక్కడక్కడ నుండుదురు - కావున వారిరావించి యనుయోగింప దీని తత్వంబు విదితంబగు.

దే. స్వ. ఇద్దియు నాశ్చర్యకరంబై యుండు - వెనుక విదూషకుండు నిట్టు చెప్పె అంతమాత్రంబకాక బలిసమర్పణంబున బహువాసరంబుల నాహారాదిపరాఙ్ముఖుండైన యార్యపుత్రుండు కాసంత ప్రకృతిం జెందియుండె అయ్యో యిదివరకు నేను గానకపోతిని - ఇద్దియతథ్యంబు కావచ్చు - కావున దీనికిం దగిన ప్రతిక్రియఁ బరికింపవలయు. ప్ర. జే ను నీవచనంబు లెస్సగ నున్నది - అట్లొనరింతమని పరిచారికం గాంచి ఓసీ చంపకవల్లీ నీవు రచ్చకేగి విప్రశ్నిక లెవ్వరైనఁ గానంబడుదురేమో కాంచిరమ్ము.

చంపకవల్లి. ఏలికరాణిగారి యానతి తలపూవని నిర్గమించుచున్నది.

బ్రా. స్వ. ఆర్యపుత్రుండు మాతరాలునుని విప్రశ్నికావేషధారిం జేసి పను పందలఁచి తత్ప్రవేశానుకూల్య సంధానంబుకైనన్నుఁ బనిచె ఈయెడ వాఁడూరకున్నను గాక మఱియొకతె యేతెంచి పెరకరణిం దెల్పినను నీయుద్యమంబంతయుఁ గాణ నయనాంజనాలంకరణంబు కరణి మోఘంబగుఁ గదాయని చింతించుచు దేవీ వ్యసనానుకరణం బభినయించుచున్నది.

మఱలఁజేరుచున్నది చంపకవల్లి.

చం. దేవి చాల పరికించి యేతెంచితి - తొలుత నెఱుక నొంతిన వారెరును గానంబడలేదు - కాని యొక్కయాపె జడదారి కప్పురంబుకంఠెం దద్దయచ్చంబగు బూడిద పూనుకొని కావి చీరెఁగట్టి తావలంబుల మెడనూని బికిరంబు తట్టి కేలందాల్చి యీవీథిన యేతెంచుచున్నది - ఈసుద్ది తమతో మనవి సేయుదునని గ్రక్కున నేతెంచితి.

బ్రా. స్వ. హా యార్యపుత్రుని యత్నంబు ఫలితంబయ్యెనని సంతసించుచు నభిలాష విషయార్ధ లాభజత్వ చ్ఛలంబున దానిం బ్రకాశింపఁజేయుచున్నది.

దే. కొంతసేపు పరికించి - సుబ్రాహ్మణి యిట్టివారిలో విప్రశ్నికులుందురా.

బ్రా. దేవీ యిట్టివారికి విప్రశ్నికాత్వంబన నెంత - వీరు మహా యోగినులని తోచుచున్నది.

దే. వారిలో విశేషంబు కలదా.

బ్రా. దేవీ యోగినులకు విప్రశ్నికలకుం గంగాకుల్యలకుం బోలె మహత్తార తమ్యంబుగలదు - దేవీకృతార్థవైతివి - విప్రశ్నికాన్వేషణంబు సేయ యోగినీ సమాగమనంబగుట భైషజ్యార్థంబు నోషధుల నన్వేషింపువానికిం దత్ప్రకృతిక దివ్యౌషధ లాభంబుగదా-మఱియును అవ్యాక్షేపో భవిష్యంత్యాః కార్య సిద్ధేర్హి లక్షణమ్మను నార్యవచనమ్మున నిది మహిత మంగళ నిదానంబు.

దే. సవికాస వదనయగుచు - చంపకవల్లీ నీవు సత్వరంబుగ నేగి మద్వచనంబున నాపెను దోడ్కొని రమ్ము.

చం. దేవి యానతిచ్చిన కుతుకతాయని యట్లొనరించుచున్నది.

దే. ఆయోగినిం గనుంగొని ససంభ్రమ కృతోత్థాన యగుచు భగవతీ యీ పీఠం బలంకరింపుము.

యోగిని. అట్లొనరించుచున్నది.

దే. భగవతీ స్వాగతంబుగదా.

యో. దేవీ భవత్ప్రసాదంబున.

దే. భగవతీ నీకు సుఖంబకదా.

యో. దేవీ భూతమయంబగు ప్రపంచంబు కుశలవంతంబగునంతకు మాకు దాని లోపంబు గానంబడదు.

దే. స్వ. ఇట్టి మహాత్ములకు సర్వభూతంబులం దాత్మభావంబు పరిపూర్ణంబై యుండు - కావున్న యిట్లు వచించునా. ప్ర. భగవతీ అనాద్య విద్యావరణ నిరాకరణం బొనరించుటం బరిస్ఫుట ప్రద్యోతంబగు నాత్మజ్యోతి స్ఫురణంబున సమ

స్ఖాలిత తమస్స్తోమగంధంబులగుట నతిప్రసన్నంబులగు మానసంబుల విలసిల్లు మహామహుల కానంద సందోహంబు నిష్పందంబ యగుచున్నది.

యో. సాశ్చర్యంబుగ - అహా దేవీ విదుషీమణీ యాజననం బవిదిత విషయానుభవ లేశంబులై యింద్రియ నిరోధంబువలన నేమరక మఱిమఱి తపస్సమాచరణ కర్శిత శరీరంబులై వర్తిల్లు జనంబులకెల్ల దుష్ప్రాపంబగు నర్థంబు మనోహర తారుణ్య శరణ్యాంగివియు మహారాజ పత్నివియు నగు నీయవధీరిత సుధావిధంబులగు సంభాషణంబులు శ్రవణానంద ఘనులగుట నజస్రం బాశ్చర్యంబగు - అహా నీవిజ్ఞాన విభవంబు.

దే. భగవతీ యిట్లు వచింప మాదృశజనం బెంతమాత్రంబు - అప్పుడప్పుడు నైసర్గిక కరుణా సమాగత భవాదృశయోగినీ మణుల నుగ్రహించిన వచనంబులం గొంచె కొంచెము తెలిసికొని యిట్లంటినిగాని నే నేమియుఁ దెలియ నేర.

యో. దేవీ నీవు సంవిన్మయాత్మ నగుట మాదృశజనంబుల గారవించుట నీకు నైసర్గిక గుణంబ - అయిన నీయెడ మదీయాహ్వానంబు సకారణంబనిస్ఫురించుచున్నది - మఱియు విశ్రాంతయునైతి కావున నం ప్రష్టవ్యాంశం బనుయోగింపందగు.

దే. భగవతీ భవాదృశ ధన్యజన కృపావలోకనంబునన తరణి కిరణ ప్రసరణంబునఁ దామరస సంకోచంబు కరణి మాదృశజన విపదంబు లపదంబులై నశించు - మఱియు నభినుత శ్రీవిలాసంబులును విలసిల్లు - అయిన నీయెడను పస్థితంబైన కష్టం బతిదుష్టంబుగావున వచింపవలయు - అయిన నీవిపత్కారణంబు నైతము భగవతియ సెలవిచ్చె నేని ప్రతికార విధియందు మామకీన మానసంబ జస్రవిశ్వాసాశ్రయంబగు ననియుత్సహించెద.

యో. దేవీ నీయుక్తి యుక్తి యుక్తంబ - నీయభిలాషం బట్టిదేని యట్లు వచించెద - అని తోడెంబుతటి ధ్యానాధీన మానసతంగల్యకాలిక కుశేశయ పలాశవేశా వేశనంబులగు నయనంబులకుం బ్రొహ్మానసావ నలినదళ కళల తళతళలకు నళిందత నలవడంజేసి వచించుచున్నది - ఓ దేవీ భవదనుయోగంబు విషణ్ణ రమణ క్షేమ విషయంబు.

దే. భగవతీ యోంవిషణ్ణతకిం నిదానకంబు.

యో. గ్రహావేశ నిదానకంబు.

దే. ఆగ్రహం బెయ్యెడ నావేశించె.

యో. మహారణ్యాంతరంబున.

దే. ఆర్యపుత్రుండచ్చటికేగ నెద్ది కతంబు.

యో. లోగడ నొక్క కతంబునం గలుషిత చేతస్కుండై కాలవినోదంబు సేయఁగోరుట.

దే. ఆగ్రహం బెయ్యది.

యో. రాక్షసగ్రహంబు.

దే. అయ్యదేమి కామించి యార్యపుత్రు నావేశించె.

యో. వైరనిర్యాపణంబు.

దే. వైరంబున కేమి కారణంబు.

యో. ప్రాక్తనతను విసోజనంబు.

దే. దానికెయ్యది మూలంబు.

యో. ఈభూరమణ చూడామణి యార్తజన సంత్రాణ పరాయణుండగుట.

దే. ఆగ్రహంబు దొలుతం గిమాత్మకంబు.

యో. నక్తంచరాత్మకంబు.

దే. ఆనక్తంచరుం డెట్టివాఁడు.

యో. మహాబలమాయా నిలయుండు.

దే. అట్టివాని సమయింప నార్యపుత్రుండొక్కరుం డశక్తుండయ్యెనా.

యో. తదీయాయురవసానంబు బాసటయగుటం దాపృశుండయ్యె.

దే. అత్తఱి నిరువురకుం గొంతదూరంబు దురంబయ్యెనా.

యో. ఘోరతరంబగు సమరంబయ్యె.

దే. అయ్యంతరంబున నార్యపుత్రుండు పరప్రహరణ ప్రహారంబుల నిపీడిత గాత్రుండయ్యెనా.

యో. తత్ప్రహారంబుల కీతండు శరవ్యంబయ్యె నేని యిట్లుండు నెట్లు.

దే. అట్లయిన నిర్వ్యాపారవాణుండగు నార్యపుత్రునకుం దద్వ్యాగణంబెట్లు గలిగె.

యో. సాధ్వీమణీ యెయ్యెడం భవదీయ సౌభాగ్య మహిమాలంకృతంబగు తదీయ సుకృతంబు వారవాణంబగుట తదీయ హయంబు తదధిష్ఠితంబగుటం దత్ప్రహారణప్రహార జర్జరిత శరీరంబయ్యె నాయుశ్శేషత నొందె.

దే. ఆగంధర్వం బీయెడ నెట్లుండె.

యో. ఆసైంధవం బిదివరకును నాశ్వ్యాన ప్రాంకిణగణంబె.

దే. సాశ్చర్యంబుగ - ఓయిక్కడ నెవ్వతె.

కంచుకిని. యేతెంచి - యేలికసాని యానతి దండనూన శిరసుదద్దయుం నెలమి గోరుచున్నది.

దే. నీవేగి వేశంబ యార్యపుత్రుండారోహించు వాహంబు కుశలంబుగనుం గొనిరమ్ము.

కం. దేవి యానతి శిరసం దలకై సేతగనా యొవని నెలువడి యట్లొనరించి వెండియు నేగుదెంచి ఓ యేలికసాని గాహూ విను దమ్మావు మెయినిండ గాయంబులు గ్రమ్మియున్నవి. ఇది యేమని యడిగిన నాసాహిణి యానదుమం దొరగారు దీని నెక్కి యడవికి వేటకై వెడలినారు - వెండియుం గొంత రేతిరరుగ విజయంచేసి యుప్పరిగెలోనికి వేంచేసినారు - పిమ్మట నేఁజూడ నిత్తెజియిట్లు కానుపించె - దానికి మందులిచ్చుచుం గాపాడుచున్నానని నుడివెనని వాకుచ్చి తన తావుకేగుచున్నది.

దేవియుఁ బరిజనంబును ముహూర్త మాత్రంబు చిత్రంబునఁ జిత్రప్రతిమల కరణి నొప్పి యన్యోన్యవదన ప్రసారిత నిభృతలోచన లగుచున్నారు.

దేవి. స్వ. ఆహా యీయమ మహిమ ఈమె శక్తింగాన విదూషకుండు నా మానసంబను నయనంబునకు సిద్ధాంజనంబయ్యె ఆయన మంచి వెరవరి - అట్లగుట నే కదా పరివిస్మృతాహారాప్త జనాదికుండగు నార్యపుత్రునకు గృహంబుకై బలి ప్రదానం బొసంగించి తదీయస్మృతి కలిగించె - ఇట్టిగ్రహావేశ వికారంబె కాకున్న నార్యపుత్రుం డిట్లుండునా - హా యెంతకష్టంబు పస్థితంబయ్యె - అని యించుకతటి చింతించి - కానిమ్ము - ఈయవసరంబు పరికింపఁ గష్టాపనోద ప్రవణంబకావచ్చు - ఇట్టి యదృష్టార్థ వక్త్రియగు నీయమ దీనికి నుపశమ విధాన ప్రకారంబును జెప్ప నోపుఁ గావున నద్దియు నీమె ననుయోగింపవలయు నీమెయు దాని వాక్రువ్వం దగునని తలంచి. ప్ర. ఓభగవతీ తథ్యంబ వచించెద నవధరింపుము - ఆర్యపుత్రుండిదివర కిక్కతంబున నిట్టివాడయ్యెనని యిసుమంతైన నేనెఱుంగ - హాయకాయ సంక్రాంతంబులగు గాయంబుల నిద్దియంతయు నైహిక సుఖ దుఃఖాద్యనుభవంబులం బ్రాక్తన సుకృత దుష్కృతంబుల భంగి నత్యంత విశ్వసనీయం బగుచున్నది - కావున భవత్ప్రతిపాదితంబగు నుదంతంబంతయుఁ దథ్యతమంబె - మహానుభావవు గావున నీగ్రహం బుచ్చాటితంబు సేయందగు నుపాయం బర్థించెద.

యో. తోడెంబుతటి చింతించి - ఈగ్రహంబు పనిదానాగమంబు గావున నీయెడం బారఁదోలుటకు నేరికి శక్యంబుగాదు - భవదీయ జీవితస్వామియు సమయ వశంబున నాతి చిరవసరం బిట్లుండవలయు - దీనికియ్యెడ నుపశాంతి విధి యొక్కండు గలదు - కాని యది మిగుల దుర్లభతమంబు అయిన నదియు నవ్యవహితంబ సంఘటించునని తోచుచున్నది.

దే. ఖేద సంవళిత మోదంబుగ భగవతీ మీవంటి మహాత్ములకిట్టి కార్యంబులు సుకరతరంబులేకదా - మఱియుఁ భవాదృశులు పరోపకారపరులని జగంబుల విదితంబు - కావున సేవకులమగు మముంగనికరించి యార్యపుత్రున కనామయంబు ప్రతిబంధ నివారణ పూర్వకంబుగ నొనరించి మదీయ సౌభాగ్యంబునకు రక్షణం బొనరింపవలయునని ప్రార్థించుచున్నది.

ఆ. కృతోత్థాన యగుచున్నది'

రా. స్పర్శంబనుభవించి. స్వ. ఆహా నా భాగ్యవిపర్యయవిభవంబు దేవిదృష్టియో గిదృష్టిననుకరించుచున్నది. నేనీయెడశిక్షకసాక్షికంబుగన పరాధవిధాతృత్వంబునొంది దర్వీకర గృహీతంబగు దర్దురంబు దశకు వశంబయితి. ఈమెడ సమాశ్రియంబుకం టెనొండగు నుపాయం బపాయ నివారకంబుగానం బడదని పశ్చాత్ప్రసారితంబులగు పాణుల దేవీచరణంబులు పట్టిల్లోని. ప్ర. దేవీ ప్రణిపాత ప్రతీకారస్సంరంభోహి మహాత్మనామను నభియుక్తోక్తి మన్నింపుమని ప్రార్థించుచున్నాఁడు.

దే. నిజకరంబులం దనీ కరంబులం జరణంబులం దొలఁగించి ముంగలఁజేరి. ఆర్యపుత్ర యాభియుక్త జనోక్తుల సంభావింపం దదనుగుణంబుగ వర్తింపను బాల్యం బాదిగ గురుజన సంశిక్షితులును ధర్మసంరక్షణైక ప్రయోజనులునగు మీవంటి పండితులకుఁదగుంగాని యీ బాల బాలికలము ప్రకృతి ప్రతీపదర్శనులునగు మాబోటిబోటులకు నేసాటిపాటుగలదు. కాఁబట్టి సౌశీల పరిశీలనంబున నిట్టిమీకు మేమెక్కింత యు గణనీయులము గాము. కావుననీవింక నొక్కటి వచింపనక్కరలే దూరకుండుమని యక్కల్కి యలంగని మిగులందర్జించుచు నధిక్షేపించుచున్నది.

అయ్యవసరంబునం బ్రవేశించుచున్నది. శంపాలత శృంఖలాద్వయాకలిత హస్తయగుచు.

దే దానింగాంచి ఓసీ నేఁజెప్పకున్నను గాంగేయమయ నిగళంబులేవీరలకర్హంబులు తెచ్చితివి గావున నాకను చితాచరణంబు కలుగమింబట్టి నీ తెలివికి మిగుల సంతసిల్లితిఁగాని వేత్రంబానయింపమిఁగడుఁ బొడవగు తెలివి దానవు కాకపోతివి.

శం. ససంకోచంబుగ. దేవినాతప్పు సైరింపందగు నానతికంటె నదనంబొనర్చిన నదియు నేరమగునని నేఁదేలేదు.

దే. ఓసీమందిది. నీవు నాయాజ్ఞ మన్నించిన దానవుగాన నాలోపంబు నీకులేదు. ఇప్పుడేగి దానింజేకొనిరమ్ము.

శం. దేవి యానతి శిరంబునకై సేతనెందెనని వెడలుచున్నది.

రా. సభయవ్యాకుల మనసుండగుచు స్వ. ఆహా ఎంతకష్టంబు పస్థితంబయ్యో ఈమె నిగళయుగళంబుఁ దెప్పించె. నాపనీబాలికమనో కాక యీబాలికలకోదీనిసం

తి యొక్కింతయేని స్వోపకృత జనంబులవలన నెద్ది యైన సేకరింపం దగదని నియమించు - అక్కతంబున నేనెద్దియు నీయెడఁ బరిగ్రహింపం జాల - నీవింతకంటె నుత్తరోత్తర సౌభాగ్యం బనుభవించుచుం జిరంబుల్లాసంబులు వెలుంగ వెలయుదువు గావుతమని యాశీర్వదించి కరుణాభరంబున నూరడించి నిర్గమించుచున్నది.

దేవి. సుబ్రాహ్మణీ యీభగవతి వర్తనంబు గంటివి కదా.

బ్రా. దేవీ యీను వారి ప్రకారం బట్టిది - విమలజ్ఞానైక లభ్యపరానందానుభవాస్వాద నిపుణులైన మహాతపస్వులు సంసారమాత్రసారంబులగు నైహిక సుఖంబుల నెల్లం గనకమయ బిసకిసలయరసాస్వాద నిపుణంబులగు మానసావాసంబులు శంబూకంబులం బోలె నిరసింతురుకాని చేకొనుదురా - అట్టివారేయైన నిటువంటి మనకు నటువంటి వారికియు నేమి యంతరంబు గలుగు.

దే. సుబ్రాహ్మణీ నీవచనంబు నిక్కంబ సంసార సంబంధంబుచేతనే కదా యవాప్తలాభ సంతుష్టి వీడి యనధిగత పదార్థార్జనం బభిలషించి యీజన్య కోటి మాన్యామాన్యతలం దలంపక నానావిధ వ్యాపారంబుల వర్తిల్లు.

బ్రా. దేవీ నీకు విదితంబుగానిది యెద్ది.

దే. సుబ్రాహ్మణీ యీవాసరంబు నీయాగమంబున నాకు మిగుల నుపకారకరణంబయ్యె.

బ్రా. దేవీ నీవిట్లు వచించుటకు నేనెంతదానను - మరియు నేఁజేసినదెద్ది.

దే. సుబ్రాహ్మణీ యిట్లు వక్కాణింపకు నీరాకనే కదా యార్యపుత్రుని బాధా నిదానం బెల్లఁ దెల్లంబయ్యె.

బ్రా. భవదిష్ట దైవప్రేరితయగు యోగినిచేతనని వచింపవలయు అచిరంబుగ మీరు వివీనాథులై పరమ ప్రమోదంబున వర్తింతురు గావుత - ఈయెడం గతిపయంబులగు నిలయకృత్యంబులు నెరవేర్పవలయుఁ బనివినియెదనని నిర్గమించుచున్నది.

దేవి. స్వ. ఆహా దైవంబెంత భక్తజన పరాధీనంబు - అహా సుప్తం ప్రమత్తం విషమస్థితం వారక్షంతి పుణ్యాని పురాకృతాని యను నార్యవచనంబెంత ప్రమాణంబు - ఆధునికంబగు నీబాధఁ దొలగింపనే కాఁబోలు దైవంబు పేటికనుండి యాక

న్యాద్వయంబు గృహంబునకనిచె - కావున్న మానిసు లేరు లోకంబున నిట్టి రూప విజ్ఞాన లావణ్యాది సమగ్ర గుణగణాశ్రయులు- గగన సంచార ప్రవీణులు నగుదురు. మరియు నాయోగినీమణియు నార్యపుత్రునకుం గొంత శ్రమావసాన సమయంబుం డుటచేఁగాఁబోలు ఖేచరీదర్శనం బార్యపుత్రుని బాధ కుపశామకంబగుననియు నదియు నచిరంబున సమకూడుననియు వచించి యపుడ నను దత్ప్రకారబుభుత్సాపరం దెలిసి యిక నడుగకుండుమని వచించి సత్వరంబుగం జనియె - కావున నార్య పుత్రుని యారోగ్య లాభంబుకై వారిం గనుపరచి చూతము అయితే వారిరువురతిమనోహర సౌందర్య జనుర్మంది రాయమాణ సంహననవల్లికలు అయినం బెద్దయగు ఖేచరి తద్దయు నియమ స్వభావయై కానంబడు - ద్వితీయయైతే యభినవాంకురిత తారుణ్యాయు నాగంతుక దుర్నిరూప యత్కించిన్నిదానతపసిని యైన శృంగారైక నికేతన స్వాంతతాబోధ కలావిలాసినియై కన్పట్టు కావున నిది మదవరోధ నిరుద్ధనైసర్గిక మదన చాపలుండగు నార్యపుత్రునకుఁ గానుపింపందగు - అక్కతంబునం బ్రథను నార్యపుత్రునకు దృష్టివిషయం బొనరింతునని తలంచి యట్లొనరించుటకు నిర్గమించు చున్నది.

పిమ్మటం బ్రవేశించుచున్నారు - రాజు విదూషకుండును.

వి. ఓవయస్య నీవదనం బీయెడ నపర్యాప్తస్వాంత నిశాంతంబగుట నంతర్నిస్ఫురితంబగు నాశ్చర్యాధ్యాన వికాసంబుగ నావృతంబగు కరణిఁ గానంబడు.

రా. నర్మసఖామర్మవేత్తవైతివి.

వి. సోత్కంఠంబుగ - నాయనుయోగంబు సనిదానంబేనా.

రా. సుమతుల వితర్కంబులు వితథంబులగునా.

వి. అట్లయినం దత్కారణంబు శ్రవణ శరణంబు సేయందగు.

రా. ఇంతకంటెఁ బ్రియతమం బెయ్యది.

వి. ఆహా స్నేహసంరంభంబు.

రా. ఇద్దియొక యభినవంబా.

వి. కాదు నైసర్గికంబె.

రా. ఔనుగదా - సావధానత నాలింపుము వచించెద - దేని యీదినంబున నొక్క కన్యారత్నంబు వెంటనుంచికొని యేతెంచి నాకుం గానుపించె.

వి. విస్తృత నిష్పందనయన సంవృతోన్నమిత వదనుండగుచు నాహా యిది మిగుల విస్మయంబ యియ్యది సంభావింప శార్దూలి హరిణశాబకంబునకు సద్యశ్శ్యాణ నిష్కృషణ చకచ్చకదశ్మ గర్భ విభ్రమంబగు దూర్వాంకూర ప్రకరంబు దినిపించు నటులుండె - దేవీ నిసర్గంబెల్ల యెడల రూపరులగు తరుణులు నీకంటంబడఁగాంచి కంటకంబుల కరణి ఖరతర ఖదిర శిఖిఖండంబుల సరణి దంభోళి ఛిత్తదంభంబుగం బ్రత్యగ్రనిర్ముక్త నిర్మోక మేచక దర్వీకరిమాద్రి దుస్సహవ్యథా నర్థ సంధాన నిసర్గలం దలంచు - అట్టిదేవి యిట్టు సలుపుట యాశ్చర్య ద్వారంబు విఘటిత కవాటంబై సంఘటింపం బడియె.

రా. ఓయీ సాంప్రతికంబగు నద్భుతంబు తదానయన నిదానంబు గాదు - తదానీతయగు నామె వయోలావణ్యాది మహిత తమ గుణగణవరాళి మణియయ్యు నియమపరయగుట మాదృశులకు నభివంద నీయయే.

వి. అట్లయిన నేతాదృశాద్భుతంబునకు మూలంబెయ్యది - తాదృశలగు తపస్వినుల దర్శనంబు దేవిచే నప్పుడప్పుడు నీకుం బ్రాపితంబేకదా.

రా. మదీయ వ్యాహారంబు సమగ్రంబుగ శ్రోత్రపాత్రం బొనరింపక నను వేగించెదు - అందుల కేనేమి వచించెద.

వి. ససంకోచంబుగ - ఓయీ యాభవద్వాక్యావసానంబు నేనూరకుండెదఁ గాని వక్తవ్యబంతయు వచింపుము.

రా. అటుల ముహూర్తమాత్రంబు సావకాశంబుగ నాకర్ణింపుము. పిమ్మట మేలుగ నాలోచింపుము - లోఁగడ నీతో స్వప్నవృత్తాంతం బంతయు వచించి యుంటినిఁగదా అందు - మదీయ ధైర్యమణీ విశేషసంద్రావణ హరిణకిరణ ఘృణిగణనైపుణీ సర్వస్వహారిణియగు నొక హరిణేక్షణామణి సకల రాజన్యకన్యా మాన్యలక్షణ యిదిపరకును నామనోమహార్ణవంబను మదీయమానస సుధాకర మండలి భంగి సంక్షుబ్ధంబుగావించు చున్నదను సంగతియు మీకు విదితంబకదా-పరికింప నిజ్జగంబున నదృష్ట పూర్వంబున శ్రుతచరంబునైన వస్తువు స్వప్నంబున ననుభూతంబగుట యాశ్చర్యం

బు - అద్దియు బాల్యగ్రద్ధకం దాదృశ భావ భరితం బగుచుఁ బ్రత్యక్షంబగుట యాశ్చర్య తరంబు - మఱియుం దదవసరీయ దశావశాత్మయగుట యాశ్చర్యతమంబు.

వి. ద్వాపర పరీతచేతసుండగుచు - ఓయీ నీవ ప్రస్తుతంబగు వప్రస్తుతార్థవాఙ్ముఖంబు సల్పుట నాయుల్లంబు వేద్యాంశ విమూఢం బగుచుఁ దదుపలబ్ధికై మిగులఁ దొందర నొందుచున్నది - కావున ముఖ్యార్థంబు వెసగవచియింపందగు.

రా. అట్లయిన నట్ల వినిచెద వినుము - లోఁగడ స్వప్నంబున నొక్క రమణీయ సౌధశాల నిరుపురఁ గన్నియలం జూచితిననియుఁ జిన్నపడుచునందు నామనంబు తద్దయుఁదగిలి దానిం బ్రార్థింపుచుండం బ్రథమ నాయొడలం గనికరించి తదీయ సంగతికై సహాయం బొనరించెనని వచించితిఁగదా-ఈమె పరికింప నాపెగాఁ గనుపించె.

ఉ॥ అద్దియగాత్ర లక్ష్మిగుణ మద్దియమం జిమకాంతి వైభవం । బద్దియ సన్నుత ప్రణయహారిపి లోకనసౌమ్య విభ్రమం । బద్దియ యాత్మమానురినుతా మృతవల్లకి వాగ్ఝరీభరం । బద్దియ దైన్యసక్తహృదయ ప్రమాదార్జన తత్పరత్వముల్ ॥౯౯॥

గీ॥ అయినఁదొల్లింటికంటెఁ గృశాత్మయగుట । భిన్నయై కనుపడును వివేకదృష్టి । నరయనటుకాదు బహుల పక్షైణ లక్ష్మి । మూర్తిలాతిగఁ దలచు నవ్వోహుఁ డెవఁడు॥ ౧౦౦॥

క॥ కడువిస్మయంబు మోమున । నడరఁగ నతిచిరవిలోకితాప్తుని కరణిన్ । విడువక చూచెను నన్నా । పడతిరవికర ప్రమృష్టపద్మేక్షణయై ॥ ౧౦౧॥

ఇంతకంటె మరియొక చిత్రంబు నేత్రపాత్రంబయ్యె వినుము.

మ॥ మరియుం జేరువదేవి యున్నయెడ నామాన్యాత్మ తాటస్థ్య భా । వరతిం జూచు సుశీలతన్నను మహావాత్సల్య పూర్ణాక్షియై । పరిచర్యావిధికై యటిట్టరుగ విస్పష్టాఘరోల్లాసయై । చిరసంవీక్షిత విస్మృతాప్తుని పలెన్ జింతించుచున్ జూచె దున్ ॥ ౧౦౨॥

మ॥ అశరీరాత్మక మే పిశాచ పదవక్యార్థంబు హృజ్జన్మతా । దృశుఁడౌటం బరికింప భూతమగుడున్ దీవ్రాత్మతన్ సోకినన్ । వశుఁగాఁజేకొని 'భూరి విక్రియల నావార్తిన్ జుగుప్సాదశా । రశనాబద్ధము సేసి మర్కటిపలెన్ రాగంబు నాడించెడిన్ ॥ ౧౦౩॥

సీ॥ మదన పిశాచ సంపాదిత జ్వరభారవిక్రియాభంగ ప్రవీణుఁడుఁగుచి। కిత్వక మణిగలఁగేళిఁ గూడిన కన్నెదానిపై పూత యతగు విభూతి। తదధర రసమ మంత్రాభి సంస్కృత తీర్థమతి దీర్ఘత ద్వేణి యమరు వేత్రి। ఎల్లిక కవచమతల్లి కవలమాన తదుదార చరణాంగద రశనాది। మహనీయ మండన మహితశింజితములే శ్రవణ సౌభాగ్య సంత్రాణ ఘృణులు। గురుతరసౌరభా గురుధూప ధూపిత తత్కుచబ్బర్హగంధాను భూతి।కలిత ఘూపానేవ కలశీని నాగంబు మాధుర్యధుర్య తన్మాన్యగీతి।నిబిడోప గూహావి నిష్పన్న తన్మణీహార ముద్రలు రక్షణాంకములగు। లలిత మందాక్ష సంగత ప్రణయభరస। ముదిత సరసార్థ గర్భితా మోది జీవ। మయతదుదిత సుమావలీమహదఘాఘు। ఘుస్మరత్వాత్మమా మంత్రకమ్ము సుమ్ము॥ ౬౮॥

సీ॥ మలయు జశ్యాదసంభరిత శీతమయూఖ మణిబద్ధగర్త నిర్మజ్జనంబు। స్వకిరణోద్వాంత తౌషారభరాకారింత జగదిందుమండలీ సంగతంబు। అన్యోన్య కాష సాంద్రాక్షిప్త శీకరోల్లోల సుధాసరః ఖేలనంబు। హైమన జలనీలికాలి కాంతసూత నిబిడశయ్యాస్థలీ నిత్యసేవ। యమునని సర్గోత్థ రాగోదయోరుత్తైల। భరసు సంభృత హృదయాంత విరహదహన। జృంభణోద్భూత సంజ్వరాలంభవిధికి దంభమున్నైన గడప సంరంభులగునె॥ ౬౯॥

గీ॥ శుచితబహు శుచితులైనట్టి సుమతులెల్ల। స్వప్నదృష్టార్థములతో నసత్యవస్తు। వులను బోల్తురకటా యది దలఁపవంధ్య। మనఁదగుఁ గిరియాను భూతి ప్రమాణము గద॥ ౭౦॥

గీ॥ చేటుదరిఁజేర విపరీత చేతనయగు। నుడువుఁనలఁపగ నెడలానవిడిచి పోవు। ప్రీతిదములెల్ల మిగుల నప్రీతిదముల। దృశ్యదృశ్యము విపరీతదృష్టిఁదనరు॥ ౭౧॥

మఱియుఁ దారకానికర పరివృతంబగు తుషార కిరణ బింబంబు విష్ణుపదంబును దారతారాగారంబున మేయ ఛాయ సంవ్యాప్త పుష్కరమణి కలితంబును మహత్తర కుళీర మకరవైసారణాది సంచార సౌమ్యభీకర గ్రాహవ్యూహ విహారాశ్రయంబునగు నంబరంబునసం జాతసాగర భ్రమంబగుచు నపూర్వసరస్వదా వాసలాల నావళంబు ననో కాకున్న నతిచిర సమయ నిష్పీత లవణోదశంబరంబగుఁ దజ్జనిత వైరస్యంబున నలి పవిత్రి మధురతరసుర సరస్వతీ వారపూరాస్వాద కందళదమంద తర్షంబుననో

స్వావాస సముద్ధితంబై పరితః పరిస్ఫురదుడు పటోలకపట సముట్టంకిత దహనకణగణ పరివృతంబై పొడమిన బడబానల మండలంబు కరణి నా డెందంబునకుఁ గడుజడుపు వొడమించుచున్నది - చందన నిలయ శైలపవమానంబులును సదేశ సరస్సు మనస్సంశ్లేష సముదితా మోద కందళంబులును సాంద్రచంద్రా తపసం వళితంబులునగు మరుత్కిశోరంబులుం దాదృశా శ్రయాశ ప్రిస్ఫురణ మయంబులగుచు నతంద్రంబులై మదాత్మకతిదుస్సహా విషాదంబు లొనరించుచున్నవి - కావున నామనం బనుకూలవాత ప్రేరితంబగు గాలిపడగ చందంబునం బరివర్తితంబైన కులాల చక్రంబు సరణిసన్నిబద్ధగుణాత్త్రిప్తంబగు కందుకంబు కరణినసం వెద్య వికారంబై పరిభ్రమించుచున్నది- సన్మిత్రంబు శోకమకరాంక తారకంబనియు నానందకుముద సందోహ రోహిణీ కమండలంబనియు లోకవిదితంబు - కావున నీదురంత సంతాపంబు నంతంబు నొందింపఁ దగిన యుపాయంబు నిరపాయంబుగ నరసినను బ్రకృతిసంక్రాంతుం జేయుము.

వి. స్వ. ఆహా ప్రియవయస్యుం డీయెడ మరుఁడు వొడమించిన జడుపునఁ గడుబడలియున్నాఁడు - ఈతనికెట్లు మనోవినోదనం బొనరింతునని చింతించి - కానిమ్ము ద్రిసవ్యాహారంబులం బలికి చూతమని.

ప్ర. వయస్యా యాత్మాను భవసిద్ధంబు లోక ప్రసిద్ధంబును నైన యొక్క ప్రతిక్రియ కలదు - అను నర్థోక్తంబున.

రా. ఆగంతు కాగతచేతస్స్వాస్థ్యుని చందంబున, సవికాసవదనుండై సాంద్రమేడితంబుగ - వయస్యా యట్టి సాధనం బెయ్యది వచింపుము.

వి. కమలా ఫలంబులు నుత్తమ కదళీ ఫలంబులు సిత సితాకల్పిత బహు విధ సుగంధ వస్తు బంధుర పానక రసంబును పన్నీరత్యుష్ణ ఘనసార మిళిత చందనపంక విలేపనంబు నాదిగల శీతోపచారంబులు పెక్కులు గలవు - కావునఁ దత్సేవనం బొనరించితివేని యీసంతాపంబు నితాంతంబు శాంతంబగు.

రా. సజుగుప్సంబుగ - వయస్యా యివ్వి చేసెఱుంగనివే - ఎల్లపదార్థంబు లెల్లయెడల నవస్థా వశంబునఁ జేతన వ్రాతంబునకు స్వగుణ కార్యంబులం బొడమించుఁగాని సర్వ సమయా సమయంబులం గార్య నిర్వాహకంబులు గానేరవు - మరియు వైపరీత్యంబున విరుద్ధ గుణకంబులగు - దందశూక సందష్టునకు శర్కరాపిచు మందమ్

బులు వ్యత్యస్తంబులై తోఁచుఁగదా - కావున నీయుపాయం బపాయ ప్రాయంబు గాని శర్మ సంపాదనంబు గాదు.

వి. స్వ. హా వయస్యుండు సరళ చేతస్కుండగుట ననుం గుత్సితుఁగాఁ దలంపక నాపలుకు పరిహాస గర్భితంబని యెఱుంగక స్వచ్ఛందా నభిజ్ఞతతో వచించునట్లు పలుకుచున్నాఁడు - కావున నింకం గొంత తడవిక్కరణిన జరిగింపవలయు. ప్ర. వయస్యా నీయుదితంబు సూనృతంబ అందుకింకొక్కటి వచించెద - అట్లొనరించితి వేని నీకీ యిక్కట్టు దొలఁగు.

శా. ససంభ్రమంబుగ - వయస్యా నీకుం దోఁచె నేని తగిన వెరవు పరికించి వచింపుము.

వి. సస్మితంబుగ వినుము - ఇత్తఱి దేవి రావించి యీయుదంతంబంతయు నామెకు శ్రవణ సంగతం బొనరింతుమేని యీసంతాపంబింతైనలేక హరించిపోవు.

రా. సవిస్మయంబుగ - అది యెట్లు.

వి. స్వ. ఆహా వయస్యం డిదివరకును నాభాషణంబులు ప్రితారణా కరణంబులని యెఱుంగఁడు కానిమ్మింకం గొంత తడవునీచొప్పునం గాలయాపనం బొనరించెదనని. ప్ర. ఓయీ వయస్యా యిట్లొనరించితి వేని నైసర్గికా శంకా కలంకాత్మయగు దేవి నీయెడ నెట్లొనరించునో యెఱుంగుదువుగదా అయ్యెడం దదీయ తర్జనాజన్య సంతాపంబున నీసంజ్వరంబు లయింపం గలదు

రా. సరోషాశ్చర్య హాసంబుగ - వయస్యా మేలు మేలు వెరవరులలో నెఱజాణ వీవకదా మిగుల బాగుగ వచించితివి. ఇద్ది యవిధేయం బీయెడఁగాని నిపుణాగ్రగణ్యుండవగు నీయుపదేశ శ్రవణ మహిమంబున వర్షధారా మేళనంబునం బట్టి నిర్ఝరంబుకరణి ఘనతరంబగు నొక యుపాయంబు నాకుఁ దోఁచుచున్నది దాని విని రెంటి తారతమ్యంబు పరికించి యెద్దిలగ్గగు నద్ది వచింపు - దానిన యేమరక నొనరించెద.

వి. సవైలక్ష్య సంకోచంబుగ - వయస్యా యెన్ని విధంబుల నాకంటె ఘనుండవకదా - ఉత్తమోపాయంబు పరికించితి వేని వచింపందగు.

రా. వయస్యా నీమంత్రంబు ననేకవిధ వ్యధాహాని గలిగియుం నితర బాధా సంబాధంబు గలుగు - శరీర పరిత్యాగం బొనరించిన నాధుని కయావద్బాధా నిరోధంబగు - కావున వీనిలో గరిష్ఠంబగు దాని వచింపుము.

వి. స్వ. ఆహా సారస్యం బుపన్యసింపంబోవ వైరస్యంబు పస్థితంబయ్యె - వయస్యుని యుల్లంబు మిగులం గనలుచున్నట్లు దోచు - దానిం బ్రసన్నంబు సేయం దదభీష్ట కార్య నివేదనంబున కంటె నొండొక్క యుపాయంబు గానుపింపదు - కావున కా దఘ్టటనా యత్నం బొనరింపవలయు - ఐన నీయెడ నీతండు కర్కశభావంబు గానుపించుట నేనందుల కనుకూలంబుగన వచించెదనని. ప్ర. సవికాసంబుగ - వయస్యా నీవన్నిటం బ్రవీణ చూడామణివి - కావున మదుక్తోపాయంబునకంటె భవదుదితంబవరంబగు - ఇద్ది లెస్సయే కానిమ్ము శరీరపరిత్యాగం బెయ్యెడ సెత్తిరునం జేయందలంచితివి.

రా. స్వ. ఆహా సర్వంబు విపరీతంబయ్యె - ఆహా యిట్టివి వర్తిల్లుటనే కాం బోలు అరిర్మిత్రం విషంపథ్యమ ధర్మోధర్మతాంవ్రజేత్ । అనుకూలే జగన్నాథే విపరీతే విపర్యయయను నార్యోక్తి విదితంబగు - సర్వ ప్రకారంబులం గైర వాకరంబున కుందుపార కిరణుని కరణి నలిన వనంబునకు దినకరుని లాగునం దృషార్తచాతక వ్రాతంబునకు జీమూతంబు రీతి సన్మన్మనో వినోదనైకతానుండగు నీవయస్యుండు దానధునాతనంబగు నావిషాద నిదానంబు తెలిసియు నవి దితమదీయాశయుని చందంబున నాతెంపునకు సొంపుసేయు మినుకులు వలుకుచున్నాడు - మారంబుగ సూక్ష్మదృష్టిం బరికింప మదీయ హృదయ ప్రమోదమ్ముకై యొక్క వెరవు పరికించి యది నిశ్చితఫలంబగుట నన్ను నాడింపం దలంచి యిట్లు వచించునని తోచు - మంచిది ఇంక నేమి వచించునో తెలియ వలయుంగావునం తదాశయానుయాయి తన వచించెద. ప్ర. వయస్యా యీయెడం దదుపాయసాధనాది నిరూపణ నైపుణ్యంబు నిదియ కావలయు.

వి. స్వ. ఆహా వయస్యుని శాంతిదూర దృష్ట్యాది గుణంబులు - సేవక కల్పుండనైనను నాయనువితంబులగు లపితంబుల సూదితంబులరీతిం బ్రీతి మన్నించి సౌహృదంబ ప్రకటించు - మంచిది - ఇంకం గొంతతడ వింగితం బవిదితంబగునట్లు వర్తింతునని. ప్ర. వయస్యా యట్లైన నాకుం దోచినది వచించెద నాలింపుము - నీ

వు స్వస్థతం గోరి కదా యిట్టి జలనం బభిలషించితివి - ఈశరీరం బెట్లైనం బ్రమదవనం
బున కర్పించితేని నీకతి లభించు.

రా. వయస్యా విషాది సాధనంబులు దారుణ వికార జనకంబులగుట వానికం
టె మలయానిలకామదిందిందిరనినదాదులు సుకుమార వికార జనకంబులనియో యి
ట్లంటివి - అవ్వి యూరయెడఁ మిగుల సున్నవే అవ్వి సేయు వగల మిగులఁ గుందించు
కాదా యట్లు తలంచితి.

వి. ఇవ్వి చిరపరిచితంబులగుట విశేష వికృతి సంధాతలు గానేరవు - అచ్చ
టివి యిత్తఱిఁ గ్రొత్తలగుటం గార్య విశేష నిర్వాహకంబులగునని తలంచెద.

రా. స్వ. ఈతండెంతసేపునకు నెన్ని యనుయోగంబులకైనం జేతఃపిహితా
ర్థంబు బయల్పడనీయఁడు- కావునఁ దదిచ్ఛాను సరణంబు సేయఁ బిమ్మట నీతండ
వచించునని. ప్ర. వయస్యా యట్లైన వర్ష్యారామంబు దేవీశాసనంబు వీడి యు
ప్రవేశ్యంబుగదా.

వి. సహసంబుగ శరీర నిరపేక్షునకు నితరాశంకతో నేమి ప్రయోజనంబు
మరియు నట్లు శపథ పూర్వకంబుగం బ్రతిననూనితివా.

రా. అట్లు లేదు.

వి. అట్లైన సందియం బేల.

రా. కార్యభరంబునంబట్టి యట్లుండదు.

వి. వయస్యా యిట్లు సాధకబాధక విచారంబు సలుపనవధి ప్రత్యక్షంబు దవి
యంబగు నక్కారణంబున నాలోచనంబును నిర్ధారణా విషయంబు కానేరదు. దీనం
గార్య సిద్ధియు వితర్క విషయంబునకైనఁ బాత్రంబగుట కనర్హంబకావున నసాహ
సమునారుహ బ్యనరో భదాత్రిణి పశ్యతియను నయం బవలంబించి మన మచ్చటి కేగ
వలయు.

రా. వయస్య నీకై యద్ది రుచించు సామర్థ్యంబునం బ్రవర్తింపఁజేయుము.

వి. వయస్యా యట్లైనం దదీయ చిత్రపటంబు నాచేతికిచ్చి కూడ రమ్ము వెడ
లుము. మనము పవనమ్ము సేరిన పిదప నప్పటి కనుకూలంబుగఁ దర్శింతము.

రా. అట్లయని యతని తోడంగూడి యుపవనాంతర ప్రాసాదసదేశక్రీడా శాలా ప్రాంతంబున కరుగుచున్నాఁడు.

వి. స్వ. అంతట నవలోకించి. ఆహా యీయవసరంబు శయనార్హంబయ్యె వీరలిరువురు నిద్రావశులుగాక యీయారామాంతరంబున మెలంగుచున్నారు. కర్ణ కరీవచన ప్రకారంబున లాస్యాభ్యాస జన్యాయాసాప నోదనంబుకై యాపె యీ బాలిక నుపవనాంతరంబునం ద్రిప్పుచుండు. ఇద్దియు నస్మచ్చికీర్షితంబునకు నవ్యాక్షేపాద్భవిష్యంత్యాః కార్యసిద్ధేర్హి లక్షణమ్మను నభియుక్తోదితంబున సిద్ధి సూచకంబ. తస్మాత్ప్రి విదితంబుగ నంగుళిచే నిర్దేశించుచు వయస్యా యట్లవలోకింపుము.

రా. నిరీక్షించి. వయస్యా యిది స్వప్నదశ యనుకొందునా. యద్ది జాగ్రదవస్థయనుకొందునా. లేక యుభయం బేకంబ యనుకొందునా కాదు తాత్కాలిక భాగ్యంబ యిపుడు ప్రత్యక్షం బయ్యెనని తలంచెద.

వి. వయస్య వీరు పవనసంచారం బొనరించి క్రీడాశాలం గూర్చుండ నుద్యోగించుచున్నారు. కాని కీదృశంబగు గోష్ఠియగునో యీవికచవిచికిలని కుంజాంత ర్హితులమై యాలింతము.

రా. వయస్యా యిది మిగుల వినోదకరంబు అని యట్లొనరించుచున్నారు. ఆమోదరేఖ ఉపవన సంచరణ ప్రశమితాల సతయగు మంజరితోడ నుచిత ఖట్వాయం ము గూరుచుండి. సఖి యీయెడ నీప్రదేశంబు విలోకించితివా.

మం. సఖి చూచితి.

చ॥ స్ఫటికశిలానిబద్ధము రసాతల మిద్ది మొగిళ్ళదారి వి। స్ఫుటవిలసిద్వి ధూప్రముల శోభిలు నివ్వియు దాని సక్తిసం। ఘటిత విభాభరంబులగు గాఢ విసృత్వర హీర సత్ప్రభా। పటలమయాత్మతం దగు నపార ధరాంబర మధ్యమంతయున్॥౧౯॥

గీ॥ నిబిడ నిష్ఠ్యూత సౌధకణికము లయ్యెఁనీకలానిధి విశదగోహాలలిపుడు। మత్సరగ్రస్త చిత్తుని మతికిఁ గరణి నాథ ఘుతచిత్త నాకసహ్యముల యగును॥ ౨౦॥

మ॥ నయనానంద కరుండు చందురుఁడు కర్ణాహ్లాద సంజీవనీ। నయభూము ల్పిక శారికా శుకల సన్నాదంబులున్ నాసికం। బ్రియభాగ్యాఘుములౌ ప్రసూనము

లు మూర్తి క్షేమను శ్రీలుమా । లయవాతంబులు రాస నాసువులు నీరాదుల్న సహ్యం బులో॥ ౨౧॥

మ॥ కుపిత ద్వాదశమూర్తిపోలె మిగులన్ గోకారి దుర్లక్ష్యుడౌ నిపతత్సం దుగ్రితలోహ వారి కరణిన్ నిర్భిన్న కర్ణంబు లా । సుపికాది స్వరముల్గళద్భి దిరము ల్మానంబులోఁ జూడుమా । విపదుద్గారము లర్చికా విషగతిన్ వేవాయుపానీయ ముల్॥ ౨౨॥

గీ॥ వ్యధలు పరికింప దుస్తర భావమునను వారిఘులని యా వర్ణింపపరలు మిగుల। నట్లుగాకున్న హిమకరుఁడరుగుదేర భిన్నగర్భంబులై విజృంభించు టెట్లు॥ ౨౩॥

చ॥ పగలుతమంబు లట్టి పనువాక్యతమః పదమంధకారశ । క్తిగపచియింతు రారయవిగీతము యయ్యదికాకయున్న నా । గగనము నెల్ల నాత్మజనకాత్మము సేయుం విధుండు దోపనా । పగలు నెలంగుఁగావున నవార్యతరాహ్వాభి ధేయమైతగున్॥ ౨౪॥

చ॥ పవన గళత్పరాగములపైఁ బడి మూర్ఛరభంగిఁ గాల్చునీ । పవనము చాయలాయ నిలబంధు శిఖావృతులట్లు దోచెడున్ । కువలయ వాయువుల్దహను ఘూర్ణన భంగిఁ దపింపఁ జేయునీ । నవమకరంద బిందువుల నంగశరాగ్నికిఁ దైలధారలో॥ ౨౫॥

గీ॥ ఇట్టి సమ్మోద సామగ్రి యేఘుమీటి మిగులఁ గహ్వాషీ కవితతికి మేలుసేయ । నాదుడెందము మరునికి నాఁకపడకనున్న నెటువంటి సంతోష మొంద గలనో॥ ౨౬॥

గీ॥ దైవకృతవల్లభ వియోగదైన్య విధుతమగుట నామన మిపుడు మదాంధ సింధు। రక్షుభితమగు మడుగు కరణిరసాత్మసంస్ఫురణమున కర్హాత సడలియుండె॥ ౨౭॥

క॥ నామది జగుదుల్లాసర మామయ మలయానిలేందు మధుకభగీతుల్ । సామయద శీలములనీ సామయదశ దలఁచుఁ గడునసారం బగుచున్॥ ౨౮॥

క॥ విధురవు లీయెడ వల్లభ విధురనగుట నేకరూప విదితాత్మకులా । మధుమాస లక్ష్మియిది దుర్మధు మాసమమగుచు వికృతిమహిమన్ జేయున్॥ ౨౯॥

సఖి యీయెడ నాస్వప్నోప భుక్తుండగు ప్రియుండు.

చ॥ నిజగుణ విభ్రమస్మరణ నిర్ధుతదుర్వహభూరి దుర్విషా । ద జనిత సౌధసింధు విహిత ప్రమదోద్గముఁడయ్యె మన్మథ । ప్రజవిజయిష్ణు ఖేచర వల్లభమూ తన రూపు దాచి య । క్కజముగ నామనంబునకుఁ గాకలు మూకలు గాఁగ సల్పెడున్॥ ౨౦॥

ఆ॥ శరుఁడు గాఁడు వీఁడు శరుఁడైన బైకి సంతసము లీనుకరణి మసలుచంత । రంబునందు నోర్వ రాని యగ్గల సల్పు సలుపు మద్విషాదములను నొకట॥ ౨౧॥

చ॥ మనమునకున్ ముదంబొసగు మాన్యుఁడ యాప్తుఁడువంత సేయువాఁ । డ నయము దుర్గ్రహ ప్రచుండనియు నందఱకున్ విదితంబ యాతఁడై । నను నిజ సంస్మృతిన్ మిగుల నాయెదనున్ గడు మోద ఖేదముల్ । దనరఁగఁ జేయు నీతని విధంబెటువంటిదొ యెంచి చెప్పుమీ॥ ౨౨॥

ఆమోద. స్వ. క॥ సుషమాత్మయయ్యె నిపుడిది సుషమాసంగతిఁ దొలంగి సుశ్రీక్కడు నకటా విష మెషు ప్రహతోత్కట విష మేషు ప్రహతి భిన్న విధురాశయయై॥ ౨౩॥

గీ॥ దీని యుల్లంపు తీరు నేఁ దెలియ జెరి యప్పుడప్పుడొకా నొకలఁడుగఁ దోలుత । నూటినొందివకలఁగన్న సుద్దినంటి నుడువుఁగాని వచింపదయ్యెడుగుదాని॥ ౨౪॥

కావున నిది పంచశర సంచిత వంచనా కుంచిత వివేకయగుటను దంచదున్మాదయగుచున్నది. అక్కాలంబున నీయెడ దీని యడలుట కెటులు మాటుపరుపం దగునని యోగమాయవిలోకనంబు నన్గొంతసేపు సింతించుచున్నది.

వి. వయస్య జూచితిరే నీయెడల దీనికిం బొడమిన మోహభరంబు.

రా. ఔను మద్విషయంబగు దీని మోహాతిశయంబున సుషమానంబు తదాశ్రయంబగు నస్మద్రాగభరంబ.

వి. భవదీయంబులగు ననురాగంబులే యన్యోన్య సదృశంబులు గావు. సౌందర్యాది యావద్గుణంబులుం బరస్పర సదృక్షంబులగు.

రా. వయస్యా వల్లరీ సౌరభంబులుం బోలె ముక్తావళీ తరళంబుల మాడ్కి మణిహిరణ్మయ పరిష్కారంబు కరణిఁ బరస్పరార్హంబులగు పదార్థంబు లన్యోన్యమేలనంబున విలసిల్లెనేని శ్లాఘ్యతమంబగు నిరుపమ పరభాగం బొకటి దేజరిల్లఁగదా

వి. వయస్యా నీయింగితంబు నాకు హృదయ సంగతంబ నీయుదితంబును తథ్యంబ యవిలంబితంబ యట్టి మీకును సంగతియగు.

రా. సనిశ్వాసంబుగ. వయస్యా యవ్విధాత విరూప సంధాతయని మిగుల విదితంబగదా.

వి. తత్తద్దృష్టాన్త వక్తవగు నీకిట్లు వచింప నుచితంబేనా.

రా. ఇట్లు ప్రసిద్ధిలేదా.

వి. అద్ది మందభాగ్య విషయంబని వచింపందగు. నీవు మహాభాగ్య లక్షణ సంపన్నుండవు కావున నీకిష్టంబు సమకూరు.

రా. సప్రత్యయంబుగ. అట్లైన భవాదృశ సుబ్రాహ్మణాశీస్సహకృతంబైన దైవప్రసాదంబ మూలంబు.

వి. అట్ల యగుత.

రా. సౌత్సుక్యంబుగ. వయస్యా దీని నుడువులకుం జెలి యిదివరకు నేమియు వచింపలేదు. ఏమి వచించునో వినవలయుం గావున నీవును హవణికనుండుము.

వి. అట్లయని యిరువురును దదుక్తిం బ్రతీక్షించుచున్నారు.

ఆ. యోగవిదిట భావి వృత్త మగుచు దీనికి నసన్నంబగు భవుకం బాసన్నంబగునని తలంచి మించినదైన దానిం బొడమిన సంతసం బించుకయేని వెలికి వెడలకుండ వచించి. ప్ర. ఓబాలా నీవక దాబేలల కెల్లం గోలవు. ఎంత ముగుదవైన నీ పుడమింగలం గన్నయరతంబులు నిక్కంబులని వక్కణ సలుపువారైనంగలరా ఇద్ది యెఱింగియు స్వప్నానుభూతార్థంబులు జాగ్రద్దశ ననుభవ విషయంబులు గాలేదని వగలం బొగులుట దెలువరితనంబే. కావున మనంబు దిటపఱచికొని ధీరత నేల చేకొనవు.

రా. వయస్యా వింటివా యీమెచ్చను నయోక్తి లోకవ్యవహారంబు ననుచితంబైన స్వాత్మానుభవంబునం జింతించినన కించిత్కరంబయని వచించెద. తాదృశంబగు నాయవస్థ యంతయు. నీకు విదితంబకదా.

సఖి. అట్లైనం దడవు వీడి వెసఁగ నట్లొనరింపుము. నేనును వెండియు నే తెంచెదనని నిర్గమించుచున్నది. దేవియుఁ దాత్కాలిక కృత్య నిర్వహణంబునకై యుద్యోగించుచున్నది.

పిమ్మటఁ బ్రవేశించుచున్నది. ప్రాణనాథ సౌధంబహుజన సంవాహితత్రినయన ఫల పరిస్థూల మహాస్వాద ద్వాత్రింశల్లడ్డుక మహారజత పాత్రియుఁ దాదృశపాక పాటల గోక్షీర భరిత కనక కలశయుఁ బరిమిత పరిచారికానుగతయు దేవి.

వి. ఈషద్దూరంబున దేవిం గాంచి - రాజుం జూచి - ఓ వయస్యా దేవియేతెంచుచున్నది గాని వివశుండవు గాక వైరస్యంబభినయింపుచు దేవితో నేవచించు వచనంబులకనుకూలంబుగ నప్రమత్తుఁడవై ప్రవర్తింపుమని దేవి కభిముఖంబుగ.

దే. సుబ్రాహ్మణ యీజనము ప్రణమిల్లుచున్నది.

వి. దేవి సమగ్ర సౌభాగ్య సాధ్వీమతల్లికయగుత.

దే. సుబ్రాహ్మణ భవదాగమంబునంజేసియియ్యెడ నిచ్చటికిరాఁగలిగె.

వి. దేవి యిట్లు వచింపనేల యంతరమ్మునకేతెమ్ము.

దే. అందుకుఁదొల్లింటి యార్యపుత్రుండు గాడు గావున నేనొల్ల.

వి. దేవి యవశంబునం బొడము దోషంబు లెన్నుట మహితమతుల కుచితంబేనా.

దే. (స్వ) ఆర్యపుత్రునకట్టి వికారము వొడమ నొక్క కారణంబుండవలయు - (ప్ర) సమనాగమర్షంబుగ - అవశతకెద్ది నిదానంబు.

వి. ఇయ్యెడ నేవచింపం జాలను గాని నేనుడివిన చొప్పుచేసితివేని యప్పు డాలోచించి వచించెద.

దే. ఇపుడేమి సేయవలయు.

వి. ఈపదార్థంబులతోఁ గూడఁబలిశెంత కేతేరవలయు.

దే. ఆర్య పుత్రుఁడు మిగులనలుగఁడుగదా.

యంతయు నిటుండనిమ్ము. కాచ్ఛపాతీన సంపృక్త క్షీర మహార్ణవంబని కదా నీవు వచించుచున్నావు. ఆత్మ దృష్టాంతంబున నీవవచింపవలయు. అద్దియ నిక్కంబై న మనమింటనున్నతఱి నాయెడల నీమనంబెట్లు వికాస శీలంబగునట యిప్పుడలదా దృశం బగుచున్నదా తథ్యంబుగ వచింపుము.

రా. వయస్య వింటివా యీ బాల యుదితంబు ఆమెయిందుకేమిశచించునో.

వి. యియ్యెడ నింగితంబు విదితం బొనగించు.

ఆ. (సంకల్పిత స్మితంబుగ) ఓసి నాచిన్ని కూనకాన యిట్టిపగల మునింగియు నెంత చక్కగఁ జెప్పితివె.

మంజ. సఖి నీవతి నిమ్నాంతరవు గావున నీయింగితంబు విదితం బొనరింపక నున్నఁగరండ గర్భ గుప్తంబగు మృగమదంబు కరణి దానంతటఁదాన నిజామోద చిహ్నంబున సుజ్ఞేయంబ ఐన నధిక వ్యథా జర్ఝరితాంత రంగనగుట నిట్లు వచింపవలసె క్షమింపందగు.

వి. వయస్య చూసితివా యామె లోఁగడ వచించిన నుడుగులు తాత్పర్యాంతర గర్భితంబులని వచించితిని గదా యీబాలయు నట్ల వచించె.

రా. వయస్య యామె యాత్మీయా కూతంబు ప్రకటింప నిద్దియ యవసరంబుగదా అద్దియ విస్రదము

ఆ. స్వ॥ ఆహా యిద్ది యియ్యెడఁ సద్దయు ముద్దరాలగుట గద్దింప నలవడని పెద్దవగలం బొగులుచున్నది. భావి వృత్తంబంతయు దెలిపిన దీని మనంబెట్లుండునో కావున హితసూచకం బగునటుల వచింపందగునని ప్రయత్న నిరుద్ధ బాష్పయగుచు. (ప్రకాశంబుగ) సఖి యన్ని విధంబులం దుదకు నీకు మేలయగు యల్లైనం జరుగుదాని కతిధీరవై యీ తేయు. సహింపుము. తక్కిన దెల్ల నెల్లి తెల్లంబగు..

మం. సఖి యీవగలనెల్లైన నట్ల యోర్తును గాని యిట్టి యవస్థకు నిక్కంబగు నిదానం బెద్దియని వచింతువు.

ఆ. సఖి సమయం బేతేరఁ దాన విస్పష్టంబగునని యింతవరకు వచింపకుంటి యిప్పుడింతమట్టుకు నీవడిగితివి కానం జెప్పవలసె. నిత్య శ్రీమతాది ధర్మంబులఁ

బురుషోత్తముండగు నొక్క క్షత్త్రియ సుత్రాముండు దొల్లి యుషాకన్యకుం బ్రద్యుమ్ను కరణి నీకు స్వప్నంబునం బ్రత్యక్షుండయి కామకేళు లుపదేశించుట నిక్కంబ. అట్టులవాఁడ నీకుం బ్రాణేశ్వరుండగు. మఱియు దక్షిణుండయ్యు నీ కనుకూలుం డును. తన్నిదానంబగు భవదాధికంబెఁ ద్వన్మూలంబగు తదీయ వ్యధ బహు గుణం బుగ సంవృద్ధంబై యుండు ఇంతయు వెసగఁ దేటపడుఁ గావున సమయార్థినివై యుండుము.

రా. వయస్య వింటివా యీభగవతి యుదితంబు.

వి. వయస్య నీమనోరథంబు ఫలిత ప్రాయంబ.

రా. వయస్య నీయుదితంబు విశ్వసనీయంబె కాని యీబాలకు స్వప్నలబ్ధుం డగు వాఁడు నేనయగుట కెద్ది యుపపత్తి.

వి. వయస్య కతిపయ నిదానంబుల నూహించి వచించిన వచనంబుల కెల్లం బ్రమాణంబు లడిగెదవు అప్రత్యక్షంబులగువానిం బ్రత్యక్ష విషయంబుల నెట్లొనర్తు. ఐన నీభాగ్య విశేషంబును నావితర్క్యమై పుణ్యంబు నెట్లు కాఁగలదో యిప్పుడ ప్రకటించెదనని యాతండు లిఖించిన చిత్త్రపటంబు నేకొని వారిచెంతం జేర నవిదిత స్వదేశాభిజ్ఞానంబుగ విసరుచున్నాఁడు. ఆ. దానింగని. స్వ॥ మహారాజు మధుకరుండియ్యెడ దీనింజూడ నేతెంచి కొండొకచో డాగియుండవలయు. ఇత్తఱి జరిగిన సల్లాపంబు లాలించి తన్నుం బ్రకటింపం జింతించి కాఁబోలిట్లొనరించు. కాకున్న నితర దుష్ప్రవేశంబగు నిచ్చోటికిది రాఁగతం బేమి. మంచిది కాఁగలదెల్ల వేగంబ కావలసినదె. ప్ర॥ సఖియిద్దియేదో యొక లిఖితంబు కరిణిఁ గానుపించుచున్నది చూతము దానిం జేకొనిరమ్ము.

మంజరి. అట్టుల యని దానిం దెచ్చి సఖీకరంబునం దుంచుచున్నది.

ఆ. సఖి దీని యపిధానంబు విఘటించి కనుంగొనుము.

మం. మంచిదని దానిమూతం బాపి విచ్చికాంచి యిందు సందర్శనంబున నంబుధి భంగి క్షణ క్షణ ప్రవర్ధమాన సంభ్రమ సంభరితంబగు నంతరంగంబుతోఁ గ్రమ క్రమంబున వికస్వరంబులగు విలోకనంబులం గాంచుచున్నది.

వి. వయస్య నీయాలేఖ్యంబీ బాల యెట్లు చూచుచున్నదో కాంచితివా.

రా. తిరోహిత ప్రియదర్శంజ నంబుగ । వయస్య. వికచల్లోచన యగుచు నవలోకించుచున్నదని తోఁచెడు.

వి. తెస్సగఁ గన్పట్టియుండు.

రా. దీనికన్న నెయ్యని యాశ్యంబు.

ఆ. అవిదిత తదీయాభిప్రాయకరణి. సఖి యిది యొద్ది.

మం. బధిరవలె నుంచున్నది.

ఆ. పెక్కుమారు లట్లు యనుయోగించుచున్నది.

మం. అన్ని సారిలకు నట్లయుండు.

ఆ. కించి దుచ్చైస్స్వరంబుగ సఖి యిది యొద్దియంటె మారువల్కవేమె.

మం. సావిధేయ సమయాభి నయంబుగ తదుచ్చతర స్వరంబుతో ఆసఖి యుండవె వచించెదనని. దాని యెడ నుపేక్షతోఁ గతిపయ నిమేషంబులు నిర్నిమేషంబుగ నాచిత్రిం బానంద బాష్పపూరంబు నయనంబుల నిండువరకుం జూచి పదంపడి తొందర యితెపొందనో చెలియా వీడెసుమీ నాఁడు నామనం బపహరించిన చోరవరుం డెన్ని దినంబులకు నాకుం గరగతుండయ్యెనే చూడు చూడు వీని నిప్పు డేమిచేసెదనో యని యాపటం బురంబునం బీడించుచున్నది.

రా. సఖేద మోదంబుగ. వయస్య చూచితె. దీనికబ్బిన భాగ్యంబు నాకు లభింపదయ్యెఁగదా బింబ భాగ్యంబులకంటెం బ్రతి బింబంబుల యవి మిగుల భావుక నికేతనంబు లగుచున్నవి యిద్దియుం దలఁప విస్మయంబుగాదు ఈలోకంబున సాత్మ ప్రతిమానంబులకుం గల్గు నుత్సవంబు లాదైవతంబులకు లేవుగదా.

వి. వయస్య నీవీయెడల విమృశ్యవాడివిగావు ప్రతిమానోత్సవంబులు ప్రక్రృతి సంమోదార్థంబకదా కల్పింపంబడు నిందుకేమి నిదర్శనంబని యందువా భవత్ప్రతిమానసంమాననంబున నీమనంబు సంతుష్టంబయ్యెనా లేదా.

రా. వయస్య నీవచనంబు నిక్కంబె కాని యాత్మకు స్వానుభవంబువలె స్వీయానుభవంబు తృప్తికరంబవునా.

వి. వయస్య యద్దియా సమయ వశంబున సమకూడు యీబాలికకు స్వప్న లబ్ధుండగు బురుషుండు నీవయనివి స్పష్టంబయ్యెగదా.

రా. యిమ్ముహూర్తంబున కిట్టుల తోఁచుచున్నది.

వి. పరికింపు మింకనేమి విశేషంబులు వెడమునో.

రా. అట్లయని పరీక్షించుచున్నాఁడు.

ఆ. అవిదితయుంబోలె ఓచెలిగా యెంతయుస్మాదిని వైతివె. అనల్ప శిల్ప కలాకల్పులగువారు మహారాజు ప్రసాదంబు వడయఁగోరి యధిక యత్నంబున సుచిరంబులగు నాలేఖ్యంబులు లిఖియించి సమర్పింతురు. అందులోనిది యొకటి యెక్కతంబుననో వాతవినూతంబై కాఁబోలు నిచ్చట వ్రాలె. అద్ది తద్దయు సొంపగుట మక్కువం గని వీఁడ నారమణుండని యక్కునం జేర్చికొనుట వివేకంబునకు లక్షణంబేనా. నిక్కంబుగం జింతించి నీవ వక్కాణింపుమా.

మం. ఈషదం కురితరోషంబుగ। సఖి- యట్టి సాధుశ్రతి గోత్రవతంసుండగు జననీ జనకులకుం జన్మించి మహామహిమవగు నీచే శిక్షితయగు నాకుం దాదృశానచ్ఛాత్మకంబగు నిచ్ఛవిచ్ఛవితం దుచ్ఛంబకాక సచ్ఛాయత వెట్టువుట్టునే నీమూర్తి సవిమర్శంబుగ నాలోకింప సకలోపమాన ద్రవ్య సందోహ సారాత్మకంబుగ శతధృతి సంకల్పితంబగు నామనస్తస్కరుని యాకారంబ యెబ్బుతంబుగం గానుపించుచున్నది దీన నేదోషం బుండిన నది నాదిగాదనియు నానిశ్చయంబు.

వి, వయస్య వింటివా.

రా. కృతార్థకల్పుండ నైతి.

వి. కృతార్థుండవె కాఁగలవు

రా. (సప్రమోదంబుగ) భూదేవ కులదేవతా ప్రసాద మూలంబగునట్టి భాగ్యంబుండినంగదా.

వి. అద్ది నీకు విందుగ నున్నదే యయ్యెడఁ గనుంగొనుము కనుంగొనుము.

రా. అట్లని నిరీక్షించుచున్నాఁడు.

ఆ. సస్మితంబుగ. ఓచెలియా నీనిశ్చయధైర్య సాహసంబులు విశృంఖలంబులు గదా.

మం. లోక వ్యవహార బాధ లాలోచింపమను దక్షయంబ పహ్నవించుట నీతి నిమిత్తంబేనా. స్వప్నంబునం గనుపించి నవ్వాడెట్టి వేషంబు గలిగ నట్టి వేషంబ యిప్పుడుం గానంబడుచున్నది.

ఆ. సఖీ నీవంత నిక్కంబుగం జెప్ప నేనేమి వచింతునని దానిం గైకొని తోలుత మంజరిచే లిఖించి యుపధానాధ స్థాపితంబగు చిత్రింబు సంస్మరించి సర్వ ప్రికారంబుల వానికి నైకాత్మ్యంబు నిశ్చయించి సఖి యింకొకటి కానంబడు నిది యుం జిత్రిపటంబై తోచు. విచ్చి కనుంగొనుము.

మం. అట్లొనరించి దాని ముదుమచుం ద్రిపానవత వదన యగుచున్నది.

ఆ. సఖీ దీనింగని సిగ్గునం బెగ్గిలుచున్నావు. పూర్వ ప్రతిజ్ఞాతార్థ బాధకంబు పస్థితంబయ్యెనా యేమి.

మం. స్వ. ఆహా యెంత యపత్రిపా నిదానంబుద్భవిల్లె. దీనందాడికా కల్ప చిహ్నితంబగు నాయాకృతియుం దాదృశంబగు నాతని యాకృతియునే కాక సాపదిక క్రీడా చిహ్నంబులును వ్రాయంబడె. దీనికట్లునే దీనిం గానుపింతు. లేదా చూపింతునా యీమె మామకీన విస్రింభై కనికేతనగదా. అట్లైన మరియు దీనిం గన్నం బ్రాగుదితంబగు మదీయచాపలదోష వితర్కంబున మనంబు దొలంగించు ఆహా యిద్దియు మిగుల నుచితంబై చూపట్టదు. సంభోగ చిహ్నంబు లారులకుం దెలిపె నేని వారు గన్గొనం గ్రీడించెనేని వీనికి నంతరం బంతయుం జింతింపందగు. ఎట్టి విస్రింభవతియైన నెట్టిచెలియైనం జూడం గ్రీడించుట సుశీలాశీలంబేయని వితర్కించుచు వివర్ణానన యగుచున్నది.

ఆ. అవిదిత తదభిప్రాయ మాద్రి. చెలియా యేమే యిది యవలోకించుచు నెట్లో యుంటివి. నేం జెప్పినట్లె యయ్యెనాయని దానిం జేకొనం గరప్రసారణంబొనర్చు చున్నది.

మం. కృతబలాత్కార కరణి విడుచుచున్నది.

ఆ. సవిమర్శంబుగ నంతట నాలోకించి సస్మితంబుగ ఓసి వయస్యా యిప్ప టికైన నాయుందరమర వీడవుగదా. వెనుక నేనన్నమాటకు నలుక వొడమెనా. ఈయవసరంబునం దదీయాధ్యానైక తానత్వంబు హృదయ ప్రసాదకరంబుగ్గామి దానిం దొలగించుటకయి యట్లు వచించితి సుమీ. కావునం బ్రిసన్న మనస్కవగుము.

మం. సఖి త్వదధ్యాహృత దోషం బాత్మీయ సూహాపరిమృష్టంబు గావున నింక నట్ల యగుదు.

ఆ. సఖి స్వప్నవృత్తంబగు నీవృత్తంబు సత్యం బెప్పుడగునని మిగులం బ్రతీ క్షించుచున్నాను.

మం. సకౌతుకంబుగ. సఖి యట్టిభాగ్యం బెన్నటికైన నాకబ్బునా.

ఆ. సఖి కాకున్న నిచ్చో నేనెందుకుందు.

మం. సఖి నీవు సర్వదా మదీయ దయితార్థ సంధానైకతానవనే నమ్మి యుండునుగదా.

ఆ. మంచిదికాని యిద్దియు నొక చిత్తరువేమొ పరికింపుము.

మం. మంచిదని దాని విఘటించి యంతట విలోకించి సంచిత నిశ్వాస యగు చున్నది.

ఆ. సఖి యెందుకే యిట్లు వగచెదు.

మం. సగద్గదంబుగ. నాకబ్బిన వితత పాతక వారితంబునకే.

ఆ. సఖి సద్వంశ ముక్తారత్నాయమానగుణ శరణంబవగు నీకు దురితకథా లేశ వితర్కంబునకైన నిదానంబు గానంబడదుగదా.

మం. సఖి యట్లంటివేమే. మహాగిరి కరణిన విజ్ఞేయ ప్రమాణంబై దృగ్గో చరంబగుచున్నది.

ఆ. సఖి నీయభిప్రాయం బీయెడ నతి గూఢంబైయుండుం గావున వ్యా ఖ్యానం బొనరింపకున్న నాకు సుఖవేద్యంబు గాదు.

మం. ముహూర్త మాత్రంబు తద్వదనంబు తేరిపారం జూచి సఖి సుధీగణ్య వగు నీకు విదితంబుగాని యర్థం బెద్దియు నెక్కడనైన నుండదు. అతిముగ్ధనగు

నాయుదితంబుల యరతంబులట్లుండవని వచింప నేల. ఐన నీవడిగితివి గావునఁ బరిగుణంబులవలె నాత్మదోషంబులు వివరించుట సుశీలమూలంబను సదాచారంబు వట్టి నిశ్శంకనై వచించెద నాలింపుము.

వి. వయస్యా వింటివే వీరల సల్లాపంబు లీయెడ నీశ్రోత్రంబున కాసేచనంబులను వ్యాహార నిర్ఝరాహార ధార లుదితంబులగు సావధానుండవయి యవధరింపుము.

రా. కృతార్థుండగుదునని యట్లుంచున్నాఁడు.

మం. సఖి చూచితివే యిప్పటంబు. మహారాజ శేఖరుండీయెడ శరదాద్యవ్యవహిత ప్రాక్కాలిక కైరవబంధు నోజఁ బ్రావృడావిర్భావ ప్రాక్తన ధూళీసంవలితంబగు మణిరత్నంబు కరణి నాసన్న దినకరకరపాళీలాలన భావుకంబగు కమల కోరకంబు మాడ్కి సంస్కారార్థ సంతాపిత జాతరూప పరిష్కారంబురీతి నతికార్శ్యమూల చిరసమయసంగత సంరోధ విఘూన నోత్పతిష్ణు కంఠీరవంబు చందంబునం బరిచ్ఛన్న నిజచ్ఛాయా నచ్ఛాత్ముండై తుచ్ఛావస్థకుం బాల్పడెఁగదా. ఇందుకు మూలంబగుటకంటె దురితనిదానంబొండు మఱి యెద్దియైన నుండునా.

వి. వయస్యా వింటివా భవద్విషయకంబగు దీని యనురాగ భరంబు.

రా. వయస్యా ధన్యుండనైతి. ఈసుదువునం బొడమించిన సంతసంబునకు మూల్యంబుగ నేనేమి సేయంగలఁ.

వి. వయస్యా సత్యంబ వచించితివి. సర్వోపచారంబులకుం బ్రణామోపచారంబు ప్రధానంబు గావునం దదీయ చరణకంజ రంజితమంజుల లాక్షారసంబున నిటాలం బలంకరించికొనుము.

రా. ససమ్మదంబుగ వయస్యా యద్ది లభించిన నే ధన్యజనమూర్ధన్యుండను గానా.

వి. మంచిది యందుకు ముందు విచారింతము. ఇంక నెట్టి శ్రవణ మహోత్సవంబు మిగుల నుల్లసిల్లునో విను ము.

రా. భాగ్యంబు భాగ్యంబని యప్రమాదుండనై యుండు.

ఆ. సస్మితంబుగ. ఆహా సఖీ యేమి వచింతువే. దీనియందు నీకున్న ప్రేమభరంబు ఉపమానోపన్యాసంబు సాపదిక కార్యమాత్రబోధకంబ కాక భావ్యభ్యుదయ వ్యంజకంబగుచున్నది.

వి. వయస్య తెలిసికొంటివా వీరి యాకూతంబు. అప్పుడు మనకు వ్యక్తంబు కాదయ్యె ఇద్ది నీమనోరథ సిద్ధికి ముఖ్యనిదానంబగు వ్యంజకంబు.

రా. ఆహా వయస్యా వీరల వచనగాంభీర్యంబు తద్దయు నాశ్చర్య ధుర్యంబు.

వి. సస్మితంబుగ వయస్య యిద్ది యదూష్యంబగు నీవైదుష్యంబునకు భూష్యంబె.

రా. సజుగుప్సంబుగ. వయస్య యిట్లు వచింపకు భూషణంబని వచింపుము.

వి. మంచిది యింక నెట్టి శ్రవణ భావుకంబు లుద్భవించునో యవధరింపుము.

రా. అట్లయని ప్రతీక్షించుచున్నాడు.

మం. అంకురద పత్రపయగుచు సఖియింత. నేనెఱుంగను గాని యెందుకో యానుడు వప్పుడట్లుదయించె.

ఆ. సఖి నేవచించెద వినుము. తద్దృష్టాంతింబని యభ్యుదయంబు నకు.

మం. సత్యమస్తు వచస్తవ యని యభినందించుచున్నది.

ఆ. సఖి యేదీ యీపటంబని దానికరంబునం జేకొని యాపటంబంతయు విచ్చి ప్రాక్తన వేషధారిణియగు నిజవయస్యకుం బద ప్రణామం బాచరించు గతిదీనంబగు తదాత్మంగని. సఖి యిద్దికంటివా నీహృదయ దయితుండు స్వావస్థా ప్రకాశన పరుండుగాని పరావస్థాస్మరణ నిపుణుండు గాడు గదా యని దానికిం జూపించుచున్నది.

మం. దానిం గని యత్యంత తటి ఘుం కురిత వ్రీడా చకితచేతస్క యగుచుం దద్విషయక రాగభర సంఛన్న తద్వికారయగుచు సఖియీదోషం బీతని యందారోపణీయంబు గాదు. ఎందునుండి యని యందువా యీతండిట్టి నా యవస్థం గాంచెనా మంచిది యాత్మ దృష్టాంతంబున నెదిరి వారికింగల యవస్థ నూహనీయం బేయని యందువా మదీయానురాగ భవంబు మామకీనహృదయంబున జీర్ణంబగుచున్నది. కాని

యతని కెట్లు తెలియంబడు. మరియు నెట్టి దోషంబులఁ దలంపమికేకాఁబోలు పరిణమిల్లె.

ఆ. స స్మితంబుగ. సఖి యిప్పుడ యీతని దోషంబుల కిట్లు పరభాగాత్తం బొడమించు చుంటివి. ముందెట్లుండువే.

మ. సఖి పెక్కులు నేచెప్పనేల. అట్టి భాగ్యంబు నాకుంగలిగె నేని నీకు దానంతటఁ దాన తెల్లంబగునని హాహృదయవల్లభ సకల సామంత భూకాంత సంతత ప్రణామైక నిశాంత నిజపీఠ చరణ సరసిజుండవగు నీవు నాకతంబున నపదలను నందయనీయయగు నిట్టి దీనదశ ప్రాప్తించెనా యాహా యిట్టి పాతకంబున నే నెట్లు విడువంబడుదునని వయస్యాంకపాళి మూర్ఛిల్లు చున్నది.

రా. మందర పరిలోడిత కలశవారాశి సోదరాంతరుండగుచు హా మదీయ జీవిత జీవనంబా నాభాగ్యం బింతయేనాయని ససంభ్రమంబుగం దదీయ మంటపంబు సేరం జనుచున్నాఁడు.

ఆ. స్వ. దీని కతిదుష్టంబగు కష్టదిష్టంబు సుదిష్టాదిష్టంబైన నష్టంబగుటకు నిర్వాహోన్ముఖంబగు దీపంబు కరణి మిగులఁ బ్రజ్వరిల్లుచున్నది ఇంక యామిత్రి యంబు దీని యాభీల్యం బనుభవింపవలయునని యెదుటం జూచి. స్వ. ఆహా యీచి త్రిపటం బిచ్చటి కెట్లు చేరెనోయను నాలోచన మాత్రి కలిగెఁగాని వ్యాసంగాంతరంబున విస్మృష్టంబు గాదయ్యె ఎట్లోయీబాలిక యిక్కడ నుండుటం దెలిసికొని దీనిం గాన నవిదితంబుగ నీయారామాంతరంబున నొక్కచో నిమిడియుండి యిప్పుడు దీని యవస్థం జూచి సైపనోపక యేతెంచు. ఈయెడ కిద్దియ యుచితంబ యనుచు వెండియు మోిలవిలోకించి యాహా సుహారాజ మధుకరుండు సమీప గతుండగుచు న్నాఁడనుచు నిజోత్సంగ నిపతితయగు నాబాలిక నవలంబించి యభ్యుద్గతి యొనరింప నుద్యమించుచున్నది.

రా. భగవతీ నీచే విరచిత సత్కారుండనే యధిక కష్టభరంబు పస్థితంబ య్యెఁ గావున నుపవేశింపుము. నేనిచ్చటం గూర్చుండెదనని యతివిషణ్ణుండగుచుఁ దదభ్యాశంబున నుపవేశించుచున్నాఁడు.

ఆ. మహారాజ విడుము విషాదంబు ప్రాణులకెల్లం గాలవశంబున సుఖదుఃఖంబులోలిం బ్రాప్తించుట విదితంబకదా. నీచైర్గచ్ఛత్యుపరిచ దశా చక్రనేమి క్రమేణయను నార్యోక్తి విస్మృతం బయ్యెనా.

రా. భగవతి సుఖదుఃఖంబు లుద్భవిల్లినం దద్వికారంబులు మీబోటి విజ్ఞాననిధులం గతిపయులందక్క తక్కిన నేవాండ్రఁ దీండ్రంబుగం బరిభవింపవు.

ఆ. మహారాజ నీవు దయామయ హృదయుండవు గావున నిట్లువచింతువు గాని ధీరుండవు గాకనా.

రా. భగవతీ ప్రతిభాదృష్టులకు మాదృశ చార్మణ చక్షుష్కు లెద్దియయు వచించుట కెంతవారు.

ఆ. మహారాజ యిద్ది యిట్లుండనిచ్చి నీయాధి నిదానం బంతయుఁ గొంతయైనఁ గొఱంత పడకుండ నిక్కంబుగ వక్కాణింపవలయునని యోజనంబు వేఁడుచున్నది.

రా. భగవతీ యనుగృహీతుండ నైతిని. సూనృతంబుగన వచించెద నవధరింపఁదగు. అలి స్వప్నవృత్తాంతం బాలిగఁ దత్క్షణావధికంబగు నాత్మీయ వార్తనంతయు నార్తమనస్కుండయి తెలుపుచున్నాఁడు.

ఆ. స్వ. ఆహా దైవం బీయిరువురకు నివ్విధంబున సంబంధంబు సంఘటింపందలఁచి కాఁబోలు నీనడుమ నింత వ్యాపారంబు గల్పించె. కాకున్నఁ జందరయోగిన్యాగమనాది ప్రవృత్తి యెట్లు సంధిల్లు మంచిది వీరికష్టం బల్పావశిష్టంబు గావున మిగుల వగవందగదు. ఈతని యంగస్పర్శనంబు గలిగెనేని దీనికిం దెలివి గల్గునని.
ప్ర. మహారాజ స్వప్నోపభుక్తయగు బాలిక యిద్దియయని నీకు నిక్కంబు గలదా.

రా. భగవతీ నేవేరుగ వచింపనేల నాచే స్వప్నభుక్తయగు దానిరూపంబు తద్గత చిత్తుండనై లిఖించితి. ఈచిత్రంబునకు నీబాలికకు నంతరంబు లేకున్న నిద్దియ యని విశ్వసింపందగు.

ఆ. మహారాజ భవదుదితంబు సూనృతతమంబే కావునఁ జంద్రకాంత శిలసుధాకరుండువలె నీవిద్దాని నిజకరస్పర్శనంబున సజీవనఁ జేయందగునని యాబాలిక నతని యంకదేశంబున నుంచుచున్నది.

రా. సగద్గదంబుగ. హా మహారాజపుత్రీ కలకాలము శృంగార సాగరస ముద్భవయగు నరవింద మందిర మాడ్కి మహిత ప్రకాశలై యానంద వర్షిణివైననిన్ని జాగ్రద్దశ నాతప ప్రఘాత సంతాప సంకాంతంబగు నుపవనవల్లి పోలిక నిరంతర దుస్సహ విజృంభణ తప విఘాతంబగు నారణ్యా కదళికరణి గతవాసర గ్రథితంబగు విచికిల మాలికపోలిక వాతాఘాత నితాంత తాంతంబగు ఘనసారసాల భంజిక యోజఁ జూడవలసివచ్చెఁ గదా యని కొంత తడవు మిగుల వగలం బొగిలి యతి యత్నంబున నాలంబిత ధృతి యగుచు.

గీ॥ అలరుననేని పరస్పరార్హత యనంత । విధికృతంబేని యీ ప్రేమ విషము మాకు। ధర్మతత్పరతయు నాకుఁ దద్దయేని । శర్వదీనిస చేతన సలుపవయ్య॥ ౧౫౪॥

అని తలంచుచుం గరపల్లవంబునం దాని శరీరంబు నిమురుచున్నాఁడు.

ఆ. సానందంబుగ. మహారాజ నైదాఘరాకాభ్యుదితుండగు నమృత ద్యోతుని దీధితి వ్రాతంబున నుపలాలిత యగు కువలయ కలిక పోలిక నీబాలిక మంద మంద సంస్పందమాన ప్రతీక యగుచు నుపగత జీవితరీతి నయనానంద కందంబగుచున్నది.

రా. భగవతీ యిద్ది నీసంకల్ప మహిమంబే.

ఆ. మహారాజ యిట్లు వచింప నేనెంతదాన. దైవ సంకల్ప మహిమంబని వచింపవలయు.

మం. సుప్తప్రాయయయు నిమీలిత నయనయు నగుచు. ఆహా నాభాగ్యం బిపుడమృత కిరణ మండలాధివాస సౌఖ్యంబు సంఘటిల్లెననుచు బాహువల్లుల నతనిం బట్టుకొనుచున్నది.

రా. తదీయసుఖం బనుభవించి భగవతీ నేటికి నష్టధనంబు దిష్టప్రసాదంబున సంలబ్ధంబయ్యె.

ఆ. స్వ. ఈయెడ నీబాల సంప్రాప్త చేతశ్చేతనయై పలవరించు చున్నదాని వలెఁ బలుకుచున్నది. కావున దీనిం బ్రవ్యక్త చేతనఁ జేయవలయునని. ప్ర. కల స్వరంబున సకియా సకియా యని పిలుచుచున్నది.

మం. గాఢసుప్తకరణి ఊఁ యూఁ యనుచున్నది.

ఆ. కించి దుచ్చైః స్వరంబుగ వెండియు నాహ్వానించుచున్నది.

మం. దీర్ఘతమంబగు నిశ్వాసంబిచ్చుచు మిగుల ఖేదంబు సూచించుచు నబ్బబ్బా, సకియా, యూరకుండవే కొంతతడి. నాటికల మదీయ హృదయ చోరుండగువాఁడు వెండియు నిపుడెట్లో కానంబడుచున్నాఁడు.

రా. సానంద సంభ్రమంబుగ సఖీ యట్లైనం దొలుతం బోతె వానింబోనీకు. వాఁడీయెడ నుండి కదలకుండ గట్టిగం బట్టుకొను.

మం. సఖీవచనంబని తలంచి వయస్యా బాగుగ వచించితివే యని మారలం దోర్వల్లుల నాతనిం బీడించుచున్నది.

రా. భగవతీ ధన్యజన మూర్ధన్యుండనైతి.

ఆ. మహారాజ యిదివరకు నిది స్వాపవృత్తంబువలన నివృత్తి కాలేదుసుమీ.

రా. భగవతీ కావున దీనిం బ్రబోధించెదనని దాని ప్రతీప్త వేష్టనంబల్ల నల్లన వదలించి యంకపాళి నుపవేశింపుచున్నాఁడు.

మం. సుప్తోత్థాపితవలె హా సఖీ స్వాప్తిక సుఖంబునకుం బ్రత్యూహంబు వాటిల్లెఁగదా.

ఆ. కించి దుచ్చైస్స్వరంబుగ. ప్రత్యక్ష సూఖోప లబ్ధినట్లగుట శోచనీయంబు గాదులే.

మం. ప్రబుద్ధప్రాయ యగుచు. సకియా యది యట్లే.

ఆ. సకియా కనుమూసినవానికి వస్తు ప్రత్యక్షం బెట్లు కలుగునే.

మం. సంప్రాప్త బోధయగుచు, లోచనంబుల నోలి విచ్చిచూచి, సకియా యిది యెట్టివింతయో కాని జాగ్రద్దశ నొందినను స్వప్నావస్థానుభవంబ యగుచున్నదే.

రా. సవిహాసితంబుగ, భగవతీ దీనికిప్పటికిని స్వాప్నిక సంస్కారంబు పోలేదు.

ఆ. సఖి సావధానవై విలోకింపుము. ఉభయావస్థా విశేషంబు తెల్లంబగు.

మం. సావధానంబుగం గనుంగొని సవ్రీడాభయ సంభ్రమ విస్మయ ప్రమోద యగుచుండ దంకపాళిఁ దొలఁగి సఖీ చరమదేశంబునకుం జనుచున్నది.

రా. తదంతికంబునకుం గూడఁజని. సఖీ యిది యెట్టి నయంబు. చిరకాలాభిలాష విషయంబగు వస్తువ ప్రయత్నంబుగఁ దానంతటఁదాన క్రీతప్రాయంబై కరగతంబుగాఁగ ననాదరం బొనరింప నుచితంబే నాకుని బలిమింబోలె దానింజేకొని నిజస్థానంబునకు మరలం జేరి యూరుపీఠింజేర్చి తదవసరోచిత సల్లాపంబుల వారితో నభినందించుచున్నాఁడు.

వి. పార్శ్వదేశం బవలోకించి, అన్నా దైవసంకల్పం బిట్లుండునని యెప్పుడు నొక్కింతయేని నమ్మందగనిది గదా. అది నిక్కంబ. చిరతరావసరంబున ననంగానల సంతప్తుండగు నీవయస్యుండు గ్రీష్మోష్మ సంతాపితంబగు సారంగంబు కాదంబిని కరణిఁ దపన మహాతపాక్లాంతంబగు చకోరంబమృత మరీచిమండలి మాడ్కి దవదహన సంజ్వలితంబగు సరీసృపంబు చందన శాఖ పగిది నీబాలిక నవలోకింప సముల్లసత్కుతూహలుండైయెట్లో యీయవసరంబున దైవవశంబునం గృత కృత్యుండగుటనిస్తీర్ణ విషాదార్ణవుండయ్యెనని మిగుల సంతోషించుచుంటిని. ఇట్లుండగనే యీతనికి దుస్సహ పిపాసావ్యథనంబున సరసి నవగాహించిన వానికి నుగ్రితర గ్రాహ సంగ్రహంబు గలుగునటుల దేవీదృష్టి విషయంబగుట తటస్థించె. మరియు నీతండు మందభాగ్యుండగుట నిత్తరిన వంచనా పరత దోషగవేషణైకతాన యాగాసంతయేని యవకాశంబు గలిగినం బౌరస్త్యపాశ్చాత్య కృత్యవిలోకన కనీనికా విహీనయుఁ జండతర నిసర్గయునగు దేవీదృష్టి పథంబునం బడంగలండు. అట్టి యీతండభినవ ప్రసవ సంవర్ధిత బుభుక్షారూక్షాత్మయగు శార్దూలీ సమక్షంబున కతికార్శ్యనిదాన బహుతర నిర్బంధన నిర్గళితంబై యశనాయాసహిష్ణువగుట ననుపమానానూన ప్రియంబగు గుహాంతరంబు సొచ్చి యతిథియగు మహోక్షంబెట్టుగాదు?

ఈబాలికయైన మున్నేహరిణ శాబకయైనది. అని వెండియు నించుకతడి సింతించి. ఆహా నేనీయెడ నెంతయదూర విచారుండనైతి. నేనతాదృశుండగుదుననియెంచవలయు. ఇద్దేవి మిగులఁ గలావతియ. వయస్యుండైతే చెలిమివీడిన రెండవకృతాం-

తుండే. దేవియు నీబాలిక నిగ్రహించి సకల సద్గుణ కుసుమారాముండగు నీయభితా మునకుం బ్రతికూల వర్తినియగుచు ముందేమి భుజింప గలదు. మఱియు వీరియంద మరవర వర్ణినీమనీష యీయోషిన్మణికిం గలదు. కావున వీరలకొక్కింతయు నపా యుంబు వితర్కింబునకైన విషయంబుగాదు. మఱిమన్న నీయెడ నీమెనర్గాంచిన నిం తకు నేనమూలంబని తలంచి సంచిత క్రోధయై నన్నవంచించు. నేనపరిచితుండనగుట వారల విస్రంభంబునకు విస్రంసయిత నగుదు నేమో యని వెళ్లకుంటిని గాని యిట్టికష్టం బుపస్థితంబగు నేమోయని వెళ్ళనివాఁడను గాను. కావునం బవిసెతలంపున నిద్దియు మే లయ్యె. కాననింక నిచ్చట నుండందగదని నిగూఢక్రమంబునం దరునికరాంతరంబు న వెలికి వెలువడుచున్నాఁడు.

పదంపడి ప్రవేశించుచున్నది దేవి. తచ్చేటికాద్వయా సేవితయగుచుం దదు ద్యానంబు.

దే. ఓసి సంపకాంగీ యీకన్నియ లీయెడ నేయేగోష్ఠుల నుందురో చూత ము. కావున నవిదితగమనాభి జ్ఞానంబుగ నడచెదము.

చం. దేవి యొరులనడత నరయుట కిద్దియ వెరవు.

దే. ఓసి నీకును నిదయ యుచితంబని తోఁచెనా యట్లయొనరింతము. నీవిపుడ నుల్బణ యానంబుగ నేఁగివారిచ్చట నెట్లువర్తించుచుందురో దూరంబుననుండియ పరికించిరమ్ము. ఈశంపాలత నాకుం దోడైయుండు.

చం. దేవియానతిమూలకుం బూలదండయని యవ్యక్తసంచారయగుచు నోలి శయన సౌధలాస్య శాలాదుల విలోకించి యాక్రీడమంటపంబు నసదుదవ్వునం గాంచి, సవితర్కంబుగ, ఆహా యీకన్నియలు లగ్గలకు నిగ్గుల నిడురూపుచు, నతితయు దొ లుతఁగల యామేటి గొనంబుల వేల్పుల వెలందులనుని యొఱంగిన వారలకెల్లఁ దెల్లంబ గు. ఇపుడుచూడ మూడవజనం బొకండుండుననితోఁచు. మఱియు మగవాఁడుగఁ గన్పడు. ఇంతియుకాక యాయాలక్షణంబుల వీరిలో నేమెకో చెలువుని తసంబునకుం దగి చెలువొందుచున్నాఁడు. ఈనికైనం డబుచుగఁజొరరాని యీటీకు తోటకేతెం చుటకు నెవ్వండోపునని తద్దయునరసి. ఈతండెవ్వండనుకొందు. ఓడనేయనుకొం దునా దేవేరియానతి నిక్కడనుండు పనికత్తెలగు మామూవురకుం దప్ప నేరికి వీరియు

నికి తెల్లంబుగారాదు. అనుమఁ దారుచుందారుచుఁ గొంత చెంతకరిగి లెస్సఁబరికించి యూహా! యీతండు మనయేలిక పోలికగాఁగానుపించుచున్నాఁడని వెండియుంబాగు గఁగాంచి యితండు మనయొడయండే. మఱియు నీబాలికం గుఱుఁపులనుంచికొని యే మేమో ముచ్చటలాడుచున్నాఁడు. దీనినీయెడ దేవిపరికింపక మానదు, నేనేమిసేయ నేర్తు. ఇప్పుడు పనికత్తెలగు మాకును వీరికిని లేదా యేరికో కొందఱకుఁ దద్దయునెద్ది యో యొక్క యిక్కట్టు నిక్కంబుగం గలుగకమానదు. అంతయు బవిసితలంపునం జరుగు. ఐన నేనిట్లని వచింపక నీలాగున నుడువుచునని యల్లనల్లనం జేరి, దేవీ వారి యెడ నాక్రీడమంటపాంతరంబున నున్నవారు. వక్కాణింపందగునది యింకొకండు గలదు. గాని సందియంబునకుం దావగుట నేవచింపఁజాల. నిక్కంబుగం గానఁజెం తకుఁజేరవలయు. అట్లైన రాజాడవారు పొడఁగందురను బెగడునందగిన యటుల నర యనైతి. కావునంగన్గొన దేవికే విదితంబుగాఁగలదు.

దే. సవైమనస్యయగుచు, మీరిరువురు మెల్లమెల్లగ నావెనుకం జనుదెండు. ముందు నేవెడలి పరికించెదనని నియమించి యవిజ్ఞేయక్రియయగుచుఁ గొంతదూరంబ రిగి యెదుట విలోకించి క్రోధసంక్షుభిత స్వాంతయగుచు, అన్నన్నా యార్యపుత్రుం డెంత సాహసంబుసలిపె. ఇద్దియు నాదు నేరమే. మొదటితప్పు వీరలశీలంబు లెస్స గం దెలియక యింటనుంచుకొంట. రెండవది యోగినీభ్రమంబున నార్యపుత్రునకుం గానుపించుట. ఐన నిక్కన్నియలు సముల్లంఘిత సమర్యాదలగుట నిశ్శంకంబుగ దం డనీయతేయని తలంచి పాశ్చాత్యభాగం బవలోకించుచున్నది. చేటికలును సమీపిం చుచున్నారు.

దే. ఓసి శంపాలతా నీవు గృహంబునకు నిభృతంబుగ నేగి యొకశృంఖలాద్వ యంబుచేకొని నాయున్నతావునకు వెసగ నేతెమ్ము.

శం. దేవేరియానతి నాతలకట్టునకు రవణంపు తలకట్టు. పోయివచ్చెదనని వె డలుచున్నది.

దే. పెరపరవుడు దోడరాఁ బెడదారినవిదితగతి యగుచుం బ్రియుని పశ్చిమదే శంబుసేరి పాణిపల్లవంబుల నతనిలోచనంబులు మూయుచున్నది.

మం. భయవిహ్వలయగుచుం దొలంగుచున్నది.

ఆ. కృతోత్థాన యగుచున్నది.

రా. స్పర్శంబనుభవించి. స్వ. ఆహా నా భాగ్యవిపర్యయవిభవంబు దేవిదృష్టియోగిదృష్టి ననుకరించుచున్నది. నేనీయెడ శిక్షకసాక్షికంబుగఁ బరాధవిధాతృత్వంబునొంది దర్వీకర గృహీతంబగు దర్దురంబు దశకు వశంబయితి. ఈయెడ సమాశ్రయంబుకంటెనొండగు నుపాయం బపాయ నివారకంబు గానం బడదని పశ్చాత్ప్రసారితంబులగు పాణుల దేవీచరణంబులు పట్టికొని. ప్ర. దేవీ ప్రణిపాత ప్రతీకారస్సంరంభోహి మహాత్మనామను నభియుక్తోక్తి మన్నింపుమని ప్రార్థించుచున్నాఁడు.

దే. నిజకరంబులం దనీకకరంబులం జరణంబులం దొలఁగించి ముంగలఁజేసి. ఆర్యపుత్ర యాభియుక్త జనోక్తుల సంభావింపం దదనుగుణంబుగ వర్తింపను బాల్యంబాదిగ గురుజన సంశిక్షితులును ధర్మసంరక్షణైక ప్రయోజనులునగు మీవంటి పండితులకుఁదగుంగానియాబాల బాలిశులము ప్రకృతి ప్రతీపదర్శనులునగు మాబోటిబోటులకు నేసాటిపాటుగలము. కాఁబట్టి సౌశీల పరిశీలనంబున నిట్టిమీకు మేమొక్కింతయు గణనీయులము గాము. కావుననీవింక నొక్కటి వచింపనక్కరలే దూరకుండుమని యక్కన్నియలంగని మిగులందర్జించుచు నధిక్షేపించుచున్నది.

అయ్యవసరంబునం బ్రవేశించుచున్నది. శంపాలత శృంఖలాద్వయాకలిత హస్తయగుచు.

దే. దానింగాంచి ఓసీ నేఁజెప్పకున్నను గాంగేయమయ నిగళంబులే వీరలకర్హంబులు తెచ్చితివి గావున నాకనుపితాచరణంబు కలుగమింబట్టి నీతెలివికి మిగుల సంతసిల్లితిఁగాని వేత్రంబొనయింపమిఁగడుఁ బొడవగు తెలివి దానవు కాకపోతివి.

శం. ససంకోచంబుగ. దేవి నాతప్పు సైరింపందగు నానతికంటె నదనంబొనర్చిన నదియు నేరమగునని నేఁదేలేదు.

దే. ఓసీమందిడి. నీవు నాయాజ్ఞమ్మానించిన దానవుగాన నాలోపంబు నీకులేదు. ఇప్పుడేగి దానింజేకొనిరమ్ము.

శం. దేవి యానతి శిరంబునక్కై సేతనెందెనని వెడలుచున్నది.

రా. సభయవ్యాకుల మనస్కుండగుచు స్వ. ఆహా ఎంతకష్టంబు పస్థితంబయ్యె ఈమె నిగళయుగళంబుఁ దెప్పించె. నాకు నీబాలికను నో కాక యీబాలికలకో దీనిసం

ధానంబు గావలయు. ఒక్కటే తెప్పించిన నాకేయగునని కొంత నెమ్మది నొందుదు. మఱియు వేత్రంబు నావయింపంబంపె. ఆత్మీయశిక్షకైతే యెట్లైన నొప్పుకొందు. నేను సజీవితుండనగుచు వీరలయాభీలం బెట్లు సహింతు. ఇప్పుడేమి సేయుదు. సాంత్వనోదితంబులకంటె సాధనంబెద్దియుఁ గానుపించదని దయాధారాధారంబులగు మధుర వ్యాహారధారా ధరంబుల నాపె తీవ్రతర రోషాశ్రయాశంబు శమియింప బహుతర ప్రకారంబుల వేడికొనుచు దాననుపగతనిజేప్సితలాభాశావకాశుండై ససంభ్రమంబుగ దేవియీయెడ వీరిని హింసించితివేని యాత్మీయాఘాత ప్రకటిత మదీయగ్రీవానిస్సృతాసృక్కల్పిత తిలకాంచిత నిటాలవగుదువని యొట్టువెట్టుచున్నాఁడు

దే. సవిషాద క్రోధకరుణంబుగ. స్వ. ఆహా యీయెడ వీరల దండింపంబూనిన నామహోద్యమం బుపతతిరాణ్మంత్ర నియంత్రణంబున దందశూకంబు చందంబున నీతని శపథంబున వితథంబయ్యెనని తచ్ఛపథంబు సంస్మరించి ఆహా యార్యపుత్రుండా శపథవాక్యంబున నియ్యెడ ననినుదువుటంబట్టి నాతలంపున కిసుమంతైన యడ్డంకి వొడమదని తలంచి యొకసంకిలివిచ్చి యామోద రేఖా నృపశేఖరుల మోలంబరచి చేటికం గాంచి యోసీ యిట్లొనరింపుమని దానికిం జెప్పుచున్నది.

చే. దేవి యానతి యనాక్రోశ్వేదకుఁ బూలదండ యగుచున్నది.

రా. విషాదవిషయ మనీషుండగుచు స్వ. అయ్యయ్యో దేవియెడల నేనొనరించిన వేడుకొంటలన్నియు స్థూలబుద్ధులకుం గఱపిన సుబోధంబులుం గృతఘ్నవిషయంబులగు నభిలాష నివేదనంబులు ధనజీవితోద్దేశ్యకంబులగు దానప్రసంగంబులు విరక్తలక్ష్యకంబులగు రాగగోష్ఠులుం కుంఠితమతి సమాశ్రయంబులగు గూఢోక్తులు నగుచు వితథంబులయ్యె. ముందెద్దియో యొక శిక్షవిధింపంగలదు. దానికే నెట్టు చూడఁగలను. మఱియు నేనిచ్చటనున్న నాయందలి యలుక మిగులం జీకాకునొంది దండించుఁ గాననీయెడ నీదండనుండఁ గూడదని వెడలుచున్నాఁడు.

దే. వారింగాంచి ఇత్తరికి నేఁజేయంగల పనిచే ననార్యుండగు నార్యపుత్రుని శపథంబీరేయికిఁ బ్రతిబంధకంబయ్యె. ఎల్లియాలోచింతునని రోషకషాయ భీషణ దృష్టియగుచు నధిక్షేపించి నిజనికేతనంబున కరుగుచున్నది.

వి. దవ్వుననుండి యంతయుంగాంచి నిదానంబు పరికించి యిప్పటికింత మాత్రితోఁ దేవిపోయెఁగదా. కేపటిదినంబున నెక్కాలంబున నోయీవగలఁ రగిలిస్మర జీయతామాత్రి పాత్రంబులను మఱియు నీయామోద రేఖముఖ విలాసం బవలోకింప దుఃఖాభినేతగాని దుఃఖితంబై తోఁపదు. అంతయుం వేగంబ తెలియునని యంతటవిలోకించి. ఆహా కల్యతుల్య యగుచున్నది. యీరజని. అద్దియుక్తంబే.

చ॥ విగళితలాఞ్ఛనీ రసతవెల్వలఁ జారెడు ముత్తియంబులు । ద్దిగగనుఁబట్టితారకలతీరున నక్కట నీవయస్సు సొం । పగువరసమ్మదాకర విభాస్వరతర్ష మహాఃస్త్రిరోహముల్ । విగతవిధంబులై స్మృతి వివేక నికేతనమందు దాఁగెదుఁ ॥ ౧౬ ॥

ఉ॥ దేవిమనంబునం బొడముదీర్ఘతరంబగు తీవ్రరాగముఁ ॥ వావిరిచూపుకైవడి దివస్పతిది క్కరుణారుణాస్యయా । పీవరబాష్ప బిందువులు మిశ్రితకజ్జలముల్ గనుంగవఁ । దేవులు నీడునట్టులుల దీనతఁ బూలవిడుఁ గు ముద్వతుల్ ॥ ౧౭ ॥

గీ॥ విబుధ సంతోష సత్కాలా విభవమునను । కువలయానందకృతి నిత్యకుతుకభూతిరాజతన్బాంధవుఁడను నీరాజుదీన । దళవిలోకింప నోపకఁదరలురాజు॥౧౮॥

గీ॥ తముమెల్లను దేవిచేతః ప్రభూత । తమముదొరగను సేవింపదరవె నొకొ । తత్తిర స్కృతతరగాఢ హృత్తలమున । నరుణభీతిని దాఁగనోయనఁ గవిరియు ॥ ౧౯ ॥

గీ॥ పరుషదేవీ తిరస్కార భాషణముల । దాఢి సైపఁగ నోపక గాఢవృత్తి। నుండనితఁడే గెఁ దనతావుబెండువడెన । యనెడు పోలికఁ జేరునస్తాద్రికి శశి ॥ ౨౦ ॥

కావున నే తదవసరోచిత కృత్యంబులు నిర్వర్తించికొని వయస్యునిం గనవలయునని వెడలుచున్నాఁడు.

పదంపడి ప్రవేశించుచున్నారు దేవియు ముక్తామణియను ప్రియసఖియు.

ముక్తా. దేవి యీయవసరంబున నిసర్గనిమ్నంబయ్యు నీహృదయంబు కొండొక కతంబున మహార్ణవంబు తిమిసముద్ఘట్టనంబునంబోలె నతుచ్ఛంబగుననచ్ఛభావంబున విచ్ఛురితం బగునటులఁ గానంబడుచున్నది.

దే. సఖియిద్ధిమందభాగ్యులకుఁ గరతలనిలయుంబకాదా.

ము. దేవీ బహుతరులగు వసుమతీపతులు శేషాయితంబుగ నూనుశాసనంబు ననసూన విభవుండగు ధవుండభినవరతిక వుండని యెన్నఁబడు వాఁడునిజనయనాంచల విలోకన పాశవశాత్ముండగుట నిరుపమాన సౌభాగ్యశాలినివగు నీవిట్లువచించుట పీయూషకిరణ మండలాంత రాళంబున వెడలు నుల్కాయు సువికచదరవిందోదర నిస్సృతంబగు దురాపేయంబునుగాదె.

దే. సఖి యిది యాహేలావతి యనుకొంటివా కాదు. అద్దిస్మరణీయోదయ యయ్యె.

ము. స్వ. ఆహా యీదేవియిట్లు వచించుచున్నది. ఈనడుమ, దీనిగమణుం డస్వస్థుండై యుండెనని వింటి. ఇప్పుడాతండు మిగుల నవసిపోయుండెఁ గాఁబోలు. కాకున్న దీనికిట్టి విషాదంబునకుం బ్రసక్తిగానంబడదని. ప్ర. దేవీ భవదీయ హృదయ శంకరుండగు మహారాజ మధుకరుండు శర్మాకరుండై యుండెఁగదా.

దే. సరోషవిషాదనిశ్వాసంబుగ. ముఖంబవనతం బొనరించుచున్నది.

ము. సవైక్లబ్యంబుగ. దేవీ యిదివరకు నాయునకు నారోగ్యంబు గలుగ లేదా.

దే. అస్తంభనీయ సంక్షోభాత్తయగుచు. సఖియీయెడ నది వోడమియ నాడెందంబున నిట్టి క్రడగండ్ల నడరించుచున్నది.

ము. సవైలక్ష్యంబుగ. దేవి యద్ది సమ్మద నిదానంబె. ఇట్టేల పరిణమించె.

దే. సనిర్వేదంబుగ. నాభాగ్యవిపర్యయంబున. మఱియు నీయుదంతంబు దలఁపఁజేతంబు జాతవేదస్సహవృతం బగుటకరణిసంజ్వర భరపరీతంబగుచున్నది.

ము. దేవి యద్దియాలించుటకు నాశ్రోత్రంబులు పాత్రంబులేనా.

దే. ససంకోచంబుగ. సఖి నీకిట్లనుయోగింప నవకాశంబిడుటఁబట్టి తావకంబగు రోషంబునకును నేనయాశ్రయంబైతి.

ము. సాధ్యాహారంబుగ. దేవీ నీయధునాతన వచన రచనయకించన విస్మయ జనకంబగుచున్నది.

దే. సఖీ యనృతంబు నచింపక నిక్కంబ వక్కాణించితి.

ము. దేవీ నాయందలి సౌహృదంబతి విశదంబేని కొంత దురంతంబగునటుల వాస్తవం బంతయు వచింపఁదగు.

దే. సఖియిదివరకు దాపరికం బొనరించి తత్ఫలం బనుభవించుచుంటిఁ జాలింకను గోపితంబొనరించెదనా । అంతయు వచించెద । ఇద్దియు నతీత వేళంబగుట భావిసహాయార్థంబ వాని స్నేహదోహదంబు కాదు. గతంబైన నామంతువు మన్నించి యాలింపుము.

ము. దేవి సమవహిత స్వాంత నైయుంటిని వినిపింపుము.

దే. ఈనడుమఁ గొన్ని వారంబులకు లోఁగడఁబడమర చేడియ మింటిర తవంబు కలయికంగను గులాబీపూఁరంగు రంగుమీఱు పుట్టంబు దట్టంబుగఁ గప్పుకొన్నట్టు చూపట్టుతదనంతరా రామసీమంబునఁ జెన్నొందు సౌధాగ్రదేశంబున నేనిరుమూవురు పనికత్తెలు గొలువఁ గూర్చుండ నింగినుండి యొక్క మందసంబు వ్రాలె. అంతనేఁ జెంతకుంజేరి తేరపాఱఁజూడ భూగర్భంబున నుండు మణిశలాకల కరణిఁ గందరోదరంబునఁ గందళించిన జాతరూపల తలతీరున నీరధరాంతరంబున మెఱయు శంపల సొంపున దాననిరువురు గన్నియలు కందళిత బాంధవ ప్రేమానుబంధలై కన్నులకుం బండువులగుచు నపుడు గానంబడిరి.

ము దేవి యిన్నాళ్లక్రిందట నింత వింతగాఁగ నాకొకప్పుడైనం దెల్పవైతివి గదా.

దే. సఖియా, యపరాధంబే కాదా మన్నింపుమని యింతకుమున్న వేఁడుకొంటిని.

ము. దేవి యిదేనా నీయాధినిదానంబు ?

దే. సఖీ మఱేమనుకొంటివి ?

ము. (సాశ్చర్యంబుగ) దేవి యిదెట్లు

దే. సఖి యదేకాదా చెప్పుచుంటిని వినుమని. పదంపడి వారింగనుడు నేకతంబున నామీఁది దివినుండి యేతెంచిన యమరకుమారికలని యుల్లంబు పల్లవింప వీరుకొంతకాలంబైన నాయొద్ద నెట్లుండుదురను తమి నామనంబు నెల్లనావరించె. పదంపడి యనుకూల సల్లాపంబు లొనరింప నాయిచ్చలోచ్చంబుగాకుండ నాకడనుండవయ్యో

డననుమతించిరి. ఆర్యపుత్త్రునియెడ నుండు నా డెందంబు చందంబు నీ వెఱుంగుదువు కదా. వీరిజాడ యాయనకుఁ దెలిసెనేని యెత్తఱి నెయ్యదిపుట్టునో యని వారినచ్చటి సౌధాంతరంబునందయుండ నియమించి యప్పుడక్కడనున్న పరిచారికలనే వారి సేవకై యొప్పగించితి. మఱియు నాకర్మకరులకు నీజాడ యెక్కడనైనం బొక్కిన మీజాడ మాపించెదనని యొట్టువెట్టి యనుశాసించితి పదంపడి దినదినంబున నతీతనిర్ఘరవార ముఖ్యాభరత కలాపరభాగంబగు వారివిద్యా విభవానుభవంబున నార్యపుత్త్రి వ్యాధిజనితాధినిర్ఘాతంబు గావించుచుంటి ; ఐననార్యపుత్త్రుని యస్వాస్థ్యంబు బహుళౌషధసేవనంబు గలిగియు నుపశమింపమికిం జింతించుచుండ నీనడుమ నొక్కనాఁడొకయోగినీమణి యేతెంచె. నేనా పెదీనింగురించి యనుయోగింప నామెయుం గొంతతడిఁ జింతించి నీవడిగిన భవదార్యపుత్త్రా స్వాస్థ్యంబు గ్రహావేశ నిదానంబనియు సిద్ధదివ్యయోషిత్సందర్శన ప్రీతికార్యంబనియు నిదియు నల్పావసరమున సంఘటించుట నాత్మప్రసాదంబాయనకుఁ గలుగుననియు సవిశ్వాస నియార్థంబుగ సంక్షేపంబుగ వచించి కావలసిన ముఖ్యసంగతులు వచించితి మీకందఱకు లెస్సయగు నికవచింపనుమని యుద్ధత్తంబగు నెద్దియు నింతైనం గొనక నప్పుడచనియె. పిదప నేనా బాలికలయందుఁబోఁగడ దివిషద్యోషామనీష వంటియుంటిని గావున వీరల సందర్శనం బార్యపుత్త్రున కారోగ్యకరంబుగాఁ గలదని యెంచి యట్లున్న నాయార్యపుత్త్రుని యందవిశ్వస్తనయివారిలో ద్వితీయపరిణయ ప్రణయగావున దానిరానీక యోగినీవృత్తినలరు ప్రథమందోడ్కొని యార్యపుత్త్రునికి దృక్పాత్రిం బొనరించితి. ఓచెలియా, యేదియెంత వింతో కాని యామెవచించినట్టే యార్యపుత్త్రుండు తదవలోకన క్రమంబున నానాటికిం జిరతర పరిమ్లానంబగు నుపవనవిటపంబు జలసేచనాది విధిచేతంబోలెను పచితతనుండగు.

మ. ఓచెలియా! నీమాటకడ్డమువచ్చితిఁగాని నన్నొక్క సందియంబు దొందరనొందించుచున్నది ; అదివినివచింపుము. నీవిదివఱకుం జెప్పినపలుకులు మిగుల సంతసంబులీనునవే. జరిగినదంతయు సమ్మద నిదానంబే అట్టివానిం దొలుత నాధినిదానంబులుగ వచించుట చేతంబునకుఁదద్దయు నబ్బురం బొనరించుచున్నయది.

దే. సఖి యిదియంతయు నిజంబే. వారివర్తనంబు ముసల్యత్వార్హాదోష గర్భితంబని తేటగఁ దెలియంబడియుఁ గరుణం బొడమించుచు బలాత్కారంబుగ గుణో

ద్గారంబుల నాచే జేయించుచున్నది. ఇద్దినీక కాదు: నామను నాలోచించుకొన విస్మయంబగుచున్నది.

ము. దేవి, యట్టియిన నానంతర్య వర్తనంబునం బరిష్కృతంబగు ముఖ్యాంశము వచింపుము.

దే. అట్లవచించెద నాలింపుము. గతనిశీథంబున వీరలయందొకి యాశంక మనంబునం జనుదించ నప్పుడ యాయుద్యానాంతరంబున కరిగితి. అచ్చట వారిరువురు నార్యపుత్రుండును దత్త్రీయుక్తా మంటపాంతరంబున మామకీన స్థానంబున నార్యపుత్రుండు ద్వితీయాసంకపాళిం గీలించుకొని యుపవేశించియుండె. ప్రథమతదీయ సదేశస్తంభ ప్రాంతంబున నాసీనించియుండె.

ము. సాశ్చర్యంబుగ. దేవి యచ్చటికి యార్యపుత్రుండు నిన్నువీడి చోరకుండని బంధనంబు కలదుగదా.

దే. సఖి యట్లు వాఙ్మాత్రంబు గలదుగాని శపథంబులేదు.

ము. ఆహా నీయార్యపుత్రుండెంత విపరీత వృత్తుండయ్యె! వారును సాధారణలై యెంచఁదగియున్నారుగాని సుశీలురై యుండురని తోఁచదు. మంచిది, పిమ్మట నేమయ్యె?

దే. లోఁగడ నేనతిరోషకషాయి తమనీపనై యాబాలికంగచంబునం బట్టి వియుక్త పాణియగునట్లు దృఢతరంబుగ నొక్కుచ పేటంబు వ్రేయఁజేయెత్తి నెంగున్నో తెలియదుగాని యయ్యెడ నామనంబంతయుఁ గరుణరసమయంబయ్యె. ఐనదాని నపహ్నవించుచుఁ గోపచిహ్నంబుల నేధితంబు లాచరించి వేరియనుద్యోగింప నంతట నార్యపుత్రుండు బహువిధంబులగు నుపసాంత్వనంబులు ప్రణామపూర్వకంబుగ వచించె.

ము. సాశ్చర్యంబుగ. ఆహా దేవినీయార్యపుత్రుం డిట్టికర్జంబు నీకంటఁబడ నొనరింమటయేకాక వెండియు వేడుకొనెనా? బాగుబాగొనరించె. వింటివా? కాముకుల శీలంబిట్టిద. ఎదుటనున్న వేళ నిజమనంబునకే కని కేతనంబగుట నవిదిత కష్టటంబుగం దెలుపుచు లోలోపల విపరీత వర్తనంబులు సలుపుట. ఇప్పుడు దెలిసినదే నీయాధిమూలంబు. పదంపడి యేమయ్యె.

దే. సఖి నేవాని సరకుగొనక తదుదిత స్నేహధారా సంవర్ధిత క్రోధోపర్బుధన యితిరిగికొట్టసమకట్టగా శతుండు వానినివ్వేళం బ్రహరించితివేని యుష్మద్ఘాతిని వగుదువని యొట్టువెట్టె.

ము. దేవి యట్లైన నిదివఱకతి యవిదిత దండయైయుండు.

దే. సఖి యట్లువచింపఁదగదు. ఇక నేమన్న నవి దితప్రహారదండయగుని వచింపందగు.

ము. దేవి యట్లైనం బ్రకారాంతరంబున శిక్షితయేనా.

దే. సాటోపంబుగ. ఎంతవింతయయ్యె. అట్టిదుశ్శీల శిక్షణీయ గాదో దానిదండింప నెంతకసియైనం గలదు.

ము. దేవి పిమ్మట నేమిసలిపితివి ?

దే. సఖి, యాకితవచేతనుండు నారోపభాగ్య విశేషంబునం గాఁబోలునిన్వే శతుని వహించె ; అదియునతని వశంబుగాదు. అధర్మమర్మచ్ఛేదియగు నాదైవంబ యట్లువినిపించె. కావునతని యొట్టుదిట్టంబగునట్టును నాదండాభిలాషంబు సఫలంబగునట్టును వగవుడుచే నయ్యెడ సంకెలం దెప్పించి దానిపదంబులం దొడిగించితిని.

ము. దేవి మహానిపుణవుగదా విపరీతమతియగు పతి యానతికి ననుకూలంబుగ నిజేష్టంబు నెరవేర్చుకొంటివి. తరువాత నీయార్యపుత్రుండేమయ్యె ?

దే. దృష్టదోషుండగు నాతం డేమి సేయఁగలఁడు? పిమ్మటదీనప్రణతానుండగుచు నేమోవచింప దొరకొనుడు నిదివరకు నీవచించిన యానతికి వేరుసేయులేదు. ఇక మీఁదనెందు నుడివితివేని నిజకర జాగ్రచ్ఛురికా నిర్భిన్న మదీయ వపుస్సంక్షర దస్రపూరంబున సంకల్పితాంగ రాగుండవగుదువని శపించితి.

ము. ససంభ్రమంబుగ- దేవి, రాతినూతికి నినుపచేద యనునట్లు నీవాయనకుం దగినదానవే! పదంపడి యాతండేమయ్యె ?

దే. ఏమగునప్రక్లిన్ననయనుండై ధరణీనిధ్యానైకతాన నయనుండగుచు నంతర్గతంబగు కపటంబున పహ్నవింపంజాలక సంలక్షితంబు సలుపుచువచ్చిన దారిన నిజని

ము. అంతయు మిగులలెస్సగ జరిగె. ఇయ్యెడనీకు విచారవిషయంబైన యంశంబెయ్యది ?

దే. దాని నెట్లు శిక్షించుననునది.

ము. దేవి, శిక్షాతారతమ్య విషయంబేనా.

దే. సఖి, యేమివచింతు ? ఆర్యపుత్రుండియ్యెడ నిట్టివాఁడయ్యెఁగాని. యింతకుమున్ను నాయానతిలో నటఁకత్తెలో వక్కచిక్కినట్లుండలేదా. దానంబట్టి యూరకుందునంటే యల్లైనవి శృంఖల విహారుండగు ; కాకున్న నతిసిగూఢంబగు నెక్కనాయింగితంబునకు నతివిరోధంబు సంఘటిల్లు; దీనియాగడంబునకు నతిదారుణంబైన దండంబు విధేయంబె ? అయిన దండవిధిదలంప దీనిగుణగణంబులు దానినడంచుచున్నవి. కావున నియ్యెడ నాయాత్మ పిపీలికా శతపదీ సమాక్రాంతంబు గరణిసున్నది.

ము. దేవి, యేను. మనంబొకమార్గంబున సంచరించెనేని నిరర్గళంబుగంగొంతతజేరుగు. ఇయ్యెడనైతే విప్రతిపన్నంబగుట నందు గర్తకంటకాది సంవృతంబగు దుష్పథంబునం బోలి సంచరించుట నస్వాస్థ్యమయంబైయుండు.

దే. సఖి మనంబిట్లుండుట నేకాదా నేనిట్లుంటిగాని నేనెప్పుడు నిటువంటి యుల్లంపువంత నెరుంగనే.

ము. దేవి, యియ్యెడ మిగులఁ దొందర నొందఁగూడదు. యోగినీమణి వచించినట్లార్యపుత్రునకు నారోగ్యంబు గలుగుఁగదా. కావున యద్దిమహాభాగ యని వచింపందగు. నీవుదీనికిం దండంబొనఁగంచితివేని యామెయలుగ నేమియగును ? నీయార్యపుత్రుండు నేమిదలంచునో: యిట్టిసంగతులంబట్టి యట్లువచించితి.

దే. సఖి తాదృశ వితర్కంబుచేత నేకాదా మనంబు డోలాయితంబగుచున్నదని చింతించుచుండ నయ్యెడం బ్రవేశించుచున్నది.

వేత్రహస్త. జయించుగావుత : దేవిజయించుఁగావుత.

దే. ఓద్వారపాలికా, యేమియుదంత విశేషంబు.

వే. దేవియుల్లంబు గనికరంబునం దెల్లంబగుత. వారణాసీ పురంబుననుండి యేలికసానిగారికి చిన్నమ్మగారు గమ్మపంపించినారని వరవుడు దెచ్చి యిచ్చినది.

దే. (సప్రమోదావేశంబుగ) ఓ, దానినిచ్చటికి వడిగ రావింపుము.

వే. కడిదియూనతియని వెడలుచున్నది.

మ. దేవి, భవద్యువ జననీవృత్తాంతంబు కార్తికరాకాని శాకరబింబంబు కరణి నింతలోఁ దావకీనమనస్సంరూఢ తమస్స్తోమంబంతయు నపహరించెనే

దే. సఖి, యుట్లే లెస్సగ వచించితివి. ఒక్క భాగ్యవశంబున నీసమయంబున నామె యుదంతంబనుభవ విషయంబయ్యె.

మ. దేవి, యామెయట్టిగుణవతియె ?

దే. సఖి, యామెనిసర్గం బీవెఱుంగవు గాని పరికింపఁదనీయ పరభాగంబు నిరూపింప నేరువెరవరులు. ఆయమ్మ రసావాసలాలసత సాక్షాత్కరించిన లక్ష్మియయని లక్షణీయ.

మ. దేవి, యామెనీకు నిజజననికంటె నభినందనీయయని వితర్కంబు వొడముచున్నది.

దే. నేర్ష్యంబుకరణి నాకుమాత్రింబకాదు ; గుణజ్ఞులందఱకును.

మ. (సాశ్చర్యంబుగ) సఖి, యట్లైన నామెసౌశీల్యసంపత్సుధారసంబు పూర్ణంబుగంగ్రోల నాకర్ణంబులు తూర్ణంబులగుచున్నవి.

దే. సఖి, చూనుగవచిరచితి వట్లయిన వచించెద నాలింపుమని యెదురంగాంచి సఖి, పత్రికాహస్త యేతెంచుచున్నది. ఈయెడ నయ్యుదంతంబులం దెలిసికొని పిమ్మటవచించెద.

మ. దేవి, యట్లగానిమ్ము ; అయ్యెడ వేత్రహస్త పత్రికాహస్తతోడం బ్రవేశించి 'యీయామెదేవి' యని చూపున సూచించుచున్నది. అంతనయ్యది 'దేవిగారూ, జయింపుఁడు, జయింపుఁడు' పాదపీఠమూలంబునందు నొరగి దేవీపురః ఫలకంబు నందుంచుచున్నది.

దే. (ఆకమ్మంజేకొని దానింగాంచి) స్వ. తొల్లింత నెప్పుడెప్పు డేతెంచెడి వార్తాహారిణులు సవికాస వదనలై యుందురు. ఇద్దియేమో, వింతగాఁగాన్పించుచున్నది. అని పైవ్రాలుగాంచి ఇది యువజననీ లిఖితంబయని తలంచి సఖీహస్తంబునం

దుంచి వెండియుంగని యోసీ, యచ్చటివారి కందఱకుం గుశలంబేకదా

పరిచారిక. దేవిగారూ అచ్చటివారందరికి లెస్సయేయగు. నావిన్నపంబు నై పవేడెద. అమ్మగారియానతి మిగుల వెసగ నేతెంచినదాననగుట బడలిక నడగింపఁ గోరెద.

దే స్వ. ఇదిమిగుల నలసియుండుట నేకావచ్చు నిట్టిచందంబు ప్ర. ఓసీ వే త్రహస్తా దీని నంతిపురంబులోనికిఁ గొనిపోయి మావచనంబు గనచటి కర్మకరులచేఁ దగిన విశ్రాంత్యుపచారంబులం జేయింపుము.

వే. దేవి, యానతి గడిదియని యట్లొనరించుచున్నది.

దే. సఖి, లేఖాపిధానంబు ద్ఘాటించి తదుదంత సుధారసాసేకంబునం బరితాం త సంతాపంబుగ నాహృదయంబు నానందమందిరం బొనరింపుము.

ము. దేవి, యట్లయగుంగాకని దానిముద్రం దు్రటితంబొనరించి దేవి, క్రిమాం కచిహ్నితో పరిభాగంబులగు మూడుపత్ర సంపుటంబులున్నవి.

దే. (కొంచెముచింతించి) ఏదోయొక కార్యభరంబుండునని తోఁచుచున్నది. కానిమ్ము, ప్రథమంబు విఘటించి వచింపుము.

ము. అట్లొనరించుచున్నది.

స్వస్తిశ్రీమదాత్మీయరూప సౌభాగ్య సౌశీల్య లావణ్య దాక్షిణ్య ప్రముఖ మహాగుణ సంఘాత శ్లాఘాందోళిత వివిధమణి గణకణ పూర్ణకర్ణాభరణ పరితః ప్రసృమర కిరణ కౌముదీ సంపళి నాపర్యాప్త చేతస్సద్మతాబహిర్నిస్సృత చితాధ్వాంతర స్థూలలక్షముఖ మృగలక్ష్మలక్ష్మీక్షా భృదధ్యక్షతనుజావలక్షాం గీప్రభృతి సురవరనారీ నికురుంబయుఁ బ్రాయంబు కరణిఁ బ్రేమాస్పద త్వాది ధర్మంబులంగని శ్లీకృతాస్తాక మంజరియు సకలసమ్రాట్కు మ్రాంగీవినమితాచార్యదేవీ శబ్దైకవసతియుం బ్రేమగౌరవా పహృత మామకీన ససర్గజఘన్య తాకలిత సవిత్రీభావయునగు నస్మత్కుమారి హేలావతి నత్యవధివళక్ష పక్షవక్షస్థే శసేన్ద్రుక్షితటిన దినప్రవర్ధమాన సకలసౌభాగ్య భాగ్యవతియగునటుల నిరంతరం బపరిమితంబులగు నాశిషంబుల వెలయించి లేఖనీయంబగు నఘునాతన ప్రవృత్త విశేషంబు అని యాహా, యామె శబ్దార్థగుంభాగాంభీర్యంబు!

దే. సఖి, తావన్మాత్రింబ కాదు. వాత్సల్య గాంభీర్యంబు నట్టిదయ. ఆమె యస్మాదృశులకు సహజంబగు మాతృత్వాది ధర్మంబులచేతన గరిష్ఠగాదు సద్గుణంబుల చేతయునని-స్వ-తొల్లింటికంటె లేఖనవైఖరి విభిన్నంబైయుండెఁ గాని మ్ము. వెంటనే తెలియంబడునని-వయస్యా, పదంపడి పఠింపుము.

మ. ఇచ్చట వారణాసీపురంబున మేమందఱము నియతి వశంబునఁ గుశలి కల్పులము అని దేవీవదనంబు సాకూతంబుగ విలోకించుచున్నది.

దే. విషణ్ణనయనయగుచు సఖి, కుశలప్రకృతిక కల్పప్రత్యయంబా యమ్మకు నెట్టియొయస్వాస్థ్యంబు గలుగునని వివరించుచున్నది. దానంజేసి నామనంబు జలక్షిప్తంబగు శుష్కమృత్పిండంబు కరణి విశీర్ణంబగుచున్నది. ఈదినంబున నెట్టివ్రేళ లేచితినో యేదురంతరంబు వినవలసియుండునో దానికి సిద్ధంబైయుండవలసివచ్చెఁ బిమ్మటం జదువుము.

మ. అట్లని అచట మీసకల కల్యాణ సమ్మద నిదానోదంత సుధాసేకంబున నాస్మాకీన శబ్దగ్రహంబు లందనుపవలయు. ఈనడుమం గొంత తటికిలోఁగడ మననికేతంబున నస్మన్మనో వినోదన నవసౌరభ మంజరియగు మంజరిచెలియగు నామోదరేఖతోఁగూడి ప్రమదవనంబునం గాలయాపనంబుకై సంచరించుచుం జమత్కార కరంబుగ నాగంతుకంబగు నొక్క హరిణంబందులమెలంగుదానిం గని బాల్యలౌల్యంబున దానింజేరి చేపట్టి పదంపడి యావిదిత కపటంబగు దానిచే మింటితెరువునఁ జెలియతోడంగూడఁ గొనిపోఁబడియెననియు ననునర్థోక్తంబున.

దే. హా, సకలసద్గుణ సమ్మాన్య కన్యాకుంజరి మంజరి మామకీన హార్దైకనికేతనమాయతి నిరూఢంబులగు నామనోరథంబు లెల్లవితథంబులుగాఁ గనస్మద్దురదృష్టంబున మాయుపజ్ఞేవదనునిచే జానకి కరణి నొక్క పాపపుహరిణంబుచే హరియింపఁబడితివాయని విలపించుచుఁ బుడమింబడుచున్నది.

మ. దేవి సైరింపుము. సైరింపుము. అర్థోక్తంబున నిట్లు పరిదేవింపం దగదు. తత్ప్రత్యకల్పప్రత్యయంబు కుశలంబునకు నసాకల్య సూచకంబకాని యభావబోధకంబుగాదు. మరియు నొక్క యుపశ్రుతి కల్యాణ నిదానంబగుచుఁ గానంబడు- అద్దియుం ద్వదుక్తంబగు జానకీదృష్టాంతంబ, కావున మదిదిరంబొనరించి యనంతర వృత్తాంతం

బాలింపవలయు.

దే. సఖి దాని క్షేమవార్త వినుటకుం దగిన భాగ్యంబునకు నా శ్రోత్రంబులు పాత్రంబులగునా. అయినం జదువుము. సముద్రంబునం బడి తరంగపరిహారములకు జడియం బ్రయోజనం బేమి.

ము. దేవి, యూరక డెందంబు దొందరనొందింపకు. అనంతర వృత్తాంతంబం తయు వింతవడక యాలింపుము. అనిచదువుచున్నది వారిజాడఁ జూడ మావురౌతు లంతటం బంపఁబడిరనియు నొక్కవారంబువరకు వారిసేమంబు దెలియకుండిన భాగీ రథీభావుకాత్మయగు నార్యపుత్రి సవిత్రియనల ప్రవేశంబు సలిపి శరీరత్యాగం బొన రింతునని శపథంబుసలుప నస్మత్పురంబుననుండు నాప్తజనంబులందఱునట్ల ప్రతిన నూనిరనియుం దత్రత్య మంత్రిశేఖరుండు లేఖ లిఖియించి మాకునంపె.

దే. హా మంజరి, సకల బంధుజనంబులకు ననుపరిత్యాగలాలసాపదంబగు నా పదంబు నొందితివా నియతిచేతనని వెండియు మిగులవిలపించుచున్నది

ము ఓ దేవీ, యీవృత్తాంతంబునకు నసమగ్రశ్రోత్రివై సారెసారెకెందుకుఁ బ రిదేవింపుచున్నావు? ఇకనట్లైన మద్ద్రోహిణి వగుదువుసుమీయని నివారించుచున్నది.

దే. దుర్నివారంబగు సఖీ శపథంబున సంరుద్ధశోక ఝరియగుచు సఖి, నా భాగ్యంబుకొలది శ్రోతవ్యంబు శ్రుతంబగు నవలవచింపుము.

ము. దేవి. యట్లుదిరంబుగ నుండుమని వెండియుఁ జదువుచున్నది. ఆర్యపు త్రిండక్కమ్మ యవలోకించి కించిదనేహంబకించనుని కరణిం బరికించి పిదప కుం చితవదన వికాసుండయి హృదయంగమంబగు మంగళంబు సంగతంబగునంచు నన్ను వీక్షించి వంతలంబొగలకుమని పచించి నాచేతంబెట్టెనని వచించి సాశ్చర్యంబుగ దేవి, యీమె యార్యపుత్రుండు దైవజ్ఞుండగునని తోచుచున్నది.

దే. సఖి, దైవజ్ఞసత్తముండని వచింపవలయు.

ము. దేవి, యట్లైన వానికి సేమంబు నిక్కంబకాని వగలందొలఁగి సావధా నవై యాలింపుము.

దే. ఎట్లైన నేమి సేయఁగలను తరువాత వచింపుము.

మ. (చదువుచున్నది) పదంపడి ద్వితీయలేఖయు అవధి సమయంబువరకు నాహయసాదులు వితథమనోరథులై యేతేర నార్యపుత్ర సవిత్రిస్వాంగసంగంబునఁ బావనం బొనరింప నప్పావకంబుఁ బ్రజ్వలింపంజేసి యిష్టదైవతంబు నిమీలితనయన నై ప్రార్థింపుచుండఁ దదర్థవిఘాతంబగు నంజలిపుటంబున నొక యోగినిప్రేషితం బగుగంట మ్రోయుచు నొకలేఖంబట్టుకొని యచ్చటనుండు నందఱు నకదర్యాశ్చర్య చర్యాధుర్యులై కనుంగొన నామెదోసిటనిడి యయ్యెడ వెండియు నెగసి చనియెనని యుండల్లేఖా లిఖిత వృత్తాంతం బెట్టిదనిన నాహరిణం బొకదుష్టయోగినిచే నియమితుండై జిఘాంస నేతెంచిన యొక్కదుష్టనిశాటుని పరిణామంబనియు నను నర్థోక్తంబున.

దే. (సవిలాపంబుగ) హా, యతసీకుసుమ దామకోమల ధామవల్లి పనవార ణంబుచే నభినవమృణాలినికరణి దారుణ సురవిద్వేషణునిచే హరింపంబడి యెట్లుంటి వే యేమయితివే శార్దూలగృహీత హరిణ డింభంబువోలె మాంసలమార్జాలగ్రస్తశుకశాబకంబు కరణినుంటివి కాఁబోలు. హా, యెంతమంద భాగ్యనైతినే॥

మ. దేవి నాశపథంబు వితథంబు సేయనుచితంబ కదా!

దే. హరిహరీ, సఖీద్రోహినైతిని. ఓవయస్యా, నాయపరాధం బతివితత విపత్కృతశోక ఝరీకల్పితానవధానతాకృతంబు క్షమింపుము.

మ. ససంకోచంబుగ దేవి, నీవూరకుందువని యిట్లంటినిగాని మనకొక ప్రత్యవాయంబగునని కాదుగదా. ఇకనయిన సావధానవై యాలింపుమని పెక్కుజనపదంబులు గడచిన పిమ్మట నొక్కమహారణ్య మధ్యంబుననుండు నెవ్వండో కాని యొక్కండు బాణంబులేయ నాకురంగం బాత్మీయ భీకరనక్తంచరా కృతిం బూని మన బాలికల స్వకల్పితంబైన యొక్కమందసంబునందునుంచి కొంతసేపు నాతనితో గడు ఘోరంబులగు నాయుధంబులం బ్రధనం బొనరించి తుదకీమందసంబు నాకసంబున మిగుల దవ్వుగ రువ్వి సమసెననియుం దదరణ్య బహిస్థితతౌరంగిక దృష్టక్రమంబున జరిగెననియు నియ్యెడ నాబాలికలున్నతావుఁ దెలుపనుగాని వీరు సేమంబున నజ్ఞాతస్థానంబున నుండిరనియు ముందుముందు భావుకభాజనులు గాఁగలరనియు మీరందఱు శరీర విసర్జన యత్నంబువలన విరమింపవలయుననియు నిట్టిముఖ్యసంగతులు దెలుపు

నదియు నందులసంగతులైనం బెక్కుతార్కాణంబుల విశ్వసనీయంబులగుట నందఱుం దదుద్యమంబునం దొలంగి యసమగ్రప్రమదులమయి యున్నారమనియీ నను వృత్తాంతంబు బోధించునది యేతెంచెనని సవికాసంబుగ దేవి ముఖం బవలోకించుచున్నది.

దే. సముంకురితానందంబుగ ఓవయస్యా నాప్రాణంబులిప్పుడు సంగతంబగు వాతమంత్రిదళ వీడుచున్నవే. వామాంశస్పందంబులు శోకంబువాడిమి నడంచుచున్నవి గాని మీఁదెఁ జదువుము.

ము, దేవి, యెట్లో శుభంబగు: ధీరవయియాలింపుమని ఆర్యపుత్రుం డదియుం బరిశీలించి కతిపయవాసరంబులకు నాంబాలికలు మేలుగాంతురని వచించెంగాని తదన్వేషణంబునకై యొక్కింతైనం జతనంబు సలుప నుద్యోగింపకుండు. ఆధీరుని విజ్ఞానధైర్యంబు లెట్టివో కాని యెన్నఁడైన నొక్కింతయేని మనంబునం గలంగఁడు. నా మానసంబార్య పుత్రధైర్యరాకావికాసితంబయ్యు నవ్యద్విపత్కలుషితంబగుట సైంహికేయసంగ్రస్తసోమ బింబంబగు నక్షత్రనాథ మండలం బనుకరించుచున్నది. ఎట్టివారికిం గాలవశంబున నెటువంటియంగదలును సంప్రాప్తంబు లగుటలోక విదితంబ. ఐనం దెలవరులగు మానినులు దమకడిమికొలది వానిందొలగించుటకుం దగిన జతనం బొనరింపవలయుంగదా. కావున నీకు నేనెఱింగింపవలయు సుద్దియుద్దియైయున్నది. ఎద్దియంటివేని నెఱుఁగుము. అను నర్ధోక్తంబున.

దే. సఖి, యాహా యాయమ్మవాత్సల్యంబు! జనకప్రముఖులగు బంధువు లనేకులున్న నిట్టికష్టసమయంబున నన్నాప్తతమగా నెంచి నియోగింపం దలఁచె దానినాలింపనావీనులు మిగుల నుత్కలికా నిలయంబులగుచున్నవి. వచింపుము. వచింపుము.

ము. వారికుశలం బియ్యెడ విశ్వసనీయంబై యుండెఁగదా వచించెద; సంప్రీతవయి యాలింపుమని మాకుంజామాతృకల్పుండగు నీయార్యపుత్రుండు క్షత్రియ సముచిత సకల సద్గుణ గణైక శరణుండు గావున విచారపరులగు చారవరులవలన నస్మత్కన్యాపహర్తయు నపుణ్య జనాగ్రగణ్యుండునగు నాపుణ్యజనాధముం డెయ్యెడ నెవ్వనిచే సమయింపఁబడెనో యాయసురయు జీవితవీత స్పృహుండగువేళ తొలుత వీరికాధారంబుగ గల్పించిన మందసం బెక్కడ ద్రావలియుండునో యిత్తఱి నెత్తి

రున వారుత్తలంబునం దత్తరపడు చిత్తమ్ముల మెత్తవడి చెత్తలగుచుఁ గత్తుల బోనులో నత్తుకొన్న కరణి నెచ్చోట శరీరధారణం బొనరించుచుండిరో యిద్దియంతయు బాగు గవిమర్శించి జానైన తెఱంగున వారిరావించి నీయొద్దనుంచునటుల నొనరింప వలయు నను నర్థోక్తంబున.

దే. బాగు బాగు ఓ చెలియా, నాయుల్లంబియ్యెడఁ బల్లవించుచున్నదే. ఏమంటివా యొక్కతంబుననో నాచెలి యలుసురులతో నర్వాస్థానంబున నుండిరనియు ముందుల గ్గగానంగలరనియు సర్వజ్ఞకల్పుండగు మాపిన్నయ్యగారికి నమ్మికగలిగియున్నదనిగదా పిన్నమ్మయభిప్రాయంబు అదియనిక్కంబు కావున నార్యపుత్రుని యాజ్ఞప్తి నిష్ణాతు లగుగూఢచరుల నచ్చటచ్చటకుం బంపిదాని జాడందెలియుట సుకరంబే; కాని యొ క యడ్డంకి గానుపించుచున్నది.

ము. దేవి, యది యార్యపుత్రుండ స్వాస్థ్యంబై యుండుటా?

దే. సఖి, నాయార్యపుత్రుం డియ్యెడ సువిహితా నుచిత మహాపరాధుండ గుట మామకీన మనఃప్రసాద నార్థంబుకై మదీయాను శాసనంబు నెరవేర్పఁ దద్దయుఁ బ్రతీక్షించుచుండు. మఱియు నాయన నయప్రతాప మహిమంబు నిసర్గ నిరర్గళంబు గాదా. అక్కతంబున నదియొక యంతరాయంబుగాదు.

ము. దేవి యట్లయిన మఱేది·

దే. సఖి నిగూఢ ప్రణిధులచే నవనీశాంతర్ని శాంతవాసినియగు దానియుదం తంబుచేత స్సంగతంబు గావింపవలయు దానిరూపుజాడ తెలియమి నది దుర్లభం బని తలంచెద.

ము. దేవి నీవచనంబు నిక్కంబ కావున నీయొక దానియాకారంబు వ్రాయిం చిపంపుమని లేఖనంపించి తత్ప్రేషితంబగు దానవాజతనంబు సలుపవలయు.

దే. సఖియట్లయిన మిగుల విలంబం బవలంబింపవలసియుండుఁగదా. కాని మ్ము పిమ్మటంజిఁ తింత మనంతరవృత్తాంతంబు ఐచింపుము.

ము. మంచిదని పశ్చాత్తన వర్ణానళి నవలోకించి. సవికాసవదన భాసురయగు చు. అహా నీవెంతవిధేయ భాగధేయవయితివి.

దే. సానందాతిరేకంబుగ. సఖి. వెండియు నేమివిశేషంబు.

మ దేవి మనమియ్యెడ నాబాలరూపు తెలియమికిం జింతించుచుంటిమి గదా. యింకనద్దియు నిరవకాశంబ.

దే. సఖి యిటియెట్లోవచింపుము.

ము. మంచిదని చిరంజీవినియగు మనమంజరి శైశవాపగమంబైన పిదప నీక దృష్టపూర్వయగుటం బ్రకృతతదన్వేషణోప యోగంబుగా నియాకృతి పటంబున విరచించి దానిద్వితీయ సంఖ్యాచిహ్నితంబగు లేఖ్యపుటంబునందుంచి పుత్తెంచితిన ను నర్థోక్తంబున

దే. సానంద గద్గదోదితంబుగ. సఖి నామనోరథంబు లన్నింటితోడ సఫలో దయనైతి నే దైవంబుకరుణించుట.

మ దేవి యిదానీంతనంబగు నేతదన్వేషణ పర్యాలోచన మాత్రంబకాక నిం కంబెక్కులు చిరంతనంబులు తద్విషయంబులగు మహోస్వప్నఫలంబులున్నట్లు నీవచనంబు న సూచితంబులగు చున్నవి.

దే. అవు నేవయస్యా. మందభాగ్యులకుఁ దర్శనంబులకేమి కొదువయగు.

ము. దేవి యట్లనకు నీవు భాగ్యసంపన్నవుగావున నీయభిలాషంబులన్నియు విశేషలాభ విషయంబులేయగు. దానికిద్దియ నిదర్శనంబు. గానిజాడం దెలియఁజింతిం పనప్పుడ తత్సాధనంబగు తదీయప్రతినిధి సిద్ధంబయ్యెంగదా. ఇత్తెరువనే యావ త్కామంబులు నికామంబుగ ఫలింపఁగలవు. కాని యాయభిలాషంబు లెట్టివో యా లింప మిగులలాలస విలసిల్లుచున్నది.

దే. (స్వగతము) అహో. చిరతరావసరగుప్తంబగు నభిప్రాయంబు సమ్మోదావే శవశంబునం దెల్లంబుసేసితిగాని యిప్పోళి నాళియను యోగంబు విప్రలంభనీయంబు గాదు గావున నిజంబవచింపవలయునని. ఓసఖి. నీప్రశ్నంబు సప్రయోజనంబ నా యభిప్రాయంబిదివరకు నవసరంబు రాఁగిప్రియ చేఁదేఁట పడవలయుఁ గాని యీన డుమ నెవ్వనికైన విదితంబుగాఁగూడదనియ నానిశ్చయంబు. ఐనన్ దాదిక ప్రమద వశంబున నుదితంబై నీచేననుయోగింపంబడుట దాఁపందగదు. కావున వచించెద. విని విస్మృతప్రాయవగుము.

ము. దేవి నీతాత్పర్యంబునకు నేవేరుసేయుదాననే.

దే. మంచిది. యిశ్శి హృదయంబునం దొలంగ నీకు మిక్కిలిమిగుల రహస్యంబు వినిపెదనాలింపుము. లోగడనది శైశవంబున నంకురితకల్పలపితయై యున్నయెడ నొకప్పుడాయమ్మచే నాకారితనై చని తన్నిలయంబునఁ గొన్నిదినంబులుంటిని అప్పుడీ బాలిక రూపలావణ్య మధుర వ్యాహారాదికంబుల మిగుల ముద్దులుగులుకుచు నప్పయప్పయనుచుఁగడుమచ్చికతో నెల్లప్పుడు నాయొద్దనయుండునది. అదియాదిగ దానినార్యపుత్రునకుం ద్వితీయఁగావించి నేనద్వితీయ సమ్మద నిదానయై యుండుదునను మనోరథంబు పరిధానంబైయుండె. దానింబట్టి యనేక తర్కంబులుగలవు.

ము. దేవి దానింబట్టియేనా నీయార్యపుత్రుఁడిందు గుణోత్తరులగు కతిపయధాత్రీనేత్రాత్మజాతలచేఁ గామింపంబడుటఁ దదాయత్తస్వాంతుండయ్యె భవద్విఘటిత తర్కుండయ్యెనని జనశ్రుతి విలసిల్లు.

దే. సఖియౌను. అప్రాపంబున కిద్దియేమూలంబు.

ము. దేవి యిద్దియునొక పాపంబేనా.

దే. సాను తాపంబుగ. సఖిసతులకుఁ బతిలాలసా నిరోధంబునకంటెఁ బాపంబుగలదా.

ము. చెలి యట్లయిన ధర్మాపరవను నీవిట్టులెట్లువర్తించితివి.

దే. సఖి నీయనుయోగంబు తద్దయులెస్స. అట్లయిన మదీయ తాత్పర్యంబంతయు వివరించెదవినుము. ఈకన్నియం బెళ్ళిసేయుట నిక్కంబ దీనింజేపట్టిన పిమ్మటఁ బూర్వగృహీతలగు పాణిగృహీతు లార్యపుత్రుని వదనావలోకనంబునకైనం బాత్రిలుగాలేకనగలం బొగులుదురని తలంచి వారియంగదలకేల పాల్పడవలయునని కరుణించి పరిణయంబువలన న్దొలఁగించితి.

ము. దేవి నీయభిప్రాయం బార్యపుత్రునకు విదితంబేనా.

దే. సఖి సర్వజ్ఞుండైన యీశ్వరునకుఁ దప్పనిదివర కేరికి నెరుకపడదు. ఈయెడన్ప్రసక్తివశంబున నీకుఁజెప్పవలసివచ్చె. ఇద్దిమిగుల గోపనీయంబుసుమీ. తర్వాతవచింపుము.

ము. వచించుచున్నది. మఱియు వాత్స్యాయ నిలయంబుననుండువేళ వారికి యాపదవచ్చుటకుం దొలుత నొకనాటి రేయింగలతతి నాయుష్మతియగు మనమంజరికి నొక్కచక్కని మానసికలయి కయియుండుననియు నందు కానవాలుగ దానిచే నొక్కండగు చిట్ట లిఖియించి తలిముంబు నడుగున నుంచబడినదియనియుం గమ్మ వ్రాసి యాయాలేఖంబుచే గర్భితంబుసలిపి దానివయస్య బాకడకుం బుత్తెంచె అదియుం దృతీయపత్రిపుటిక యందు సంధించి పంపించితి. దీనింబరిశీలించి యాపురుషవరేణ్యుండు చింతింప మహారాజలక్షణ లక్షితుండై కానంబడుఁగావునఁ దగువారివలన నతనివంశ వృత్తాదికంబులు పరికింపం దగునను నర్థోక్తంబున.

దే. సవిషాదంబుగ. అయ్యో నాస్పృహాలన్నియు నుత్పత్తిమాత్ర ఫలకంబులయ్యెనా.

ము. దేవీ యిట్లంటివేమి.

దే. సఖి యది స్వప్నంబున నెవ్వనితోఁ గలిసెనో వానియంద యాదరంబు దిరంబుచేసెనా మనమేమి సేయఁగలము.

ము. దేవి యిదియొకటి నీతర్కంబునకు న(?)పహార్హదంబని శంకింపకు. దైవవశంబున నది యానీతిరైనపిమ్మట ననుకూలోక్తులు దెలిపి యను గతాస్మదభిప్రాయఁగ సలుపవచ్చు.

దే. సఖి మామక మనోరథంబులు భాగ్యానుసారంబుగ ఫలింపఁ గలవుగాని యనంతర వృత్తాంతంబు వచింపుము.

ము అట్లని తదుత్తర వర్ణావళినవలోకించి యత్యాశ్చర్య ప్రమదసదనావన యగుచున్నది.

దే. సఖి మఱియు నేదోయొక విశేషంబు న్నట్టులోచెదు.

ము. దేవి భవన్మనోరథ ప్రకర్షారామంబు వసంతసంగతంబగుటకం టె నొండెద్ది.

దే. సఖి యట్లైన వడిసెపదింపుము.

ము. దేవి సావధానత నాలింపుము. మఱియు దానియెడల నాకుం జెక్కుల

గు ౹క్రచ్చులు విచ్చలవిడి హెచ్చియున్నవి. అవియన్నియు నీయెడ నియతిచే నెట్టి యవస్థ నొందఁగలవో నిరూపింప నలవడవు. వానిలో ముఖ్యంబెయ్యదియనిన నా యమ్మతియగు మనమంజరి దేవీ పదైక నికేతనంబవగు నీచెంతఁబట్టి నీపదలలామయై యుండ లెస్సఁగనుండునను వదియను నర్థోక్తంబున.

దే. సప్రహర్షాతిరేకంబుగ. ఓయమ్మా నీకును గోరికయట్లయ్యెనా మిగుల సంతసిల్లితి. నీయాదరంబు మన్నించెద నియతిసంకల్పం బెట్లగునో తెలియదుగదా యను నర్థోక్తంబున.

మ. దేవి నీమనోరథంబు ఫలితప్రాయంబ. ఫలించుట కాటంకంబు దాని నెమకి రావించుటే కాదా. దానియమ్మ యభిప్రాయంబునీ కామంబునకు నికామ సాధకంబ.

దే. సోత్సాహంబుగ. సఖి జీవనంబని వచింపుము.

మ. దేవియట్లె.

దే. సఖి యనంతరి వృత్తాంతంబు వచింపుము.

మ. మంచిదని దానినొక్కయెడ భావత్కజనక చరణులకుం దెలుప నాసౌ భాగ్యవతియు ద్వితీయయైయుండ మనంబుగలదిగ నుండుఁగావున మనమది తలంపం దగదని యానతిచ్చెనను నర్థోక్తంబున.

దే. ఆహా చిన్నయ్య వాత్సల్యాభినయంబుగాం భీర్యాతిశయంబు నతిశయిం చుచున్నది. ఇంతకుమునుపు సెప్పితిఁగదా యార్యపుత్రుండేరినైనఁ జేపట్టినట్లు సేసితి నని. అందునుండి యెట్లో నాయభిప్రాయంబు మనంబునం గైకొని తాదృశమామక తాత్పర్యాను సారికరణి నమ్మకైన స్వాభిప్రాయంబు ప్రకటించిన వాఁడుగాడు. కాని నాచేతననుదయోగింపఁ బడి యట్లొనరింపవలెనను తాత్పర్యంబు వహించు. ఇం కమన మొనరింపవలసిన పని దానిన న్వేషింపించి రావించుటయయై యున్నది. మంచి ది తరువాత వచింపుము.

మ. మంచిదని. నీవు బంధువత్సలవగుట నభిలషితంబు మన్నించి యథో చితంబుగ సాత్త్వికోపాయ బలంబు వినియోగించి నాకు సంతసంబు గలుపుదువని సమయవశంబున ననన్యసాధననై మిగుల విశ్వసించుచున్నాను. అను నర్థోక్తంబున.

దే. సజుగుప్సంబుగ. సఖి పిన్నమ్మవాత్సల్యం బంతయు సరేకాని యాపె నాయందు నితర సాధారణ దృష్టియ యయ్యెనని తలంపదగి కానంబడు.

ము. దేవీ యిట్లంటివేమి.

దే. సఖి యామె నీవిట్లొనరింపవలయునని యనుశాసింపందగిన స్వాతంత్ర్యంబు గలిగియుం బెరవారికింబోలె నాకు నిట్లు ప్రార్థనారీతి వ్రాయుటంబట్టి.

ము. దేవి యింతమాత్రంబున నామెయం దన్యథాభావంబు సంభావింపం దగునా యెందుచుండియుని యందువేమో వినుము. ఆబాలిక కేతెంచిన యంగద యించింతని వచింప నలవి కాదుగదా. సద్బంధమాత్రమ్మున మన మనంబిట్లు కలంకనొందుచుండం గన్నతలి కెంతవంత యగు నిది యొక వింతయేనా యట్టిస్థితిలో నేమి నెమ్మది గలుగు. కావున నాపె యప్పగిది వ్రాయుటయొక్కింతయు నచ్చెరువు కాదుగదా.

దే. సఖి యాను బాగుగ వచించితివి. శోకపార వశ్యంబుననే యిట్లు వ్రాసియుండు పదంపడి వచింపుము.

ము. అట్లని. ఇద్దియుం బ్రకృత దశావిశేషంబునం బట్టి వ్రాయుందగనిద య్యు భవదీయ తాత పాదమహిమంబునంబట్టి యిట్టు లిఖించితి అట్టి మనోరథంబులు పెక్కులు గలవు కాని యెట్టు పరిణమింపంగలవో తెలియంజాలననుసర్థోక్తంబున.

దే. సఖి యాహా చూచితివిగదా మాయమ్మ హృదయ పయస్సరస్వంతంబునకు నీకష్టంబు మంథాన ధరణీధరంబయ్యె అక్కటా విధివిధానంబు.

ము. దేవి శోకింపకు మీభాగధేయ మహిమంబున నెట్లో యాబాలిక వేగంబ మన నయనోత్పలంబులకు నతివిశదంబగు కౌముది కాంగలదు.

దే. సఖి అట్లైన నస్మద్భాగ్యం బామూల ఫలితంబు గాదా.

ము. దేవి దిష్టంబు కలిప్పయ దిష్టంబున-నీయిష్టంబుల కష్టంబుగాం బుష్టంబులంజేయు.

దే. సఖి మంచిది నీయుదితం బవితథంబగుత. ఇంక నేమి లిఖియించెనో

యుదియును వచింపుము.

మ. అట్లయని. నీవు నాకాప్తవగుట నీవృత్తాంతము బంతయు నీకుఁదేటపఱచితి. కావున నిద్ది యంతయుం బరిశీలించి లేఖనీయంబులగు యావదంశంబులతో యథావిధితంబుగ లిఖియించి యవిలంబితంబుగ సంపందగు. ఇదియ యనేక భావు కాశీర్వాదంబులని దేవి యాయమ్మ మిగుల నాకులమానసయై యుండుఁగావున నతిత్వరితంబుగ దాని జాడం జూడఁజతవం బొనరింపవలయు.

దే. సఖ యందుకింక సంశయంబా దానింగవి కాని తాంబూల చర్వణంబు సేయను గాదా. అట్లుగాకున్న నార్యపుత్ర చరణ ద్రోహినియగుదు.

మ. దేవి యాహా యెంత సాహసం బొనరించితివి.

దే. సఖి యీయెడం దదన్వేషణంబు పలిపియుకార్యాంతరం బాలోచింప వలయునైనఁ జిరదృష్టయగు మన మంజరింగని కాని రెండవ కార్యం బొనరింప మనసు గలుగదు. కావునం ద్వితీయ పత్రపుటి భేదింపుము.

మ. దేవి యట్లొనరింపందగు. ప్రత్యాసత్తియు సూచీకటాహన్యాయ ప్రసక్తియు మెండుగ నిండియుండెనని పత్రపుటికం దదాలేఖ్యంబు దొలగించి వితతంబు గావించి మించిన వేడుకం గాంచి సంచితాశ్చర్య సుస్థిరాత్మ యగుచు. స్వ.

చ॥ అజుఁడు స్వసృష్ట సుంగరుల కందఱకుం బ్రతిగాఁగ సౌందరిన్ । సుజనమతాత్మనీ సుదతిశోభిల నొక్కతె నెక్కతంబునో । స్వజవిషయం బొనర్చె నొకొ శిద్ధమిదే యిటుగాకయున్న నా । త్రిజగతి యోషలెల్ల నెటుదీనలు దీనికి ముందల నుండినన్ ॥ ౯౧॥

చ॥ ఇదివిధి సృష్టిగాదయిన నిట్టి సురూపము నెన్నడైన నా । త్రిదివమునందు నేని నొకతెన్ సురనారిని నేని జేసెనే ; మదిగన సౌందరీరమయ మర్త్య జగత్యుదిత ప్రసాదయై ; ముదముననే తదాకృతిని బొమ్మగ బుట్టెనటంచుఁ దోచెడున్ ॥ ౯౨॥

ఇట్లు వితర్కించుచున్నది.

దే. సఖి దీని రూపంబు సేవచించినట్లుండలేదనా మిగుల నచ్చెరువుగం బరిశీలించుచున్నావు.

ము. దేవి యిందుకని సేవదింపనేల నీక తేటపడు నవలోకింపుమని దేవికిం బటంబు గానుపించుచున్నది.

దే. సాశంకంబుగ నవలోకించుచున్నది.

ము. దేవి యిప్పుడీయది నీవదనారవిందంబునకు నభినవ సముదయ దినకర బింబంబును దావకీన నయనేందీవరంబులకు నమృత కిరణ మండలా విర్భావంబును గావలయునని లోఁగడనగు నీ సుగుణముల గాకుందోచెడు. ఈరమణునకు మిగుల వైలక్షణ్యంబు గానంబడు. కావున దీనికతంబు నవియింపఁ గోరెద.

దే. కొందరం దెలుపు డెందంబున సంకుచద్వదన విలాసయగుచు. సఖి వచించెదఁ గాని ముహూర్త మాత్రంబు సైరింపుమని పార్శ్వంబుననుండు చామర గ్రాహిణిం గాంచి యోసీ నీవు వేగంబుగ శయన గృహంబునం బర్యంకాంతరంబున నొక్క యాలేఖ్యంబున్నది గాని దానిం గొనిరమ్ము అద్దియు దేవి యానతి మూలదండ యని యట్లొనరించి దేవి కందించుచున్నది.

దే. దానిం జేకొని యిరుచిట్టలనూలి సారె సారెకు నవిరతోచిత చేతశ్చింతా వ్యంజక సంకోచాక్రాంత శిశిర కరవినుత వదన తామరసయగుచుం గనుగొను చున్నది.

ము. దేవి యీయవసరంబున నీస్వాంతంబ క్రాంత సంగత చింతా సంక్రాంతత ననుకరించుచున్నది.

దే. సఖి యీను బాగుగ భావవేదిని వైతివి. ఆచింత యెట్టిదని యనుయోగింతువా సేసిన తప్పుదామటచేలాభంబు లేమియకాక యనర్థోదయంబునగు. కావున వచించెద వినుము. ఆచింత యాత్మఘాతినికంటె నన్యయగు వివేకిని జగంబున నెద్దియేవిం గలదాయని విచారాత్మకంబై యుండె.

ము. దేవి నీచేతం బపరిమిత పశ్చాత్తాప పరీతంబగునటుల విదితంబగుచున్నది.

దే. సనిశ్వాసంబుగ. సఖి యల్పబుద్ధులగు మందభాగ్యులకుం దొలుత నలక దొందరల మెలంగి పదంపడి వగచుచుంటి. సాఁటంబే కాదాయని చామరగ్రాహిణిచే సమానీతంబగు నాయుత్తమాలేఖ్యం బొసంగుచున్నది.

మ. స్వ దానింగని యాహా మహారాజ మధుకరుండు ప్రార్థించుచున్న యీ చిత్రగత ప్రతిమ యవ్యవహిత ముహూర్త విలోకిత చిత్రలిఖితమూర్తియునయి కానంబడుచున్నది. దీనికి సంబంధంబెట్టిదో తెలియదు. గాని యద్దియో నొక్కటి యుండవలయు కాకున్న దేశాంతర గోచరయు విపన్న ప్రాయయు నగు నా బాలిక యెక్కడ నపర్యాప్తాంతరాశ్రయంబగుట బహిర్నిస్సృత శృంగార ఝరీఝరీతాంగియు నేత్రద్వారజ రాజీవ ధ్వజసంప్రార్థితయు నగు నీబాలిక యెక్కడ. ఇరువురు వేరుగానుందురని తలంచుటయు నేయంశంబున నైన నొక్కింతయేని భేదంబు న విమర్శ విషయంబున నిర్విషయంబగుట సంభావింపనైన సంభవింపం దగదు. దీని మూలంబు నాకుం దెలియకున్నం గొన్ని చేష్టావిశేషంబుల దేవికిం దెలియుననియు తోచుచున్నది. కావున నీమె వలన నే వినవలయునని. ప్రి. దేవి యిది యేమిటి.

దే. సఖి యిదే కాదా నా యజ్ఞాన ధనపేటికా సముద్ఘాటనంబు.

మ. దేవి సాంప్రతికంబగు నీయవస్థం గాన సామనంబు పారదసోదరంబగు చున్నది. కావున నైరణంబుగాని దీని నిదానంబు నాకుం దేటపరుపుము.

దే. సఖి చేసిన తప్పితంబె చాలు. నీకుం జెప్పమి యను తప్పితంబుగూడ నొకటి గావలెనా విను. ఇద్దియ మనమంజరి. జరిగిన తేయింబె బుద్ధిని దాని దండించిన నేను బిడాలబుద్ధి బిడ్డంగొట్టికొన్నదాననైతిని.

మ. దేవి యిది మిగుల నాశ్చర్యకరంబై యుండు. మానిసినిబోలు మానిసులు జగంబుననుండరా. ఇంతకుమున్ను మనము కాలితోంగూడ నది యేదేశమందుండునో యని తలంచుచుంటిమిగదా. ఇంతమాత్రంబున నిద్దియ యని నిర్ణయింప నెట్టుగ నలవి యగు.

దే. కాదే చెలి కూ విను. నేనవివేకగ్రస్తయు మందభాగినియు నగుట, గానలేకపోతిని. గాని యీ మెడ వివేక దీపచ్ఛాయంగన నిద్దియ యిదియని నిశ్చయించుట కిసుమంతైన కొంత గానంబడదు. ఇందుకుం బ్రధాన కారణంబుల నవరీణంబులు పెక్కులు గలవు. అవి యెవ్వియంటేవా తెలిపెద విని యాలోచింపుము. మొదటిది దాని శైలి యంతయు నమ్మదే. ఖేచరకవ్యాభ్రమంబు గలుగుట దాని నొక్కింతయైన లెక్కింపకుంటిని. రెండవది దానియందు నాకుం బొడమిన

యర్థిలి పెఱితితి వచింప నేల. ఆర్యపుత్ర సహాసీనయై యున్నవేళ దాని రూపుమాప వేసియు నెత్తిన చేయి యత్యుత్కృష్ట కృపాసౌహార్ద్రా విష్టబ్ధంబగుట వాలిదయ్యె మఱియు నమ్మ వ్రాసిన కమ్మకరణి బేటి కాంతర్వర్తినియై చెలితోఁగూడ నిది యేతెంచుటయు. నర్థాస్థానంబుననుండుటయుగా నడుమనే యార్యపుత్రుండు మహార ణ్యంబున నొక్క రక్కసి సమయించుటయు సర్వజ్ఞకల్పుండగు మాపిన్నయ్య దీనికిం గలిగిన యంగద విని నిర్వికారుండై కతిపయదినంబుల దానికి లగ్గు చేకూరునని సూచించుటయు నిత్యాద్యమిత సుతర్క హేతుజాతంబున నిది మన మంజరియని నిర్ణయించుటకు సంశయంబు సంగతంబుగాదు. మరియు నార్యపుత్రునకును దానికిం బోలె విధివశంబున స్వప్నసంగతంబు గావలయు. కాకున్న నాయనకు నీనడుమం బొడమిన యమితంబగు నాత్మవికృతియు నాధిమూలంబకాని యాధినిదానంబు గాదు. అట్లైన దివిషద్భిషగ్విశేష విషయులైన నత్రత్యచికిత్సకులు నిర్విచికిత్సంబుగ దాని వారింపలేరా. మఱియు నొక్కటిగలదు దానికి స్వప్నసంగతియైన కాలంబునకు సరిగానే యార్యపుత్రుండ స్వస్థుండై యుండె. నాకు వెఱచి యీయుదంతంబు నాకు శ్రోత్రసంగతం బొనరించినవాఁడుగాఁడు. అయ్యెడన దీని చెలినింగూడ గాంచియుండు. కాకున్న నేతద్దర్శనంబున స్వస్థకల్పుండెట్లగు. విపశ్చికయుఁ జాల సంగతులు సదృష్టాంతంబులుగ వచించి దీని సంగతి తెలిసియుం జెప్పనట్లు తోచుచున్నది. అందుకు మూలంబు నేనీయెడ నిట్టి విప్రాదంబునకూం బాల్పడి యుండుట వైధంబనియుఁ గాఁబోలు ననునర్థోక్తంబున.

ము. నీ చెప్పినదంతయు సత్యంబ కాని యందుకు మూలంబు దానిక యిట్టి యవస్థానుభవంబు వైధంబని వచింపవలయు.

దే. సఖి యిట్లనకు. ఇంతవరకును దాని సురవరకర్ణినింబోలె సన్మానించుచు నేయుంటిని దానికి నిర్బంధావమానంబులు గాకంత యెక్కువు తక్కువుగా మూడు జాములగును. ఇంక నాయుపాయంబున వీని మఱమనట్లు చేయంగలనుగాని యెట్లైనను నాకుం దూరమై యెక్కడ నివసించుదానిం జూచునెడల నామనఁబెట్లు సిద్ధించునుపపత్తి సుఖియుండదు. మఱియుం బతివ్రతా శిరోమణియగు నాయమ్మగలనప్పుడో బిడ్డా యజ్ఞానంబున నీపట్టినిట్లు సేసినందుకు నాకుఁ జింతలేదు కాని పతికిట్లు విమతం

బొనర్చుట సంగతంబేనా యని యడుగ నేమని వచింపను. కావున నిద్దియంతయు నాయభాగ్యంబయని వచింతు.

ము. దేవి యిట్లు చింతింపకుము. ఆమె సౌశీల్యవై దుష్ప్యాది సకల సద్గుణ శరణంబని నీవ యెఱుంగుదువుగదా కావున దానికీదశ దైవికంబయనియెంచి మించిన వాత్సల్యంబున నిన్ను మిగుల మన్నించుఁ గావున నెట్టి సందియంబును మనంబున నుండ నీక ప్రసన్నాత్మవై ముందు చేయఁగలచెయువు పరికింపుము.

దే. ససంభ్రమంబుగ సఖియా హా యొకప్పు డొక్క పొరబాటు పొడమ నయ్యెడనఁ బెక్కులగునపి యేతెంచుఁ గదా. వెనుకఁ జేసిన తప్పుకంటెను జ్ఞాన పూర్వంబగుట మఱియొక నపరాధం బొనరించితి

ము. దేవీ యది యేది.

దే. సఖి మంజరీ జ్ఞానం బెప్పుడు నాడెందంబునం బొడమె నయ్యెడన దాని బంధంబుఁ దొలఁగించి మానించి పదంపడి యీవృత్తాంత విచారం బంతయుఁ జేయవలసియుండె. అట్లొనరింప కింత తడవు దాని నిర్బంధం బోర్చితిఁగదా. ఇంతకంటె దుశ్చేష్టితం బెయ్యది నాకు.

ము. దేవీ యౌను. గతంబునకుఁ జింతింప నేమి లాభంబగు వేగంబ యట్లొనరింపుము.

దే. సఖీ సరేకాని మనమంజరి యుపాధ్యాయయగు నామె నేఁజేసిన తప్పితంబునకుం గినిసె మహామహిమ యగుట నాకు నేమైనఁ గీడు వొడమించునా.

ము. అలఁతి తఱి నంతరంగంబునం జింతించి. ప్రి. దేవీ నీవిట్లు సందియంబు నొందకుము. ఆమె మహామహిమయని నీవవచించితివిగదా. శాంతి కృతజ్ఞతాది మహనీయ గుణులుగాని వారు మహామహిము లెట్లగుదురు. కావున నీవిట్లొనరింపు. మీద నేమంబయగు.

దే. సఖి యిప్పటి కిద్దియ లెస్సయై కానంబడు. నీవును రావలయునని దానితోడ మంజరీ నివాసంబున కరిగి యామెచరేఖఁ దొలుతంగాంచి. భగవతీ య విదిత కృతాపరాధయగు హేలావతి వినీతయగుచుం బ్రణామిల్లుచున్నదని యామె పదంబుల నొరగుచున్నది.

ఆ. అధర స్ఫురణ సంవలిత బాలాత పానుకారిస్మితరోచి రలంకృత వదనార విందయగుచు. దేవీ యభిమతార్థ లాభంబుల నెల్లయెడల వర్ధిల్లుచుండుము.

దే. సమ్మోద సౌహృద వినయంబులు ముప్పిరిఁగొన భగవతీయనుగృహీత నైతి ని. అస్మదభీష్ట లాభ సంపత్సమృద్ధులను భగవతియలఘ్నకత నొందునని కరణ త్రయంబున విశ్వసించుచున్నాను.

ఆ. దేవీ దైవంబట్ల యనుగ్రహించెనునని సఖి మంజరి నీయక్కసుం బ్రాణ మిల్లుము.

మం. కృతోత్థానయగుట శృంఖలాబద్ధ చరణయగుట యత్నం బొనరించు చున్నది.

దే. సభయ లజ్జారాగంబుగ· ఆయుష్మతి దేవీపదైక వసతి నైరింపుము. నేఁజేయించిన యపరాధంబునకు నేనప్రతీకారం బొనరించెదనని దాని చెంతకుం జనుచున్నది.

ఆ. దేవీ నీకిది చెలియలుగావున దీని నిగళవిమోచనంబు పదస్పర్శ మూలం బగుటఁ బరిచారిక రావించి చేయింపందగు.

దే. భగవతీయట్లు వచింపందగదు. పెద్దలు పుత్రాదుల వాత్సల్యంబున బాల్యం బునందు మస్తకవిన్యస్తలం జేయరా యను మ సంకెలఁ దొలగించుచున్నది.

మం. ససంకోచంబుగం బరాఙ్ముఖి యగుచున్నది.

ము. సఖీ మంజరీదేవి యీయెడలఁ బిన్నమ్మ శృంగారవల్లి యంపిన కమ్మం గాంచి నిన్నుఁ జెలియలుగా నిక్కంబుగం దెలిసికొని స్వాపరాధపరిమార్జనంబునకై నిగళ విగళ నచ్ఛలంబున నెద్దియో సలుపుచున్నదని నిండుగం దెలిసికొనుము. దేవి సేయుపని కవకాశం బొసంగుము·

ఆ. సఖి మంజరి యమ్మ లేఖనంపెఁగాని దాని సంగతులు దెలుసుకొందము స్వస్థవై యుండుము.

మం. అట్లొనరించుచున్నది-

దే. దానిపదంబుల గళితనిగళంబు లొనర్చి యుచితవచన రచనంబుల దానిం

బ్రిసన్న మనస్కం జేసి యంకపాళినాసీనింపం జేయుచున్నది.

మ. దేవి చూచితివా యీభగవతి శాంతి సౌహృదాది పరభాగంబు.

దే. సఖీ కృతాపరాధనగుట నేనీయెడ నీమొయెదుట నేమియు వచింపనేర.

ఆ. సఖీ మంజరీ యకలుషమనీషవయి యత్రికమం బ్రిణమిల్లుము.

మం. సప్రసాదంబుగ నట్లొనరించుచున్నది.

దే. భగినీ నన్ను సఫలజీవిత సంపూర్ణ మనోరథం జేసితివి. ఇంక నవ్యవ హితంబుగ మదీయదేవీపదవడంబవయి పరిజననివగుము.

ఆ. దేవీ యూహా నీసాహసంబు దీనిమాత్రపితల యభిప్రాయంబు పరికింపక యిట్లుంటివి గదా.

దే. భగవతీ యార్యపుత్రునకు దీనికింగలిగిన సంబంధంబు నీకు విదితంబకదా నాయభిప్రాయం బంతయు నిరుడు నేంజెప్పజాల. పిదప నాప్రియ వయస్యయగు నీముక్తామణివలన విశదంబగు. మాత్రపితల తాత్పర్యం బెట్లుండునోయని యంటివా యీలేఖ వీక్షింపం దగునని యొసంగుచున్నది-

ఆ. దానినంతయు బరిశీలించి దేవీ నీయాశయంబు సర్వానుకూలంబై యుండంగాని మనతలిదండ్రుల తాత్పర్యంబు విశేష విభవ ప్రకాశంబుగ దీనికిం బరిణయంబు సేయు మనంబుగలదు.

దే. భగవతీ యట్లైన మనమందరము విహిత పాణిగ్రహణులైన యీదంపతులతో వారికడకేగి కొంతతడి యచ్చటి మహోత్సవంబులనుభవింతము. నీవుసత్యాశీర్వచన వయితివేని యొండు దలంపందగదు.

ఆ. దేవీ యట్లైన నీయిష్టానుసారంబుగ జరుగందగు.

దే. భగవతీ నీచే జీవితనైతి సంభూత విస్రంభ నగుట నొక్కటి యడిగెద. మాకిచ్చుట నియతవర్తనంబు.

చే॥ నలినికనంబు భూవసతి నాగవధూటికిం జేటికాంతల । ప్రలయక రావరోధము కళానిధిమండలికింద మోగ్రహా । కలనము మాలతీలతకుం గాశవికాసదశాల లా

భముఁ । సలలిత సస్యరేఖ కతికాత నిదాఘ భరంబునుంగదా ॥ ౯౩ ॥

ఆ. దేవి. ఇట్లు వచింపం దగదు. నీయాదరంబునఁ గుశలంబుగానే యున్న వారము. సూక్ష్మదృష్టినాలోచింప.

ఉ॥ ఈకమనీయమూర్తి కిటులేటికి రావలెనంగదంచు వే । గాకల నొందరాదెపుడు గాలవశంబున నెట్టివారికిన్। శాకలోలంగవాపదలు రామ నరేంద్ర యుధిష్ఠిరప్రియుల్ । లోకమునందు నన్బవిసి కోసిన నందరె పెక్కుకష్టముల్ ॥ ౯౪ ॥

కావున నియతి నియమనంబునం జేసి యెల్లవారును గాలవశంబున సంకోచవికాసావస్థలం జెందుట యాబాల గోపమాపండితంబును విదితంబుగాన దీనికి వగవం దగదు.

దే. భగవతీ నీవతి నిష్కృణాత్మవుగదా కొంత నేనడిగిన యెడనైనం బదంపడి యెప్పుడయిన గోష్ఠీవశంబుననైనం బరిణయంబు సఫలంబగునటుల నొక్కింతయేని మీవృత్తాంబు విదిత బేల చేయకపోతివి.

ఆ. దేవిపరిచ్ఛన్నతనున్న మాకుంగొంత గోరంతయిన నుంటెకదా యద్దిరే కుండుటకుఁ జెప్పవలయు. మాకువిస్రంభంబు పూర్ణంబుగ నుండుటఁ గతంబు గానం బడదుకాని యాప్తతవలనం జెప్పవలసినదే. అట్లు గానుండుటకుఁ గారణంబడుగు వచించెద. దీనిజన్మ కాలగ్రహస్థితిఁ జింతింప మధ్యకాలంబునం బరిభవాంతంబగు పారతంత్ర్యంబనుభవింప వలసియుండె నద్దియుగత ము[illegible]ర్తములతోడ సమాప్తంబయ్యె ఇంకనిది మండలేశ్వర వల్లభయై సవిశేషంబులగు మానుపానందంబు లనుభవించు. ఇద్దియంతయుం బరిశీలించి యిచ్చట నిట్లుండుట మిగుల కల్యాణకరంబని యెంచియు నమ్మవచించిన యడియాలంబుల నీవు హేలావతి వనియు నెఱింగియకరంబు సమ్మదంబున నుంటివి. భవద్విషయంబగు పారతంత్ర్యంబును దీనికి శిష్యునకు సద్గురు విషయక పారతంత్ర్యంబు కరణి పరభాగకరంబయగు.

పదంపడి చింతాపరీతస్వాంతుడగుచుం బ్రవేశించుచున్నాఁడు రాజు.

రా. ఆహా నియతి నియామకవైచిత్ర్యంబు । శరీరులకు సమ్మోద విషాదంబులు నెట్టివారికైన ననిరూపణీయ కారణంబులగుచు నేతెంచుచున్నవి । అద్దియెట్లంటేఁ! దేశాంతరవిషయయు నదృష్టచరయునగు నా బాలికయెక్కడ నిజగృహాంతర వా

సియగు నేనెక్కడ । అట్టైన స్వప్నసంగమంబెక్కడ తద్విషయ విషాదంబున కనధ్యా నదుర్నివారతయెక్కడ। మఱియుం జాగ్రద్దశఁదల్లాభంబెక్కడ స్వప్నానుభూతావస్థా ప్రత్యక్షీకరణంబెక్కడ । మఱియుం జిరతరావసరంబునఁ దర్శవిషయంబగుట సంతోషవిశేష నిధానంబగు నాయిష్టవస్తు సంబంధంబు యాదృచ్ఛికంబై లభింపనప్పుడె కోపినిరోధంబు మద్వర్తనంబున కనిరోధకంబుఁ గాక తత్పదంబులకు నిట్టిదయ్యె । ఆహా దేవియెంత చండురాలు । చిరకాలానువృత్తవర్తనుండగు నన్నెగణింపక నవమానించె నట్లుండ వారినవమానించుటన నెంత । గుడిమింగు వానికి గుడిలోనుండు లింగం బుట్టిపడియుంబైనఁ గాదను లోకోక్తి యతి రిక్తార్థంబే । కాలవర్తితంబగు నదృష్టంబు మహిమయేరికి విజ్ఞేయంబగు । నేనితివరకైతేఁ బెక్కుతరినుండి దేవిరంధ్రాన్వేషణ తత్పరయగుచుండినం దానికందకయను పాలంభనీయుండనై యుంటిఁ గాని యియ్యెడ నియ్యదియంతయు వితథంబయ్యెఁ గానిమ్ము నాకు కేతెంచునది యేదియైనట్టైన మిగుల విషాద పరిభవంబుగాదు. దేవియీబాలికదెసఁ జేసినదండంబు నాడెందంబు శిలామయంబైనను దీంద్రంబుగ మండుచున్న మెండుకొలిమి కరణినీరు సేయుచున్నది. మఱియు దానివీఁడి యేతెంచినపిమ్మట నచ్చట మఱియేమివింతలు గలిగినవో తెలియంబడవు. ప్రియవయస్యుండు తదనంతరంబునం జరిగినవృత్తాంతంబంతయు నంతరంబునకు సంగతంబొనర్పుకొని యేతెంచునని వెడలి తడయుచుండెననుచుం జింతించుచు నుదుట దూరంబుగ దృష్టిబఱపి, ఆహా ప్రియవయస్యుండు గడువేగంబున నేతెంచుచున్నాఁడు. నతాననుండగుట ముఖలక్షణంబ లక్షణీయంబగు నీయెడ నేమివినవలసి యుండునో యని తలంచుచున్నాఁడు.

ఆయ్యెడఁ బ్రవేశించు విదూషకుండు.

వి. వికచ కమల విమల వదనుండగుచు, వర్ధిల్లెదుం బ్రియవయస్యుండు చిరతరావసరంబున నభిలాష సంకాపంబగు నభీష్టలాభంబునకు లగ్నకత్వ ధురీణంబైన దేవీప్రసాదంబున.

రా. సందేహదేహ మనస్కుండగుచు. స్వ. ఈతఁడెప్పుడెప్పుడు పరిహాస ప్రకృతియగుట విరుద్ధార్థంబుల వచించువాఁడు గావున నిరయ్యెడను నట్లనచియుంచు ఇద్దియు విశ్వసింపందగదు. ఏతాదృశ వ్యాకులావస్థా దుస్స్వావస్థావసరంబున మన్మ

సూవినోదన పరుండగు నీసుహృద్వరుండు కృపాపరితోషా పాదక సంభాషణుండ గుచా యనుచు తదవసరోదిత దక్షిణేక్షణా దిస్పంద ప్రముఖ శుభలక్షణంబుల నతిక్ష ణా నభిమత పత్నుండగుచు సంతోష విషాదంబులు దశావిశేషంబుల దైవప్రేరితంబు లగు టంద్రప్రాప్తి కెంతసేపు గావలయును, నియతి సదయ హృదయంబేని తాత్కాలికా నిష్టం బమహేష్టంబై పరిణమించునని. ప్రి. వయస్య యాధివిఘూతస్వాంతుండన గుట నీభాషితంబు తెలియనేరనైతి. వెండియు వచింపుము.

వి. సాశ్చర్యంబుగ. ఆహా వయస్యాయీయుదితంబె యిపుడు శ్రుతిసంగతం బుగాలేదా యని యట్లతిరిగి వచింపుచున్నాడు.

రా. కందళదానంద హృదయుండగుచు. వయస్యా నీయుదితంబు నిశ్చితార్థ గర్భితంబేనా.

వి. స్వ ఆహా యితని కిదివరకును నావచనంబునందు విశ్వాసంబు దితశ్వా సంబుగాదు. కావున నిట్లువచింతునని. ప్ర. వయస్యా నే బ్రాహ్మణుండనైతి నేనియిది వేద విధియని విశ్వసింపుము.

రా. ప్రమదమయ మానసుండగుచు. వయస్యా యిట్లేని విషాద విపన్నంబుల గు నాప్రాణంబుల కీవ్యాహారం బమరాహారంబయని విశ్వసించెద.

వి. నేనియెట్లుడఁ బెక్కులు వచింప నేల అచిరంబ నీకద్యది ప్రత్యక్షంబగు.

రా. సవిస్మితంబుగ. వయస్యా జీవితుండనైతిఁగాని ఈబు మనమాయు ద్యానంబున నుండివచ్చిన పిదప నేమిజరిగెనో దేనికిట్టి ప్రసాదం బెట్టుకలిగెనో విన మనంబతి కుతూహల సంభ్రమ సంభరితంబగుచున్నది. కావున నది వచింపవలయు,

వి. వయస్యా యద్దియంతయు సవిశేషంబుగ వచింప నిది యవసరంబుగాదు. కావున ముఖ్యాంశంబు వివిచెగవినుము. త్వదీయహృదయాప హారిణియగు నాబాల దేవికింబిన్నమ్మ కూఁతురు మంజరియనునది. నీవు మధుకరుండవగుట భవత్సంజీవన ని దానంబ. దానినీకుం బెండిలిసేయఁ దమిచేన యితర రాజకన్యా పరిణయుని. వారిణి యుయెయ్యే ఈక్షిసంబునం బ్రహ్మప్రహారారంభంబునం దనయువజనని యంపిన కమ్మనల న నీబాలిక తన చెల్లెలని నిక్కంబుగాఁ దెలిసికొని సముదితానుతాప పరిపూతచేత యగుచు విస్మృతావమాన యగుచటుల దానిమన్నించి చెలితోఁ గూడ నంతఃపురంబు

వ నునిచె. అవిలంబంబ తత్కారగ్రహంబు నీకగు.

రా. వయస్య యుద్దితథ్యంబైన సచర్చాధ్యాహారంబుగ వచించెద నాకనాయకుండు దేవతాత్మయగుట నింకమన్నింపంబడు.

వి. వయస్య యుద్దియ యువితంబు. ఈబాలిక నీకబ్బెనేని నతిపురుషార్థసంపత్తివి కావా అట్లయగు.

రా. మరియేమి యుదంత విశేషంబులు.

వి. దేవియును నీకడ కియ్యెడ నేతెంచుంగావున నవిద్వైతదురంతంబుగ నతిఖిన్నానికరిణి నిపుడు నీవుండవలయు. ఎందునుండియని యందువా దేవి యిదివరలో నతిచండస్వభావ యుపంచనావ పరాన్వేషణ జాగరూకయు ననునది నీకు విదితంబ కదా ఇది యెంతమాత్రంబైన మనమెఱుంగునట్లుంటిమేని దేవివిప్రలంభ వారంభయగుటం దాంజేయునుద్యమం బీయెడ నిలిపిన నిలుపుంగావున నిట్లు వచించితి.

రా. వయస్య మేలుమేలు నీవచించిన సుగుణవంతయు నిక్కంబ. ఔను దేవి యట్టిద. మనమీయెడ నేమిసేయవలయు.

వి. వయస్య నీవీయెడ విషాదశయనంబునం బన్నుండుము. నేను నీచెంతన కూర్చుండి యుండెద. నీవు తాత్పర్యోల్లంఘనంబునం గలుగునను తాపంబభినయించుచుండుము. నేనును నీకు బుద్దులు వచించువానివలె నుచితోదితంబులు పలుకుచుండెద.

రా. సప్రమోదంబుగ. వయస్య బాగుబాగు. నీవంటిగం బ్రత్యుత్పన్నమతివకావు అనాగత విధాతయు నగుదువు.

అని రాజట్లొనరించుచున్నాడు.

వి. బహిర్జనాంతికశైన స్థితియై దేవీమార్గం బవలోకించుచు రాజుతో నుచితల్లాపంబులొనరించుచున్నాడు.

పిమ్మటం బ్రవేశించుచున్నారు. దేవియు సఖియు.

దే. ప్రకటిత ప్రమోదంబుగ. సఖీ యిపుడుగదా నేసుజీవితనైతి.

స. దేవీ నీకోర్కెల కెప్పుడేయడ్డంకులు వాటిల్లె. నీవెల్లయెడల విధేయభాగ

ధేయ మగుట ఫలితలాలసవె.

దే. సఖియింతకుం దొలుతపరమ సెప్పాపంబుననో కాని యుత్తరంబు రాక మునుపు భర్త్రపరాధ కాలుష్యంబునం బిమ్మటనే తదపరాధ కాలుష్యంబునను నిట్లు జీవింతునను తలంపు గలుగదయ్యె.

స. దేవి యిట్లుండుట సతులకు సైజంబకాదా. నీవంటి సతులయందు దైవంబు దయ దొలంగి యుండునా.

దే. సఖి నాసతీత్వంబు వచింపకుము. అదిదలంచి నాయుల్లంబు గల్లగాదును మీ యుపతిపోదన్వంతంబున మునుంగు. దైవంబకారణ కరుణ సర్వశరణంబగుటనో ధర్మపరుండగు నార్యపుత్రునిం బ్రేమించునది యగుటం దదీయత్వాను సంధానంబుననో మనమంజరి భాగ్యవశంబుననో యప్పుడ యాలేఖనందఁజేసె. కావున నెంత యుపాయంబు గాఁగలదని తలంతువు. వచించెద నాలింపుము. ఆలేఖచూచుటకుం గాని మంజరినిగా నెఱుంగమి బలాత్కారంబున సమయింపకలయు నంతయులుక గలిగె. అట్లుజరిగించిన నార్యపుత్రుండేమగు. ఆయనమాట యటుండనిమ్ము. పదంపడి యైన నీవృత్తాంతంబు దెలిసిన విషాస్వాదంబుననైన నరజ్జు బంధనంబుననైన జలానల ప్రవేశంబులనైన నయ్యెడన యొడలు విడువవలయుఁ గాని యెక్కటంబునయిన నొక్క నిముసంబున నైనను సురులఁదాల్పఁ గలనా.

స. దేవి యింతయును నీయదృష్టంబ ప్రధానంబని యేనెంచెద.

దే. సఖి యాప్రశ్నోత్తరంబు కెయ్యదికడ ఇది యిటుండనిమ్ము. ముందేమి సేయవలయు.

స. దేవి యితివరకు నాకన్యాద్వయంబునకుం బూర్వ బాంధవాద్యభిజ్ఞాన నివేదనంబున సవిస్రంభంబగు ప్రీతిపుట్టించి మంజరికి వైవాహిక సంవిధానంబులు సేయందగు. వారిసమతూర్చితివిగదా. ఇప్పుడింతకంటె ముఖ్యంబగు నొకకార్యంబుండునని తలంచెద.

దే. సఖి యదియెద్ది.

స. దేవి మహారాజ మధుకరుం డయ్యెడనీచేత విధూతుఁడయ్యుండునో తెలి

సికొందువుగదా కావున నీయుదంతం బాతనికి విదితంబొనర్చి ప్రసన్న మానసుం జేసి పరిణయార్హ వేష భూషితుండగుటకు నివేదింపవలయు.

దే. సఖి యౌను నీవచనంబు లెస్సగనున్నది. నేనైతే యింతకుమున్న మంగళస్నాతయు సముచిత ప్రసాధితయు నగు నామంజరిందోడ్కొని మదీయాపరాధ పంకప్రమార్జనార్థంబుగ నర్పింపవలయునను తలంపున నుంటినిగాని యంతవరకును వికృతచేతనుం జేయ నుచితంబుగాదు. గావున నీయెడ డెడలి యార్యపుత్రు సప్రసాద హృదయు నొనరింప వలయునని యొకనిముసంబు సింతించి, సఖి యార్యపుత్రుని కట్టి యపరాధంబు సలిపి యిప్పుడే మోము వెట్టికొని యతనిచెంతకుం జనుదు మఱియు నెత్తెరున నాయన వదనం బవలోకింతు నెటులమాటలాడుదు నేమివచింతు.

స. దేవి నీవు వచించినదంతయు నిక్కంబ. ఐన నాన్నపసత్తముం డెయ్యెడ నేని నర్మలితోఁ గూడిన కనికరంబు విడినవాఁడుగాఁడు. నీవప్పు డప్పుడాయన కనిష్టంబగు పట్టులువట్టినను దుర్భ్యాతు దుర్జనయను నాయంబున వానిం గణింపకుండుఁగదా ఇయ్యెడ సయితమట్లయ్యెడు. గావున్నం బ్రథమాపరాధం బుత్కంతవ్యం బని వేఁడుకొంటివేనిఁ గరుణించు.

దే. సఖి వేఁడుకొనుటయన నెంత. దీనికిం బెండిలిసేయ నుద్యోగించియే యుంటినిఁగదా నాదేవిశబ్దంబు దానికిఁ గానుకగా సమర్పింతుననియు వేఁడుకొందు

స. దేవి యట్లైన నతఁడు వేతన జీవితుండు క్రీతుండగుట ననుకరింపఁడా.

దే. సఖియంత దూరంబు నాకాశలేదు. ఎట్లైననాకు సమ్ముఖుండైన నేనక్రీతనగుదు.

స. దేవి యట్టినిశ్చయంబు నీకుంగలిగిన నెద్దియసుగమంబు. అట్లైన నేను న్యాచ్ఛెద వెడలుము.

దే. సప్రసన్న స్వాంతయగుచు. లెస్సయని దానితోడంగూడి పతి వసతి సదేశంబున కరిగి గవాక్షాంతరంబునర దదంతరంబున దృష్టి ప్రసరింపంజేసి యాధర స్పంద నవేద్యంబుగ. సఖి యార్యపుత్రుండు విదూషక మాత్రసహాయుండై చింతాశయనంబున నతిఖిన్నాత్ముడగుచు శయనించుచున్నాఁడు.

స. దేవి యియ్యెడ నిట్టులుండుట కేమి యబ్బురంబు.

దే. విషణ్ణహృదయ యగుచు. సఖి నాజననం బిందుకయ్యెఁగదా.

స. దేవియియ్యెడ నని వచింపందగు.

దే. సఖి యిద్దియెన్ని జన్మంబులకుఁ జాలదు.

స. దేవి యిది యెంతమాత్రము. విలాస విలసితంబగు నీయాననంబు దృష్టి విషయంబగుటతోనని రవశోధ నిశీథినీధవ ప్రాదుర్భావంబున హరిన్మండలంబు కరణి నతఁడు ప్రసన్నాంత రంగుండుగాఁ డనుకొందువా.

దే. అట్టి భాగ్యంబు నాకబ్బునా.

స. దేవి సందియంబేల యిపుడ నీకది ప్రత్యక్షంబగు.

దే. సఖి యట్లైన నే దైవానుగ్రహంబునకుఁ బాత్రింబైతినని తలంతు. మఱియు నీయెడ వీరలేమో సంభాషించుచున్నట్టు తోచునద్దియెట్టిదో యాలకింతము గావున నీవును హవణికనుండుము.

స. అట్లయని దేవితోఁగూడ నట్లుంచున్నది.

రా. వయస్య దేవిహృదయంబునకు నసహనంబు మాత్రము లేకున్న జాంబూనదంబునకు మృగమదామోద లాభంబైయుండుఁగదా.

వి. వయస్య లోకంబున సపత్ని యెవ్వతె కులిప్వావిషయంబగు.

రా. వయస్య యట్లువచింపకు సాధ్వీమాత్రంబునకెల్లఁ దదసహనాభావంబు సాజంబు. ప్రాచీన మహీనులెల్ల బహుకళత్రులై యుండలేదా.

వి. అనాదరసూచకంబుగ నట్టహాసంబుసల్పి. అయ్యోవయస్యా యింతజాన పదుండ వైతివేమి.

రా. సాసూయాభినయంబుగ. యేమిట్లంటివి.

వి. సూక్ష్మదృష్టివినుము. ఇద్దిదేవికిఁ బరభాగకరంబ కాని దోషంబుగాదు. ఎట్లంటివేని పాతివ్రతన రాజదారలు దమభర్తలయందుఁ బరిచ్ఛిన్నానురాగులగుట స్వరాగానుగుణంబుగ ననుభుక్తలై తృప్తలగుదురు. దేవి యపరిచ్ఛిన్నానురాగయ

గుట భవదనుభవ సౌఖ్యంబితరులకిడఁ దనకుఁ దృప్తి కలుగదను భావంబున నే తద్విష యంబై యిట్టుసేయుఁ గావున నీవు దేవీమనోవినోదనైక పరాయణుండవు గావల యుఁ గాని పెఱతెరువున దెండంబు నడిపింపం దగదు.

రా. వయస్య బాగుగఁ బలికితివి పరేకాని మదాసక్తయు మత్కామితయు నగు దానినిట్లు నాయెదుటనె పంపించుకంటె దానిమన్నించి నన్నుదండించుట నా కమందసమ్మద నిదానంబుగదా. మఱియు దేవి యెన్నఁడుఁ దనపాదంబులకు బ్రణామ గ్రహణంబునకైన నవకాశం బీలేదని. ఈపదపసరంబధ్యాహరించి. వయస్య నీయు క్తి యుక్తియుక్తంబ దేవిమతంబు విదితంబయ్యె విమతాచరణం బొనరించుట నీకప్పి తంబు నాదేయని యొప్పుకొనవలయు. ఇయ్యెడ నాకుసంగ్రహంబుల నుచిత స్థానంబు లనుండి వ్యథాసంధాయులు గాఁగ దేవి యేమిసేయు. స్వకర్మవశ సంప్రాప్తంబులగు కష్టంబులు వచ్చినయెడల స్వకర్మచింతనం బొనరింపక నితరుల దూరుట మూఢలక్ష ణంబకాని విపశ్చిత్ప్రకృతిగాదు. ధీరులగువారాధులేతెంచి నప్పుడు నిర్వికారులై యుందురనియు శోకవ్యాకులగుట ధీరలక్ష్మ గాదనియు నే నెరుంగుదు. ఈబాలిక కేతెంచిన కష్టంబును గాలానుగతంబుగావున దీనికి వగవనుగాని దేవియిట్టియెడల చం డక్రోధయగుట నింక నేమిసేయునో యేదురంతంబు శ్రవణవిషయంబగునో యని నా మనంబు వికలంబగుచున్నది. ఉసురులును గంపింపుచున్నవని తూష్ణీకుండగుచు న్నాఁడు.

స. దేవి యీమహారాజు తాత్పర్యంబంతయు విదితంబయ్యెఁ గదా యనుచ ర్థోక్తంబున.

దే. ససంభ్రమంబుగ. సఖి పెక్కుమాయలకిది యపన్నైకానంబడదు. అంత్య పుత్రిండు పచించుచు వచించుచును నుసురులు చలించుచున్నవని యూరకున్నాఁడు గావున నిది యత్యాహితకరంబై యుండె. అక్కృతంబున వేగంబేగి యతని నాశ్వా సింపవలయునని సత్వరంబుగ దానితోడఁగూడి పతిపర్యంకాంతికంబు నేరి యార్యపు త్ర యిదుగో నీజీవ సంజీవనవల్లియని యౌవనజననీ సంశ్లిషితంబగు నామంజరిపటం బతనికి దృష్టివిషయం బొనరించుచున్నది.

రా. తదాలోకన జనితమహితాద్భుత విధుతతదవసరీయాధి చేతస్కుండగుచు

స్వప్నాను భుక్తతదీయరూప వేషాదికంబు దలంచి నిర్నిమేషంబుగ దాని నవలోకిం చుచున్నాఁడు.

దే. ఆర్యపుత్ర దైవదిక్షా విషయంబగుట నీ యభిలాషంబున కేకనికేతనంబై న దీనిపాణిగ్రహణంబు సంఘటింపం బూనిన యాగ్రహంబున నేనొనరించిన మహా పరాధ వ్రాతంబెల్లఁ గనికరించి సహింపంగోరెద నదియును నానియతి నీయెడ ఫలితం బగుతయని ప్రణమిల్లుచున్నది.

రా. సాశ్చర్యానందంబుగ. కృతార్థానుండై దేవింగర సరసిజంబుల నెత్తి యు థోచితంబుగ సంభావించి మహాపీఠంబున దేవితోడం గూడ నాసీనించుచున్నాఁడు.

అతని యానతిఁ దద్వయస్యయు నుచిత పీఠంబున నుపవేశించుచున్నది.

రా. ససమ్మదాద్భుత ప్రసంచితమై స్వర్యంబుగ. దేవి యీవృత్తాంతం బం తయుఁ జింతింప ననూహవిషయంబై నామనంబునకు మిగుల మహామోహం బొనరిం చుచున్నది గావున నీబాలిక యెవ్వతో వచింపవలయు.

దే. సఖి నాలోకించుచున్నది.

స. మహారాజ.

క॥ తావకహృచ్ఛశిమణి సంద్రావణచణ సుగుణకిరణ ధన్యవిధుతకృ । ష్ణావి ర్భవసఘజనియగు నీవాసువు దేవి చెలియలే యని కనుమా ॥ నాఁగు

రా. అమందసమ్మదోదన్వంతంబున మునింగి కొంతతడికిం దేలి దేవీ విస్రంభ లిటాధి రూఢుండై. దేవి యీవృత్తాంతం బుత్తరోత్తర వర్ధిష్ణువులగు విస్మయప్రమ దంబుల నీనుచున్నది గావున నిదియంతయు సంతతంబుగఁ దెలుపవలయు.

దే. సఖి యీవిదూషకుండు మనకుం బరమాప్తుండు గావున నాకమ్మ యీత నిచేతికిమ్మని వచించి యతనింగాంచి యోయీ దీనితాత్పర్యం బంతయు నార్యపుత్రు నకు విశదంబొనరింపుము.

వి. దేవి యిర్యోడ భ్రమ[illegible]ణయ మహార్ణవం బతికూలంబగు.

దే. తమస్సమయంబునం దన్నివారకంబగుటఁ గదా దృషత్సామాన్య గణితం బగునది మహామణియని తెలియంబడుచున్నది.

వి. దేవి మహానుగ్రహంబని యట్లొనరించుచున్నాఁడు.

రా. సాశ్చర్యంబుగ దేవి యిందలి యనేకసంగతులు నాకుం బ్రత్యక్షానుభవ విషయంబులే-

స. మహారాజు పరికింప నన్నియు నిక్కంబులే.

దే. ఆర్యపుత్రి స్వప్నవృత్తాంతం బెన్నఁడేని వినోదంబుననైన వచించితివేని నిట్టి కష్టంబులు మనకుం బ్రాపింపకుండు గదా.

స. దేవి యిట్లనకుము. మహారాజు సర్వదా సాధారణ సంభావణంబులను జేమివచించిన నీకేమిదోఁచునో యని సంశయించుఁ గదా యిట్టిసంగతి నీతోఁ జెప్పుట కెట్లువేడుకపడు.

దే. నిట్టూర్పునిగుడించి. సఖియిట్లు ప్రచ్ఛన్న వృత్తి నేలయుంటివని మనమంజరి చెలియగు నామోదరేఖ నేనడుగ దీనికిం గొంతకాలం బిట్లుండవలసెఁ గావున నిట్లుంటిననియు నికమీద నిదిమహాభాగ్య సేవధియగుననియు నామెవచించెగదా అక్కరణి దానికిట్టి కష్టానుభవంబునకై యింతయు సమకూడెనని తదాగమనంబు మొదలుకొని యావద్వృత్తాంతంబు వచింపుచున్నది.

రా. దేవి సంధిన్నాధి బంధంబుగ నేననుగ్రహింపఁ బడితి.

దే. ఆర్యపుత్రి యీయాహ్లాదమాతోఁ గూడ నీకు నభివ్యంజిత స్వాభిధేయంబగుఁగావుత.

రా. దేవి యనుమ్యదెట్లు.

వి. వయస్యా యిదివరకును నీమనంబు చరమశరణిఁ దొలంగలేదా.

స.- మహారాజ యీరజని ద్వితీయ ముహూర్తంబున దేవి తన చెలియలి చరణారుణాంబుజంబునకు భవదీయ పాణితరుణారుణాంశు సంపర్కం బొనరింప సమకట్టి యున్నది.

రా. సలజ్జాంతరిత సమ్మదుండగు చున్నాఁడు.-

వి. సానందాతిరేకంబుగఁ బీఠంబునం దిగి నిలువంబడి. ఆహావయస్య నీభాగ్యం బామూల చూడ కుసుమితంబయ్యెఁగదా. అవ్యవహితంబుగ నట్లఫలింపనున్నది

దైవంబు ప్రసన్నంబయ్యె నేని తత్ప్రసాద పాత్రులకు నెయ్యది దుర్లభంబు: సకలగు ణంబుల నఖిలలోక బాలికా మతల్లిక స్వప్నోపభుక్తయగుట యెక్కడ నద్దియు విదితయై నిజస్థానంబు సేరుట యెక్కడ. మఱియు నది కాలవశంబున నిర్బద్ధయై స్వాప్నికవాసనావశంబున నాధివిధాయిని యగుట యెక్కడ పదంపడి విదితబాంధవయై స్వరక్షిణియగు దేవికి సత్యసంకల్పతా నిర్వాహకత్వంబున నమంద సమ్మద సంధాయిని యగుచు నీకుంగర గతయగుట యెక్కడ, ఇద్దియంతయు మీరందఱొనరించిన యారాధన నతి తుష్టంబగు దిష్టంబు విలాసంబుగదా. సరే నేనిప్పుడ వచించెద నన్నిదినంబున హైయంగవీన సిక్తంబులగు మహాభక్ష్యంబుల ముంచి యెత్తవలయు. భళీ వీరట్లొనరించుట నేఁడిదంబు నాకును సుదినంబ యని నిరర్గళంబుగం బలుమారు నటించుచున్నాఁడు.

దే. సస్మితంబుగ. సఖి చూచితివే యీబ్రాహ్మణుండు మిగుల నల్పసంతోషి. మనమింతవైభవంబు దలంప భోజన మాత్రింబ కోరెఁగాని యొండు దలంపడు.

స. దేవి బ్రాహ్మణో భోజన ప్రియయను నుడువు ప్రసిద్ధంబే కదా.

దే. సప్రసాదంబుగ. సుబ్రాహ్మణ యింకను నీకుంగావలయు నర్థంబులం గోరుము. ఆర్యపుత్రుఁ డటుండనిమ్ము నేన నీయభీష్టార్థంబు లొసంగెద.

వి. దేవి నాకుంగావలసిన దింతయ తక్కిన యర్థంబుల్ మాబ్రాహ్మణిపలన నెఱుంగవలయు.

దే. అట్లైన నీకేయి నార్యపుత్రునకుం బరిణయ మహోత్సవంబు గావున సాయంతన సమయంబువరకు బ్రాహ్మణింగొనిరమ్ము.

వి. సప్రమోదంబుగ. దేవి మహాప్రసాదంబు. మీకు మేమెకదా శోభన దేవతలము.

దే. సుబ్రాహ్మణ నీవచనంబ తథ్యంబ సర్వదేవమయో విప్రయను పురాణవచనం బేనును నెఱుంగుదు.

వి. దేవినిర్భరంబు నీదయాభరంబని యభినందించి అట్లైన నియ్యెడఁ జేయందగు కృత్యం బెయ్యదియని యనుయోగించుచున్నాఁడు.

దే. సఖీ వదనం బాలోకించుచున్నది.

స. సుబాహ్ణ యియ్యెడ నొనరింపం దగు కర్జంబులు పెక్కులున్నవి. దేవి యీపరిణయంబునకై దాని పుట్టింటివారి యావద్భరంబును దాన తాల్చియున్నది నీవీ యెడ మహారాజ పక్షంబునం గావలయు వైభవ చిహ్నంబులన్నియు నాలోచించి మంత్రికిందెల్పి సిద్ధంబులు సేయింపవలయు నికార్యం బతివేగంబునం గావలయు. ఎందుకంటివేని దేవి యీలేఖ తాత్పర్యంబు కొంతయునవరకు దానిరావించి యార్య పుత్రునకుం బరిణయం బొనరించునవరకుం దాంబూల చర్వణం బొనరింపననియు నది య చెలియలని యొకెంగినపిమ్మట నంతవరకు నారగింపననియుం బ్రతినబూనె. కావున సత్వరతరంబుగ నిమ్మహారాజునకు మంగళస్నానాది కృత్యంబులు సలిపించి యర్హా లంకార లలిత నేపథ్యం గావింపుము నను నర్థోక్తంబున.

రా. ససంభ్రమంబుగ. హా కష్టంబు పస్థితంబయ్యె. దేవి యంతవరకు నా హార సేవనం బొనరింపక యెట్టుశరీర ధారణంబున నీకార్య జాతంబు నెరవేర్చు.

దే. సోత్సాహంబుగ. ఆర్యపుత్ర యతిచిరసమయ సమభిలషితం బగునీయ భీష్టలాభంబునం బొడము మహానంద ప్రభవ సత్వ సువర్ణ ధరణీధరంబున కీయాయా సంబు సర్షపమాత్రంబుం గాదుగదా. నేను ధానిం గృతశుభ మజ్జన ప్రసాధనం గా వించి యుచితకృత్యంబు లొనరించి యిక్కడకు తోడ్కొని వచ్చెదం గావున నీప్రా సాదంబు మణిమయంబగుటవ నపేక్షిత పరికర్మకంబయ్యుం గృతసంస్కారంబు గావ లయుం గావున నీవయస్యుండు ననుజీవులకు నియోగించి యట్లొనరించు. నేనరిగెదన ని సఖీయుతయై నిజస్థానంబునకు నిర్గమించుచున్నది.

విదూషకుండును మంగళస్నానయిత్రు ప్రసాధక జనంబుల రావించి. వయ స్య దేవీ నివేదిత ప్రకారంబున సన్నద్ధుండవయి యుండుము. నేనుం బ్రధాన జనం బులతో వైవాహిక సంభారంబుల సజ్జీకరించుటకై నీయానతి వక్కాణించి మా ధ్యాహ్నికకృత్యంబులు నిర్వర్తించి యేతెంచెదనని వెలువడుచున్నాడు.

అనంతరంబు ప్రవేశించుచున్నాడు. రాజుకృతకల్యాణస్నానుండు నభీష్టలాభపరి లంభిత సమ్మద శోభాద్విగుణిత నిరర్ఘ భూషణాపేక్షిత నైసర్గిక ప్రకాశుండగుచు సకల మంగళ సంభార సంభృతంబగు ప్రాకారశిఖరంబు.

రా. ఆహా వయస్యుండు సమయజ్ఞుండయ్యెం దడయుచున్నాడు.

విదూషకుండుం బ్రవేశించి ప్రియవయస్యుం డభిమత మంగళ శర్మంబుల వర్ధిల్లుత.

రా. వయస్య యీకశిపువ నుపవేశింపుము.

వి. వయస్య యిద్దియుం నీవువచింప వలెనా నుని యట్లొనరించుచున్నాండు.

రా. వయస్య ప్రద్యోతనుండు చరమగిరి శిఖరంబున కెంతదూరంబుననుండు

వి. వయస్యమంజరీ కరగ్రహణంబుకై నీమనంబు మిగులం దొందర నొంది యున్నదా. అద్ది యుచితంబ. ప్రయోజన వ్యాసంగంబున నన్నంబువ్యవహితంబై యుండ సమయంబతీతంబయ్యె నాత్మకు వ్యగ్రతం గలుగంజేయలేదు. పాత్రస్థంబై యెదుటనున్న సహానంబపహరించి మిగుల వ్యాకులత గలుగంజేయు.

రా. స వితర్కంబుగ. వయస్య నీవేమయిన ననుకొనుము. ఆబాలామణి దేవీకృత పరిభవంబునం బొడమువగల నను నయంబులం దొలగించి ప్రసన్నసల్పి స్వాప్నికావసరవ్యవహారంబులం బ్రశంసింప మదీయంబగు హృదయం బెంతైన సరభసం బగుచుం జకోరనికరంబ మృతకిరణ సందర్శనంబు కరణి నభిలషించుచున్నది.

వి. వయస్య నీవయితె యిట్లింటివిగాని నాతోవచించు నపుడు నీరసనసిత సితా సంసక్తసుపక్వసుపేయక్షీరాన్నంబు కరణినభివచింపుము.

రా. ప్రహసన్ముఖుండగుచు నాహా నీజిహ్వాచాపల్యంబు.

వి. వయస్య యింతకంటె నాకుంగావలసిన దెద్ది.

రా. అట్లయగుంగాక. దేవికిం బ్రసాదపాత్రుండవు గావున నెలయునపుడెల్లతఱుల నట్లభుజింపందగు.

వి. అనుగృహీతుండనయితి.

రా. వయస్య దినకరుం డస్తగిరింబున కెంతదవ్వునుండు.

వి. మరలి మువలోకి[illegible] వయస్య కనుగొనుము.

క॥ దానవవిజయి చండిమభర । తావక నిస్ప్రతాప తర్జితుండగుటన్ । దేవో
త్తముం డరిగెడువరు । ణావసథదిశకు ముదంబుల మరుపనీకున్ ॥ ౯౬ ॥

రా. వయస్య జగద్బంధుండగుట స్వేనాభిధాన వాహన జీవనుండగుట నాకు సమ్మదంబు జేయనని వచింపుము. మఱియుం జెప్పెదవినుము.

మ॥ ఉదితుండై నిగమాగమార్థముఁ డగుచుం ద్రోవ్యన్నిజౌజశ్ఛటా । విదితధ్వస్తమహా ద్విపత్తిమిరుఁడై వృద్ధేష్ట ధర్మంబుల । మ్మదమొప్పారఁగఁ బద్మినీ ప్రియత సమ్మోదంబులం దేలిద । త్పద వీచారవిరక్తుఁడై యినుడు పత్యగ్గోత్రి నుష్ణం జనుఁ ॥ ౯౭ ॥

వి. వయస్య నీవు రాజర్షి విగదా స్వోచితంబుగన వచించితివి.

రా. వయస్య మరియు వచింపుము.

వి. వయస్య యిపుడునాకుఁ దోచువిధంబున వచించెదనని

గీ॥ కమలమణి చష కాంతరకలిత మధుర । మధురసంబులఁ గరముల మహితవాస । రంబుఁగొని యానివారుణీ రమణిరాగ । మమరవసువుల నర్పించు చరుగుఁ దరణి ॥ ౯౮ ॥

రా. రసాలంకార పూర్ణ ప్రజ్ఞుండ వగుదువు.

వి. వయస్య పరగుణ పరమాణూన్పర్వతీ కృత్యనిత్యం నిజహృది వికసంతస్సంతిసంతః కియంత యను నయంబున వచించెదవుగాని నేనెంతవాఁడను. ఇద్దియు భవత్సాహ చర్యలబ్ధంబకదా.

రా. వయస్య యీయంశంబున గుణజ్ఞులే ప్రమాణంబు గావలయు పదంపడి వచింపుము.

వి. గీ॥ కుమహితామోద శోభలచోద్యమమరఁ । బద్మినులతోడ రమియించి బవిసియిచ్చఁ । బరదిశవ నేగుచును దదంతరసమృద్ధ । రాగసంక్రాంతిచే వసురక్తుడినుఁడు ॥ ౯౯ ॥

రా. పదంపడి.

వి. గీ॥ సాంధ్యరాగంబు విలసిల్లు సవితయూర్త్య సంగమేచ్ఛవసువుల బ్రసారితములఁ । జేయుచేతేర తత్ప్రీతి సిద్ధికెదుర । కొను ప్రతీచీ కుసుంభాంసుకంత మనఁగ ॥ ౧౦౦ ॥

రా. మరియు.

వి. గీ॥ స్వరమణుండగు తరణి దేశాంతరమున । కరుగఁదదయోగ తాపభారా సహాయుయి । దివరమువహించు నీలపసనముకరణి । దనుము సరముల మాదిరినివారల మరు ॥ ౧౦౧ ॥

రా. ససంభ్రమంబుగ. ఓయీ గ్రీష్మాగమసముదితోష్మాభకర విసరపీడిత చకోరనికర ప్రమోద సంధాన నిపుణ జలధర సంఘటిత స్తనిత సౌభాగ్య పశ్యతోహరంబు మనోహరంబునగు నొక్క మహారవంబు వినఁబడుచున్నది. ఇదియేమగును.

వి. సస్మితంబుగ. ఓయీ గ్రీష్మాగమేత్యాది విశేషణస్థానంబున నవసరలాభసంతుష్యద సమశర శరాసన శింజినీరణన సౌభాగ్యంబున కని వచింపుము.

రా. సవిస్మయంబుగ. అదియెట్లు.

వి. దేవి తనచెలియలి నీకుం బెండిలిసేయ నుద్యోగించెఁగదా లగ్నంబాసన్నంబుగావచ్చె ఇచ్చటికిపచ్చుటకై యాయితంబొనరించి మించినవేడుక సంచితప్రమోదలై కల్యాణప్రయాణ సూచకంబుగ నగారాలమ్రోయించిరి.

రా. సవికాసంబుగ. ఓయీ నీవునన్నుం బరిహాస తత్పరుండవై యట్లంటివిగాని యామ్రోగుడు బాయుదువు నుడికించుటకు గండుమీరియున్న కతంబుననిక్కం బేయగును. కానిమ్ము వారలీయెడ కట్టిపరిభవంబుతో నేతెంచుచున్నారో ఇప్పుడు మనము చంద్రశాలంజేరి కనుగొందము అని యట్లిరువురు శిరోగృహంబున కేగి యచ్చట నుచ్చంబులగు పీఠంబులఁ గూర్చుండుచున్నారు.

వి. వయస్యా కనుగొంటివే యీయాడంబర డంబరంబు జరిగినతరి నొక్కగొప్పదగు పటహంబు మ్రోతయేవినఁబడె. ఇప్పుడు నిజనినాద విరచిత దిగంతరాళదారణంబులగు వీరణంబులు నిజనిస్వన విదళిత కందరంబుల నందంబు దప్పిరియున్న మరువులుగల డమరువులును మానసంబులకు సంతసంబుఁ జేయుట గుమ్మటంబులంబోలు తమ్మటంబులు నెల్ల నులివులమించుటచే సంప్రతికరంబులగుట జిరాలగు తంబురాలయు దిగ్గజంబుల కర్ణంబులకుం గృతహాళాహళులగు కాహళులును సమ్మదకళికలగు జల్లికలును సురుచిర సుషిర నాళంబులగు వంశనాళంబులును మొదలుగల వాద్యవిశేషంబులు మ్రోయుచున్నవి. గోవిలాసంబులకుం గొట్టంబులగు నవాయిగొట్టంబులు

నింగికెగయుచు నేలదుత్సవ దర్శనాగత సురతరుణీవదనంబులం గని సముదిత సుధా
కర బింబభ్రాంతులై వానిమ్రింగ గమకించునట్టి వియుఫణాతల సంరూఢమణి ఘృ
ణీగణ విశీర్ణధ్వాంతంబులు నగు నల్లత్రాచులం బోలుచున్నవి. సురుచిరహీర ప్రభా
నికర చోరంబులగు వెన్నముద్దలు సర్వాలంకార విభూషితయు క్రొత్తపెండిలికూతు
రగు నీవయస్య నాలోకించి మింటికెగయు తారలంబోలి విలసించుచున్నవి. మత్తా
బులుందమ్ముఁ జేసినవారి నేర్పు పెంపునం బాగలేమిని నయనానందకరంబులై దుర్గం
ధంబులేమిని నాసాబాధావహంబులుం గాక విడివిడి రేఁతెంచు విశదకర కరనికరంబు
ల లీల మెలంగుచున్నవి. మరియుఁ గొన్ని బాలాతపంబు విలాసంబు సలుపుచున్నవి.
మరిగొన్ని మరకతమహాపాసల ప్రభాపటలంబుల వెదజల్లుచున్నవి. మరియుం గర్మక
రకరధార్యమాణ కరదీపికా నికరంబులు నిరస్తతమస్స్తోమంబులై సమస్తదిశలం దేజో
మయంబులం గావించుచున్నవి. మరియుం జిత్రకర నిర్మితంబులగు కదళీరసాల పు
న్నాగాదితరులు పల్లవపలాశముకుల కుట్మలబాలశలాటు శలాటు పరిణత శలాటుఫలం
బులం గృత్రిమంబుల నొప్పారుచున్నవై యింతకు మున్ను లోచనంబులకుం గోచరంబు
లుగాని సంతసంబుల వింతగాఁగ వెలయించుచున్నవి. మఱియుం గర్పూరసమేధితేం
ధనంబులగు ధనంజయంబులు మత్తాబులంబోలి పరనయనాధి సమాధాయకంబులగుటఁ
దమ కేతనంబులగు ధూమంబుల విడిచి యధిగతకవిరుచిరుచిరంబులగుచు వెలుంగుచున్నవి.
బలభిదుపల మయవిపులాధరంబు పురోభాగ తిర్యక్సంప్రరూఢహారమయ శిఖరద్వ
యంబయ్యెనేని మఱియు నిజకాంతి పిహితాకాశాంతర నానాధాతుప్రవాళావృతంబగునే
నిష్పృష్ఠసముదిత సుందర కందర విరాజమాన హిరణ్మయ శృంగ సంగతి మంగళం
బయ్యెనేని దీనియుద్దినొందునను బుద్దినిద్దంబుగ నద్దించునని గొండాడందగు మతంగ
జంబుమీఁడం గల్పించిన చౌడోలునడుమఁ గామరూపియగు నీరధరాంతరంబున నచ
లత వెలయు సైరావతింబోలి దేవీ వయస్య మధ్యగతయగు టంబ్రభూతాస్వాహాశక్త్యం
తర్గతయగు మంత్రశక్తికరణి స్వాహాస్వధామధ్యగత యగు ధనంజయ జ్వాలంబోలె భూ
నీళాంతర్గతయగు శ్రీదేవింబోలి నీవయస్య విలసిల్లుచున్నదని వచింపుచు నంతట
సానందంబుగం జూచి ఓయీ వయస్యా యనవరతప్రూత భఃదర్పిత హావిష్యంబునం
బీనతమవగు శతక్రతుండు కృతజ్ఞుండు గావున నీయందలి నెలమింబంపిన నచ్చ
రల కరణి మెలంగుచున్న వారముఖ్యలు సఖ్యంబునపలె ముఖ్యంబులగు లాస్య

ప్రచారంబుల నవహితులై నవహితులైన తెఱంగు నలాస్యరహస్యంబుల వెలయించుచున్నారు. మఱియు నజునింబు రణించు ద్విజకుంజరంబులందఱు మంజుళంబులగు నిగమ వచనంబుల మంగళవచనంబుల నఖిలనినదంబుల జిందరవందర నొందించుచున్నారు. నీకీయెడం బొడమిన హాయలు పోలుచున్నవానివలె నానెల యుదయంబున నుదయంబునొంది హీరమయంబగు శేఖరంబగుచున్నాడు. మఱియు నీమతంగజతల్లజంబు మస్తునీటం గఱఁగిన సిందూర బిందువుల నిటువలె మీరు నేతదుత్సవాంతరంబున వసంతోత్సవంబు చేసికొనుడని నుడువు నదివలె వెడలింపం జేయుచున్నది. మఱియుం బరిధౌత కలధౌత పత్రి చిత్రమాలికల నొప్పారుచు విద్యుల్లతావలయిత నీలాచల శిఖరలాలితం బోలుచున్నది. దేవి యిట్టిసన్నాహం బొనరించినది. కావున నీచెలియందు విదితసోదరీ భావనయై మిగులంగ నర్మిలిగలదై వెలయుచుండెడు దయాదాక్షిణ్యంబులు గేసున్న నేతాదృశోత్సవ సంధానం బెట్లుసేయు మీకుం బరిణయంబు గావించువరకు నీరఁ బైనఁ జేకొననను బ్రతినయేలపూను. కావున నా దేవి మనోవాక్కాయ క్రియల మీకు నభీప్సితంబ సేయుం గోర. నీబొబ్బట్టు నేతిలోఁ బడ్డదిగదా. విం కంబనుర బొంకంబుగ నుండుము.

రా. స్మితాలంకృత వదనుఁడగుచు. ఓయీ వీరుచరణంబులం బుతః పసరణంబులఁ జేయుని వారికరణినుండిరి. అక్కడనుం డిక్కడకు వచ్చుటకై యింతసేపు పట్టునా.

వి. పకపక నగుచున్నాడు.

రా. ఓయీ యేమిట్లు నగుచుంటివి.

వి. ఒకమాట మతింజేరి నగవువచ్చినది.

రా. అది నేవినఁదగినదేని వచింపుము.

వి. ఓవయస్య నీకు దాపరికంబు సేయందగిన దొకటిగలదా.

రా. అట్లేవచింపుము.

వి. సహసంబుగ ఒకడు పదునెనిమిది యేఁడులకు లోఁగడనే నూరామడ లెడమగల దేశంబునకుఁ జని మరలి తనయూరి చెంతకుంజేరి పరుగెత్తెనట. అంతట నొకఁడు దానింగని యోయీ యిందులకిట్లు పరుగెత్తెదవని యడుగ నతడు మావారింగని చిరకాలంబయ్యెఁ గావునఁ దొందరగ నడచుచున్నానని వాక్రుచ్చెనట. అది మనంబునకు రాఁగనగ వేతెంచె.

రా. ఓయీ యీయెడ నీసద్బుద్ధిఁ జేరుటకుఁ గతంబెద్దియైనం గలదా.

వి. కారణంబు లేకున్నఁ గార్యంబు పుట్టునా!

రా. అందులకుం గారణం బేమి.

వి. నీవ దానికిం గారణంబు.

రా. అదెట్లు.

వి. ఇన్నిదినంబులు దేవీభయంబున నావయస్యఁ జూడనేరక యిప్పుడు విదితవృత్తాంత యగుట పశ్చాత్తాపభరితయై యాపె నీకు సమర్పింప నేతెంచుచుండ గనుచుండియు నాపెవిరహంబు సహింపనోపక యిట్లు వేగిరపడుచున్నావు. ఇందువలన నది చేతంబునకు వచ్చె.

రా. సస్మితాపత్రపంబుగ. ఓయీ వారినడకం గని యిట్లాడితింగాని తత్సంగమత్వరితచేతనుండనై యుండుట లేదు.

వి. నీమనంబు నేనెఱుంగుదునులే నాతోడనున్ నిక్కంబు పలింపవుగదా. నీయభిమతంబునకే ననభిమతుండనా దాని నిక్కంబు నీకే దెలియును.

రా. వయస్యా నీకుం దాపఁదగిన మనోగతంబైన యరతం బొక్కింతయు లేదు కాన నానమాని వచింతును. దేవి యాచెలిని నిర్బంధించినది మొదలు దాని నెప్పుడు గనుంగొనుదునని మనంబు వ్విళ్లూరుచున్నది.

వి. ఓయీ యిదియుచితంబ. ప్రియజనంబునకు నాపద గల్గినం దద్విమోక్షణంబైనను నెప్పుడు వానిం జూతునని యభిలషించుట మహాత్ములకు నైసర్గికంబగు ధర్మంబుగదా.

రా. దివాతన వికర్తన సంజాత పరితాప శోషితాత్మంబగు చకోరంబుల చందమామంబోలె తదీయవదన సందర్శన త్వరమాణ చేతనుండగుచు విదూషక మాత్రసహాయుండై నిరీక్షించుచున్నాఁడు

దే. తాదృశుండగు రమణు నిరీక్షించి యంబారివలన డిగి యభిముఖంబుగ నేతెంచి మంజరినిం బ్రణతియొనరింపుమని వినిచి మ్రొక్కించి వినీతాత్మయగుచు.

ఆర్యపుత్ర విజయంబునొందుము విజయంబు నొందుము. మనయులభాగ్యంబు వలనఁ జిన్నమ్మ పంపిన యక్కమ్మ నాతావునకుం జేరెఁ గానదీనికి నాకుం జిరకాలంబు

మనికీయింపొందె. ఇంతకు నపయశంబు నాకుం బొడమకుండ నాకమ్మయిగ్గొడపలకుం దొలుత నేతెంచె. దీనమనమందులును వెలలేని లగ్గలకె పాల్పడియున్నారము. కావున సంశయంబు వీడిదీనిఁజేకొమ్ము. ఈమీద దేవీశబ్దంబు దీనికింభట్టినీ శబ్దంబు నాకునుంగలుగుఁగాత మని మంజరికరంబు ప్రియునికరంబున నునిచి యింకనీయెడ నే యభిమతం బొడఁగూర్తును.

రా. ప్రసన్న వదనుఁడగుచు.

గీ॥ తొలుతఁ బొడమినకోపంబు త్రుంగణంచి । యాదరంబున దానినాయాలుఁజేసి । మీద మొనరించితివి నీవుముదముతోడ । నింతకంటెను బ్రియమెద్ది యిపుడు చెపుమ ॥ ౧౦౨ ॥

అయిన నీభరతవచనంబగు గాత.

గీ॥ సకలజీవులు సంపూర్ణ సౌఖ్యులగుచు । దైవతానుగ్రహంబున ధైర్యమమర । చిరసమును మువహిత బుధసేవులగుచు । మను మనుందురు గావుత మహిమమీర.

ఇట్లని యథోచితంబుగ నందఱు వెడలుచున్నారు.

ఇద్ది చతుర్థాంకము.

ఇది శ్రీసకల మునిజన మండల మండనాయమాన కౌండిన్య
గోత్ర ప్రభవ శ్రీకోరాడ రామచంద్ర కృతంబగు మంజరీ మధుకరీయంబు
సంపూర్ణము.



# Errata



| PAGE. | LINE. | FOR THIS. | READ THUS. |
|---|---|---|---|
| 3 | 3 | సంప్ర | సుప్ర |
| 4 | 2 | ప్వని | ధ్వని |
| 4 | 14 | కృత | కృతు |
| 5 | 13 | మలీల | చుచునులీల |
| 9 | 26 | ధీవన | ధీన |
| 16 | 22 | కోడ | కోడం |
| 18 | 18 | తంల | తలం |
| 30 | 4 | యొడణ | యొడలవ |
| 30 | 13 | నేసి | సేసి |
| 31 | 18 | లుపిప్రియునిబ్రే | లుంబిర్యు[illegible] |
| డిటో | డిటో | నెద్ది | నద్ది |
| 32 | 1 | హావణి | హావణిక |
| 41 | 24 | చుది | చున్నది |
| 48 | 21 | సంయోగ | సమవాయ |
| 70 | 19 | యంత | యెంత |
| 73 | 21 | యది | యిది |
| 73 | 23 | బిన | లీన |
| 79 | 4 | కటాకటా | కటకటా |
| 79 | 9 | జదివిజదివి | దమిసిజదివి |
| 80 | 2 | యాపుమి | నేపుమి |
| 82 | 7 | విసంభం | విస్రంభం |
| 92 | 8 | ప్రతీమ | ప్రతిమ |
| 95 | 15 | క్తుల | తులను |

| | | | |
|---|---|---|---|
| 96 | 22 | కపండుడే | కుండుడే |
| 105 | 9 | కిల్లి | కిదల్లి |
| 106 | 9 | బొగలు | బొగులు |
| 109 | 3 | రకు | జరకు |
| 110 | 5 | పధాన | ప్రధాన |
| 113 | 2 | వంశం | వశం |
| 130 | 8 | మెత్తనిడి | మెత్తనడి |
| 139 | 5 | ఖంజి | క్షీ జీ |
| 156 | 4 | మహాత్త్రా | మహాత్త రతా |
| 186 | 2 | కాశ్లై | కాశ్నై |
| 189 | 15 | నిదయ | నిడయ |
| 193 | 10 | యశా । శీ | యశాం । శీ |
| 219 | 12 | విదిత | విదితం |
| 221 | 2 | నతిక్ష | నతిక్షీ |

